

# భారతి

సంపు. ౧౩ ధాత సంవత్సరము, జ్యేష్ఠమాసము (జూన్ ౧౯౩౬) సంఖ్య ౬

## ప్రాతస్స్తవము

విశ్వనాథ సత్యనారాయణ

లే! యింకన్ నిద్రించుటేమిటిర! లే! లే! చిట్టినాతండ్రి కృ
ష్ణా! యన్నాయి కళిందజాపులినదేశక్రీడనార్థమ్ము న
ప్డే యేగెన్ మఱి నీవుకూడఁ జనవా వేగమ్మ లేవయ్య! తం
డ్రీ! యాదిత్యనవాంశువుల్ పసుపుపండించెన్ గవాక్షమ్మునన్.

ప్రక్కయంతయుఁ జిమ్మితి పద్మనాభ-అన్న చూడుము పుస్తకమ్ముట్లు పంచు [దు
కొనుచు నీవేమొ ప్రక్కంత క్రుమ్మిక్రుమ్మి-ప్రక్క యటు లుండ నీ విట్లు పండుకొం

మొగము కడిగెదను, లే, సం-పెగ ఱెక్కను బోలె ఱెప్పవిప్పుము, నునుచి
ర్నగవు, పసరు మొగ్గవలెన్-తొగరుపెదవిమీద వచ్చి దో బూచాడున్.

ఇదిగో తండ్రికిఁ జిట్టిన వ్వాదయమయ్యెన్ లే! యదూత్తంస నీ
వోడుగన్ బోవని సందుసందులకునై యూరెల్లఁ దా నేడ్చెడున్
గద! నీయల్లరి లేక, గజ్జియలు ఘల్లుఘల్లా, గృహమ్ములఁ ద్రొ
క్కెడు నాట్యమ్ముల, లేవవయ్య! ప్రభువా! కృష్ణా! యశోదాత్మజా.

ఘాలపాల కన్నువిప్పి మఱి మూసెదు చిట్టికి నిక్కమాడు చ
క్కిలిగిలి యున్నదా! కలదు, కేలును జంకకు హత్తుకొంచు న
వ్వులచిఱువెల్గులోఁ బెదవి పొందె నుపోనవరేఖ! తిర్గి య
వ్వలి మొగమై ముసుంచుకొని పండెద వల్లరి కాదు లెమ్మురా.

తఱికలు కట్టగాఁ బెరుగు ద్రచ్చిన కవ్వపుమోత నిద్రలే
చి, ఘురుశిశుంబలెన్, నెగచి చిందులు త్రొక్కెదు ప్రొద్ద దెక్కెయున్
సరి, నును సెజ్జ వీడవు పసంముల బిడ్డవు నేడు, తండ్రి! యి
క్షురసము నీకునై యెదురుచూచెదు మీఁగడతోడ వెన్నతోన్.

చాలు నిక నిద్ర లెమ్ము కృష్ణయ్య లెమ్ము-లేఁత క్రోఁతులై పం డ్లిగిలించుకొంచు
నక్క నిను తొంగి కనుగొంచు నన్నుఁ జూచి-పరువు లిడెదవ నీదు స్నావాసగాంధ్రము.

ప్రిదులనిచంద్రవంక సనరించెడ, రత్నపురావి రేకఁ బైఁ
గుదురుగ నిల్పుదాన, జడకుప్పెలు వేసెద జుత్తు దువ్వి, యీ
నిదురను మాని పైడిబరణింబలె మెల్లగ లేచిరమ్ము నా
యెద గల యింద్రనీలమణి యేడిర! యల్లన మెల్ల లేచెడున్.

ఒయ్యారమ్ము" నిద్రకాని నిదు రేలోయీ! యశోదాశిశూ
కయ్యమ్ముల్ మిగిలెన్ విచిత్రశిశువా! గ్రామమ్మునందెల్ల నో
యయ్యా! కోపము వద్దులే, యనను లే, జో పైడిఖిల్లావు లే!
సయ్యాటమ్ముగ నంటిలే యదుకులస్వామీ! రమావల్లభా!

అయ్య నిద్దుర లేచెనా యంచు నడిగె-నంకగోపుఁడు మీయయ్య సుందరాంగ!
కొసలు ప్రక్కలఁ బడి పులిగోరు నలిగి-పోవుచున్నది లేవరా! బుచ్చితండ్రి!

అచ్చపువేల్పుబువ్వ బడగై తరఁగై గరుడాళువాఁ పై
వచ్చెడు చిట్టికోసమని, వాకిట నున్నది యెవ్వరోయి! వేఁ
బుచ్చుకొనుండు దానిఁ జిఱుపొంగుల నవ్వులకన్నుదమ్ములన్
విచ్చుచునున్న వాఁడు యదువీరుఁడు, బుగ్గ గులాబిమొగ్గగాన్.

చిమ్ముందూడవంక నెగఁజిమ్మెదు కోరల కన్నుదోయితో
గుమ్మమువద్దనున్న డదగో! కను నీకయి గుమ్మపాల గో

# "హిస్ మాస్టర్స్ వాయ్స్"

## రేడియో రిసీవర్



మాడల్
**471**
A. C.

వెల
రూ.
300

శబ్ద పునరుత్పన్నమునకు నపరిమిత పరిశ్రమచేసి, అసమాన ప్రఖ్యాతిగడించిన "హిస్‌మాస్టర్స్‌వాయ్స్" వారి యద్వితీయ నిర్మాణముగల యీ రిసీవరు మూలముగ సర్వ దేశముల వార్తలు, సంగీతము వినటయేగాక, రికార్డులందలి సంగీతమును విద్యుచ్ఛక్తి మూలముగ ప్రతిఫలింపజేయుటకును వీలగును. వివరములు తెలియగోరువారు ఇప్పుడే మాకు వ్రాయుడు!

# ది గ్రామఫోను కంపెని
## లిమిటెడ్.

**45,** సౌత్ పెరేడ్, బెంగుళూరు.



వమ్మ, మఱీవు త్రాగకయ యా తన దూడను గూడఁ ద్రావనీ
దమ్మ మఱింక లే! నురుసు లారక మున్నగఁ ద్రావగావలెన్.

అనఁగనఁగ నొక్కయబ్బాయి యున్నాఁడు-లిప్తలోన నిద్రలేచునంట
కన్నువిప్పవఱకు గంటసేపనుకొన్న-కన్నువిప్పపైని గంటసేపు.

దిండిద మంచమిద్ది తెగ ద్రెంచుక లేవవలెన్ సుమండి! లే
దండి! యిదేగతిన్, మసలినంతటి సేపును బద్ధకంబుపో
వండీ! జగమ్ము మీకొఱకు ద్వారము నొద్దనె వేచియుండె లే
వండి! యదూద్వహా! విసువువచ్చెను ప్రాణము తల్లిగారికిన్.

ఎత్తఱి తెల్లవారి నిదురించరు మాదగు కోవలోన మా
మొత్తముమీద నెవ్వరును, జోలిక యింటనె యున్నదే కదా
మెత్తగ పండుకో! నిదుర మేల్కొనగాఁదగదయ్యా! అయ్యా! మే
నత్తలచాలి కందురుగదా! నిజమే! యదువంశమండనా!

ఈమెలనవ్వులో జనని యెంతటికోపము పోవునంచు నీ
వే యెదలోనెఱుంగుదువులే! పసిదొంగ! మరింకఁ జాలు లే
వోయి బడాయి! లేవగదవోయి! ననుం గనుపార కన్నతం
డ్రీ! యదువృద్ధలోచనమణిచ్ఛవిభూతశరీరవల్లరీ!

అంతే కావలె నిద్రమేల్కొనవు నీ వన్నాయి తావచ్చి యా
యింతా మీగడ పాలువెన్న తిని యడ్డే చెప్పకుండన్ జనెన్
సంతోషించితిఁ గండ్లుచల్లవడఁ గన్నా! లేవరా యంచు నే
నెంతేనిం బతిమాలుచుండినను నీవింతేని విన్నావురా!!

ఇంక నిద్దుర లేవవీ వెట్లు కాని-నెలల తరబడి నీబిడ్డ నిద్రపోవు
నుర్వియెల్ల చాతుర్మాస్య లుండవచ్చు-నని జగంబునఁ జాటింతునయ్య కొడుక!

ఇకఁ జాలు లేవవోయీ-యొకకొలికికిఁ దెత్తుఁగాని యూరెల్లను నీ
వాకవేల్పువులే, మాపాలికి స్వామీ! లేవవయ్యా! లేవయ్యా! ప్రభూ!

వెనుకత్రిప్పచేతులను గుప్పిళ్లుపట్టి-కనులు తుడుచుచుంటివి మణికట్లతోఁ
నిక్క నీల్గుచునుంటివి నిద్రయింక-నయ్యెనని యనుకొమ్మందువా! ముకుంద!

ఇది యేదోకథవోలె నున్నయది మీ కీరాత్రియెల్లన్ ప్రభూ
యదువంశాంబుధిచంద్ర! నిద్ర యదిలేనట్లున్నదే! తేలుగా
నదియున్ కొంచెము సేపులోన, కడుపేదయ్యా! బలే నిండియు
న్నదియే, యుట్లవియేమియేగ మిగిలెనా! నందార్భకా. యూరిలో!

ఇదియా! నిను గనవచ్చిన-యదపుచెడిన కుబ్జకు:కలందఱకన్నుల్
చెదరిన మందారమ్ములు-చిదిపినకట్టెజ్ఞకావి చిమ్ముచునుండెన్.

మతకరిబుద్ధులెంతకును మానవు నిన్నును బట్టియూప బ్ర
హ్మతరముకాదు, నాకడుపునం దెటుపుట్టితి వోయి! చాలు! న్నా
మెతకతనమ్ముగాక, పుడమిన్ నినువంటి కుమారు లుందురే
యతివ గయాళిమూక యిపుడై పడిపోవును వచ్చి నాపయిన్.

గొల్లల గూడెముల్ తడకకొంపలు తల్పులులేవు నీవు ప్రే
వల్లెకు మేటివైతి వొకపాతిక క్రోతులు నీకుం దోడు, మీ
రెల్లరు నుట్లకెక్కు-పనికేమొ హుజూర్సరదార్లైరి! యా
పిల్లలతోడ నింక గనిపింపుమ యింకొకమాఱు చెప్పెదన్.

పాయక రాత్రులన్ గదలవద్దని చెప్పినమాట గాలికిం
బోయెను జాలుచాలు నటువో పురుగుండును పుట్రయుండు కా
ళీయునిసంగతిన్ దలచలే నిపుడైనను నాయదృష్ట మ
న్నా! యలకోటిదేవతలు నాడు నినున్ బ్రతికించి యీయరే.

చేతముకూడ సొమ్మసిలు చీకటిలోపల నల్లదొంగ వే
రీతిని గానుపింతువు దరిద్రులకున్ నిదురించువేళ నీ
వాతరుణమ్ము వేచికొని యందఱ వెన్నలు దొంగిలింతు నీ
చేతము సుంతయున్ గుణము చెందదురా నవనీతలుబ్ధుడా!

తనయింటం బాలులేవో - తనయింటను బెరుంగులేదా తానేమిటికో
వనజాక్షుం డూరిపైంజని-తిని 'మాగీ'లింటిపైకిం దెచ్చునొ చెపుమా!

ఎవడురావాడు మొన్న తానేమొ వచ్చి-యయ్య యవతారపురుషుం డటంచుచెప్పె
నిపుడు వచ్చిన దెలియుంగదే, నిశా్ర-ళయశిశున్ నిన్నెఱుంగువేళకును లేండు.

ఆమొగమునట్లు పెట్టెదు-స్వామీ నామాట గిట్టుబడి కాలేదా?
ఆమెతలు మఱగువారికి-సామెత లేమిటికి వట్టి చాదస్తమ్ముల్.

చెప్పిచెప్పి నాగొంతుక నొప్పి వెట్టె-కొన్ని పెరుగులు నిశి తోడుకొనును గొనవు
తోడుకొనుచున్న పె గులు దోచెదేని-కూడుకొనుచున్న కాపురాల్ కూలిపోవు.

ప్రన్ననిబల్లి యేడుపులరాగము తీసెదు, నీవు చేయ లే
దన్నను చాలదా! యటుల నందరకేట గజదొంగ లమ్మకుం
గన్నులుకప్ప నీయొడుపుగాని నిజంబుగ నీకు నేడు పం
చన్నల! వచ్చుచున్నదటరా! కనులన్ దడియేది చెప్పరా.

అది,-ఆలోగున నేడ్వగా వలయురయ్యా! రంగమార్తాండ! క
న్నుదలన్ నీళ్లులుకూడ తెచ్చితివిగాదోయీ! నటోత్తంస! యే
మిది నిక్కమ్ముగ నేడ్చుచుంటివిర! యేమీ! సామి! నీగుండె యెం
తదిరా! అమ్మను నేడిపించుటకునైనం గొంక వింతేనియున్.

మానాయనగా, ఏడ్వకు-మానాయనగారు చూడ మాంధాతగదే!
లేనివిపోనవవాదలు-గానీ మాతండ్రి యిల్లుకదలడుగదవే!

ఎవరాశబునుగూర్చి యిట్లనిరి బాబెచ్చోటికింబోయె? తేం
బవలున్ నాయొడిలోననుండునుగదా! బంగారునాతండ్రి ఆ
యెవరో గిట్టనివారలందురు శిశూ! నే నెత్తుకొందున్ నినున్
జిప్పురుంగేల్మొడ ముద్దుపెట్టుకొనరా చిన్నీ! ననుంజెక్కిటన్.

తామెవ్వారలు తండ్రినిట్లనిరి నేదండించెదన్ వారలన్
రా! మాబంగరునాన్న! యెత్తుకొనెదన్ రావయ్య కృష్ణయ్య! యే
డీ! మాయాదవవంశదీపమణి! యేడీ! చిన్నినందయ్య యే
డీ! మావేల్పులకెల్ల వేల్పుదొర! యేడీ! వాడు నీవా ప్రభూ?

చాలు నేడ్వకురా బాబు చచ్చిపోయి-నానురా నాదుబంగారునాన్న చిట్టి
కనులఁ గన్నీరు తెప్పించి, కన్నకేమొ-ఆటయరదమ్ము తెచ్చు నూమయ్య నేడు.
బుజముపైఁ బందుకొని బాబు, మొగమునత్తు-కొనెడు నిటుచూడు! నన్నుఁ గన్గొనగనిమ్ము
మనసుకిలికించితం బందుకొనినతండ్రి-తమ్మిమొగము చిర్నగవులు తాండవించు.

నారతనాలు! నామణులు! నాపరహారమును, నింద్రనీలపున్
హారతి! నాదుముత్తెములహారము! వజ్రము పుష్యరాగమున్!
కోరికలుబ్బగా దిగిన కుచ్చుల పల్లకి! నామనస్సులో
నూరినతియ్యనీటిజల! యుల్లలదు జ్వాలవారివేణియున్.

మజ్జారే! చక్కిలిగిలి-బుజ్జాయికిం బొట్టుమీద ముద్దుమకొన్నన్
బొజ్జగలవేము! బుజ్జికి-ముజ్జగముల కలకిలారు ముద్దులనవ్వుల్.

* * *

మొగము కడిగించుకొనె మూ-నాగసరి దువ్వించుకొనియె జుత్తును సొగసి
సాగయుని చలిదన్నము తినె-ఖగరాడ్గతి నింక నేమి గంతులు త్రొక్కున్.

కుణుకుణుకుణుకుణు క్వాణనమ్ములొనరింప-కవ్వించు బంగరుమువ్వలగమి
కిణకిణకిణకిణస్వనములు వెలయింప-జిగిజిగిరత్నాలగజ్జియలపేట
ఘణఘణఘణఘణధ్వనులు పంచారింప-నెకె నగిపీలియాదియలజంట
ధణధణధణధణ ధ్వానమ్ము లొలయింప-కలుపుకేజ్జెత్త హారాన్న గంటలవడి
యదుకులోద్యానకేకి నాట్యమ్ము చేసె-నందగర్భసరోహంస నడలు నెఱపె
నెమ్మినాట్యమాడెను యశోదమ్మకొడుకు-అంచనడకలు నడచెం గ్రిష్ణమ్మగారు.

# "బ్రతికించారు ఆచార్యులుగారు"

## చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి

ఏందు చేశాంటే? సూక్ష్మంలో మోక్షో పాయం చూపించారు వారి పూజ్యమా అని. మొట్టమొదట అనుకున్నాను గదా? అమ్మయ్యో! యేమాత్రమో తక్కువగా పద్ధాలుగుకాలాలు సంపూర్తిచేశారే! యీవార్ధక్యంలో, యీ అనారోగ్యంలో "తీరికూర్చున్నమంగలి" లాగు యీ పనికిమాలినపని యెక్కడ పెట్టుకొందునురా అని భయపడ్డాను. ఉభయ వేదాంతప్రవర్తకులు యేవో తారతమ్యజ్ఞాన బోధకపు వాక్యాలు వ్రాసివ్రాసి "కసిదీరనమ్మ" అనే సామెత తను జ్ఞప్తికి దెస్తూ శాస్త్రజ్ఞానం అంతా యింతా మాత్రమేకాక సంపూర్ణంగాకల శిరోమణులవడంవల్ల, ఆతరవాతవచ్చే అతివ్యాప్త్యవ్యాప్తులను సవరించుకోవడానికి వేసికొనే "మాత్ర" పదాన్ని యిప్పుడే లక్షణంలో తగులుకోఁబెట్టి—

"వయోమాత్రవృద్ధులను మీరు"

అంటూ వకఅంకెవేసి, "మావిషయంలో యిక ముందేనా జాగ్రత్తగా సంచరించండి, లేకపోతే తగినట్లు బుద్ధిచెపుతాం" అనే అర్థమిచ్చేమాటలు కొన్ని వ్రాసి వ్యాసాన్ని ముగించారు. వయోమాత్ర వృద్ధత్వాన్ని వారు స్వయంగా వప్పుకుంటూ వుండడంచేత వారు "సభకు రావలసిం"దని నన్ను కోరడాన్ని నేను పాటింప లేకపోయినా యీమిషు నా అసమర్థత్వాన్ని సమర్థిస్తుం దనుకుంటాను. యిప్పటికి వారే దేశంలో యేజిల్లాలో వుండేవారో నాకు తపిసీలుగా తెలియదు. యేమైనా నేను వెళ్లేవోపికలో వున్నాను గనుకనా "మీవూ రెక్కడ"అని వ్రాసికనుక్కోవడానికి. వకటిమాత్రం యిప్పటి నాస్థితికి తగుతుం దనుకుంటాను. వకపర్యాయం తమరే తమకు నచ్చినపండితకవిని (కేవలపండితుణ్ణిగాని, కేవల కవిమాత్రుణ్ణిగాని కాదుసుఁడీ) వెంటఁబెట్టుకొని మాగ్రామం కడియానికే దయచేస్తే మీవాదంలో విశృంఖలంగా నన్ను గూర్చిన దూషించిన మాటలకేం గాని - సంప్రదాయం తెలియక వొప్పులను తప్పు లనడం యెట్టిదో, తప్పులను వొప్పు లనడం యెట్టిదో, యెంతోసే పక్కఅలేదు. కొద్దిసేపట్లోనే తేలుస్తాను. మీరేనా పత్రికలో రాయడం కనక యేదో కొంత పెంచివ్రాయఁగలిగారు గాని ప్రత్యక్షంలో జరిగే ముఖాముఖివాదంలో ఆలా పెంచలేరనుకుంటాను. నేను అనారోగ్యంగా వుండి మీ రున్నచోటికి రాలేక నేనున్నచోటికే రమ్మనడంవల్ల మీకయ్యే రైలుఖర్చులున్నూ, యిక్కడవున్నకాలంలో "తశీహ" ఖర్చు కరాముతులున్నూ నేనే భరించుకుంటాను. "అవస్థా పూజ్యతే" అన్న సందర్భం తమ రెఱుంగనిది కాదు కాఁబట్టి యీ నావిజ్ఞప్తిని తోసిపుచ్చ రనుకుంటాను. మునుపటిరోజులే అయితే తాము సభ అంటూ వుచ్చరించాలా? వుచ్చరింపనక్కరలేదు.

"లేడిపై దూఁకు సింగమ్మజాడ"

అన్నపద్యంకూడా తమరు చదివేవుంటారు. 'కొంగల మల్లాయగట్టు' అంటూ నైజాందేశప్రయాణంలో తగులుతుందఁట! కొంగలమల్లాయ వృద్ధుఁడైన పిమ్మట ఆగట్టుశిఖరం అధిష్ఠించి కూర్చుంశి, "లేస్తే మనిషినిగాను" అనేవాఁడఁట! యిప్పుడు నేనున్నూ అట్టి మూఁడుకాళ్ల ముసలిగానే వున్నాను. కాఁబట్టి, మీరు రప్పించేవోటుకు రాలేక యింతగా ప్రార్థించడం. యిదేమిన్నీ నా సిద్ధాంతాలని ఆమోదించడం కాదు కనక మీరు నిరాకరిస్తారని అనుకోను. మీపుస్తకం నేను యెవరోవిద్యార్థిదగ్గఱ యేకొంచెమో చూచాను. వెంటనే ఆవిద్యార్థి తత్సమేతంగా వెళ్లిపోయాఁడు. మీకోక్కపంపస్తే యేంచేతును? 'తప్పులతడక'గానే తోఁచింది. ఆకాస్తసేపట్లో "బొక్క" గా ఛేదించి చూపిన

దోషమున్నూ, "త్య, క్ష" అనే అక్షరాలకుపడ్డ ప్రాస విషయమై ఆక్షేపించినదిన్నీ నాకంటఁబడ్డాయి. ఇంకా మీ లెక్క ప్రకారమైతే యేనిమిదుండాలి అవి చూచిన జ్ఞాపకం లేదు. తరువాత చాలారోజులు యీ ప్రసక్తి పెట్టుకోనే లేదు. అంతట్లో యితర శిరోమణులవల్ల ప్రసక్తికల్గింది. పనిలోపనిగదా అని "కారుణ్యం" ఉపక్రమించాను. దోషాలతోపాటుగా యేస్వల్పంగానో గుణాలుకూడా మీరు మా గ్రంథాల్లోనుంచి వుదాహరించివుంటేమాత్రం మిమ్మనుగూర్చి నేను వాడిన "జ్ఞానలవదుర్విదగ్ధ"పదము వ్యర్థమై నేను తొందరపడ్డట్టు లోకులకు సాక్ష్యమిస్తుంది. లేనిపక్షాన్ని సార్థకమై "దేవుఁడికి సదృశమైన పత్తిరి" అనే లోకోక్తిగా వుండి క్షేమేంద్రాదులు చూపిన ఔచిత్యాన్ననుసరిస్తుం దనుకుంటాను. యీమాట బాగుంటేనే స్వీకరించండి. గుణాలకు మీరు మా గ్రంథాన్ని చూడనే లేదన్నందుకు మీ యీవాక్యం సాక్ష్య మిస్తూవుంది, చిత్తగించండి.

"రంధ్రాన్వేషణపరుఁడ నంటిరి, ... మీ గ్రంథములు నూఁడునాల్గు పరామృష్టములైనవి. సుమారు పదివఱకు నిందు దోషోదాహరణములుగా మీ పద్యము లుదాహరింపఁబడినవి"

చాలును. మీతల్లికడుపుచల్లఁగా నూఱేళ్లు వర్ధిల్లాలి. "అభణపు", "ఢిల్లికిఢిల్లే" లోకోక్తి యెత్తుకొని యెంతవుపకారంచేశారో, యీవాక్యం వ్రాసికూడా అంతవుపకారం చేశారు మీరు. అందుకోసమే మీకంటె ముందుగానే నేను సభాముఖమందు మీదర్శనాన్ని కోరా లనుకుంటూ వున్నాను. యింతలో దైవం ఆ కాస్తమాటా మీచేతే పలికించాఁడు. "నీదయా నీదయా నిర్దయా" అను లోకోక్తి తా మెఱుఁగనిది కాదు. "ద్వారాణి భవంతి సర్వత్ర" కదా! మీవుద్దేశ మెట్టిదో తెలియడమే నాకు కావలసింది. వేలకొలఁది పద్యాలు వ్రాసినవాళ్లకి యెక్కడో సంధివశాన్ని "బొక్క" రాక, యతీపోక, ప్రాసా చెడక వుంటుం దని వాదించే శుంఠనని తా మనుకొనుచున్నట్టు మీ వ్రాఁతధోరణి తెల్పుతూవుంది. ఆవాదం నాది కాదు. మీరు దోషాలకే మావి వుదాహరించడంలో మీహృదయం యెట్టిది అని తెలుసుకోవడమే నాకు కావలసింది. దానితో సకలమున్నూ తేలిపోతుంది. యీ వాదం తేలడానికి నా "వయోమాత్రవృద్ధత్వమే" పర్యాప్తమవుతుంది. దీనిలో జయం పొందడానికి మీ "విద్యామాత్రవృద్ధత్వం లేశమున్నూ పనికిరాదు. "అభణ" వగయిరాలు మీ "విద్యామాత్రవృద్ధత్వాన్ని" పూర్తిగా కుంకటివేళ్ళతో పెకలించితీరుతాయి, చూస్తురుగాని. తి. వెం. కవుల రచన దోషాలకుమాత్రమే వుదాహరించుకోతగ్గది కాని, గుణాల కుదాహరించుకోతగ్గది లేశమున్నూ కాదు - అనే అంశాన్నే మొట్టమొదట మీరు సాధించఁదగ్గది. జ్ఞాపక ముంచుకోండి. మీకు నేను వ్రాసిన యే అక్షరాలు కోపము కల్గించి వెఱ్ఱిమొఱ్ఱి ప్రసంగాన్ని పత్రికాముఖమున ప్రకటింపఁజేశాయో, ఆ మాటాలు మళ్లా వుదాహరిస్తాను, కొంత శాంతించి దానియందుండే ప్రధానాంశాన్ని మనస్సుకు పట్టించుకోండి—

"జ్ఞానలవదుర్విదగ్ధు లేదో మాకు వృథాగా పని కల్పించుట మానకున్నారు. ఇదికాక యీ శిరోమణిగారికి మారచించినవి పెక్కు గ్రంథము లుండఁగా, ఈ "బొక్క" మాత్రమే యుదాహరించుటకు దొరకెనా? దీనివలన నీయన కేవలరంధ్రాన్వేషణతత్పరుఁడనియును, అందుచే "బొక్క" దొరికియుండు ననియు ప్రాజ్ఞు లనుకొని దీనికి సంబంధించిన శ్రోకమును పఠింతురుకాఁబోలును! శాంతం పాపం!!"

ఇవిగదా నామాటలు? మీకు కోపంవస్తే లాభమేమి? చేసినపని తప్పుపని. భారతి నాచేత తగినమాటలు పలికించింది. యిఁకనేనా సంతోషించి నన్నుఁగూర్చి పడ్డ తొందరపాటుకు పశ్చాత్తాప పడండి స్వామీ! "సత్కవి వాక్యము రిత్తవోవునే?" నేను - సత్కవిదాఁకా యెందుకు - కవినేనా అయితే (మీ హృదయాన్నిబట్టి కాదుసుఁడీ) మా విషయమున మీరు నడచిన నడతనుబట్టి నేను మీ కొసఁగిన "జ్ఞానలవే"త్యాది బిరుదావళి, మీరు కష్టించి గురుశుశ్రూష చేసి సంపాదించిన "శిరోమణి" బిరుదంకన్న మిన్నయై ప్రసిద్ధికి వస్తుం దని నాపూర్ణవిశ్వాసం. యేవో నాలుగు పుస్తకాల్లో వాక్యాలు యేకరువుపెట్టి—

"యివి మీకు బొత్తిగా తెలియనివి, అసలే తెలియనివి" అనే అర్థమిచ్చే పేలవంమాటలు వ్రాసినంతతోనే తేలి పోతుం దనుకున్నారా? స్వామీ! మీ రొనర్చిన యసంగతపు పనివల్ల మీకున్నూ మాకూ వయోముఖ్య సందర్భాల్లో దేనియందున్నూ లేశమున్నూ పోలిక లేక పోయినా యేదో యింతవఱకు నాకు మాత్రం గోచరింపనికారణంగల కోపం మాయందు మీహృదయంలో వున్నట్టు అనుమానింపవలసివచ్చింది. లేకపోతే మీ రట్టి అసంగతప్పని చేసివుండరు యేం కర్మంకాలింది. చక్కఁగా గురుముఖతః చదువుకొని ప్యాసై యేదో పదవి సంపాదించుకొని సుఖజీవనం చేస్తూవున్న మీకు యెప్పుడో "మిడిసి రాలిపడ్డప్పటికీ" 'వృద్ధనారీ' అన్నట్లు వకరికంట మేము పడేదిలేదు; మాకంట వకరున్నూ పడవద్దన్నట్టు కాలక్షేపం చేస్తూవున్న తిరుపతి వేంకటేశ్వరకవులను వెక్కిరించడానికి యేదో ప్రబల కారణం వుండితీరాలి! అది మీ ముఖతహానే వినాలి. దయచేసి తెల్పుదురు గాక. ఆత్మవంచన లేకుండా మాత్రం ప్రవర్తించండి యిఁక నేనా! 'యోజించి తప్పు, యోచించి వొప్పు' అన్న మీ వ్రాఁత అబ్బో! చాలా ఉత్సాహంగా నడిచేటట్టు వుంది. నడిపిస్తురుగాని. వంట్లో బలం తగ్గింది గాని యింకా కొంచెం బుద్ధిబలం భగవంతుఁడు నిల్పేవున్నాఁడు. మీవాదాన్ని తట్టుకోవడానికి యీకాస్తా చాలకపోదు. అది లోకవ్యవహారసిద్ధ మేమండి? అట్లాగే వాదిస్తురుగాని సభలో. "జ్ఞానలవదుర్విదగ్ధత్వాదులు" పెద్దతిట్లుగా మీకు తోఁచాయేమండి స్వామీ? అస్మదాదుల మందఱమూ దానిలోనే చేరతాముగదా! మీ రింకా వయస్సులో మాకన్న చిన్నలవడంచేత అస్మదాద్యపేక్షయా అనుభవం తక్కువగా వుండడాని కంగీకరింపనివా రుంటారా? అపక్షాన్ని ఆమాట వాడఁగూడదా? తి. వెం కవులు.—

"చీమలో దోమలో నాఁగఁ దోఁచిరి" కదా మీ బుద్ధికి. యెవరో కొందఱిచే గౌరవింపఁబడిన వాళ్లు మీ కట్లు తోఁచినప్పుడు "కారుణ్యా"ది ప్రసంగం మీ విషయమున తగనిదెట్లగును? గుణ మేమిన్నీ లేనే లేదండీ మాకవిత్వంలోను? యీ మాట మీ రే విద్యార్థులకు గురుత్వం చేస్తూవున్నారో, జిజ్ఞాసాతాత్పర్యంతో వారే అడిగితే గతేమి? మీ రేకాలేజీలో వున్నారో? తపిసీలుగా తెలియక సందిగ్ధగా వుండి "ఫలానా" అని స్థిరపఱిచి వ్రాయలేదు, క్షమించండి. నేను మీగ్రంథ మంతా తపిసీలుగా చూడలేదు. యీ "బొక్క" సుట్టమున్నూ, 'త్య, క్ష' వర్ణాలకు ప్రాసాన్నిగూర్చిన ఘట్టమున్నూ మాత్రమే చూచి మీరు అమాయకు లనిమాత్రం అనుకున్నాను. యెందుచేత? మొదటిదానికి భారతాదులలో సంధివశాన్ని వచ్చిన యీలాటివి లెక్కకుమించి వుండడంచేతనున్నూ, రెండవదానికి యిదికూడా తప్పే అనుకోవడంగాని, లేక యింతమాత్రం ప్రమాదంకూడా లేకుండా కవిత్వం చెప్పేవాళ్లంటూ వుంటా రనుకోవడంగాని సహృదయు లనిపించుకొనేవారి విషయం కాదుకనుకనున్నూ, యీయ నెవరో గ్రంథాలు చదివి ప్యాసై తే అయివుండును గాని హృదయ నైర్మల్యం లేశమున్నూ లేనివారై వుండడంతప్ప దనుకొన్నాను. అందుచేతనే సహృదయుల మండలింపున కాశపడింది నేను. ఆమండలింపునుకూడా మీహృదయం సమ్మతించిందికాదు. ఓహో! మీతాత్పర్యం నాకంటే ప్రపంచంలో సహృదయుఁ డంటూ వుంటాఁడా అని కాఁబోలును! అవును. 'అహమేవ పండితః, అహంచ పండితః, అహం న పండితః' అనే అవస్థాత్రయంలో మొదటి అవస్థలో వున్నారుగదా స్వామివారు. మూఁడో అవస్థలో వున్నవారిమాటలు వెగటుగా వుంటా యనుకొంటాను. యింతకూ స్వామివారితాత్పర్యం, అశ్లీలమంటే తి. వేం. కవులకు తెలియదు సరికదా! యే అక్షరానికీ యే అక్షరానికీ ప్రాసమైత్రి వున్నదో అదికూడా తెలియదు— అని ధ్రువపఱచడమే అనుకుంటాను. ఆపద్ధతిని తి. వెం. కవులకు తెలిసిం దేమిఁటో? తెలకపిండి. అందుకే విద్యార్థినిగూర్చి వుపయోగపఱిచేమాట లుపయోగపఱిచారు స్వామి.

(౧) ఇదొక్కవిషయమే కాదు మీరు గ్రహింపనిది యింకను చాలవిషయము లున్నవి.

(౨) పురీషం.........ఇదియు మీరు గ్రహింపఁజాలకపోతిరి. (ఇయ్యెడ స్వామివారి హృదయం

బొత్తిగా నీచమున కొడిగట్టినట్లు నాకుఁ దోఁచెడిని. నిజం వారే తెలుపవలెను.)

(౩) మీ కుచ్ఛ స్ఫురించునంటిరి (ఇటుఁగూడ స్వామి కేదో హృదయకాలుష్యం ధ్వనితం.)

(౪) మీరు సరిగా గ్రహింపఁజాలరని డింకొకటి.

(౫) మఱొక విషయము మీకు తెలియనిది.

(౬) అంతులేని తప్పులువచ్చు మీరు.

(౭) మీ రీవిషయములో నోరెత్తుట కేమాత్ర మును అర్హులు కారు. (యీమాట స్వామివారిగ్రంథం తప్పులతడక యన్నందుకిచ్చేజవాబు.)

(౮) కావున మీయోజన పూర్తిగా దుష్టము. నాయోచించుట మిక్కిలి యుక్తము.

యింకను నిట్టి ప్రల్లదములు పెక్కులు. ఒరులు దుష్టుసుగా వ్రాసిరని చూపువారు కొంత వెనుకత్గ్గి వ్రాయవలసింది. అట్టి తెల్వి స్వామికి పెరుమాళ్లనుగ్రహించలేదు. పాపం! ఆచార్లవారికి మిక్కిలికోపం వచ్చింది. కాఁబట్టి విద్యార్థికి బోధించినట్లు శిక్షించి బోధించారు. 'పురీష'పదఘటితమైన వాక్యంలో ప్రతి వాదికి తత్స్వీకరణాన్ని స్ఫురింపచేశారు. శ్రీమంతులవారితో వాదం పెట్టుకోవడంకంటె శ్రీమంతులవారు చెప్పినట్లే చేయుట యుక్తమేమో? అంటారేమో? చదువరులు. నా అంతట నేను నాజన్మమధ్యమందు వీరితోనేకాదు వాదం యెవ్వరితోనూ పెట్టుకోలేదు, పెట్టుకోను. అవతలివాళ్లు నన్ను కదిపితే చేతనైనంతలో ఆత్మసంరక్షణార్థం పెనుగులాడతాను. జయాపజయాలు దైవాధీనాలన్నది నాకోసమే పుట్టలేదు. ఆచార్లుగారు నిమ్మేమైనా ముందు కదిపినారా అంటారా? కదిపినట్లు యిదివఱకే ఋజువు చేశానుకదా! అకదిపినదేనా పెద్ద గొప్పతప్పిదంచూపి కాదుసుమండీ?

"పృథ్వీభరం బొక్కటా" అన్నది. "పృథ్వీభర మొక్కటా?" అంటే నా రన్నదోషం అక్కడ రాదు. ఆచార్లవారి గ్రంథమంతా తప్పులతడకకాకుండా వారు వ్రాసిన రక్షకవాక్యం వకటి వుంది. ఆవాక్యాన్నే తి. వేం. కవులకు వక అభినిమిషం యెరవుగా యిస్తే అది సవరణ అవుతుంది. ఆవాక్యం చూపుదునా?

"నా గ్రంథము తప్పులతడక యనియు...వ్రాసితిరి....అచ్చు వేయించుటలో జరిగిన లోపమువలన నట్టివ్యత్యాసము జరిగినది" యీసంరక్షణవాక్యం సుదాబద్ధమైనా వారిగ్రంథాన్ని యావత్తూ రక్షించింది కాని మా— "పృథ్వీభరంబొక్కట" అన్నదాన్ని సంరక్షించలేకపోయింది. చూచారా ఆచార్లవారి సాహసం! యింతకూ ఆచార్లవారు ముందు మమ్మల్ని కదిపినారా, లేదా అన్నది ప్రస్తుతం గుణవిషయంలో వకటిన్నీ వుదాహరించక దోషవిషయంలోనే (నేను వకటే అన్నాను, కాదు పది అంటూవున్నారు శ్రీమంతులవారు. యీ వ్రాఁత నాకు మఱీవుపకారకం. (ప్రియం నః ప్రియం నః) అన్నీ వుదాహరించడం వల్ల వారు నిద్రిస్తూవున్న నన్ను కదిపినట్లయిందా? అందుచేత నేను వారినిగూర్చి యెత్తుకోక తప్పింది' కాదు. యిదివఱలో మాకువున్న ప్రతిజ్ఞాస్వరూప మెవరెఱుఁగరు?

'ఉ. కొండల నోరఁజేసికొని కొంత వడిం బఱతెంచి యంతను, ద్దండత దారి కడ్డమయి తాఁకి హళాహళి నేయు కొంపెలన్, బిండిగఁజేసి రైలు కడువేగమునం బఱతెంచు నట్లుభూ, మండలి మాకవిత్వము ల "మంకుఘటమ్ములఁ" జెండి మీఱుతన్."

అనేది మా ప్రతిజ్ఞ. అంతేనేకాని యెవరివీఁడికిఁగాని మా అంతట మేము పోలేదు, పోము. ముందు వరతలవారు మాట మిగలాలి. యిది చదువరులు బాగా విచారించవలసిన విషయం. తరనాతంటారా? 'ఆసీమాంతం' చేసికొని విడిచేదిలేదు. సరే! యీ మాటల కేమి? యిదివఱలో మీకు వాదోపవాదాలు యే 'లాకలూకాయల'తోనో వచ్చాయి. కాఁబట్టి మీ ఆట సాగింది. యిప్పుడో 'యినపగుగ్గిళ్ళుగాని మినపగుగ్గిళ్లు కావు' అంటారా? సమ్మతమే. శ్రీమంతులవా రట్టివారే! యెట్టివారున్నూ కాకపోతే నిద్రపోతూవున్న వాణ్ణి పనిగట్టుకు లేపుతారా? వస్తే వాడే రానివ్వండి. పాములను పట్టుకొని ఆడించేవాడికగతి తుద కేమవుతుం

దంటారు? ఆలాగే చెప్పుకుందురుగాని తరువాత నీరు. యిప్పుడల్లా విచార్యమేమిటి? వారి గ్రంథంలో మా ప్రయోగాలని దోషాలకే యెత్తుకొని యితరానికి లేశమున్నా యెత్తుకోని ఆచార్యులుగారి హృదయంయెట్టిది? యిందుకు ఆచార్యులుగారు పెరుమాళ్ల సాక్షిగా జవాబు వ్రాస్తే, అది లోకానికి నచ్చినా నచ్చకపోయినా నేను వారికి దాసోహాలు చెపుతాను. యింతవఱకు నేను వ్రాయఁబోయేదానికి వుపోద్ఘాతం. ఆచార్లగారు—

'అయితే, మోదించి, సాధువదాన్ని కూర్చి యేమి? వాళ్లను ఆక్షేపించే విషయానికి—

"ప్రశస్తి, అభఃపుగాంక్లు, ఢిల్లికి ఢిల్లే పల్లెకుఁ బల్లే" అనేవి అద్భుతశులుతా యన్న వ్రాఁతకేమి?

పిమ్మట వ్రాస్తాను. కాని ఆ ప్రయోగాలయం దున్న తప్పిదము మాత్రం స్వామివారు ముందుగా విపులంగా వ్యాఖ్యానం చేయాలనుకుంటాను. యేదో టిప్పణి కొంచెం వ్రాశారు. అది చాలదు, విపులంగా తత్తన్నిష్ఠమైన దోషస్వరూపాన్ని వ్యాఖ్యానం చేయాలిగాని 'నీళ్లల్లో గేదెను బెట్టి బేరం' చెప్పఁగూడదు. కాఁబట్టి మిక్కిలి అవసరమైన యీవిషయాన్ని స్వామిగారు గమనించాలి. అక్కడక్కడ "ఓనమాల కుఱ్ఱాఁడికి బోధించినట్లు బోధిస్తూవచ్చారే? యిక్కడ మాత్రం "శకోస్తు పానం వ్యాఖ్యానం"గా వ్రాస్తే యేలాగ? యీవయస్సులో అయాచితంగా నాకిలాంటి గురువులు దొరకడం పురాకృతపుణ్య పరిపాకంగదా! "గుణాః పూజాస్థానమ్". అది అట్లుండే. లక్షణగ్రంథముల కఠిన నియమములకు నేను వప్పుకొంటూ లక్ష్యానికి-అనఁగా, లౌకికూకాయలదానికి కాదు- మహాకవుల లక్ష్యానికి యెక్కువప్రాముఖ్యం యిచ్చితీరాలి అని కదా వ్రాశాను? దాన్ని గుఱించి యేదో వ్రాస్తూ తిట్లకి రేఁగారు స్వాములు. అవి యౌచిత్యానికి దూరంగా వున్నాయి. వారికి జ్ఞానలవదుర్విదగ్ధత్వమే తిట్టుగా కనపడ్డది. 'సర్వజ్ఞత్వము సాంబమూర్తిది'గదా! అయితే సర్వజ్ఞులే అనుకుందాం స్వాములను. 'అభః' అర్థంకాకపోవడమేమి? "ఢిల్లికిఢిల్లే" దోషజుష్టమవడమేమిటి? నేను వ్రాసిన జ్ఞానలవదుర్విదగ్ధత్వాన్ని సమర్థిస్తేనే ఆచార్లగారు సన్మతించవచ్చును. లేదా, బలవంతం లేదు. అన్నిటికీన్నీ మకుటం నిర్దుష్టహృదయంతో తమ గ్రంథంలో మా ప్రయోగాన్ని యెత్తుకున్నారా? దుష్టహృదయంతో యెత్తుకున్నారా అన్నది. యిది స్థిరపడితేనేకాని తక్కిన చర్చకు దిగడం అవసరంకాదు. యింకొకటి. లక్షణగ్రంథాల్లో వుదాహరణా లిచ్చేటప్పుడు సమకాలికుల పుస్తకాలనుంచి యివ్వడం అంత గౌరవప్రదం కాదు. గుణాలకున్నా దోషాలకున్నా కూడా ప్రాచీనులవి యివ్వడమే యెక్కువవీలు. వాళ్లు స్వర్గస్థులవడంచేత లక్షణగ్రంథకర్త తెల్వితక్కువగా ప్రవర్తించినప్పటికీ తిరగఁబడి అడగడం తటస్థించదు. అది గ్రంథకర్తకెక్కువ సుఖంగదా? ప్రతి ప్రాచీన గ్రంథకర్తనున్నూ ప్రతినవీనగ్రంథకర్తా కొద్దోగొప్పో ఆక్షేపిస్తూనేవుంటాఁడు. అడిగే దిక్కుమాత్రం వుండదు. మళ్లా యెవరో బయలుదేరి పూర్వగ్రంథాన్ని సమర్థించడమున్నా వుంది గాని అది మిక్కిలి అరుదు. వక్తవ్యాంశం- సమకాలికుల ప్రయోగాలు పుచ్చుకోవడంలోకూడా స్వాములనా రేదో గొప్పను సంపాదించుకోవడానికే అన్నది. యిదే నిశ్చయమైతే తమరు బెత్తం చేతపుచ్చుకొని ఓనమాలు బోధించడానికి తగ్గస్థితిలో వున్న మాకంటివారి గ్రంథాలనుండి వుదాహరణాలు పుచ్చుకోవడం గ్రంథానికి వుపకరించదనుట నిక్కం. యెందుకు పనికివస్తుందంటే, యేదో క్రౌర్యంతో అవమానించడానికిమాత్రమే పనికిరావలసివుంటుంది. స్వామి యేమంటారో చూదాం. యేకవి వాడింది అశ్లీలంగా వుంటుందో ఆ మాట ఆ కవికాలంనాటికి దురర్థాన్ని యిచ్చేదిగా వుండివుంటదంటూ తేల్చారు స్వాములు. 'పాని, అనుష్ఠించు' వీట్లనట్టివిగానే అభిప్రాయపడ్డారు. సందిగ్ధవిషయంలో వ్రాయడంలో మొదలెడితే వ్రాఁత మిక్కిలి పెరుగుతుంది. సందేహం లేనిదాన్నే చూపితే బాగుంటుంది. ఔచిత్యాది విషయములకు పింగళివారిని అగ్రగణ్యులుగా స్వాములు వప్పుతారేమో, లేక వారికిన్నీ వుపాధ్యాయత్వానికి సిద్ధపడతారా?

"తనుచోట్లు సుద్దంటఁ ద్రవ్వి త్రవ్వి"

అని సూరన్నగారు ప్రయోగించారుకదా? ఆచార్యుల వారు మావంటి "లాకలూకాయల" ప్రయోగాన్ని దోషాల కుదాహరణంగా చూపుకొని "గిల్లి కజ్జాకు" దిగి తోఁచీతోఁచని వ్రాఁతలు వ్రాస్తూ మాకు పనికల్పించడంకన్న ఆ సూరన్నగారివంటివారిని వుదాహరిస్తే లోకం "మెచ్చి మేఁకతోలు కప్పుతుం"దేమో? వీరిని నేను జ్ఞానలవదుర్విదగ్ధపదభాగినిగా నేసినందుకు మిక్కిలి కినిశారు వీరు. వీరు చేసినపని యెట్టిదో మాడండి. వీరెత్తుకొన్న చోటున మేము చిరకాలం నాఁడే వ్రాసిన అక్షరా లుదాహరిస్తాను—

(పాశుపతమునుండి)

"పృథ్వీభరం బొక్కటా? ఇట బొక్క అని విడఁదీసి దోషము నాపాదించుట లాక్షణికులమతమే గాని, మఱి "దీ బొక్క" పదమున కేమి, పాలు, ద్రొబ్బు ఖోనసువానికేమి గ్రంథకర్తలమతమున దురర్థమున్నట్లు తోఁచదు. కావున నే "బొక్కనీరు (మార్కం. 3 ఆ) అని మారన్న ప్రయోగించినాఁడు. పాలు, ద్రొబ్బులకు సర్వత్ర చూడుఁడు. దురర్థము వచ్చినను నంగీకరించి సంధిస్థలముల నిట్లు భారతాదికము నిరాఘాటముగాఁ బ్రవర్తించుచున్నది. "ద. హరి తా జయ మొదఁగూర్పకున్న" (భార - ఉద్యో-౨ ఆ.) ఇట్టివి పెక్కులు. శృంగారరసమున నించుక పరిశీలింప వలసి యుండునుగాని యందును బ్రాచీనులు గణింపరైరి. సీ ..... తనుచోట్లు సుద్దంటఁ ద్రవ్వి త్రవ్వి" (కళాపూ- ర. ఆ)

యిట్లు చిరకాలంనాఁడు సమాధానం వ్రాసి ప్రచురించిన విషయాన్ని యెత్తుకోవడంలో శ్రీ ఆచార్యులవారి హృదయం యేలాటిదిగా కనపడుతూవుందో ప్రాజ్ఞులు విచారించాలి. యీ విషయంలో నాకు తెలియని దేమిటో? వారు స్కూలు పిల్లాడికి బోధించినట్లు నాకు బోధించే దేమిటో? ప్రాజ్ఞలోకమే నిర్వచించాలి. "సద్ధపదం సూరన్నగారి కాలానికి సదర్థాపాదకమే" అనేవా రుంటారా? ఆచార్లగారివాదం అతోవలో వుంది. వారిని నేను జ్ఞానలవదుర్విదగ్ధు లనడం స్వభావోక్తి యైతేనే లోకం విశ్వసిస్తుంది యీ క్రింది సందర్భం మాడండి—

"అభంగపుగాండ్లు" అనునది నిరర్థకపదము"

అంటారు స్వాములు జ్ఞానలవదుర్విదగ్ధత్వాన్ని స్వామివారి యీ వక్కమాటే సిద్ధపఱుస్తుంది. దీని కోపమెందుకు? "నిజమాడితే నిష్ఠూరం" కిందికి యిది రాదు కాఁబోలు? యిది స్వభావోక్తి "స్వభావోక్తి రలంకారు" అది నిరర్థకం కాదు గిల్లికజ్జా తెచ్చుకొని, చేయూడినట్లల్లా వ్రాసేవారిపారం తేల్చడానికే "మూలమున్న ఆపదాన్ని ముంగిటి కీడ్చడం తటస్థించింది. సంప్రదాయజ్ఞులైన శిష్యు లున్నారు. అడిగితే వారు స్వాములకు అర్థాన్ని బోధిస్తారు. అది శిరోమణిత్వానికి భంజకమైతే మనవిచేయఁజాలను. వ్యాకరణంలో కొంచెం ప్రవేశ ముండాలి. అజాదిగాఁ గాకుండాకూడా వక త్రోవ వుంది అక్కడ. కానీ ఆ పక్షంలో యింకా చిక్కులు కొన్ని వస్తాయి. సారం తేల్చడాని కేర్పడ్డ ప్రయోగ మయినప్పుడు • ఆ తిరుమంత్ర రహస్యం యిప్పుడే అంతా తేలిస్తే యేలాగ? స్వామివారి ముందుముందు వ్రాఁతకు-అనఁగా "దుస్త్యజా హి ప్రకృతిః" వల్లనైరా వ్రాఁతకు తగినఫలాన్ని యీ "నిరర్థకపు" పదమే కలిగిస్తుం దని మనవిచేసుకుంటాను. యెన్ని గ్రంథాలో వుదాహరించారు ఆచార్లగారు. గురుపాదాల వద్ద చదివితేగాని అవన్నీ నాబోట్లకు తెలియవన్నారు. అంగీకారమే. ప్రస్తుతపదాని కర్థంకూడా గురుపాదసన్నిధానాన్నే తెలుసుకుంటారేమో? యెందు కింత కర్మం, అన్యబుద్ధి యప్రత్యక్షము కదా! వచ్చినవాదం, వారు "నిరర్థక" మన్న "ఈ యభంగపుగాండ్లు" అన్న చోటకాదు. లక్ష్య లక్షణములలో దేనికి యెక్కువ ప్రాధాన్యం అన్న చోట. దానికోసం ముఖ్యమైనమాటలు వ్రాస్తే తీరిపోయేది. దానిలో దీన్నెత్తుకోవడం యెందుకు? బోల్తాపడడానికి అని బుజువవడానికే. యింకా యీఘట్టంలో "ఢిల్లీకి ఢిల్లి" కూడా తప్పన్నారు స్వామి. యేమి సాహసం? యేమి సాహసం? వీరికి సూరన్నగారి "లోల్లా రోకల్లం బాడినపూరుము" లేలా సాధవుతాయో గదా! యింకా "ప్రకాస్తి" వంటి

వుంది. తర్వాత చూదాం. శాంతం పాపం! లక్షణం కన్న లక్ష్యానికి ప్రాధాన్య మిచ్చితీరాలి అన్నందుకు పాణిగృహీత పత్రికలో రేఫశకటరేఫలవిషయంలో కూడా కొంత వ్రాసియున్నాను. దానికి వీ రేమిచెపుతారో? అందుకే యిటకు దయచేసేటప్పుడు కేవలకవిని గాక కేవలపండితుణ్ణిగాక మాధ్యస్థ్యానికి "పండితకవి" సహితంగా దయచేయాలని మనవిచేసుకున్నాను. లక్ష్యలక్షణవిషయంకన్నా వీ రెట్టిహృదయంతో జీవత్కవినైన నాకవిత్వాన్ని పరామర్శించడానికి దిగినారో తేలాలి సదుద్దేశమే అయితే, రంధ్రాన్వేషణత్వము వీరికి తగులదు. ఆఘట్టంలో వుదాహరింపకుండానే స్ఫూర్తికి వచ్చి స్వామివారిని యిప్పుడు "తందనా"లాడిస్తూవున్న శ్లోకప్రసక్తిన్నీ వుండదు దురుద్దేశమే అయితే ఆస్ఫూర్తికి తగిన శ్లోకాన్నే వకమంత్రంగా యేర్పఱచుకొని సపాదలక్ష జపం జరిపి తద్దశాంశం తర్పణమున్నూ, తద్దశాంశం హోమమున్నూ, తద్దశాంశం బ్రాహ్మణభోజనమున్నూ జరిగించాలా, వద్దా అని ఆచార్యులవారినే అడుగుతాను. చాలా గ్రంథాలు యేకరువు పెట్టారు? వాట్లలోనుంచి కొంత గ్రంథాన్ని కూడా వుదాహరించారు. యివన్నీ నాకు తెలియవన్నారు, సమ్మతమే. వారికి తెలిసిన లాభ మేమి? తెలియనివాళ్లు తప్పుత్రోవ తొక్కడంకన్న తెలిసినవాళ్లు తొక్కడమే తప్పుగాదా? ముఖ్యంగా ఆచార్యులవారు మమ్మల్ని కదపడం సదుద్దేశమా, దురుద్దేశమా అన్నది తేలాలి. నాకు తెలియని అంశాన్ని వా రీవ్యాసంతో బోధించే సందర్భంకూడా తేలాలి. లోపం తమది కనపడుతూండగానే ఆచార్లగారింత తొందరపడ్డారు, లేకపోతే యెంత తొందరపడతారో? తమకే యింత యిబ్బందిగా వుంటే వా రన్నట్లు వయోమాత్రవృద్ధత్వమేనా వున్న నాకు తమరు చేసిన యయుక్తకార్యంవల్ల యెంత యిబ్బంది వుండాలో? యేమీ? నాజోలికిరానట్టున్నూ, నేను వారిమీదకు వృథాగా వెళ్లిదూషించినట్టున్నూ అపలపిస్తారే ఆచార్యులుగారు? యింతమాత్రంతోనే పోతుందా? నాప్రకృతే దుస్త్యజమో, లేక తమకే అది వర్తిస్తుందో తేలేకాలం వచ్చిందనుకుంటూను.

లేకపోతే వా రుదాహరించుకో తగ్గదో పాలకు కవిత్రయం మొదలైనవారి ప్రయోగాలుండగా మావంటి "లాకలూకాయలని" తడవడ మెందుకు వస్తుంది? "ఫలానుమేయాః ప్రారంభాః" కదా! ఆ కాలంనాటికి ఆపూటకు దుర్గ్రంథం లేదంటూ వక ఆభాసవాదాన్ని లేవదీశారు స్వామి. యీవాదం నిలిస్తే చూస్తాను నేను సూరన్నగారి సుద్దులలో 'సుద్ది' పదం యెంత అపకారం చేయాలో అంతా యీవాదానికి చేసితీరుతుంది. యిది తెలుగులో వచ్చింది కనక వాదం తెలుగే వుదాహరించాను. సంస్కృతమ్మట్టుకు సంస్కృతానికిన్నీ వున్నాయి బోలెడు. భారవిలో కాంబోలును-"శ్లో. ఈశార్థం" అని పడ్డది. "పంచాంగవినిర్ణయోనయః" అనిన్నీ పడ్డది. శేఫాలికా పుష్పశబ్దం వకటి మహాకవులు తఱచు వాడుతూవుంటారు. ఇంకా యెన్నో వున్నాయి. యేమీ ఆధారాలు లేకుండా "కార్యం" వేయడాని కుపక్రమించలేదు. చూపినవాట్లలో "శార్ధం" శ్రాద్ధానికిన్నీ, యింకొకటి గుహ్యావయవానికిన్నీ, వేఱొకటి పురుషగుహ్యావయవానికిన్నీ స్ఫోరకత్వవాచకత్వాలకు పనిచేస్తాయి. అయితే ఆకవులందఱూ అప్రాజ్ఞులే అంటూ వాదిస్తారని స్వామివారిధోరణి సూచిస్తూవుంది. అందుకే, అది తేలడానికే యీ వయోమాత్రవృద్ధుడిపరిశ్రమ. లేకపోతే- "లక్షణమున్నను" అని వ్రాస్తూకూడా "కారుణ్యాలి" కుపక్రమిస్తానా? కాళిదాసాదుల కాలానికిన్నీ, ఆలంకారిక వామనుని కాలానికిన్నీ కల భేదమే నాకు తెలియదనిన్నీ, కాళిదాసుకవిత్వానికిన్నీ ఆంధ్రదేశవ్యవహారానికిన్నీ యెట్టి సంబంధమో తెలియదనిన్నీ నాకు (బెత్తంమాత్రం చేతబట్టలేదేమో?) వుపాధ్యాయత్వాన్ని చేయడానికి మొదలెట్టిన శ్రీమానులవారి సాహసం వర్ణనీయం. నేను నూటికి ముప్పైయయినో, లేక నలభైయో మార్కులు తెచ్చుకోలేదుగాని యీ తెచ్చుకున్నవారికి పాఠం చెప్పే శిష్యులున్నూ, వీరందఱిమీదా సర్వాధికారం వహించేశిష్యులున్నూ, నాకు పలువు రున్నారనియేనా స్వామి సంశయించలేదు. నే నొకవేళ వృద్ధుడు నవడంచేత యీవాదం తేలే

లోఁగా పరమపదిస్తానని ధైర్యమేమో స్వామివారికి? జాతకరీత్యా యింకా ఆయు వుంది. రెండోపక్షంలో సమర్థులైన శిష్యప్రశిష్యులున్నారు. స్వామివారిని నిరోధించి అడుగుతారు. యేమని? మీ ప్రవృత్తినిబట్టి వాడఁదగ్గమాటలే సుకువుగారు వాడినారు. "అవసరపఠితా వాణీ గుణగణరహితాపి శోభతే పుంసామ్" అని. అవసరానికి తగ్గమాటలు వాడవలసివచ్చింది, వాడినాను. ఔచిత్య విచారచర్చ చేసిచూస్తే స్వామికి కోపం రాకపోయేదే కాని నా ప్రకృతిలో ఆలా సహించేగుణం లేదు. "దుస్త్యజా హి ప్రకృతిః" అని నాకే వ్రాశారు పత్రికవారు విసుక్కోకపోతే నా ప్రకృతిని స్వామివారు రుచిచూస్తారు. స్పృశించి విడిచానేకాని ప్రధానాంశం యింకా మొదలెట్టలేదు. "అభణ" నిగ్రధకమన్నది స్వామి మఱుస్తారేమో? జ్ఞాపకంచేస్తే మంచిది గదా! ప్రత్యుత్తరానికి నిరీక్షించే - వేం. శా. శతావధాని.

## అ ను బం ధ ము

(౧) ఆచార్లగారు తాము నిరపరాధులైనట్లు వకవాక్యం వుటంకించారు. ఆవాక్య మిది— "నేను మీ గ్రంథమును విమర్శించినపుడు నా యాంధ్రకావ్యాలంకారసూత్రవృత్తివివరణమునం దొక్క పరుషవాక్యమేని మీ విషయమై వాడినట్లు చూపఁగలరా?"

పరుషవాక్యాన్ని పిమ్మట చూపుదాం. ముందు గీటుంచినచోట మాకు ఆయన ఆపాదించిన 'బొక్క' వంటి 'తొక్క' కనపడుతూవుందా? లోకంలో 'తొక్క'పదం బూతులాటలో గ్రామ్యులు వాడేదేనా? 'తొక్కన్న తోలన్న' ఇత్యాగులు స్వాములున్నూ వినేవుంటారు కాఁబట్టి విస్తరించేదిలేదు. వారి సిద్ధాంతప్రకారం యిది గ్రామ్యదోషంకదా! పిమ్మట యింకా యిట్టివి మఱికొన్ని చూపుతాను. ప్రస్తుతం యిది "వెక్కిరింపఁబోయి బోల్తాపడడం" కిందకు డేఁకుతుంది గదా! యిఁక పరుషవాక్యం చూపుతాను.

'ఈవివర సమాసము...బ్రాహ్మణ పరిషత్తులో చండాలునివలె నున్నది.'

మాకవిత్వమును తెలిసో తెలియకో తోఁచినరీతిని విమర్శిస్తూ బాగులేదని తోస్తే బాగులేదనడం యుక్తం గాని యీ "చండాల" పదప్రసంగ మెందుకు? దీనింబట్టి వీరికిన్నీ మాకున్నూ యేవిధమైన ముఖపరిచయముకూడ లేకున్నను, యేదో వైరకారణ ముండితీరవలెను. మఱి యే యితర లక్షణగ్రంథకర్తగాని యీ "చండాల" పదప్రసంగముతో కవికవిత్వాన్ని యీసడించినట్లు స్వాములు చూపఁగలరా? అయితే యిందు వ్యక్తిదూషణ లేదంటూ సమాధానం చెప్పవస్తారేమో? నేను 'కారుణ్యం' వేసిందిమాత్రం వ్యక్తికా, వ్రాతకా? చూడండి—

"ఆ వ్రాఁతనుగూర్చికూడ, ఈ సందర్భములో ఒక కారుణ్యము వేయుట మంచిదనుకొందును" అంటుచేత 'బొక్క' కి 'తొక్క' లాగే యిదిన్నీ సరిపోతుంది. "జ్ఞానలవదుర్విదగ్ధత్వం" వగయిరాలు వారి రచనవల్లనేమి, వారు తిరిగీ ఆక్షేపించిన "ప్రకాస్తి-అభణ" వగయిరాలవల్లనేమి సుళువుగా సమర్థింపఁబడతాయి. యిఁక ఆచార్లగారు "వయోమాత్రవృద్ధ"త్వాన్ని గణింపక చేసిన తూలుప్రసంగం మిగిలిపోతుంది. స్వామివారి గ్రంథంలోవున్న యితరతప్పులు వుపేక్షించి గ్రామ్యదోషానికి వారిసిద్ధాంత ప్రకారం బాధించేవి దిఙ్మాత్ర ముదాహరిస్తాను.

(1) పంచమాధికరణము, (2) లింగము, (3) కావున నాతీరుగల, (4) మదింగా, (5) కమలము, (6) కాటయవేమన, (7) ఈశర్మాఁడవగుదని, (8) నెచ్చెలికాఁడు, (9) సహజన్యచూడనొప్పెఁ జారుదోహదలక్షణసహితి, (10) తియ్యఁబోఁడి, (11) రాచలింగకవి (12) కూర్పుకూర్చెదక్, (13) భగదత్తు, (14) అప్సరోమయము (15) అతిమాత్ర, (16) బిరుదోత్సవములకు (17) సంకటముల (18) దహన (19) వెండిగుండెన (20) మేళగింపుకాలేదు (21) మొత్తపుకూర్పు (22) ఎఱుఁగుటచే (23) భీమఁడనుశంభతుక్కంభి, (24) కెంపుకడాని (25) ముగుద (26) మానము (27) లక్ష్యముండవలయు (28) మట్టింగ.

యింకను ఆచార్లవారి పొత్తమునుండి యిట్టివెన్నో చూపవచ్చు. వీటిలో కొన్నిటికి అసభ్యదావృత్తి కలదు. వారి విమర్శనాధోరణి ననుసరించినచో యీ

చూపినచోట్ల అంతో యింతో గ్రామ్యదోషమును చూపవచ్చును. యీ చూపినవాట్లలో వారు వుదాహరణంగా చూపిన మహాకవులకవనంలోవి కొన్ని. కొన్ని వారి వివరణవాక్యాలలోవి. మా మతములో నివియన్నీ నిర్దుష్టములే. వారిమాట వారికి వప్పగించేపక్షాన్ని యివి అన్నీ దోషదూషితములే. యేది యెందుకు దోషదూషితమయిందని స్వామి బహుశః ప్రశ్నింప రనుకొంటాను. ప్రశ్నిస్తే విపులంగా వివరణం వ్రాస్తాను. యిప్పుడెందుకూ వృథాపరిశ్రమ? మఱేన్నీ వీరికి తెలుఁగువ్యాకరణ సంధులు తెలియ వనుటకు ఛాలా వుదాహరణాలు దొరుకుతాయి. చూడండి యీవాక్యాన్ని—

"సౌభాగ్యమునోదవెడలంకాకైరేక దేశములు"

నావుకు, అనవుకు, యేమవుతారంటూ యెగతాళిచేయడం కలదు. వీరికి ఒనవెడున్ అను తద్ధర్మ విశేషణం రాముఁడువంటిదై సంధిని సంపాదించుకుంది. పయిగా సాహస మెంతో వున్నట్టు—

అయితే, యోచించి

యివి "సిద్ధిర్లోకాద్దృశ్యా" వల్ల సాధువు లవుతాయని వ్రాయడంవల్ల కనపడుతుంది. పైసంధికూడా, యీ "దృశ్యా"లోకే చేరుతుం దనుకుంటాను. యిట్టివి చూపవలసివస్తే మిక్కిలి పెరుఁగుతుందని వ్రాఁత. వారిమాట వారికి వప్పచెప్పడమే నాపనిగాని వారిని వెక్కిరించడంకాదుగదా? వీరు యితరులపద్యాలు వుదాహరించడంలో అవి యెట్టివో, బొత్తిగా గమనించనేలేదు. పద్యమయితే సరి వుదాహరిస్తూవచ్చారు. వుదాహరణకి వకటి చూపుతాను—

క. ముసలాపె వ్రేలుఁజన్నుల
పసవంటిది లోభివానిబ్రతుకు ధరిత్రిన్;

అంటూ, స్తుతినిందల కుదాహరణంగా యిచ్చారు స్వామి. మళ్లా దేశకాల పాత్రాలు బాగా తెలిసినట్లు వ్రాఁతలో మాటలు కనపడుస్తారు. యీ కాలంలో యీ పద్యం, అందులో ప్రస్తుతం వుదాహరించిన పూర్వార్ధాన్ని అసహ్యించుకోని నాగరికు లుంటారా? వామనుఁడీలాటివుదాహరణాన్నే యిచ్చాఁడా? లోకంలో దీని వుదాహరణకు యీ మాత్రం మంచిపద్యమే లేకపోయిందా? దీన్నిబట్టి వీరికి ఛందోబద్ధమాత్రత్వమే పద్యానికి లక్షణంగా కనబడుతుం దనుకోకతప్పదు. వ్యాకరణదోష దూషితమైనా పద్యమైతేసరి, వీరికి వుదాహరించడంలో సంశయం లేశమున్నూ లేదు. చూడండి—

"శా..............యెపుడేనా? యెందుకైనా? యిదేనా? వారందఱి తెల్వితేటలు సరేనా? గోపికావల్లభా!" వీరికి "ఉదహరించు" "ఉదాహరించు" ప్రయోగములభేదమే తెలియదు.

దిఙ్మాత్రం ఆంధ్రవ్యాకరణపాండిత్యానికి వుదాహరించాను. న్యాయశిరోమణిగారు కనుక వీట్లతో అంతగా పని లేకపోవచ్చును. యిఁక యితరకవిత్వాలు దిద్దేధోరణి కొంచెం వుదాహరించి ముగిస్తాను—

ఉ. అంచితులైన బంధుగులయందఱి ముందఱఁ
జెప్పె నిన్ను మె,చ్చించెదఁ గుంతిచేతరవిచేత నిజంబని నీకు
సాక్ష్య మి,ప్పించెద ఫల్గునప్రముఖవీరులు గొల్వఁగ నెల్ల
భూమి యే,లించెద నచ్చకీర్తివిమలీకృత సర్వదిగంతరంబుగన్.

యీ పద్యవిమర్శనా ప్రసక్తిలోనే వీరు "చండాల" పద ప్రసంగంచేసింది. యేదో దోషం వచ్చిందన్నారు, దిద్దుఁబాటు శాసించారు. చూడండి—ఆదిద్దుఁబాటు—"నిన్ను నెల్లెడ సరే యనిపించెద మండలించెదన్, లేక యెల్లవారును సరే యనునట్లుగ మండలించెదన్" యీ దిద్దుఁబాటెట్లున్నదో సహృదయులనిర్ణయానికి వదులుతాను. యించుగాగమయతిగాని, రలాభేదయతిగాని అంగీకరిస్తేనేకాని విశ్రమం చెడుతుందికూడాను పైదిద్దుఁబాటులో. తి. వేం. కవులు యే ఆసుధారకవిత్వంలోనో తప్ప ఆ రెండుయతులనూ సుతరామున్నూ అంగీకరింప రని స్వామి యెఱుఁగ రనుకుంటాను. ఆ శుధారలోకూడా యేవకటిరెండో తప్ప దొరకనూవదు. పోనిండు యతిమాటకేమి? ఆయతులనుకూడా యెక్కడో బుద్ధిపూర్వకంగా కాకపోయినా ప్రమాదంవల్లనైనా తి. వేం. కవులువాడేవున్నా రనుకుందాం, దిద్దుఁ

బాటు హృదయంగమమేనా? అని నేను సహృదయుల నడుగుచున్నాను- ఆచార్ల గారిని కాదు. వీరిపోకడ కింకొకటి చూపి ముగిస్తాను. యీ ఘట్టంలోనే—

ఉ. "కామముచేతఁగాని భయకంపితచిత్తముచేతఁగాని" అనేపద్యాన్ని యెత్తుకొని-"భయముచేతఁగాని" అంటే బాగా అతుకుతుందని సవరణ నుపపాదించినారు. పద్యమన్న సంగతి మఱిచారేమో? అంటే, మఱిచినట్లున్నూ లేదు. లేదనడానికి—

"శా. కామోత్కంఠత గోపికల్ భయమునం గంసుండు" అనే పద్యాన్ని వుదాహరించారు మళ్లాను వారితల్లికడుపుచల్లఁగాను. దానివల్ల మన కేంలాభమంటే, భయమునన్ అన్నట్టే, కామమునన్ అంటే బాగా అతుకుతుం దని స్వామి కెందుకు తోఁచిందికాదో! అనే వాళ్లకు అవకాశం కలిగింది కదా! యీలాటి వుపకారాలు చాలా వున్నాయి స్వామివారు చేసినవి. యేదో సందర్భం కలిపించుకొని తెనాలి రామలింగకవిగారి—

"చ. తెలియని వన్ని తప్పులని దిట్టతనాన సభాంతరమ్ములన్"

అనేపద్యాన్నికూడా వుదాహరించారు. యిది వెనక దొంగ పాఱిపోతూవుంటే కాళ్లట్టుకు వేళ్లాడుచున్న కేస్తురాల్ని మగఁడు, 'వొసేయి వాఁడు వేళ్ళు కొఱుకుతాఁడే' అన్నకథను జ్ఞప్తికిఁ దెస్తూవుంది. దీని కేంగాని స్వామి యీపుస్తకం రచించడంలో చేసినలోపా లెన్నో వున్నాయి. అవన్నీ చూపడానికి నాకు వోపిక లేదు. వయోమాత్రవృద్ధుణ్ణి గదా! లక్షణభంగాలంటే ఛందోవ్యాకరణభంగాలకంటూ అనవసరంగా వారివీ వీరివీ వుదాహరించారు గాని స్వామివుదాహరించకుండానే వారిస్వంతకవిత్వంతోనే అవి యెత్తుకుపోయేవి. శుద్ధపత్రికలో శ్రద్ధగా దిద్దినప్పటికీ అజ్ఞానప్రయుక్తదోషా లింకనూ శరపరంపరగా వున్నాయి. వ్యావహారికభాష అనుకుందామా? స్వామివారివ్రాఁత అదిన్నీ కాదు, గ్రాంథిక భాషం దామా అదిన్నీ కాదు, స్వాములారి భార్యలావుంది. దీన్ని ఋజువు చేయుమని స్వామివారి ఆజ్ఞయితే చేస్తాను. యిట్టి పుస్తకాన్ని యేదో పరీక్షకు పఠనీయంగా యేర్పఱచిన యూనివర్సిటీబోర్డువారు బుద్ధిపూర్వకంగా కాకపోయినా విధిలేక వ్యావహారికభాషను సమ్మతించినట్లయింది కనుక ఆ పక్షం వారికి వంద్యులనుకోక తప్పదు. స్వామివారి విమర్శనాధోరణి మా అపూర్వకవితా వివేచనంలో చాలాకాలం నాఁడే చూపఁబడింది. యిప్పుడు మళ్లా చూపనక్కఱ లేదు. "కంటికి నిద్రవచ్చునె? సుఖం బగునే? రతికేళి జిహ్వకున్" అనే శ్రీనాథునిపద్యాన్ని విమర్శించమంటే? స్వామి మొదట షష్ఠ్యంతంతో అన్వయం వుంది కనక రెండోవాక్యంలోకూడా షష్ఠ్యంతంతో అన్వయం వుంటేనేకాని ప్రక్రమం చెడుతుందనక మానరనుకుంటాను. యిప్పు డేమంటేయేం లాభం గాని శ్రీనాథుడి కాలంలో అంటే బాగాసమ్మానం జరిగేది "ప్రధ్వంసాభావము ప్రాగభాగ మనుచున్" అన్న పద్యం శ్రీనాథుఁ డెందుకుఁ జెప్పాఁడో అనుకుంటే యిప్పటికి బాగా బోధపడింది, 'అథణవు' 'ప్రకాస్తి,' 'ఢిల్లీకి' అనేవాట్లని మఱవవద్దని స్వామికి హెచ్చరిక!

(వగా) వ్యాసం వ్రాసి పోస్టుచేసినతరువాత వారిగ్రంథం అందింది. అందుచే అనుబంధం వ్రాయవలసి వచ్చింది అని చదువరులకు విజ్ఞప్తిచేసుకుంటున్నాను. వేం. శా.

---

# ప్రాచీనాంధ్రకవులు

నిడుదవోలు వేంకటరావు

ఆంధ్ర వాఙ్మయమునకుఁ దొలుత క్షేత్ర మాహాత్మ్యమును బ్రసాదించినవాఁడు శ్రీ గిరికవి. ఈతఁడు శ్రీ శైలప్రాంత వాసి. శైవుఁ డైనను శ్రీరంగమాహాత్మ్యమును పద్యకావ్యముగ రచియించినవాఁడు. శ్రీ రంగమాహాత్మ్యము గారుడపురాణము నందలి శతాధ్యాయికిఁ దెలుఁగుసేఁత.- ఈతని తరువాతనే భైరవకవి శ్రీరంగమాహాత్మ్యమును విరచించెను. భైరవకవి కూడ శైవుఁ డయ్యు శ్రీగిరివలెనే శ్రీ రంగమాహాత్మ్యము నాంధ్రీకరించుట చిత్రము. శ్రీగిరి కవికాలమును మనము దెలిసికొనినచో నాతఁడు భైరవకవికన్న ముందువాఁ డనియే యేర్పడును. దాని కాధార మిది.

శ్రీ గిరికవిరచిత శ్రీ గిరీశశతకమునుండియు, శ్రీరంగమాహాత్మ్యము నుండియు క్రీ. శ. ౧౪౨౦ సంవత్సర ప్రాంతమున నున్న మడికి సింగన తన సకల నీతిసమ్మతమున పద్యముల నుదాహరించియున్నాఁడు. కావున నీతఁ డంతకుఁ బూర్వుఁడనియే చెప్పనగును గదా! ఇంకను హరిశ్చంద్రకథ ద్విపద, నవనాథచరిత్రము ద్విపద, నవగ్రహస్తవము, లక్షణదీపిక విరచించిన గౌరన తన నవనాథచరిత్రమును శ్రీ గిరి రచిత పద్యప్రబంధము నుండి ద్విపదగా వ్రాసినట్లు నవనాథచరిత్రావతారికయం దిట్లు చెప్పియున్నాఁడు:

"అవిరళయోగవిద్యాధికు లైన
నవనాథవరుల పుణ్యప్రవర్తనము
పరఁగ శ్రీగిరికవి పద్యబంధమున
విరచించినాఁ డది ద్విపదకావ్యముగఁ
జెప్పింపవలయుఁ బ్రసిద్ధిపెంపలర
నిప్పుడు గల సుకవీంద్రులలోన."

అని శాంతభిక్షావృత్తి వాక్యము—

పైవానిఁబట్టిచూచిన శ్రీగిరి గౌరన*కన్న పూర్వుఁ డనుట నిస్సందేహము. శ్రీ గిరిపద్య నవనాథచరిత్రము లభ్యముగాలేదు. ఈతని శ్రీరంగమాహాత్మ్యమునుండి ప్రబంధ రత్నావళియందు నాలుగు పద్యము లుద్ధరింపఁబడినవి. ఈ నాలుగు పద్యములు నాంధ్ర సాహిత్యపరిషత్తువారి యుదాహరణ గ్రంథమునఁ గలవు. అందుండి రెండు పద్యములు:

"చ. తమము నడుఁ ద్రవజంబు భరి
తంబుగ నంతటఁ దూర్పుదిక్కునన్
హిమకర జన్మవేళ యుద
యించిన పాండిమ మించిపాఱెఁ బ

* గౌరనపుత్రుఁడగు భైరవుఁడే శ్రీరంగమాహాత్మ్య కృతికర్త.

శ్చిమమున కభ్రలక్ష్మీకుచ
సీమఁ గురంగమదం బలందిహా
రము లిడి తా దుకూలమున
రక్షగఁ బయ్యెద గప్పుచొప్పునన్.-"

"సీ. దీపించు నేవేల్పు దివ్యాంగకంబుల
కాళీకుచాంగరాగంబు భూతి
కొమరొందు నేవేల్పుగురుజటాభరసీమ
నమృతాంశుఖండంబు నభ్రగంగ
కదుమించు నేవేల్పుగాత్రవల్లిక చుట్టు
వ్యాఘ్రచర్మము వారణాజినంబు
కర మొప్పు నేవేల్పుకంఠపీఠంబున
భుజగేంద్రహారంబు పునుకపేరు
అట్టి వేలుపు శంకరుఁ డాదిమూర్తి
వేదవేదాంతవేద్యుండు విశ్వభర్త
వికసితోజ్జ్వలవదనారవిందుఁ డగుచు
నుచితరీతిఁ బేరోలగ మున్న యంత"

గౌరన క్రీ. శ. ౧౪౦౦ సంవత్సరము ప్రాంతమువాఁడగుటచే శ్రీగిరి క్రీ.శ. ౧౩౫౦ సంవత్సర ప్రాంతమువాఁడు గావచ్చును. ఈతనియుదంత మింతకంటె తెలియరాకున్నది.

ఆంధ్ర వాఙ్మయమున శ్రీరంగమాహాత్మ్యము శ్రీగిరికవివెనుక భైరవకవియే* గాక మఱికొందఱు ననువాదము గావించిరి. వారిలో కాలక్రమము ననుసరించిన కట్టా వరదరాజకవియు, నా వెనుక దీనిని ద్విపద కావ్యముగా రచియించిన ముకుందయోగియు, కందపద్యములలో గ్రంథ మంతయు రచించిన వరమల నరసామాత్యుఁడును, చంపువులుగా వ్రాసిన భాగవతుల రామకవియు, గుండుపల్లి జగన్నాథకవియుఁ గలరు. ఇట్లు పద్యకావ్యము లేగాక వచనకావ్యముగఁ గూడ శ్రీరంగమాహాత్మ్యము వెలసినది. వానిలో పేర్కొనఁదగినది విజయరంగ చొక్కనాథుని శ్రీరంగమాహాత్మ్యము. వచనము ఈతఁడు ౧౭౦౪-౧౭౩౧ వఱకుఁ బాండ్యమండలము ను పరిపాలన మొనర్చినవాఁడు. కవిపండితపోషకుఁడు, దాక్షిణాత్యరాజకవి. వీ రందఱును పదునేడవ శతాబ్దమునకుఁ బూర్వులే. వారిని గూర్చి యదను గలిగినపుడు తెలుపఁ గొందును.

---

* శ్రీరంగమాహాత్మ్యము భైరవకవిది శ్రీయుత మానవల్లి రామకృష్ణకవిగారిచే క్రీ. శ. ౧౯౧౨ వ సంవత్సరమున విస్మృతకవుల గ్రంథములయం దెనిమిదియవ గ్రంథముగా ప్రకటితము. కట్టా వరదరాజకవి శ్రీరంగమాహాత్మ్యము కీర్తిశేషులు చెలికాని లచ్చారావుగారిచే క్రీ. శ. ౧౯౨౧ వ సంవత్సరమున శ్రీరామవిలాస ముద్రాక్షరశాలయందు ముద్రితము. ని. వెం.

# శ్రీకంఠపదలాంఛనుడు – భవభూతి

శ్రీ. న. చ. వరదాచార్యులు

భవభూతికృతాలైన రూపకాలు మూడింటి ప్రస్తావనలలోనూ అతని నామగోత్రాలనుసరించి యితరకవులకన్న వీలైనంతస్పష్టంగా తెలిసేట్టు వ్రాసు కున్నాడు.

మాలతీమాధవంలో

"తత్రభవతో భట్టగోపాలస్య పౌత్రః పవిత్ర కీర్తే ర్నీలకంఠస్యపుత్రః శ్రీకంఠపదలాంఛనః పద వాక్యప్రమాణజ్ఞో భవభూతిర్నామ కవిః" అనీ,

మహావీరచరితంలో

"సుగృహీతనామ్నో భట్టగోపాలస్య పౌత్రః పవిత్రకీర్తే ర్నీలకంఠస్యాత్మసంభవః శ్రీకంఠపదలాం ఛనః పదవాక్యప్రమాణజ్ఞో భవభూతిర్నామ జతుకర్ణీ పుత్రః కవిః" అనీ,

ఉత్తరరామచరితంలో

"అస్తి తత్రభవాన్ కాశ్యపః శ్రీకంఠపదలాం ఛనః పదవాక్యప్రమాణజ్ఞో భవభూతిర్నామ జాతూ కర్ణీపుత్రః" అనిన్నీ వున్నాయి. ఇంత స్పష్టంగా వున్నట్టు కనబడుతూన్నా యిక్కడా కొన్ని సందే హాలు కలుగడాని కవకాశాలు కలిగాయి. ఏమంటే, వ్యాఖ్యాతలు "శ్రీకంఠపదలాంఛనః-శ్రీకంఠ ఇతిపదం లాంఛనం యస్యసః" అనే విగ్రహంవల్ల ఆసమాసాన్ని సాధించి శ్రీకంఠుడనేది ఆకవికి పితృకృతమైనసంజ్ఞ అని వ్యాఖ్యానిస్తున్నారు.

"భవభూతిర్నామ" అనడంవల్ల భవభూతి అనేది ఆకవితాలూకు బిరుదనామం అనిన్నీ అదైనా "సాంబా పునాతు భవభూతి పవిత్రమూర్తిః" అనే శ్లోకాన్ని రచించడంవల్ల వచ్చిందని కొందరూ,

"తపస్వీ కాం గతోవస్థామితి స్మేరాననావివ,
గిరిజాయాః స్తనౌ వందే భవభూతిసితాననౌ."

అనేశ్లోకం రచించడంవల్ల వచ్చిందని కొందరూ వ్రాస్తున్నారు. ఈ శ్లోకాలలో ఆపదం పసందైన పాకంలో పడిందని సహృదయులు గుర్తించారు. అందుకనే ఆపదంతోటే కవికి వ్యక్తిత్వాన్ని కల్పించారు. ఇదొకవాదం.

ఇక్కడ సందేహం యేమిటి? శ్రీకంఠుడనేది పేరేఅయితే దాన్ని సూచించడానికి యింత డొంకతిరుగుడుగా చెబుతాడా కవి అని సందేహం. ఇలాంటి సందేహమే కలిగి కాబోలును మేఘదూతానికి విద్యుల్లత అనేవ్యాఖ్యానాన్ని రచించిన పదహారో శతాబ్దపు పండితుడను పూర్ణసరస్వతి "ఆపృచ్ఛస్వ ప్రియసఖ మముం" అనే శ్లోకంలో "రఘుపతిపదై రంకితం మేఖ లాసు" అనేభాగాన్ని వ్యాఖ్యానించే సందర్భంలో "మేఖలా స్వకింత మిత్యత్ర భక్తసమాధిః; శేషే కనక పట్టాదినివిష్టా నీష్టదేవతాచరణ ప్రతిబింబాని కంకణసూ త్రకటిసూత్రాదిషు ధారయంతి; యథా శ్రీకంఠపదలాం ఛనో భవభూతిర్నామ కవిః" అని వ్రాస్తున్నాడు. దీనితో కవికి భవభూతి అనేదే పేరు అనిన్నీ, అతడు శివభక్తుడు గనుక శివపాదాలచే చిహ్నితుడ నని చెప్పు కుంటున్నాడనిన్నీ మరొకవాదం బయలుదేరింది. అయితే యీ వీరరాఘవ జగద్ధర కుమార తాతార్యాది భావభూత వ్యాఖ్యాతలు గాని యీ పూర్ణసరస్వతి కాని భవభూతిని చూచి వ్రాసినవాళ్లు గారు. మరి యీయిద్దరికీ వూహయే మూలం. అయినప్పటికీ యీరెండువూహలలోనూ యేది సముచితంగా వుటుం దని ఆలోచించడానికి పెద్దలయెదుట పెడతాను.

నీలకంఠునిపుత్రునికి శ్రీకంఠుడనేపేరుండడం వొక అనుక్రమాన్ని పోషిస్తూంది. తాను శివపాదాలని ధరిస్తున్నానని చెప్పుకోవడంలో విశేషం ఏమిట్లో బోధపడడం లేదు. జగద్ధరునికి దొరికిన పాఠంలో "భట్ట శ్రీకంఠ పదలాంఛనః" అనివుంది. ఈభట్ట పదాన్ని ముందుచేర్చడం వల్ల అదే పేరని వూహించ దగును. సామాన్యంగా కవుల కనేకులకు అసలుపే రొకటి, వ్యావహారికనామం మరొకటి వుండడం మనం తర్చుగా చూస్తున్నాము. అది బిరుదనామం కావొచ్చు, ముద్దుపేరు గావొచ్చు. ఎఱ్ఱాప్రగ్గడకు శంభుదాసుడని నామాంతరం వుంది. వసంతతిలకభాణరచయిత వాత్స్య వరదాచార్యులకు నడామూర్ అమ్మాళ్ అని నామాం తరం. భవభూతి అని సంజ్ఞవుండడం సంభావ్యంలా కనపడదు. రెండుపక్షాలూ వూహామూలాలైనప్పుడు అన్యతరాన్ని తోసిపుచ్చడానికి యేమిటి ఆధారం ?

ఈలాగ శ్రీకంఠుడనేది పేరు అనివాదించే పక్షం వారు చెబుతారు.

భవభూతి అనేదే పేరు అనేవారు చేసేవాదం యిది. ఈకవి శివభక్తుడని తత్కృతాలైన మాలతీమాధవ ప్రకరణ నాందీశ్లోకాలే వుద్ఘోషిస్తున్నాయి. కాబట్టి అతడు శివపాదాలను ధరించడంలోనూ, తాను శివభక్తుడనని చెప్పుకోవడంలోను అభ్యంతరం యేమీ లేదు. ఉపాసకునకు వుపాస్యునకు మధ్యనుండే అనన్యాగ్రతను మనోవాక్కాయ కర్మభిః స్థిరీకరించుకోవడం వుపాసకునిధర్మం. నిర్వహించుకోడం, అందుకుగాను వుపాస్యుని పదప్రతిరూపధారణము, ఆసంగతిని చెప్పుకోడం మొదలయినవి భక్తి అతిశయాన్ని వెల్లడిస్తున్నవి.

మరిన్నీ ఆ "శ్రీకంఠపదలాంఛనః" అనేది పేరును చెప్పుకునేపదమే అయితే తాతయ్య అనే రామయ్య అన్నట్టు వ్యావహారికసంజ్ఞా, పితృకృతసంజ్ఞా మరొకవిశేషణంచేత వ్యవధానాన్ని పొందకుండా వుండేట్టు విన్యసించడం న్యాయం. మరియిక్కడనో ఆరెంటిమధ్యా "పదవాక్యప్రమాణ తత్వజ్ఞః" అనే మరోవిశేషణం వచ్చి ఆఅభిప్రాయాన్ని తొలగిస్తుంది. పైగా "లాంఛనం నామచిహ్నయోః" అనే నిఘంటువు నాశ్రయించి యీలాంఛనపదానికి "నామ" అనే అర్థాన్ని తెచ్చుకుంటున్నారు. లాంఛనపదానికి పేరు అనే నైఘంటికమైన అర్థంవున్నా అది బాహుళ్యంమీద చిహ్నం అనే అర్థాన్ని చెబుతూంది. ఈరెండో అర్థం చెప్పటానికైతే నిఘంటువును ప్రమాణం చూపనక్కరలేదు. ఈ గౌరవమే ఆవూహను తోసిపుచ్చగలదు.

ఇంతేకాకుండా ఈభవభూతిని గురించిన ప్రసంగము ఎక్కడవచ్చినా- ఆఖ్యాయికలలోనూ, సప్తశతులలోనూ, చాటు ప్రబంధాలలోనూ ఇక్కడ అక్కడ ఏమిటి సర్వత్రా-భవభూతి అనేవాకొంటున్నారుగాని శ్రీకంఠుడనిగాని, శ్రీకంఠుడనే భవభూతి అనిగాని అనడంలేదు. ఇంకా, రాజతరంగిణిలో లలితాదిత్యుడిని ప్రశంసిస్తూ

"కవి ర్వాక్పతిరాజశ్రీ భవభూత్యాదిసేవితః;
జితో యయౌ యశోవర్మా తద్గుణ స్తుతివందితామ్."

అంటూ వాక్పతిరాజ భవభూతులు సమకాలికులని స్పష్టంగా సూచిస్తున్నారు. ఆవాక్పతి రాజకృతమైన "గౌడవధం" అనే కావ్యంలోకూడా భవభూతిని యీపదంతోటే పేర్కొన్నాడుగాని శ్రీకంఠుడనే పేరున్నట్టు సూచించనైనా లేదు.

భవభూతి అని సంజ్ఞావాచకపదం వుండటం అసంభావ్యమూ అంటే అల్లాంటిదీ కనపడదు. "వ్యాఘ్రభూతి" అనేపేరు వినని వైయాకరణులుండరు. ఆపేరుకన్నా బాగులేదా యిది? వసుభూతి, శ్రీభూతి ఇత్యాది నామధేయాలు జైనవాఙ్మయంలో చాలావున్నాయి. కాణభూతి అనేపేరూ విన్నాం. ఇంకా కావలిసిస్తే- నవ్వుగా వుంటుందేమో కాని- ఆషాఢభూతి అనేపేరు ఎరుగనివారేలేరు. కాబట్టి నామధేయంలో అసంభావ్యత కనుపడదు. నీలకంఠుని పుత్రుడు శ్రీకంఠుడవడంలో ఒకఅనుక్రమం స్పష్టం అయిందనుకున్నా దానికి ఐకాంతికతలేదు. భట్టగోపాలుని పుత్రునికి నీలకంఠుడనే పేరుండడంలో యీ అనుక్రమం యేమైంది? సజాతీయశ్రుతిలో వుండే యోగ్యత కావలిస్తే యిప్పటికీ ఆపంక్తిలో నిష్ఠం అయ్యేవుంది. జగద్ధరుని పాఠంమాత్రం "భట్టశ్రీకంఠపదలాంఛనః" అని వుండడంబట్టి చూస్తే శ్రీకంఠుడనేది అతనిపేరే అయివుంటుందన్న పరంపరాగత విశ్వాసం ప్రబలినదరిమిలా దాన్ని దృఢపరుచుకునేందుకు కల్పించుకున్న పాఠాంతరంగా కనపడుతూంది కాని భవభూతిస్వయం రచితంలా లేదు. అది అసలుదే అయితే యితరవ్యాఖ్యాతలు కూడా అలాగే పాఠం చూపించివుందురు. మరిన్నీ రెండుపక్షాలూ వూహామూలాలే అయినా యిన్నిసబబులు చూపిస్తూండడంచేత యీపక్షాన్ని పరిగ్రహించడం న్యాయం.

ఇలాగ రెండుపక్షాలు కనపడుతూన్నై. వీటియందలి ఔచిత్యం సహృదయులే ఎరుగుదురు. లేఖకునకుమాత్రం ఇందులో వుత్తరపక్షమే ప్రియమైనదని యీపాటికే పాఠకులు గ్రహించివుంటారు. అయినా అభిజాతుల సమాలోచన సర్వులకూ శిరసా పరిధార్యం.

---

# సాహిత్య సమీక్ష

## క్రొవ్విడి రామం
## భళ్లమూడి నరసింహం

> "శ్రావ్యంబై రసవంతమై మధురమై సర్వాంగ సంపన్నమై, నవ్యంబై పరిణామరూపగతులన్ రంజిల్లుచున్ భావముల్, సువ్యక్తంబొనరించుచున్ జగమునన్ శోభిల్లువాక్కెల్లయున్, దివ్యంబౌ భవదీయరూపమగుచున్ దీపించునో భారతీ."
>
> —శ్రీ గిడుగు సీతాపతి

మానవజీవితములోని వివిధప్రవృత్తులను ఆహ్లాదకరంగా నిరూపించడమే సారస్వతము యొక్క పరమావధి. దీనిని నిర్వర్తించుటకు కవి కావ్యాన్ని సృష్టిస్తాడు. దానిలో ఉండే గంభీరమైన భావాలను, మధురమైనరసాన్ని సామాన్యజనంకూడా సులువుగా గ్రహించేటట్లు చేస్తాడు విమర్శకుడు. దీనివల్ల కావ్యానికి గొప్పతనము, స్థిరత్వముకూడా లభిస్తున్నవి. మహాగ్రంథాలే విమర్శనార్హములైనవి కాబట్టి వాటిలో ఉండే గొప్పతనాన్ని వ్యక్తీకరించడమే విమర్శకుని ముఖ్యోద్దేశమై ఉండాలి. ఈ ఉద్దేశముతో రచింపబడిన విమర్శనలే సాహిత్యాభివృద్ధికి ఉపయోగపడతాయి. కావ్యంలోని వ్యక్తిత్వాన్ని గ్రహించడం కావ్యపాఠకుని ప్రధాన కర్తవ్యము. ఈ విషయంలో విమర్శకుడు కావ్యపాఠకునికిచేసే సహాయము అనన్యసామాన్యము. కాబట్టి మధురమైనకావ్యాలు, సాహిత్యమీమాంస గ్రంథాలు అహమహమికా భావంతో శోభించినప్పుడే సారస్వతముయొక్క గొప్పతనం వ్యక్తమవుతుంది.

పదకొండవశతాబ్దము మొదలు నేటివరకు అనేకమందికవీశ్వరులు పుంఖానుపుంఖాలుగా కావ్యాలను వ్రాస్తున్నారు గాని ఆంధ్రసారస్వతంలో కావ్యసృష్టికి ఉన్నంత ప్రాధాన్యం కావ్యవిమర్శనకు లేకపోవడంచేత సాహిత్యమీమాంస గ్రంథాలు చాలా అరుదుగా కనపడుతున్నవి. కావ్యసృష్టికి విధాత నన్నయ అయినప్పటికీ, ఏనువందల డెబ్బైఐదవ సంవత్సరంలోనే 'అద్దంకి' గ్రామంలో పద్యరూపంగా లిఖింపబడిన శాసనం కనపడడంచేత, ఆంధ్ర సారస్వతాభ్యుదయ చిహ్నాలు నన్నయకుపూర్వం రమారమి మూడు నాలుగు శతాబ్దములనుంచీ మనకు వ్యక్తమవుతున్నవి. శ్రీజయంతి రామయ్యగారు మొదలైనవారు కొన్ని శాసనాల్ని సేకరించి వాటికాలము, ఆకాలపుపరిస్థితులు చాలవరకు నిరూపించినారు గాని యీవివిధ శాసనములలోని గద్యపద్య రచనలు సారస్వతాన్ని పెంపొందించడంలో క్రమంగా తోడ్పడిన విధానాన్ని యింతవరకూ ఎవరూ విశదీకరించలేదు. శ్రీగిడుగు రామమూర్తిపంతులుగారు మాత్రము నందంపూడి శాసనములోని భాషకు, భారతములోనిభాషకు గల సామ్యాన్ని వ్యక్తీకరించి, భారతములోనిభాష వ్యావహారిక భాషయేనని ఋజువుచేసినారు. పదకొండవ శతాబ్దమునకు పూర్వంఉండే సాహిత్యచరిత్ర సరిగా తెలియకపోవడంచేత, సారస్వత చరిత్రను వ్రాసేవారు భారతరచనకు పూర్వం అంతా అజ్ఞాతయుగమని దానిపైన ఏవిధమైన విచారణా చేయకుండానే విడిచిపెట్టినారు. కాబట్టి భారతరచనా ప్రారంభమునకుపూర్వం యీశాసనాలలోని భాష ఆంధ్రసారస్వతాభివృద్ధికి యేవిధంగా తోడ్పడినది అన్వేషించినట్లయితే, యీ లోపము చాలవరకు తీరుతుంది. విశ్వకళాపరిషత్తువారు కూడా యింతప్రధానమైన విషయాన్ని గురించి అశ్రద్ధ వహించడం చాలా శోచనీయంగా ఉన్నది.

సారస్వతముతాలూకు లక్ష్యము జీవితవిధానాన్ని నిరూపించడమేనని యిదివరకే మనవిచేసినాము.

ఈకర్తవ్యాన్ని నిర్వర్తించడంలో భారతం అగ్రస్థానాన్ని వహిస్తున్నది. బౌద్ధమతధర్మాలనుంచి ప్రజలను మరలించి, వేదసంప్రదాయాలనే అనుసరించేటట్టుచేసి, తన్మూలంగా వేదమతాన్ని విజృంభింపచేసేడు నన్నయ. కాబట్టి యితనిరచనలలో వైదికధర్మాలకే ఎక్కువప్రాధాన్యం యిచ్చినట్టు కనపడుతుంది. తిక్కనసోమయాజికాలంనాటికి పరిస్థితులలో చాలా మార్పువచ్చింది. యీయన వైదిక సాంప్రదాయములకంటె లౌకిక వ్యవహారములకే ప్రాముఖ్యస్థానం యిచ్చేడు. దీనికితోడు భారతంలో కావ్యకళను, ఆంధ్రజాతీయతను విజృంభింప చేయడానికి యీయన విధాతవంటివాడు. భారతంలో ఉండే కావ్యకళాచాతుర్యాన్ని గమనించకుండా కేవలం మతగ్రంథంగానే దానినిచదవడం మనలో చాలామందికి అలవాటు. శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారివంటివారు భారతంలో కొన్ని భాగాలను విమర్శిస్తున్నారు. అయినప్పటికీ, భారతం కళాదృష్టితో చదివేవారికి అనువుగాఉండే విమర్శనాగ్రంథాలు చాలా అరుదుగా ఉన్నాయి. భారతంవంటి మహాగ్రంథానికి తగినసమీక్ష లేకపోవడం ఆంధ్రుల దురదృష్టమే. కాబట్టి యిప్పుడైనా అటువంటి గ్రంథాలు తగినన్ని వ్రాయబడవలసిఉంటుంది. తిక్కన సృష్టించిన పాత్రలఔచిత్యము, పోషణ, గాంభీర్యము మొదలైనవాటినిగురించి ఒక పుస్తకము వ్రాయబడినట్లయితే, విరాటోద్యోగాది పర్వాలలోని కళాచాతుర్యాన్ని, పాత్రలగొప్పతనాన్ని మనం పూర్తిగా గ్రహించడానికి అవకాశం ఉంటుంది. ఆంగ్లభాషాసంప్రదాయాన్ని చూచినట్లయితే ఒక్క షేక్స్పియరు మహాకవివ్రాసిన నాటకములలోని పాత్రలను విమర్శిస్తూనే ఎన్నోగ్రంథాలు వ్రాసేరు. కేవలం నాయికాపాత్రలను విమర్శిస్తూనే ప్రత్యేకంగా ఒక పుస్తకంరచింపబడినది. కాబట్టి ఆంగ్లభాషాస్థితితో పోల్చిచూచినట్లయితే, ఆంధ్రులు సాహిత్యసమీక్షలో ఎంతవెనకంజవేస్తున్నారో తెలుస్తుంది. తిక్కన పాత్రపోషణలోఉండే చాతుర్యాన్ని వ్యక్తీకరించడానికి విరాటోద్యోగపర్వాలనుంచి స్థాలీపులాకన్యాయంగా రెండుమూడు సంఘట్టనలను విశదీకరించుకుంటాను.

సాధారణంగా భీమునిపాత్రను సృష్టించేటప్పుడు కవులు శరీరబలానికే ప్రాధాన్యంయిస్తారు. వారిదృష్టిలో భీముడు అంతరసికుడుకూడా కాడు. కాని తిక్కన మాత్రం భీముని ఎంతోరసికునిగా నిరూపించేడు. ద్రౌపదివంటి ప్రౌఢనాయికితాలూకు భర్తలు ఐదుగురు కూడా రసికత ఎరిగినవారుగానే ఉండాలని యీకవి ఉద్దేశంకాబోలు! కీచకవధఘట్టంలో కీచకుడు మన్మథావస్థను అనుభవిస్తూ, పాన్పుపైన పొంచిఉన్న భీముని ద్రౌపదిగా భ్రమించి,

"వనిత మనోహరంబులగు వస్తువులెల్లను వేడ్క నేతి నీ, కని నియమించి తెచ్చితి ప్రియంబునగైకొను మెప్పు నంగనాజనములు నన్నుజూచి మరుసాయకముల్ దమచిత్తవృత్తులే, నిన గొనివచ్చి యిత్తురు విశిష్టధనంబులు నాకు లంచముల్" అని అంటాడు. ఈమాటలు వినేసరికి భీమునికి అపరిమితమైన కోపంవచ్చినా, దానినంతా అణచుకుని సరసంగా "ననుముట్టి నీవు వెండియు, వనితలసంగతికి బోవువాడవె యైనం, దనువేడిసిన ఫలమే, కనియెద విద చిత్తభవవికారము లెల్లన్" అని జవాబుయిస్తాడు. మదోన్మాదుడైన కీచకుడు మాత్రం యీమాటలను ప్రౌఢయైన ద్రౌపది పలుకులుగా భావించి మురిసిపోతాడు. కావ్యపాఠకుడు భీముని చమత్కార వాక్యాలకు అబ్బురపడతాడు. ఈ పద్యంలో భావశ్లేషఉంది. దీనిభావం కావ్యపాఠకునికి ఒకలాగ, కీచకునికి మరొకలాగ స్ఫురిస్తుంది. దీనినేఆంగ్లభాషలో Dramatic Irony అంటారు. మహాకవులకవనంలో యిటువంటి చమత్కృతి మనకు కనపడుతుంది.

సంజయరాయబారపు ఘట్టం చదివినట్లయితే, శాంతిప్రియుడైనప్పటికీ, ధర్మరాజు నిశిత ప్రతిభావంతుడైన రాజకీయవేత్త అని మనకు బోధపడుతుంది. ఈ సంఘట్టనలో ధర్మరాజు తన రాజనీతి కౌశల్యాన్ని అద్భుతంగా ప్రదర్శించేడు. ఈ రాయబారితో సంప్రదించిన విధానాన్ని గమనించినట్లయితే, ధర్మరాజు ఆధునిక రాజకీయవేత్తలతో సమానమైనవాడుగా మనకు కనపడతాడు. తిక్కన ధర్మరాజ పాత్రపోషణలో వర్ణనాతీతమైన గొప్పతనాన్ని విశదీకరించినాడు.

పాండవుల అజ్ఞాతారణ్యవాసాలు పూర్తిఅయిన తర్వాత, కౌరవులు, సంజయుని పాండవుల దగ్గరకు రాయబారిగా పంపేరు. రాజ్యముమాట మరపించి, కౌరవపాండవులమధ్య అభిప్రాయభేదములు ఉండవనూడదని చెప్పి, ధర్మరాజును సంతృప్తిపరచడమే యీ రాయబారముయొక్క ఉద్దేశము. వాక్చాతుర్యంలో అప్రతిహతుడైన సంజయుడు, శాంతిప్రియుడైన ధర్మరాజును సులువుగా తనవలలో వేసుకోగల ననుకున్నాడు. తనరాక ధర్మరాజునకు యేవిధమైన అనుమానం కలిగించకుండా,

"అనుజులు నీవును ద్రోవది, యును బుత్రచయంబునున్న యోగక్షేమం, బున తెఱగారయ బుత్తెం, చెనితాంతస్నేహపూర్ణచేతోవృత్తిఁ" అని అంటాడు. అప్పుడు ధర్మరాజు గంభీరంగా "ఆరాజు మాదెసంగల, కారుణ్యముకతమునను సుఖంబున నిట్లు, న్నారము నినుబుత్తెంచిన, గౌరవమున నాదుమది వికాసముబొందెఁ"

అని సంజయునికి జవాబుయిస్తాడు "కారుణ్యముకతమునను సుఖంబున నిట్లున్నారము" అన్న ప్రయోగంలో ఎంతైనా సారస్యము ఉంది. ధృతరాష్ట్రుడు పాండవులయందు కపటప్రేమను అభినయించడముచేత నే తమస్థితి యీవిధముగా ఉన్నదనిన్నీ, సంజయుడు చెప్పిన "నితాంతస్నేహ పూర్ణచేతోవృత్తి" పాండవులపైన ధృతరాష్ట్రునికిఉండడం వట్టికల్ల అనిన్నీ "ఆరాజు మాదెసంగల కారుణ్యముకతమునను సుఖంబున నిట్లున్నారము" అన్నవాక్యంలో ధ్వనిస్తున్నది.

తరువాత సంజయుడు మాటిమాటికి శాంతిబోధనలు చేస్తూ కౌరవులతో సఖ్యంగాఉండడం మంచిదని ధర్మరాజుతో చెప్పినప్పుడు ధర్మరాజు "పారితంబులే కయ్యోడు నరసిదివెడగైనను నొల్లక యొండుసేయునే" అని అంటాడు. "అరసిది" అంటే పాండవుల దృష్టిలో రాజ్యానిభాగమేనని అందరకూ వ్యక్తమవుతున్నది. యుద్ధంలేకుండా రాజ్యప్రాప్తిఅయితే అంతకంటె మంచిమార్గం ఏముందని అంటాడు ధర్మరాజు, గాని ఏవిషయాన్ని అయితే మరుగుపరచి ధర్మరాజును సంజయుడు వంచింపచూసేడో, ఆవిషయాన్నే అతను స్పష్టంగా చెప్పేసరికి సంజయుడు నిర్విణ్ణుడైపోయి ఉండాలి. తుదకి సంజయునిరాయబారం వ్యర్థమని తెలిసి ధర్మరాజు "సంపదదక్కియుండగ నశక్తులనం జను మమ్ముబిల్చి పూజింపగ నంతబేలె పతి సెప్పెడువారలబుద్ధి నాడెమ, న్నింపడ యింకనేలయగు నీవడియాసలవచ్చి రిత్తగా, రింపక మాను మాతనిచరిత్రము నీకునుమాకు వింతయే" అని చెప్పేసరికల్లా సంజయుని వాక్చమత్కారమంతా గంభీరస్వభావం కలిగినటువంటిన్నీ, అనన్య సామాన్యమైన రాజకీయ కౌశల్యం కలిగినటువంటిన్నీ ధర్మరాజుముందర బూడిదలో పోసిన పన్నీరైనదని తెలుస్తున్నది. కాబట్టి యిటువంటి సంఘటనలను పరిశీలిస్తే ధర్మరాజపాత్ర పోషణలో తిక్కన అద్భుతమైన ప్రతిభను విజృంభింపచేసినాడని వ్యక్తమవుతున్నది.

ఆంధ్రభాషలో ద్రౌపదివంటి చాతుర్యంగల స్త్రీపాత్రను తిక్కన అంత జయప్రదంగా మరియే కవికూడా యింతవరకు సృష్టించలేదు. ప్రౌఢయైన స్త్రీయొక్క మానసికతత్వాన్ని తిక్కన ద్రౌపదిద్వారా నిరూపించినాడు. పుష్పంలోని సౌరభంలాగ, ద్రౌపది గొప్పతనం, యేసంఘటనలోచూసినా మనకు వ్యక్తమయేలాగ సృష్టించినాడు తిక్కన. ద్రౌపదిని కీచకుడు భంగపరచడానికి ప్రయత్నిస్తూన్నప్పుడు ఆమె నిండుకొలువులో ఉన్న రాజుదగ్గర తన అవమానమును విన్నవించుకుంటున్నది. కాని సభ్యులెవరూకూడా తనకుతగిన సహాయంచేయఃపోగానే ఆమె ఉద్రేకంపట్టలేక

"ఐనను మత్స్యదేశమున యాజ్ఞకితం డొడయం డుగాన నా, కీనరనాథు దూరదగు నెయ్యెదియేని నధర్మమెవ్వరెం, దైన నొనర్చినం బ్రభువులారసి దండనమాచరింతు రి, చ్చో నమదన్న గీచకునిజూచియు నూరకయుండ్ర పాడియే." అని అంటుంది. విరటుడు కీచకుని అతిక్రమించలేక సమర్థుడు కాకపోవడంచేత అతని దౌర్జన్యానికి నొచ్చుకుంటూ సభను విడచి వెళ్లిపోతాడు. నిండుకొలువులో ఉన్న రాజుదగ్గర ద్రౌపదిప్రవర్తించిన విధానం ధర్మరాజుకు ఎక్కువ ఆగ్రహాన్ని కలిగించింది కాని ధీరోదాత్తుడవడంచేత హృదయావేశాన్ని

అణచుకొని శాంతముగా ద్రౌపదితో సభనువిడచి వెళ్లిపొమ్మని చెప్పేడు. నిండుకొలువులో యీవిధంగా ప్రవర్తించడం ఆమెశీలానికి భంగమనిన్నీ, తనభర్తలైన గంధర్వులకు అవకాశం లేకపోవడంచేతనే తనను రక్షించలేక పోయి ఉంటారనీ కూడా ధర్మరాజు నొక్కిచెప్పినాడు. అవమానమునకు తగినప్రతీకారం చేయకపోవడమేకాకుండా తననే శాంతింపచేస్తున్న ధర్మరాజుమీద ద్రౌపదికి పట్టలేనంతకోపం వచ్చింది. ధర్మరాజుతాలూకు మందలింపు ఆమెహృదయానికి అపరిమితమైనబాధను కలిగించింది. అప్పుడు ద్రౌపది రోషంతో "నాదువల్లభుండు నటుడింత నిక్కంబు పెద్దవారియట్ల పిన్నవారు, గాన బతులవిధము కాక యేశైలూషి గాననంగ రాదు కంకభట్ట" అనిచెప్పి, "జూదరియాలికి గరువతనం బెక్కడియది" అని అంటూ సభను విడచి వెళ్లిపోయింది. ఈ సంఘటనలో ద్రౌపది మనకు సీతవలె కేవలంముగ్ధకాకుండా మంచిప్రౌఢగా కనపడుతుంది తనశీలానికి భంగపాటు వచ్చినప్పుడు ఆధునిక నాగరికస్త్రీలలాగే తనభర్తలనైనా మందలించడానికి వెనుకాడదు. మరొకవిశేషమేమంటే పాండవులు అజ్ఞాతవాసంలో ఉన్నప్పుడు వారు నిత్యం సాంకేతికంగా మాట్లాడుకునే విధానాన్ని తిక్కన యిటువంటి సంఘటనలలో ఎక్కువ జయప్రదంగా నిరూపించేడు. యిదిగాక "జూదరియాలికి గరువతనం బెక్కడియది" అన్న వాక్యం, ద్రౌపది చదివినపద్యం కూడా పరిశీలించినట్లయితే, ధర్మరాజుకు జూదమునందుగల వ్యామోహమే ద్రౌపదికి యింతఅవమానం సంభవింపచేయడానికి కారణమని మనకు ధ్వనిస్తున్నది. యీవిధంగానే ద్రౌపది ఎప్పుడూ గంభీరంగాను, చాతుర్యంగాను మాట్లాడుతుంది.

తిక్కనయొక్క పాత్రపోషణను విమర్శించే గ్రంథాలేకాక, తిక్కన కావ్యకళానైపుణ్యాన్ని ఏసంఘటనలో ఏవిధంగా ప్రదర్శించినాడో నిరూపించే గ్రంథాలుకూడా ప్రచురింపబడవలసియున్నవి ఈమహాకవి పద్యాలలో భావశబలత్వము, భావగాంభీర్యము, అర్థగౌరవము ఉట్టిపడుతూ వుంటాయి. చిన్నపద్యంలో మహత్తరమైనభావాన్ని యిముడ్చడంలో యితనిలేఖిని పేరు పొందింది. మచ్చుకు ఒకటిచూడండి.

"ధృతరాష్ట్రభూపతికి వృద్ధతకతమున జిత్తమొకవిధముగాఁ మిసుతో, దతిమాన్పఁడు నాఁడు మనః, క్షతి పిప పంబుట్టి యిపుడు శాంతుండయ్యెన్."

సంజయుడు తనరాయబారాన్ని నిర్వహిస్తున్నప్పుడు పైవిషయాన్ని ధర్మరాజుతో చెప్పేడు. దుర్యోధనాదులు పాండవులయెడలచేసిన అక్రమాలను సాధ్యమైనంతవరకు మరుగుపరచి, కౌరవపాండవులమధ్య మైత్రిని పెంపొందించడమే సంజయుని ముఖ్యోద్దేశం. కాబట్టి వృద్ధత్వంచేత, గానికోటివచ్చిన చిత్తచాంచల్యం చేత బాధపడుతున్న ధృతరాష్ట్రుడు ఆనాడు తనకుమారుని అక్రమాలను మాన్పలేక పోయినాడని చెప్పేడు. తన ప్రభువైన ధృతరాష్ట్రునిశీలానికి భంగం రాకుండా, వృద్ధత్వంచేత చిత్తచాంచల్యం కలగడం సహజమేనని కూడా ఒకవిధంగా సమర్థించేడు. ధృతరాష్ట్రునకు కొంతపశ్చాత్తాపంకలిగి యిప్పుడు శాంతంగాఉన్నాడట. దీనివల్ల, దుర్యోధనుడు మరిఅక్రమాలను చెయ్యడనిన్నీ, చేసినా తండ్రి మాన్పగలుగుతాడనిన్నీ మనం భావించుకోవాలి. కౌరవులతో సఖ్యంగా ఉండమని ధర్మరాజుకు సంజయుడు బోధిస్తున్నప్పుడు, ఆతను దుర్యోధనుని అక్రమాలను ఎత్తిపొడవకుండా చేయడానికని సంజయుడు యింతభావయుక్తంగా మాట్లాడవలసివచ్చింది. యింతభావాన్నికూడా చిన్న కందపద్యంలో యిమిడ్చి మహాకవి తిక్కన తనభావగాంభీర్యాన్ని ప్రదర్శించేడు.

యీ కవీశ్వరుడు ఏసంఘటన సృష్టించినా మన మనోనేత్రంముందర స్ఫుటంగా వ్యక్తమవుతూ ఉంటుంది. స్త్రీలముందర తన దంభప్రజ్ఞలన్నీ చెప్పిన ఉత్తరుడు సైన్యాన్నిచూచి, బెంబేరుపడిన ఘట్టాన్ని చదివినట్లయితే ఎవరికైనా నవ్వువస్తుంది.

"కని యుత్తరుండు గరుపాఁ, టిన మేనును దలఁకు మనము బిచ్చవడిన చూ, పునునై తొట్రుపడుచు నిట్లనియె దిసలుసాచ్చి యా బృహన్నలతోడన్."

అని ఆ భయభ్రాంతుడైన కుర్రవాని హావభావాలను చక్కగా వర్ణించేడు. లంచము లిచ్చికూడా అర్జునుని యుద్ధంనుంచి విముఖునిగా చెయ్యలేనని తోచినప్పుడు ఉత్తరుడు దీనంగా

“నాతోడి ప్రేముడింగదు, నాతురయై యెదురు చూచు నంబకు జేతః, ప్రీతిగజని యాయమబోవనూతుం బోనీగదే విసుద్ధచరిత్రా”. అని వేడుకుంటాడు. అప్పుడు మనకుజాలి, నవ్వుకూడా ఒకేసారి ఉద్భవిస్తాయి. భారతంలోఉన్న మంచిహాస్యరసమైన సంఘటనలలో యిది ఒకటి. కీచకవధ ఘట్టంలోని ప్రాశస్త్యం వర్ణనాతీతంగా ఉంటుంది. స్వల్పభేదములలో అది సులువుగా రంగస్థలముమీద రమ్యంగా ప్రదర్శించడానికి వీలవుతుంది. కృష్ణుని రాయబారంలోను, సంజయుని రాయబారంలోను అత్యద్భుతమైన చాతుర్యం వ్యక్తమవుతుంది. కృష్ణుని రాయబారంకంటె సంజయుని రాయబారమే గొప్పదేమో అనిపిస్తున్నది. ఏమంటే కృష్ణుడు ప్రత్యేకమైన ఉద్దేశంతో తనరాయబారాన్ని నిర్వహించినాడు గనుక అది చాల ఉత్కృష్టంగా ఉండడం సహజమే. కాని సంజయుడుమాత్రం తనరాయబారంలో ముఖ్యంగా చెప్పదగిన ఉద్దేశము లేకపోయినప్పటికీ, కేవలం తన రాజనీతికౌశల్యాన్నే విజృంభింపచేసి, తన పాత్రను అతి సమర్థతతో నిర్వహించేడు. తిక్కనఅమాత్యుడైనందున తన రాజనీతికౌశల్యాన్ని సంజయ రాయబారంలో ప్రదర్శించేడేమో అనిపిస్తున్నది.

“ధ్వని ప్రధానం కావ్యం” అని ఆలంకారికుల సిద్ధాంతము. ధ్వని రసము, కూడా అహమహమికా భావంతో శోభించిన గ్రంథములలో భారతం అగ్రస్థానాన్ని వహిస్తున్నది.

“ఆరాజు మాదెసంగల, కారుణ్యముకతమునను సుఖంబున నిట్లున్నారము” అన్న వాక్యంలో తిక్కన ధ్వనిని ఎంతసరసంగా ప్రయోగించేడో యిదివరకే మనవిచేసేము.

“దుర్వారోద్యమ బాహువిక్రమరసా
　　స్తోకప్రతాపస్ఫుర
ద్గర్వాంధ ప్రతివీరనిర్మథనవి
　　ద్యాపారగుల్ మత్పతు
ల్గీర్వాణాకృతు లేవు రిప్పు నిను దో
　　ర్లీలన్ వెసం గిట్టి గం
ధర్వుల్ మానము ప్రాణముం గొనుట త
　　థ్యంబెమ్మెయిం గీచకా.”

పై పద్యంలో శబ్దధ్వనికూడా చక్కగా వ్యక్తమవుతున్నది. తిక్కనభావనాశక్తి, పదముల ఔచిత్యము, వర్ణనాసామర్థ్యం మొదలైనవాటినిగురించి ఎంత వ్రాసినా తనివితీరదు. తిక్కనతాలూకు భావనాశక్తిని వ్యక్తీకరించడానికి యీక్రిందపద్యాన్ని ఉదాహరిస్తున్నాము.

“అభినవ జలధరశ్యామంబులగుపెడ
　　లానుజొంపంబుల ననుకరింప
సాంధ్యరాగోపమచ్ఛాయంబులగుపట్టు
　　కిసలయోత్కరముల శ్రేణిసేయ
రాజమరాళ గౌరములగుచోటుల
　　దఱచు బూబొదలచందంబు నొంద
హారిద్రరుచి సమానాకృతులగు ఠావు
　　లవరేణు పుష్పాంశులట్లు మెరయ
గలయనెగసి ధరాధూళిలలితవనము
దివికినవిగాపువోయెడు తెఱగుదాల్ప
గోగణము ముంగలిగ నేల గోడివడగ
నడచు కౌరవరాజసైన్యంబు గనిరి.”

కౌరవసేన గోగ్రహణమైనతరువాత మరలిపోతున్నప్పుడు, వివిధస్థలములనుంచి అనేకరకములుగా బయలుదేరిన ధూళిని చక్కనివృక్షములతో సరిపోల్చి తిక్కన ఎంతచక్కగా వర్ణించేడో చూడండి

తిక్కనపద్యాలలో కొన్నిటి గమనిక సరళంగా ఉండదని ఒకఅపవాదు. దీనికికారణం పద్యంయొక్క భావం పాదంతో పూర్తికాకుండా రెండవ పాదంలో కూడా వ్యక్తమవుతుంది కాబట్టి దీనిని పద్యంలాగ రాగవరసతో చదివేకంటె వచనంలాగ భావయుక్తంగానే చదివితేనే అది శ్రావ్యంగా ఉంటుంది. షేక్స్పి

యరు మహాకవి చరమదశలో వ్రాసిన నాటకాలలోని పద్యాలుకూడా యీవిధంగానే ఉంటాయి. యిదిగాక తిక్కన పద్యాలలో పొల్లుముక్కలు ఎక్కడా కనపడవు. యీయన పద్యానికియిచ్చినంత ప్రాధాన్యం వచనానికి యివ్వకపోయినా, వచనంలోకూడా కొంత గొప్పతనాన్ని విశదీకరించినాడు. నర్తనశాలావర్ణనంలో ఉపయోగించిన ఉపమానాలను పరిశీలించినట్లయితే, ఆంధ్రభాషకు కాళిదాసులేనిలోటిని తిక్కన తీర్చినాడేమో అనిపిస్తున్నది.

"వివేకరహితు హృదయంబునుంబోలె దమోదూషితంబును, విదగ్ధవనితా ప్రేమంబునుంబోలె దుర్నిరూపంబును, ఘోరాటవీభాగంబునుంబోలె నిర్మానుష్యంబును, కాపురుష లక్ష్మీవిలాసంబునుంబోలె ననుపయోగ్యంబును, ననభ్యస్త శాస్త్రంబునుంబోలె దుర్గమంబును, స్వప్నలబ్ధ పదార్థంబునుంబోలె నదృష్టిగోచరంబును, విషమకావ్యంబునుంబోలె నస్పష్టాలంకారంబును, బాలిశ రాజ్యంబునుంబోలె జారచోరహృద్యంబును నైన యా నర్తనాగారంబు"

పైవచనం చదివేసరికల్లా మనమనోనేత్రం ముందర కలుషితమైన నర్తనశాల గోచరిస్తుంది. కాబట్టి భారతంలో ఉండే యిటువంటి కళానైపుణ్యాన్ని పుస్తకరూపంగా విమర్శించినట్లయితే, కళాదృష్టితో భారతం చదివేవారికి గొప్పఉపకారంచేసినవారుఅవుతారు. మేము గ్రంథవిస్తరభీతిచేత విరాటోద్యోగపర్వాలలో ఉండే కొన్ని సంఘట్టనలు మాత్రమే విమర్శించేము గాని ఇటువంటి విమర్శన పుస్తకరూపంగా సమన్వయింపబడినట్లయితే తిక్కనకవిత్వమేకాక, భారతాన్ని అంతటినీకూడా పరిశీలించడానికి తగిన అవకాశం ఉంటుంది.

భాషాసాంప్రదాయాన్ని బట్టిగాని, విషయపరిశీలనవల్లగాని, మరియే ఇతర పరికరములచేతగాని భారతరచనాకాలమునాటి ప్రజల పరిస్థితులను తెలిసికొనగలిగినట్లయితే ఆవిషయంకూడా ప్రచురింపబడవలసి యున్నది. యిదిగాక భారతకవుల యొక్క స్వీయచరిత్రకు సంబంధించిన సంఘట్టనలు భారతంలో ఎక్కడయినా వ్యక్తమైతే అవికూడా ప్రకటింపబడవలసి ఉంటుంది. 'కోర్సన్' మహాశయుడు మిల్టన్ తాలూకు స్వీయచరిత్రకు సంబంధించిన విషయాలను పుస్తకరూపంగా ప్రచురించి మిల్టన్ గొప్పతనానికి మెరుగుపెట్టేడు. ఆంధ్రులుకూడా తమసాహిత్యాన్ని సరిగా విమర్శించి తత్కర్తలను యథార్థముగా బహూకరింతురుగాక.



# వ్యాయామము

## పాలూరి సుబ్బారావు

సర్వసాధారణముగా మనవారలు వ్యాయామ మన సాము గరిడీలు, దండెములు, బస్కీలు మొదలయినవి చేయుటయే యని భావించెదరు. శరీరమును జక్కగ పోషించుటయందు నుపయోగించు పారిశ్రామిక విధానము లన్నియు వ్యాయామమున కన్వయింపును. వాహ్యాళి, జలస్తంభనము, ప్రాణాయామము, గుఱ్ఱపుస్వారి, సంవాహనము, నృత్యము, వేట మున్నగునవికూడ నందు జేరినవియే. ఆసనపరిశ్రమ కేవల వ్యాయామ మాత్రమేగాక సర్వరుజాపహము, ఆయుష్యము, నాముష్మికము గూడ నై యున్నది. వ్యాయామము కేవలం కసరత్తు శరీరక్లేశము మాత్రమేగాక చతుష్షష్టికళలలో నొకటియైయున్నది. ఏతత్కళలలో మొదటి మూడు నగు గీతవాద్య నృత్యములుకూడ వ్యాయామాంతర్గతములే. నలుబదినాల్గవదియగు నుత్సాదనాదికమగు కళ వ్యాయామమున జేరి పౌష్టిక క్రియలకు మిక్కిలి తోడ్పడును. పూర్వకాలమున నాంధ్రమహారాజులు రాజ్యముజేసెడిపట్లు ఆంధ్రులకు జక్కని శరీరసౌష్ఠవము, తేజము, వీర్యము పెంపొంది శౌర్యోత్సాహములు కలిగియుండెడివి. ప్రస్తుతము రాజావలంబనములేమి నిరుత్సాహత, పరాధారప్రాధేయత లలవడి యితరజాతులతో పోల్చుటకు సరిరాకున్నారు. శ్రీ ఛత్రపతి శివాజీమహారాజు మహారాష్ట్రులలో మిగుల నుత్సాహము, శౌర్యము, ప్రతాపము పెంపొందింపజేసెను. నాటనోలె మహారాష్ట్రులిప్పటికిని చక్కని పాటవము కల్గియున్నారు. మన ఆంధ్రమహాశయులు గూడ నీ చతుష్షష్టి కళలలోనివగు నీ వ్యాయామవిద్యలను మిగుల ప్రోత్సహించి సహజ వీర్య శౌర్య దార్ఢ్యాదులను పొందెదరుగాత.

అరువదినాల్గుకళలలో ౬౨, ౬౩, ౬౪ కళలగు "వైనయికానాం, వైజయికానాం, వ్యాయామికానాంచ విద్యానాం జ్ఞానం ఇతి చతుష్షష్టివిద్యాః. వైనయికానామితి - స్వపరవినయ ప్రయోజనాత్, వినయాచారశాస్త్రాణి హస్త్యాదిశిక్షాచ — వైజయికానామితి - విజయప్రయోజనా వైజయిక్యః దైవ్యో మానుష్యశ్చ. తత్ర దైవ్యో అపరాజితాదయః, మానుష్యాయాః సాంగ్రామిక్యా శ్శస్త్రవిద్యాః - వ్యాయామికీనామితి వ్యాయామప్రయోజనా వ్యాయామిక్యః మృగయాద్యాః ఏతా స్త్రిస ఆత్మోత్కర్ష రక్షణార్థాః" అనగా ఏనుగులు, గుఱ్ఱములు మొదలగు జంతువుల స్వాధీనము జేసుకొనుట వైనయికజ్ఞానము. అపరాజితము లనగా దేవతాసంబంధము లైన ఉపాసన మొదలుగాగల మంత్రతంత్రములచే విజయము నొందగలుగుట లపరాజితములనియు, శరీరసత్వముచే మల్లయుద్ధము, సంగ్రామము, శస్త్రవిద్య మొదలైనవాటిలో సామర్థ్యమును జూపి జయము నొందుటలు మానుష్యములు. ఈ రెండు విధములైన విజయప్రయోజనములగు విద్యలు తెలియుట వైజయికజ్ఞానము. వ్యాయామము (శరీరపరిశ్రమ) ప్రయోజనముగాగల మృగయాదివిద్యల నెఱుంగుట వ్యాయామికజ్ఞాన మనియు దెలుపబడెను. మఱియు ౧, ౨, ౩ కళలగు గీతము, వాద్యము, నృత్యము అనునవిగూడ పారిశ్రామికములు.

శ్లో. స్వరగం పదగంచైవ తథా లయగమేవచ,
చేతోవధానగంచైవ గేయం జ్ఞేయం చతుర్విధమ్.

ఘనంచ వితతం వాద్యం తథా సుషిరమేవచ,
కాంస్యపుష్కర తంత్రీభి ర్వేణునాచ యథాక్రమమ్.

కరణా న్యంగహారాశ్చ విభావో భావఏవచ,
అనుభావో రసాశ్చేతి సంక్షేపా న్నృత్యసంగ్రహః

తద్విధం నాట్యమనాట్యంచేతి తన్నోక్తం:

శ్లో. స్వర్గేవా మర్త్యలోకేవా పాతాళేవా నివాసినామ్,
కృతానుకరణం నాట్య మనాట్యం నర్తకాశ్రితమ్.
తంత్రాంతరేతు నృత్యభేదజ్ఞాపనార్థ మేవ పృథ
జ్నాట్యకళోక్తేతి విజ్ఞేయం.

గీతము, వాద్యము, నృత్యములను నీ కళలు ప్రత్యేక ప్రత్యేకముగ నాయాశాస్త్రములలో, ననగా సంగీత భరతశాస్త్రములయందు బహుజక్కగ విస్తరించి చెప్పబడినవి. అయ్యవి పూర్తిగ వివరించుట చాల దుర్ఘటము. గానముచేయబడునది గనుక గీతమున్ను, సమ్యక్ అనగా లెస్సగా గానము చేయుట సంగీతమనియు, నయ్యది స్వరగత మనియు, పదగత మనియు, లయగత మనియు, చిత్తప్రణిధానగతమనియు, నాల్గువిధములుగ జెప్పబడినది. స్వరమేళగానము స్వరగతము, పదమేళనము పదగతము. కేవల లయగమనికచే నాధారమగునది లయగతము, గానమునందే చిత్తము నాయత్తము జేసి యేకాగ్రతచే లోలో గానము చేయబడునది అవధానగతము (చిత్తప్రణిధానగతము) ననును. ఈతుకీయమును గానమే సర్వాంగహారము, చిత్తరంజకము, నాత్మప్రబోధకము ననుచున్నది.

వాయింపబడునది వాద్యము. ఇదియు నాల్గువిధములు. ఘనము - వితతము - తతము - సుషిరము కంచుతాళములు మున్నగువానితో వాయింపబడునది ఘనవాద్యము. మద్దెల మొదలగువాటితో వాయింపబడునది వితతము, లేక పుష్కరము. వీణలు, తంబురలు, మొదలగువానితో వాయింపబడునది తతము, పిల్లనగ్రోవి మొదలగువాటిచే వాయించునది సుషిరము. మృదుమధురగానము జంత్రగాత్రములచే నొప్పారజేయుట శారీరమానసికవ్యాయామమగుటయే గాక తద్రీత్యా రుజాహాపము, బల్యముగూడ నగును.

నాట్యముజేయుట నృత్యము. అంగహారమనగా నవయవములను శాస్త్రీయముగ ద్రిప్పుట. అభినయము (వాచిక, ఆంగిక, ఆహార్య, సాత్త్వికి) భావము, విభావము అనుభావము తదనురూపములగు రసములు నీయవయవము లన్నియు గలసి ప్రవర్తిల్లునది నృత్యము. ఈ నృత్యము సాధారణముగ నాట్యానాట్యములని ద్వివిధములు. స్వర్గమర్త్యపాతాళవాసుల ననుకరించునది నాట్యమనియు కేవల నర్తకీ జనసామాన్యాశ్రిత మనాట్యమనియు శాస్త్రప్రసిద్ధము. ఏతద్భిన్నమయినదియు, నెమళ్లు, హంసలు మొదలయిన తిర్యగ్యోనులు పదచలనము జేయుచు నొయ్యారముగ నడచుట ప్రస్తుతము మన యాంధ్రదేశములో నవలంబింపబడుచున్న యర్థముగాని పదవిన్యాసము శాస్త్రీయముగాని హస్తవిన్యాసము గలసి చేయబడు నాట్యము లాస్యమనియు జెప్పబడును. ఏది యెట్లున్నను నాట్యమువలన నాయాయవయవములు బలము నొంది శరీరము నుచితరీతిని వశమునందుంచుట కలుగగలదు. జీర్ణశక్తి వృద్ధియగును. ఉత్సాహము కలుగును. అందులకె పాశ్చాత్యసోదరులు నృత్యము నేర్చుకొనుచుందురు. నాట్యము తెలియనివాడు వారలలో సాంఘికగోష్ఠి వినోదములందు పరిహసింపబడును.

(౪౧ కళ) ఉత్సాదనే సంవాహనే కేశమర్దనేచ కౌశలం మర్దనం ద్వివిధం పాదాభ్యాం హస్తాభ్యాంచ. తత్ర పాదాభ్యాం యన్మర్దనం తదుత్సాదన ముచ్యతే. హస్తాభ్యాం యచ్ఛిరోభ్యంగకర్మ తత్కేశమర్దనం. కేశానాం తత్రమృద్యమానత్వాత్ తద్వ్యపదేశః. శేషాంగేషు మర్దనం సంవాహనమ్. కేశగ్రహణ మత్రాదరార్థం. తత్ర కౌశలం పరారాధనార్థమ్.

ఉత్సాదన సంవాహన కేశమర్దనములందలి కౌశలముకూడ నొకకళయే. కాళ్లు మర్దించుట, పట్టుట ఉత్సాదనము. చేతులతో తల మొత్తుట, వెంట్రుకలు వేధించుట కేశమర్దనము. ఇతరావయవములను శరీరమును పిసుకుట, మర్దించుట సంవాహనము. వీట్లవల్లగూడ సర్వాంగములకు బలము, పుష్టిచేకూరుటయేగాక నభ్యంగమువల్ల రుజాజరాపహతిగూడ నగును. ఇది మంచి వ్యాయామము. అట్లొనర్చుట చక్షుష్యము, వృష్యము, నాయుష్యముగూడ నగును.

వ్యాయామములలో నత్యుత్తమమగు యోగవ్యాయామముగూడ బల్యమును, పౌష్టికమును, తైజసికమునైయున్నది భీమాదులయుతగజపరాక్రమ యుతులగుట జన్మతః మాత్రమేగాక యౌగికముగగూడ నగును.

పాతంజల యోగశాస్త్రము:- (యోగపాదే. ౨.)

యోగశ్చిత్తవృత్తినిరోధః

అంతఃకరణవృత్తులను నిగ్రహించుటయే యోగ మనబడును. తత్రాపి సకలవ్యవహారయోగ్యమైన చిత్త వృత్తుల పరిణామరూపధర్మముల నిగ్రహమే యోగము. చిత్తమనగా నిర్మలమైన సత్త్వగుణపరిణామము అంతఃకరణము. వృత్తి యనగా చిత్తపరిణామరూపము. చిత్తము పంచావస్థలతో కూడినది. రజోగుణ ప్రాధాన్యమై సుఖదుఃఖాది విషయముల ప్రసరించు చిత్తము "క్షిప్తము." అస్థిరమై దైత్యదానవులకు గలుగును.

(౨) తమోగుణ ప్రాధాన్యమై కృత్యాకృత్య విమర్శనా జ్ఞానవివేకము లేక క్రోధాదుల ప్రవర్తించునది "మూఢము". పిశాచరాక్షసులకు గలిగియుండును. (3) సత్త్వగుణాధిక్యమై భోగసాధనాదులందు ప్రవర్తించునది "విక్షిప్తము." దేవతలకు గలిగియుండును. (౪) బాహ్యములందు ప్రసరించక అంతర్ముఖమగునది "ఏకాగ్రము." (౫) వృత్తులును, సంస్కారములును లేనిది "నిరుద్ధము" యోగాభ్యాసమునకు ఏకాగ్రనిరుద్ధములే యోగ్యములు. వాటియందే సమాధి కలుగును.

సాధనపాదే:-(౨౯) యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణాధ్యాన సమాధయోఽష్టావఙ్గాని. యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ, ధ్యానము, సమాధి అనునవి ౮ యోగాంగములు.

యమమనగా:— ప్రాణిహింస జేయుట, అబద్ధమాడుట, పరధన మపహరించుట, భోగసాధనపదార్థములను స్వీకరించుట మొదలయినవి విసర్జించి యుండుట.

నియమమనగా:— పరిశుద్ధత, సంతుష్టి, నిష్ఠ, మంత్రజపము, ఈశ్వరభక్తి నొనర్చుట.

ఆసనమనగా:—వీర్యనిగ్రహము జేసి దేహదార్ఢ్యమును సంపాదించి చిత్తస్థైర్యమునిమిత్తము కూర్చుండుట. (౪౬) స్థిరసుఖ మాసనం. అనగా నాసనము స్థిరత్వము, సుఖము (దేహారోగ్యము) నిచ్చునని భావము. అదియు బాహ్యాసనము, అనగా దర్భ, కంబళి, మృగచర్మము మొదలగువాటిమీద కూర్చుండుటయు, శారీరాసనము లనగా శరీరము నాయా స్థితులయందు వంచి కూర్చుండుట యను రెండు విధములై యున్నది. శారీరాసనములు ౮౪. వీరాసనము, స్వస్తికాసనము, పద్మాసనము, సిద్ధాసనము, సింహాసనము, కూర్మాసనము, గోముఖాసనము, ధనురాసనము, కుక్కుటాసనము, కపాలాసనము, మయూరాసనము, భద్రాసనము, యోగాసనము మొదలైనవి. ఎవరికి ఏ ఆసనమందు నిశ్చలత్వము సుఖము గల్గునో ఆ రీతిగా ఆసనమును ధరించిన యోగ్యము. మయూరాసనము అజీర్ణరోగమును (Gastric trouble) బోగొట్టును. కపాలాసనము రసాయన (Rejuvination) మగును. ఇటులనే ప్రతి ఆసనము నారోగ్యప్రదమును, ప్రత్యేకవ్యాయామమును నగును. ఆసనసిద్ధికొఱకు,

శ్లో. శేషమష్ఫం మహాదివ్యం ఫణాఫణిసహస్రకమ్,
కోటిసూర్యప్రతీకాశం గృహాణాసన మీశ్వర.

అని ప్రార్థించుచు నాదిశేషు నుపాసించవలెను.

ప్రాణాయామ మనగా:—ప్రచ్ఛర్దము (రేచకము) శాస్త్రీయప్రమాణముచొప్పున లోపలిగాలిని బయట విడుచుట. విధారణము (కుంభకము) లోపలి వాయువును చలింపనీయక నిలువబెట్టి యుంచుట, కుంభములోనే పూరక (లోనికి పీల్చుట) ముండుటచే ప్రత్యేకముగ సూత్రములో చెప్పబడియుండలేదు. ప్రాణాయామమువలన నాడులు శుద్ధములుగా నగును. సకలశరీరదోషములు పోవును. చిత్తైకాగ్రత కలుగును.

ప్రత్యాహార మనగా:—ఇంద్రియములను తమ తమ వ్యాపారములందు ప్రవర్తింపనీయక చిత్తమునకు మరల్చుకొనుట.

ధారణ యనగా—చిత్తము నొకచోట స్థిరముగా నిలుపుటయు, మానసికమున విద్యావిషయములను, ధ్యేయ వస్తువులను ధరించి నిల్పుట.

ధ్యానమనగా—ధారణాస్థలమున బుద్ధిని నిల్పి మరల్పకుండుట.

సమాధి యనగా—ధ్యానము దృఢమై, ధ్యానము చేయుచుంటి ననెడి తలంపుపోయి చిత్తము విషయాంతరముల గోచరములేక వ్యాపారశూన్యమైనదై ధ్యేయాకారమైనట్టి స్థితి. వితర్క, విచార, ఆనంద, అస్మిత, సమాధియుతము సంప్రజ్ఞాతసమాధి. ఏతద్విషయ రాహిత్యమైనదై నిర్వికల్పమగునది అసంప్రజ్ఞాత సమాధి. ఈ సమాధియందు వృత్తిద్వితిప్రకృతులు బుద్ధిని జేరజాలవు. నిర్మలచిత్ప్రకాశ మార్గమున చిన్మాత్రపురుష స్వరూపమై యుండును

యోగపాదే (౨౧) తీవ్రసంవేగానా మాసన్నః (౨౨) మృదుమధ్యాధి మాత్రత్వాత్తతోపి విశేషః.

కార్యసాధకమైనట్టి మిక్కిలి దృఢమైన సంస్కారము సంవేగము. అందులను తీక్ష్ణమగునది తీవ్ర సంవేగము. ఇది కలిగినవారలకు సంప్రజ్ఞాత సమాధి శీఘ్రముగ గల్గును. అందులను మృదూపాయకులు, మధ్యోపాయకులు, అతిమాత్రోపాయకులు నని యోగులు మూడువిధములుగ నుందురు. క్రమముగ నొకరికంటె నొకరు ఎక్కువవారలై తీవ్రసంవేగులకంటె నుత్తములుగ నుందురు.

విభూతిపాదే (౨౩) మైత్ర్యాదిషు బలాని.

మైత్రి, ముదిత, కరుణ, ఉపేక్ష యనువాటిని కాయాకాశమునందు సంయమనము చేయుటవలన నయ్యవి వృద్ధియగును. దేహబలము తన ఇచ్ఛానుసార మగును.

విభూతిపాదే. (౨౪) బలేషు హస్తిబలాదీని

పైవాటిని బల్యముగ నేనుగు మొదలగువాటి విషయమై మానసికమున సంయమనము చేసిన యోగికి ఆయా జంతువుల బలము కలుగును. అనగా గజ, సింహ, హనుమ, ద్గరుడ, శరభ గండభేరుండ తిమి తిమింగల వాయ్వాది మహాశక్తిగలవాటియందు సంయమనము చేసినయెడల తాను జేసినవాటియొక్క బలపరాక్రమ సాహసవేగాదులు కలుగును. ఏతద్విషయము లన్నియు నభ్యాసయోగమున నలవడును. వ్యాయామమున నలవడు శక్తులన్నిటికంటె నీ శక్తులు సర్వవిధముల నుత్తమముగను, ప్రయోజకములుగను ఉండును. ఇంతియేకాక నాయా శక్తులు యోగాభ్యాస మాత్రముననేగాక మంత్రసిద్ధులనియు, ఓషధిసిద్ధు లనియుగూడ గలవు. మూలికలవలన నాయాశక్తులు గలుగునని ఆయుర్వేదమునందును, యోగసంహితలయందునుగూడ గలదు. అవ్వాటికి రసవిద్యకూడ ముఖ్యము. రాసనిక ప్రయోగముల ద్వారా రసాయనము, అనగా ముదిమిలేకుండజేయుట, నిరామయ సుఖజీవనము మొదలగునవి కలుగుటయే గాక మరణపర్యంతము జీవశక్తి లుత్పన్నము లగుచుండును. వెంట్రుకలు నెఱియుట, మేనిముడతలను బోగొట్టి చక్కని రూపము (సుభగత్వము) గలిగి నీరోగశతాయువ్యము గలుగును. అప్పటివరకు బల్యాభి ప్రకర్షయును, కొన్నికొన్ని యద్భుతశక్తులును కూడ గలుగగలవు. దేశకాలభేదావస్థాదులయందు సహితము తత్వము చెడక శీతోష్ణ సుఖదుఃఖములయందు సమత్వము కలుగును. ఇదియే పారిశ్రామికము.

ఏతద్విషయములందు వినియమము ముఖ్యము. అనగా ప్రాతఃకాలమున నిద్రనుండి మేలుకొనినది మొదలుకొని ప్రత్యహము నన్నపానీయాహార విహార శయ్యాగులయందు సమకాలమున ప్రవర్తించుట, యుక్తాహారసేవనము మొదలైనవాటివలన సౌకర్య మేర్పడును.

కామసూత్రే నాగరకవృత్తే ౧౦౦ సూ:—

స ప్రాతరుత్థాయ కృతనియమకృత్యః గృహీత దంతధావనః మాత్రయా అనులేపనం ధూపం స్రజమితి గృహీత్వా దత్వా సిక్థక మలక్తకంచ దృష్ట్వా ఆదర్శే ముఖం గృహీతముఖవాసతాంబూలః కార్యా ణ్యనుతిష్ఠేత్.

సూర్యోదయమైనపిమ్మట లేచినచో నభ్యుదయదోషము నొసంగునుగాన చీకటియుండగానే పడకనుండి లేచి నియతకాలకృత్యముల నొనరించి యనగా మూత్రపురీషోత్సర్గ మొనరించి దంతధావనము చేసుకొని స్నాతుడై జపతపాదుల నాచరించినతరువాత కొలదిగ శరీరమునకు అనులేపనము (సుగంధద్రవ్యము) నలందుకొని అగరుధూపమున శిరస్సు, శరీరము నార్చుకొని పుష్పము ధరించి పెదవుల కలక్తక మొనరించి (లత్తుక రంగుమాది) శిరోజముల చక్కనొత్తి అద్దములో

ముఖము చూచుకొని తాంబూలము సేవించినతరువాత నిత్యకృత్యముల జూచుకొనవలెను.

పరిశ్రమ (వ్యాయామము) స్నానాత్పూర్వమే చేయవలెను. తరువాత స్వేదము శరీరమునందారిన పిమ్మట స్నానము చేయవలయును. స్నానానంతరము చక్కగ తడినొత్తవలెను

సూత్రము (౧౮౧) నిత్యం స్నానం. ద్వితీయక ముత్సాదనం. తృతీయకః ఫేనకః. చతుర్థ మాయుష్యం. పంచమకం దశమకంవా ప్రత్యాయుష్య మిత్యహీనం.

నిత్యానుష్ఠానికము లగు కర్మలలో ముఖ్యమగు స్నానము పావనము, దేహకాంతివృద్ధిదము నగుటవలన ప్రతి ఉదయమున గాని, ప్రతి సంధ్యాకాలమునందు గాని స్నానమాచరించవలెను. చరకసూత్రమునందు "ద్వౌకాలేఉపస్పృశేత్" ప్రాతః, సాయం కాలములయందు స్నానము, మార్జనము చేయవలయునని యున్నది. దేహబలమును వృద్ధిజేయునది యగు నుత్సాదనము రెండు రోజుల కొకపరి, పిక్కలు బిరుసెక్కకుండ ఫేనకము మూడురోజుల కొక పరి, నాలుగురోజుల కొకపరి ఆయుష్కర్మ, ౫ లేక ౧౦ రోజులకు బిమ్మట జేయుటవలన దేహారోగ్యము వృద్ధిజెందును.

భోజనవిధి:— (౧౮౩) సూ: పూర్వాహ్ణాపరాహ్ణయోర్భోజనం——దినం రాత్రి మష్టధా విభజ్య పూర్వాహ్ణే త్రిభిర్భాగైః కార్యాణ్యనుతిష్ఠేత్. చతుర్థే స్నానాదికం కృత్వాభుంజీత అపరాహ్ణేచ పశ్చిమేభాగే బలాధానార్థం పునర్భుంజీత.

(౧౮౪) సూ: సాయం చారాయణస్య పూర్వాహ్ణే ప్రదోషేచ చారాయణస్య మతం. నతథా అపరాహ్ణే ద్వితీయభోజనం బల మాధత్తే యథా రాత్రావితి తథావోక్తమ్.

శ్లో. అజీర్ణే భోజనే యచ్చ యచ్చ జీర్ణే నభుజ్యతే,
రాత్రౌ నభుజ్యతే యచ్చ తేన జీర్యంతి మానవాః.

పగటిని, రాత్రిని ఎనిమిదెనిమిది భాగములుగా విభజించవలెను. దినమునందు 3 భాగములు గడచువరకు వ్యాపారమును చూచుకొని నాల్గవభాగమున స్నానమాచరించి భుజించవలెను. తిరిగి అపరాహ్ణాము పశ్చిమభాగమున భుజించవలెను. ఇది ఆచార్యుల (వాత్స్యాయనుని) మతము. చారాయణుడు పూర్వాహ్ణామునందు, ప్రదోషమునందు భుజించవలెననెను. ఎందుకొరకనగా చీకటిపడినతరువాత భోజనము పగటికంటె నెక్కుడుబలము చేకూర్చునని తెలిపెను. అజీర్ణముగా నుండునప్పుడు భుజించుట, జీర్ణమైన పిమ్మట భుజింపకుండుట, రాత్రి భోజనము మానుట అను మూడు కారణములచే మానవుడు క్షీణించును అను న్యాయమును ననుసరించి రెండు పూటలు భోజనముచేయుట మంచిదని భావము.

అనులేపనము—(౧౫౪) సూ. సుభగంకరణవిధి. తగరకుష్ఠ తాళీసపత్రకానులేపనం, సుభగంకరణం.

గ్రంధి తగరము చంగల్వకోష్టు తాళిసపత్రియను నీద్రవ్యములను మెత్తగ నూర్చించి శరీరమునకు ప్రస్తుతము మనవారలలోనుపయోగించు Face Powders బదులుగా ఒడలి కంతకును అలదుకొన్నచో శరీరమును చక్కగ పోషించుటయేగాక, కాంతి రూపము గూడ నొసగును.

అభ్యంగవిధి— సర్వసాధారణముగ మలయాళ దేశస్థులు ప్రతినిత్యము తైలము రద్దుకొని స్నానమాచరింతురు. తద్రీత్యా వారలు నిత్యయౌవనులుగను ఆరోగ్యవంతులుగను నుందురు. కాబట్టి తైలస్నానము ప్రతివారికి ముఖ్యము (౧౫౬) సూ. పునర్నవా సహదేవీ శారిబా కురంటకోత్పల పత్రైశ్చ సిద్ధం తైల మభ్యంజనం.

తెల్లగలిజేరు, సహదేవి, పాలసుగంధి, గోరింట విత్తులు, నల్లకలవరేకులుతో సిద్ధపరుపబడిన తైలము అభ్యంజనమునందు ప్రశస్తముగ నుండును. అభ్యంజన మొనర్చుటవలన దేహకాంతి, దృష్టిబలము వృద్ధియగును. వలీపలితములు పోవును. శరీరము పుష్టినందును. ఆయుష్యము, వృష్యముకూడ నగును.

నిద్ర:—మనకు శరీరారోగ్యముకొరకు, పుష్టి కొరకు భోజన మెంత యావశ్యకమో నిద్రకూడ నంత యావశ్యకము. నిద్రయనునది

యోగపాదే (౧౦) అభావప్రత్యయాలంబనా వృత్తిర్నిద్రా యని చెప్పబడినది. జాగ్రత్స్వప్నావస్థలు లేని జ్ఞానము నాశ్రయించియుండునది నిద్రావృత్తి. విషయజ్ఞానమును అవలంబింపని వృత్తియే నిద్ర. భావ మనగా విషయము. ప్రత్యయ మనగా జ్ఞానము. విషయము, జ్ఞానము అను నీ రెంటియందును యేదియులేక కలిగెడి విశ్రాంతిపూర్వకవృత్తియే నిద్ర. ప్రత్యయము కారణము. ఆలంబనము విషయము. అయ్యది సర్వసాధారణముగ లౌకికవ్యాపారములు లేనటువంటిదియు, తిమిరసహితమగునట్టిదియు నగు రాత్రియందే ఆచరించవలెను. ఆత్రేయమహర్షి చక్కగా బలవవలెనన్న కృశించినవారలు రాత్రింబవళ్లు నిద్రించవలెననియు, సంతర్పణీయము నూహ జేసిన పుష్టి జెందుదురనియు నుడివెను. ఆయుర్వేదమునందు "దివాస్వాపం నకదాచిదపి గ్రీష్మే క్వచిత్" అని నుడువబడియున్నది. మరియు "రాత్రౌ జాగరణం కుర్యా ద్దివాస్వాప మాచరేత్ తత్స్వప్నవిపర్యయం స్వప్నవిపర్యయేణ మేహం" అని గూడ నొకానొకచోట జెప్పబడి యున్నది. అయినను గ్రీష్మాదులయందు మంచిది.

సూ:............ దివాశయ్యాచ దివాశయన మహర్నోసి గ్రీష్మే ఏవక్షయకాలే శరీరపుష్ట్యర్థ మనుజ్ఞాతం, శరీరస్య ధర్మసాధనత్వాత్. పగటినిద్ర అధర్మమైనను క్షయింపజేయు కాలమగు గ్రీష్మమున శరీరబలముకొరకు నిద్రింపవలయును.

ఆహారపదార్థములు: (dietetics) మనము విస్తార పరిశ్రమచేయకుండినపుడు తగుమాత్రపు టాహారమును తీసికొనినను సరిపోవును. కాని వ్యాయామము నొనరించు సందర్భములయందు మామూలు ఆహారము చాలదు. ప్రస్తుతము అధునాతన శాస్త్రపరిశోధకులు జీవకృత్తులు (Vitamins) విస్తారముగ గలిగిన పదార్థముల సేవించుట యుత్తమమని సిద్ధాంతీకరించిరి. ఎంతయో పూర్వమునుండియు దేశీయ వ్యాయామకులు యెట్టిసీటిలో నానవేసిన శనగలు, వెన్న, మొదలగు పదార్థములు సేవించుచుండు నాచారము గలదు. వాటియందు నెన్నియోవిధములగు Vitamins గలవు. కండరములకు పుష్టిజేయునట్టియు, వృష్యమైనట్టియు పెన్నేరు (అశ్వగంధ) పాలతో సేవించుచుండెడివారు. ఎంతయో యుత్తమమైనది. బాదముపలుకులను తినుట, బాదము నూనె శరీరమునకు మర్దనజేయుటవలన నెంతయోబలము కలుగును. ఖర్జూరపుకాయలయందు అగ్నిదీప్తి విస్తారము కలదు. సారపప్పు, పిస్తాపప్పు, అక్రోటుపప్పు (Walnut) మొదలగు పప్పుదినుసులు అశ్వగంధ, విదారి (నేలగుమ్మడు), దూలగొండి విత్తులు, కోడిగ్రుడ్ల తెల్లని చూన, శ్వదంష్ట్ర (పల్లేరు), మినపపప్పు కలిపి పాలలో నుడికించి సేవించిన వ్యాయామము చేయువారలకు సప్తధాతుపుష్టి, కండరపుష్టి కలుగును. బల, నాగబల, అతిబల యను మూలికలతో సిద్ధపరుపబడిన ఘృతములను సేవించుటవలన నేనుగుతో సమానమైన దేహబలము కలుగును. ఈశ్వర, తెల్లగురివెంద మొదలగు ప్రశస్తమైన మూలికల ధరించుటచే నిర్భయము, శౌర్యము, స్థైర్యము, బలపరాక్రమములు గలుగును. మనము భుజించు పదార్థములలో నన్నివిధములైన రసములు, కృత్తులు, ధాతువులు కలిగియుండవలెను. కేవలము కూరగాయలు, ధాన్యములు మొదలైనవాటిలో నన్నియు నుండినను మాంసాశనమున కలవాటుపడినవార లని సేవించుచుండవలయును. శాకాహారులకు జాంతవపదార్థమగు ఘృతము మేదోవృద్ధి నొనరించును. మాంసాశనులకు ప్రతి ప్రత్యేకాంగము సేవించుటవలన నా యాయంగమునకు బలము కలుగుచుండును. విస్తారము ఫలములను భక్షించుట మంచిది. ఆయాకాలములయందు లభ్యములగు ఫలముల సేవించుటవలన శరీరము పుష్టిజెందును. కృశించిన వారలు చెరకుగడలు విస్తారముగ తినుట మంచిది. తక్రము (మజ్జిగ) నెంత సేవించిన మేహరోగుల కంత మంచిది.

కసరత్తు (Exercise) చేయువిధానముల గురించి అద్దానియందు ప్రవీణులు పలువురు చెప్పగలరు. నేను వ్యాయామమునకు ననువర్తించు మార్గములు ఉత్పత్తులు ఆహారములును విధులు వివరించితిని. గ్రంథవిస్తరభీతిచే నింతటితో విరమించెద.

# న్యాయవైశేషిక దర్శనములు

'చైతన్య'

## ౧

కేవలము బుద్ధినే ఆధారముగా గైకొని న్యాయవైశేషికదర్శనములు నిర్మింపఁబడినవి. న్యాయవైశేషికదర్శనసూత్రములఁ బరీక్షించిచూచినచో నివి ఒండొంటిని ఒప్పుకొనియే శమతమసూత్రముల నిర్వహించినట్లు తెలియవచ్చును. ఈశ్వరుఁడు, పరమాణువులు, అనేకజీవవాదము ఇత్యాదులగు పలువిషయముల నివి పరస్పర మేకీభవించి సిద్ధాంతముల నొనర్చుచున్నవి. న్యాయదర్శనముయొక్క గొప్పతనము పంచావయవన్యాయమున. దీనినే ఆంగ్లమున Syllogism అని వ్యవహరింతురు. వైశేషికుల విశేషసిద్ధాంతము పరమాణువాదము. ఒకపదార్థమును సూక్ష్మ, సూక్ష్మతర, సూక్ష్మతమములుగా విభజించుచుపోగా తుదకు మనకు లభించునది పరమాణువు. ఇయ్యది కార్యరూపమున లేక వస్తురూపమున -నిత్యము; దీనిని సాంఖ్యుల తన్మాత్రతోఁ బోల్పవచ్చును. మూలరూపమున నిత్యము. వాస్తవమునకు న్యాయవైశేషికదర్శనముల సమాప్తియే దర్శనశాస్త్రమునకు మొదలు. అందువలననే విద్యారణ్యముని స్వవిరచిత తైత్తిరీయోపనిషద్దీపికయం దిట్లు పల్కియున్నాఁడు:

"మూలకారణాత్ పరబ్రహ్మణ ఉత్పన్నా ఆకాశకాలదిశః పరమాణవశ్చ యదా వ్యవస్థితాః, తదా తత ఆరభ్య ఉత్తరకాలీనా సృష్టి ర్గోతమాద్యుక్త ప్రకారేణ వ్యవతిష్ఠతామ్." —భృగువల్లి

మూలకారణమగు పరబ్రహ్మమునుండి కలిగిన ఆకాశ, కాల, దిక్, పరమాణువులు స్థాపింపఁబడిన పిమ్మట, తదనంతర సృష్టి గోతమాదులచే ప్రతిపాదింపఁబడిన పద్ధతిని స్థాపింపవచ్చును.

న్యాయదర్శనమునకు మూలకందము గోతమవిరచితమగు న్యాయసూత్రములు. ఇది ఐదు అధ్యాయముల గ్రంథము. ప్రత్యేకాధ్యాయము రెండు ఆహ్నికములుగ విభజింపబడినది. ఇచ్చటి ఆహ్నికశబ్దము నాధారముగా జేసుకొని పదిరోజులలో గోతము డిద్దానిని వ్రాసెనందురు. మొత్తముమీద ఇందు ఐదువందల ముప్పదియొనిమిది సూత్రము లున్నవి. వాత్స్యాయను డనువాయన ఈ సూత్రముల కొక భాష్యమును విరచించెను. ఈ భాష్యమునకు ఉద్యోతకారు డొక వార్తికమును, వాచస్పతిమిశ్ర తాత్పర్యటీకను, ఉదయనాచార్యుడు తాత్పర్యపరిశుద్ధిని రచించిరి. ఇవియే ముఖ్యముగ పండితజనప్రశంసను బడసిన న్యాయగ్రంథరాజములు.

న్యాయదర్శనానుసారము ప్రపంచము దుఃఖమయము. ఉన్న కొద్దిసుఖము దుఃఖముతోఁ గూడుకొని యున్నది. అందువలన దీనిని దుఃఖమనియే చెప్పనగును. జన్మించినచో దుఃఖము తోడునీడయే. అందువలన దుఃఖమును రూపుమాపఁగోరినచో జన్మమునుగూడ నిగ్రహింపవలెను. జన్మయొక్క కారణము ప్రవృత్తి. ప్రవృత్తికి లోనై మనుష్యుడు కర్మ నాచరించును. తత్ఫలము జన్మ. ప్రవృత్తికారణ మేమి? దోషము. ఇయ్యది రాగద్వేష మోహాత్మకము. ఈదోషము మిథ్యాజ్ఞానప్రసూతము కాన మిథ్యాజ్ఞానమును ఛేదింపనిచో దుఃఖనివృత్తిలేదు.

"దుఃఖ, జన్మ, ప్రవృత్తి, దోష, మిథ్యాజ్ఞానానామ్ ఉత్తరోత్తరాపాయే తదంతరాపాయాదపవర్గః"

—న్యాయసూత్రములు ౧ ౧-౨

'యదాతు తత్త్వజ్ఞానాత్ మిథ్యాజ్ఞానమ్ అపైతి, తదా మిథ్యాజ్ఞానాపాయే దోషా అపయన్తి, దోషాపాయే ప్రవృత్తి రపైతి, ప్రవృత్త్యపాయే జన్మ అపైతి, జన్మాపాయే దుఃఖమ్ అపైతి. దుఃఖాపాయేచ ఆత్యన్తికోఽపవర్గో నిఃశ్రేయస మితి.'

— వాత్స్యాయనుఁడు.

తత్త్వజ్ఞానము లభించినచో మిథ్యాజ్ఞాన, దోష, ప్రవృత్తి, జన్మ, దుఃఖములు తొలఁగిపోయి పరమ శ్రేయస్సు అను మోక్షము లభించునని సూత్రకార, భాష్యకారులు వచించియున్నారు. అందువలన తేలిన దేమన - తత్త్వజ్ఞాన మొక్కటియే మోక్షోపాయము. న్యాయదర్శనము జీవున కీతత్త్వజ్ఞానమును సవిస్తరముగా తెల్పుటకే నిర్దేశింపబడినది. ఈతత్త్వజ్ఞాన మేమిటి? ప్రమాణ, ప్రమేయ, సంశయ, ప్రయోజన, దృష్టాన్త, సిద్ధాంత, అవయవ, తర్క, నిర్ణయ, వాద, జల్ప, వితండ, హేత్వాభాస, ఛల, జాతి, నిగ్రహస్థానము లను పదునారు పదార్థముల తత్త్వజ్ఞానమే న్యాయదర్శన ముపదేశించునది.

ఈ షోడశపదార్థములగుఱించి ఒకించుక ఆలోచింతము.

ప్రమ, లేక జ్ఞానముయొక్క సాధనమే ప్రమాణము. (Means of knowledge) ఇది ప్రత్యక్ష (Perception), అనుమాన (Inference), ఉపమాన (Analogy), శబ్దము (Scripture) లను నాలుగు విధములుగ విభజింపబడినది.

ఇంద్రియములు విషయముల సంసర్గములోనికి వచ్చినప్పుడు కలుగు నిశ్చయజ్ఞానమే ప్రత్యక్ష ప్రమాణము. దీనినుండి కలుగుజ్ఞానమే అనుమానము. ఇయ్యది మరల 'పూర్వవత్, శేషవత్, సామాన్యతోదృష్టమ్' అను మూడుతెఱఁగుల విభజింపఁబడినది. సాదృశ్యజ్ఞానము నుండి లభించునది ఉపమానము. నిశ్చితగతి నెఱిఁగిన వారినుండి గైకొను జ్ఞానము శబ్దము. ఇయ్యది దృష్టాదృష్టములను రెండువిధముల విభజింపఁబడినది. దృష్టమనగా ఇహలోకమునకు సంబంధించినది. అదృష్టమనగా మనకు కనఁబడని పరలోకమునకుఁ జెందినది.

ప్రమేయ మనగా ప్రమాణముయొక్క విషయములు (Objects of Knowledge). ఇవి పదిరెండు. ఆత్మ, శరీరము, ఇంద్రియములు, అర్థములు, బుద్ధి, మనస్సు, ప్రవృత్తి, దోషము, ప్రేత్యభావము, ఫలము, దుఃఖము, అపవర్గము లనునామముల వీటిని నైయాయికులు వ్యవహరింతురు.

ఇచ్ఛా, ద్వేష, ప్రయత్న, సుఖ, దుఃఖ, జ్ఞానములవలన ఆత్మయొక్క అస్తిత్వము అనుమానింపబడును. యత్నము, ఇంద్రియములు, తద్విషయములు-వాటి కాధారభూతమైన భోగాయతనమే శరీరము. ఘ్రాణ, రసన, చక్షు, త్వక్, శ్రోత్రము లను పంచేంద్రియములు క్రమముగా పృథివి, అప్, తేజస్సు, వాయువు, ఆకాశము లనుభూతములనుండి జన్మించినవి. గంధ, రస, రూప, స్పర్శ, శబ్దము లనునవి వీటివిషయములు. విషయజ్ఞానము లభింపజేయునది మనస్సు. బుద్ధి, ఉపలబ్ధి, జ్ఞానము లనునవి ఒక్కటియే. ప్రవృత్తి యనగా వాక్కు, బుద్ధి, శరీరముల ప్రయత్నము. దోషమన ప్రవృత్తిని గలుగజేయునది. ప్రేత్యభావమన పునర్జన్మ. ప్రవృత్తి, దోషములవలన కలుగునది ఫలము. దుఃఖమనగా పీడ. ఈదుఃఖవిముక్తియే అపవర్గము. ఇవి నైయాయికులు చెప్పు ప్రమేయములు.

సంశయము (Doubt) అనగా అనిశ్చితజ్ఞానము.

ప్రయోజనము (Purpose) అన ఏవిషయమును లభింపజేసుకొనుటకై యత్నింతుమో అయ్యది.

దృష్టాంతము (Instance) అనగా పండితులకు, పామరులకు బోధగమ్యమగు వస్తువు.

సిద్ధాంతము అనగా విషయనిశ్చయము. ఇయ్యది సర్వతంత్రసిద్ధాంతము, ప్రతితంత్రసిద్ధాంతము, అధికరణ సిద్ధాంతము, అభ్యుపగమసిద్ధాంతము అని నాల్గువిధములు.

అవయవములు, ప్రతిజ్ఞ, హేతువు, ఉదాహరణ ఉపనయ, నిగమనము లనునవి.

తర్కము (Reasoning) అనగా ప్రయోజనీయమగు వస్తుతత్త్వమును నిర్ణయించుటకై చేయబడు ఊహ.

నిర్ణయము (Conclusion) అనగా పరపక్ష దూషణ, స్వపక్ష సమర్థన మొనర్చి ఒనర్పబడు తత్త్వనిర్ణయము.

వాదము (Argumentation) అనగా తత్త్వనిర్ణయమునకై శాస్త్రసిద్ధాంతముల ననుసరించి జరుగునట్టు వివాదము.

జల్పము (Sophistry) అనగా ప్రతిపక్షు నెట్లో ఒకట్లు ఓడింపవలెనని చేయువాదము.

వితండము (Wrangling) స్వమతస్థాపన నొనర్ప యత్నింపక, పరపక్షము నోడింపజేయు జల్పము.

ఈ మూడింటిని, అనగా, వాద, జల్ప, వితండముల కథ యని న్యాయశాస్త్రజ్ఞులు వ్యవహరింతురు.

కుహేతువులన్నియు హేత్వాభాస (Fallacy) యను నామమున పేర్కొనబడును. ఇవి సవ్యభిచారము, విరుద్ధము, ప్రకరణసమము, సాధ్యసమము, కాలాతీతము లను పంచవిధములు.

పరవాక్యమున విపరీతార్థమును కల్పించుటయే ఛలము (Quibble). ఇది సామాన్యచ్ఛలము, ఉపచారచ్ఛలము, వాక్ఛలము అను మూడువిధములు.

సాధర్మ్య వైధర్మ్యముల ననుసరించి ఆరోపింపబడు దోషము జాతి (Fals3 Analogy) అనబడును. ఇది పదిరెండువిధములు.

నిగ్రహస్థానమున వాదియొక్క పొరపాట్లు, అజ్ఞానము వెల్లడియగును. ఇవి ఇరువదిరెండు తెఱంగులని న్యాయదర్శన శేషభాగమున వర్ణింపబడియున్నవి.

ఇట్లీపదారు పదార్థముల వర్ణనముతో న్యాయదర్శనము ముగింపు నొనర్చినది. ఈ దర్శనమును న్యాయాంశము (Logic) తర్కాంశము (Dialectic) దర్శనాంశము (Metaphyic) అను మూడువిధముల విభజింపవచ్చును. న్యాయాంశమున పంచావయవన్యాయమును గుఱించిన విశేషాలోచన యున్నది. నవ్యన్యాయమున ప్రమాణవిచారమే యెక్కువగ నున్నది. కొందఱీశ్వరాస్తిత్వమును అనుమానప్రమాణమువలన స్థాపింప యత్నించిరి. 'క్షిత్యాదికం సకర్తృకం కార్యత్వాత్, ఘటవత్' అని న్యాయచర్చ నొనర్పదొడగిరి. ఉదయనాచార్యులిట్టిచర్చనే యొనర్చుచు 'కుసుమాంజలి' యను గ్రంథమును రచించిరి. ఇట్టి శాస్త్రచర్చయే వేదోక్తమననమనుటయని ఆచార్యు లభిప్రాయపడిరి. 'న్యాయచర్చేయ మీశస్య మననవ్యపదేశభాక్' తర్కమువలన ఈశ్వరుని ప్రతిపాదింపగలుగుట గొప్పవిషయమే కాని వాత్స్యాయను డీశ్వరవితర్కవిషయ మొనర్చుట మంచిదికాదని అభిప్రాయపడినాడు.

తర్కాంశమున జల్ప, వితండ, ఛలాది విషయ విచారమున్నది. దర్శనాంశమున పంచభూతములు, గుణములు, పరమాణువులు విచారింపబడినవి. ఆత్మశరీరేంద్రియ మనోబుద్ధులకంటె స్వతంత్రమైనదనియు, భోక్త జ్ఞాతయనియు, నిత్యవస్తువనియు యుక్తివలన స్థాపింపబడినది.

చతుర్థాధ్యాయము ప్రథమాహ్నికమున ఈశ్వర ప్రశంసయున్నది. ఈశ్వరుని కర్మఫలదాతగా అంగీకరించునారు.

ఈశ్వరః కారణం పురుషకర్మాఫల్యదర్శనాత్.
న్యా-సూ ౪-౧-౧౯.

ఇంతే. మఱి, న్యాయదర్శన నిర్దిష్టమగు ముక్తితో ఈశ్వరుని కేమియు సంబంధము లేదు పైన వర్ణింపబడిన షోడశపదార్థములజ్ఞానముకలిగిన కో ముక్తి అనివార్యము.

౩.

న్యాయవైశేషికదర్శనము లొకశ్రేణికి జెందినవని పైనచెప్పియుంటిమి. వైశేషికదర్శనసూత్రముల రచించినది మహర్షి కణాదుడు. ఈసూత్రములు పది అధ్యాయముల గ్రంథము. ప్రతి అధ్యాయము రెండు ఆహ్నికములుగ విభజింపబడినది. మొత్తముసూత్రముల సంఖ్య: మూడువందలడెబ్బది. ప్రశస్తపాదాచార్యుల పదార్థధర్మసంగ్రహము ఈసూత్రములకు భాష్యము వంటిది. ఉదయనాచార్యుని కిరణావళి, శ్రీధరాచార్యుని న్యాయకందళి ఈభాష్యమునకు టీకలు. శంకరమిశ్రుని వైశేషిక సూత్రోపస్కార మనుభాష్య మింకొకటి ఈసూత్రములపై వ్రాయబడినది.

వైశేషికమతమునఁగూడ సంసారము దుఃఖమయము. దుఃఖముయొక్క ఆత్యంతికనివృత్తియే పరమ పురుషార్థము. ఉపాయము, తత్త్వజ్ఞానము, ద్రవ్య, గుణ,

కర్మ, సామాన్య, విశేష, సమవాయములను పదార్థముల సాధర్మ్య వైధర్మ్యజ్ఞానమునుండి కలిగిన తత్త్వజ్ఞానమే వైశేషికులు వాంఛించునది. తరువాత వచ్చిన ఆచార్యులు అభావ మను పదార్థము నొకదానిని గ్రహించి, ఈదర్శనమున జేర్చిరి. బహుశః, ప్రశస్తపాదుడే ఇందుకు కారణమై యుండవచ్చును. గ్రీకుల Categories తో ఈపదార్థములకు పోలిక యున్నది.

ద్రవ్యము తొమ్మిదివిధములు. క్షితి, అప్, తేజస్సు, వాయువు, ఆకాశము, కాలము, దిక్కు, ఆత్మ, మనస్సులనునవి ఈనవవిధ ద్రవ్యములు. క్షితి, అప్పులు, తేజస్సు, వాయువు- ఇవి నిత్య, అనిత్యభేదములు కలవిగా వైశేషికులు పరిగణింతురు. ఇవి పరమాణురూపమున నిత్యములు, కార్యరూపమున అనిత్యములు. ఈచతుర్విధ పరమాణువులు, మిగిలిన పంచ ద్రవ్యములు నిత్యములు. ఆత్మజ్ఞానముయొక్క ఆశ్రయము మానసప్రత్యక్షము. ఆత్మ విభు అనగా సర్వవ్యాపి. ప్రతిదేహమున భిన్నమై యొప్పుచున్నది. మనస్సు అణుపరిణామము కలదై యున్నది. మనస్సు ఆత్మయొక్కయు సుఖదుఃఖాదుల యొక్కయు ప్రత్యక్షమునకు దోడ్పడు కరణము. ద్రవ్యము గుణాశ్రయము. గుణవిరహితమై ద్రవ్యముండనేరదు.

వైశేషికులు ఇరువదినాలుగు గుణముల నొప్పుకొందురు. అవి రూప, రస, గంధ, స్పర్శ, సంఖ్య, పరిమాణ, పృథక్త్వ, సంయోగ, విభాగ, పరత్వ, అపరత్వ, బుద్ధి, సుఖ, దుఃఖ, ఇచ్ఛా, ద్వేష, ప్రయత్న, గురుత్వ, ద్రవత్వ, స్నేహ, సంస్కార, అదృష్ట, శబ్దములనునవి. ఇందలి మొదటి పదునేడింటిని మాత్రమే సూత్రకారుడు నిర్వచించియున్నాడు. ప్రశస్తపాదుడు చివరిఏడింటిని కల్పి ఇరువదినాలుగు గుణముల ప్రస్తావించినాడు.

కర్మ ఉత్క్షేపణ, అపక్షేపణ, ఆకుంచన, ప్రసారణ, గమనము లను పంచవిధముల విభజింపబడినది.

సామాన్యము లేక జాతి పరాపరాభేదముల ద్వివిధము. మనుష్యత్వ, అశ్వత్వ, గోత్వాదులు అపరాజాతి; వీటికి సంబంధించిన ప్రాణిత్వజాతి పర.

విశేషమన ఏయసాధారణ ధర్మమువలన నిరవయవ పదార్థముల పరస్పరభేదము సిద్ధించునో అయ్యది.

తంతువు- వస్త్రము, గుణము- గుణి, క్రియ- ద్రవ్యము, జాతి- వ్యక్తి వీటికిగలసంబంధమే సమవాయసంబంధము.

అభావము సంసర్గాభావము, అన్యోన్యాభావము అని రెండువిధములు. సంసర్గాభావము మరల ప్రాగభావము, ప్రధ్వంసాభావము, అత్యంతాభావము అను మూడు విధముల విభజింపబడినది.

ఈపదార్థముల తత్త్వజ్ఞానమువలననే ముక్తిలభించునని వైశేషికు లందురు.

వైశేషిక దర్శనమున ద్వితీయాధ్యాయమున ఈశ్వరప్రసంగమున్నది. సంజ్ఞాకర్మ త్వస్మద్విశిష్టానాం లింగమ్ (వై. సూ. ౨-౧-౧౮) ప్రత్యక్ష ప్రవృత్తత్వాత్ సంజ్ఞాకర్మణః (వై. సూ. ౨-౧-౧౯) అనుసూత్రముల ఈశ్వరునిగురించి సూచింపబడినది. సంజ్ఞ అనగా నామము. కర్మ అనగా క్షిత్యాది కార్యములవలన మనకంటె అన్యులగు ఈశ్వరుని యొక్కయు, మహర్షులయొక్కయు అస్తిత్వము ప్రమాణీకరించుచున్నవి. ఘటపటాదినామములవలన ఆయావస్తువుల మన మెంగులకు గ్రహించుచున్నాము? ఈశ్వరుని సంకేతము కాన క్షిత్యాదులు కార్యముగుటచేసే నిశ్చయముగ వాటి కొకకర్త యున్నాడు. అత డీశ్వరుడు. ఇదియే యీగ్రంథమునందు మనకు గనపడు ఈశ్వర ప్రశంస.

వేదప్రమాణము నంగీకరించునప్పు డీశ్వరుని తత్కర్తగా పరిగ్రహించినారు. 'తద్వచనాత్ ఆమ్నాయస్య ప్రమాణమ్.'

నవ్యనైయాయికు . నవద్రవ్యములనుగూర్చి విచారము సల్పుచు, ఆత్మను జీవాత్మ, పరమాత్మలను ద్వివిధభేదములు కలదిగ నిర్వచించినారు. వీరు లెక్కలు వేసి ఈశ్వరునియందు జ్ఞాన, ఇచ్ఛా, ప్రయత్న, సంఖ్యాదులగు రెనిమిదిగుణము లున్నవని నిర్ణయించినారు. కణాదు డిట్లు లెక్కపెట్ట సాహసింపలేదు.

ప్రశస్తపాదులు పదార్థముల తత్వజ్ఞానమే మోక్షకారణమని వచించుచు, 'తచ్చ ఈశ్వరనోదనాభివ్యక్తాత్ ధర్మాదేవ' — ఆతత్వజ్ఞానము ఈశ్వరప్రేరిత ధర్మమునుండి జనించునది అని నుడివినారు. మూలసూత్రముల 'ధర్మవిశేషప్రసూత' అని మాత్రమే చెప్పబడినది. ఇచ్చటి ధర్మశబ్దమున కర్థము నిష్కామకర్మమై యుండెనోపును.

ప్రశస్తపాదులు పరమాణుప్రసంగ సందర్భమున గూడ ఈశ్వరునిమాట తలపెట్టినారు. కాని మూలసూత్రముల నిద్దానికి తావు కన్పడదు. కణాదుని సిద్ధాంతము, అణువులు సత్తు, నిత్యములు, అస్పృష్టములు. ఘటపటాదుల కారణములివియే. వీటి కింకొక కారణము లేదు. ఉత్పత్తిలేదు వినాశములేదు. ఇట్టి రెండు పరమాణువుల సంయోగమున ద్వ్యణుకమ్ జన్మించును. కొన్ని ద్వ్యణుకములు కలసి త్రసరేణు వుత్పన్నమగును. ఇట్లే క్రమముగా స్థూలపదార్థము లేర్పడును.

ప్రశస్తపాదుని సిద్ధాంతము: మహేశ్వరునకు సంహారేచ్ఛ జనించినప్పుడు పరమాణుపుంజ సంఘాతమున జనించిన శరీరేంద్రియాదులు క్రమముగా విశ్లిష్టమై, వినష్టమై పోవును. అప్పుడు చతుర్విధ పరమాణువులు మాత్రమే మిగిలియుండును. ప్రళయానంతరము జీవుని భోగాదృష్టముల పూరణకై మహేశ్వరునకు మరల సృష్టినొనర్ప నిచ్ఛకలుగును. అప్పుడు మొట్టమొదట వాయుపరమాణువున అదృష్టవశతః స్పందనము కలుగును. అప్పుడు వాయుపరమాణువుల సంయోగమువలన వాయు వుత్పన్నమై ఆకాశమున ప్రవహించుచుండును. ఇట్లే తైజస, జలీయ, పార్థివ, పరమాణువులనుండి స్థూలభూతములు జన్మించును. తరువాత మహేశ్వరుని సంకల్పవశమున బ్రహ్మాండము సృష్టమగును. బ్రహ్మ కూడ ఉద్భవించి మిగిలినసృష్టినొనర్చును.

ఇయ్యది ప్రశస్తపాదుల సిద్ధాంతమని పైనుడివియుంటిమి. మూలసూత్రముల దీనికి తగు ఇంగితమేమియు కన్పట్టదు.

వైశేషికులు సన్న్యాసము, యోగాభ్యాసము, సమాధులను సాధనాంగములుగ గ్రహించిరి.



# నవలారత్నం

వెంపటి నాగభూషణం

౧

ఆ సాయంత్రం క్లబ్బునుంచి యింటికి తిరిగివచ్చి, రాకెట్ బల్లమీదపెట్టి సుస్తులువిడుస్తూ, అప్పుడే గదిలోకి వచ్చిన చిన్నీతో అన్నాను— "ఘట్టమైన తీర్మానం చేసుకున్నాం, చిన్నీ, యీవేళ. చెప్తే ఆశ్చర్యబోతావు." అని.

నావంక టక్కరుగా చూస్తూ— "ఎందు కాశ్చర్యబోతాను. మీ "ఇచ్ఛాజీవుల" వెర్రివేషాలకు అలవాటుపడ్డదాన్నేగా......ఏమిటి తీర్మానం?—వే పార్టీనిసరించేగా?" అన్నది చిన్నీ. ఇచ్ఛాజీవుల్ని గూర్చి తరుచు చిన్నీ చేసే హేళనకు, హాసానికి అల వాటుపడ్డ నాకు చీకాకుకల్గలేదు. ఓవినయమైన నూతనో త్సాహంతో చెప్పాను. "కాదు, చిన్నీ ... అంతా అంటున్నారు, 'ఇచ్ఛాజీవులు' వ్యర్థజీవులని...అం చేత మాశక్తిసామర్థ్యాలు లోకానికి వెల్లడి అయ్యే టట్టుగా, ఓపని చెయ్యడానికి నిశ్చయించుకున్నాం..."

"అందరూకలిసి ఓమారు అన్నివీధులకుండాను వూరేగుతారా?" అని అడ్డంవచ్చింది...

"...కాదు, చిన్నీ, విను. మా పేరు, మా ఆశ యాలు, మా ఊహలు, మా స్వప్న-పరుసులూ- అన్నీ చిరస్థాయిగా వుండేటట్టుగా ఓనవలని రచించడానికి తీర్మానించుకున్నాం...శాశ్వతంగా- ఆచంద్రతారా ర్కంగా......"

"........వంశాభివృద్ధిరస్తు."

"మా 'ఇచ్ఛాజీవుల' నామసంకీర్తనం- జరిగి పోవాలి!"

"..............తత్వాలువ్రాసిన బ్రహ్మంగారి మోస్తరు!"

"........నువ్వేమన్నా అనుకో..........అల్లాజరిగితీ - లి..........అల్లాంటి వలను తయారు జేస్తాం! ఏమనుకొన్నావో!"

"............ఈపని యిదివరకే చేసివుండాలి సిందె."

"సరే, బాగుంది..........సామెతచెప్పినట్టు కల్యాణఘడియరావద్దూ దేనికైనా?"

"అయితే, యిహకైమంతా దాన్నివ్రాయడం- దిద్దడంతోనే సరిపోతుందన్నమాట."

"ఉఁహు, నాకొక్కడికేగాదు శ్రమంతా."

"నాకూడా పంచుతారాయేం కొంపదీసి?"

"ఉఁహు...నేను, శాస్త్రి, చౌదరి, కౌండిన్య- నలుగురంకలిసి వ్రాస్తాం నవలని...."

"ఒక్కరు సాధిస్తేచాలదూ- లోకాన్ని హత్య చెయ్యడానికి...నలుగురి చేతులూ ఎందుకూ?..."

"కాదు, చిన్నీ...అందులో గమ్మత్తుఉంది... మామూలు నవలలో మోస్తరు ఒక్కరి భావాలే గాకుండా- నలుగురి అభిప్రాయాలూ, ఆవేశం, శక్తి- కలిసి ప్రచండంగా ప్రదర్శింపబడ్తాయి..."

"మైసూరు కూట్ మోస్తరు- ఓ చౌ చౌ సిద్ధం జేస్తారన్నమాట."

"...ఏమన్నా అనుకో...జరుగబోయేదదీ... అంతాపూర్తి అయింతర్వాత నీకే తెలుస్తుంది దాని గొప్పతనం..."

"...పూర్తికావడ మెందుకు...ఇప్పుడే తెలుసు పర్యవసానం ఎల్లా పరిణమిస్తుందో-జీవితంలో సిసలైన అనుభవంలేని నలుగురు కొక్కిరాయలుజేరి- అయ్యవా ర్లంగార్ని చెయ్యబోతే..."

"అనుభవం కావాలా ఏం ప్రతిదానికీ... మా ఊహాపటిమ చాలు... ఎందుకు ముందుగా వాదన! నువ్వే మాస్తావుగా... త్వరగానే నెరవేరుస్తాం..."

"తొమ్మిది నెలలూ నిండకుండానే, ఘరుడు?"

"చాల్లెస్తూ, నేర్చుకున్నావు మాటలు... చేసే వాటిల్లో సహాయపడ్డం పోయి- అడ్డదిడ్డం మాటలు "

"పోనీండి... అంతయిష్టం లేకపోతే- 'ఇచ్ఛా జీవుల' లిస్టులోంచి నా పేరు కొట్టెయ్యండీ."

"అసలు నిన్నందులో జేర్చుకొం దెవరు?"

"రక్షించారు... అయితే నవల పేరేమిటి?"

"ఇప్పుడేం చెప్పగలను... నలుగురం కలసి అన్ని విషయాలు అనుకోవాలి..."

"... అయితే, ఎప్పుడు భారసాల?..."

"ఊరొక్కటంటూ...... తెలివంతా వెళ్ళబుచ్చుతున్నావ్... భోజనం తయారైతే వడ్డించమని చెప్ప వంటమనిషితో..."

"... నవలా ఉత్సాహంలో ఆకలిమాట మరపున పడ్డదేమో ననుకున్నా... వంటఅయి ఎంతసేపో అయింది... మీరు రావడమే ఆలస్యం..." అని నిష్క్రమించింది చిన్ని... "అజ్ఞాతకవి" రచించిన "కిరణావళి" గీతాన్నొకటి సాగదీస్తూ:—

రావోయి రావోయి రతివాల మొలకా
ఈవలపు దాటగా నేనేరనోయి...
మోసమని తెలియకే
చేసన్న నిజమనీ
ఆసపడినాను గద,—
ఈసారి కైనాను ......
ఏమి తెలియని వయసు
నీమీద నే మనసు
జామైన నినుబాయ
జాలనని దయయుంచి ...

* * * *

౨

నిర్ణయించుకున్నట్లుగా, మర్నాడు సాయంత్రం- అయిదుగంటలకి- నేను, చౌదరి, శాస్త్రి, కాంతిశ్య, శర్మ- కాలువ రొడ్డున కలుసుకున్నాం... ఆ 'నిరుపమానిస్థలం' లో- రమణీప్రియ ఎవరూ నాతిక తెచ్చియివ్వడానికి లేకపోయినా,- 'ఆత్మకింపయిన' ఓ నీళ్ళతో, ఉత్సాహానే ఉయ్యాలలో ఊగుతూ- నవలారచనకు ప్లాను వేసి- "రఘ్జులూహ తెలియంగల పాకశోత్తమల్" మీద ఓ బహోత్రంపమైన గ్రంథాన్ని విసిరి వెయ్యాలని సంకల్పం.

డి. పెషన్ సర్దార్ శర్మ మా మీటింగులు జరుగుతూన్నంతకాలం సెక్రటరీ. పెద్దప్యాసుల్లో టీ, ఓటిరెండు గోల్డుఫ్లేక్ సిగరెట్టు టిన్‌లు పట్టుకు రావడం, ప్రతి మీటింగులోను మేంచేసిన తీర్మానాలను ఓపుస్తకంలో వ్రాయడం అతనిపని. శర్మకు అల్లాంటి పనంటే సరదా. అంతకుమించిన ఆశయాలూ లేవు మాకు మద్దతుకు పనికివచ్చిన మనిషి...

ముందుగా నలుగురం తలో కప్పు టీ సేవించి, తలో సిగరెట్టు ముట్టించి, వలయాకృతిగా కూర్చున్నాం కర్తవ్యానికి ఉపక్రమించడానికి. కాగితం, కలం సిద్ధం జేసుకొని శర్మ ఆరంభప్రార్థన చేశాడు.

పరిత్రాణాయ షేనార్టస్
వినాశాయచ జోకులకుం,
జీజాతిన్ స్థాపనార్థాయ
సంభవామి యుగే యుగే!

ఆహుపారు వాతావరణంలో, నడుములు బిగించి చేతులు జాడించి, ఊహాలువిప్పి, తయారైనాం.

"ముందుగా ప్లాట్, అదే, కథావిధానాన్ని స్థిరపరచుకొని, తర్వాతకాండ తర్వాత ఆలోచిద్దాం. అది మంచిదని తోస్తుంది" అన్నాడు శాస్త్రి నవలా ధోరణి సూచిస్తూ...

"దివ్యమైన సలహా... ఏఏ విషయాలు రావాలో వ్రాయడంలో, బాక్‌గ్రౌండు ఎలావుండాలో, పురాణ

లాగు పాడుతూ ఆడుతూ వచ్చి గౌతమీ ప్రవాహములో లీనమైపోయే సెలయేళ్లూ, ఆయేళ్ళ ప్రక్కల గోధుమతాచుకుబుసాలు పరచినట్లు ఏజాడా అంటని ఇసుకతిన్నెలూ, ఆ దిబ్బల పక్కనే మనుష్యహస్తమంటకుండా పెరిగిన అరటి, కమలా, మామిడి మొదలైన పండ్లచెట్లూ, ఆ చెట్లమీదుగా మెల్లిమెల్లిగా గాలిలో తేలి కొండ శిఖరాలకు ఎగబాకిపోయే తెల్లి పొగమబ్బులూ, నెమళ్ల కేకలూ, ఈలకోళ్ల కూతలూ, నీటిపిట్టల కలకలారావాలూ, వెదురుపొదల సంగీతాలూ, కొండలనీడలూ, చెట్లనీడలూ పడి నీలిమ తేరుతూ చప్పుళ్లేని కొండచిలువలాగు మెల్లిగా సాగుతున్న నదీప్రవాహమూ, ఆ ప్రవాహములో ఈదులాడుతూనో, గాలము వేసి చేపలుపడుతూనో వచ్చిపోయే పడవల కేసి వేడిచూపులతో బెచ్చిబెచ్చి చూస్తూ ఉండే సిగ్గెరగని కోయపడుచులూ, నీరు తాగుతున్న వనగజాలలాగు నీటి అంచుల కానుకోని నలుపుదేరి ఉన్న బండరాళ్లకు కొట్టుకోని భగ్నమైపోయే కెరటాలూ అతని మనోదేహాలను పులకరింపజేస్తవి సృష్టిలోని వైచిత్ర్యమూ, అకృత్రిమ సౌందర్యమూ చూస్తూ ఆనదీవక్షాన ప్రయాణము చేస్తున్నప్పుడతనికి జరిగిపోయిన గాథలెన్నో జ్ఞాపకమువచ్చి ఒకవిధమైన పారవశ్యాన్ని కలిగిస్తవి. అందుకే భార్య కిష్టము లేకపోయినా అత డీనదిమీది షికారు మానలేకుండా ఉన్నాడు.

ఇల్లస్ట్రేటెడ్ వీక్లీలో వేటను గురించి వ్రాసిన వ్యాసము చదువుతున్నాడుమాపతి. ఆకులూ, వక్కలూ చేతబట్టుకోని అతని భార్య వచ్చి పక్కన నిలబడి "ఏమిటి చదువుతున్నా"రని అడిగింది.

అతడు నవ్వుతూ "ఇదిగో చూడు" అని ఆ పత్రిక ఆమె కళ్లముందు పట్టి చూపించాడు.

"మృగాలూ, పక్షులూ కనబడుతున్నవి. ఇదేదైనా వేటను గురించి వ్రాసిందా" అని అంటూ వక్కలు నోటి కందించిందామె.

వక్కలు కొరుకుతూ అతడు "అవును. ఒక దొర దక్షిణాఫ్రికాలోని తన వేట అనుభవాలను వ్రాశాడు. వ్యాసము చాలా ఉత్సాహకరముగా ఉంటే చదువుతున్నాను" అన్నాడు.

ఈ మాటతో కలకల్లాడుతూ ఉన్న ఆమెముఖము ఒక విధమైన అప్రసన్నతతో చిన్నపోయింది. ఇటువంటిపుస్తకాలు చదివితే తన భర్తకు వేటమీద మనసుపుడుతుందని ఆమెభయము.

లక్ష్మీదేవిహృదయము అతికోమలము. కవిత్వానికి ఛందస్సెటువంటిదో ఆమెహృదయానికి కోమలత్వ మటువంటిది. కావ్యప్రపంచములోని మాధుర్యమంజులతలు పడుగుపేకలుగా నేసిన నేత ఆమె మనస్సు. ఆ నేతలోని సౌకుమార్యమూ, వనితనమూ ఆమె ప్రతిమాటలో స్ఫురిస్తూ ఉంటుంది. ఆకంఠ

స్వరము చెవిబడ్డప్పుడు ఎట్టి శ్రోతమనసులో నైనా సరే ఒకవిధమైన ఆనందమూ, తృప్తీ వికసిస్తవి. ఇక భర్తమాట చెప్పేదేమిటి? నిజముగా ఆమె అశోకుని కాలములో ఉండవలసినదే గాని హింసాచ్ఛాయలలో బ్రతుకుతున్న ఈనాటి ప్రపంచములో ఉండవలసినది కాదు. ఏప్రాణి కష్టపడడము చూచినా ఆమె మనస్సు బాధపడుతుంది. మాంసపుకూర ముట్టుకోవడానికి కూడా సాహసించని ఆమె మనస్సు ఉమాపతికి తెలియనిదికాదు. అందుచేతనే అతడామెమనస్సుకు నొప్పి కలిగే మాటగాని, పనిగాని తలపెట్టడు. తన భార్య ఇటువంటి దనుకోవడమే అతనికి ఎంతో గర్వము. అతనిప్రాణాని కామె వేయిరేకుల తామరపై కొలువున్న విశ్వమాత. ఆమె ముఖము అప్రసన్నమైతే అతని గర్వ శిఖరానికి పెద్ద దెబ్బ తగుల్తుంది. అందువల్ల అతడు అనుక్షణమూ ఆమెహృదయానికి ఆహ్లాదము కలిగించడానికే యత్నిస్తాడు.

వేటమాట చెవి బడగానే ఆమెముఖాన పొడగట్టిన భయము కనిపెట్టి అతడామెమనస్సుకు ఉల్లాసము కల్పించవలెనని ఆమె చేతిలోని ఆకులు తీసుకొని నమలుతూ, లేచి ఆమె భుజముపై చేయివేసి నెమ్మదిగా కిటికీదగ్గరికి చేర్చి "చూడు ! ఎంత అందముగా ఉన్నదో" అని బయట చూపుతూ అన్నాడు.

నిజముగా బయట శరదుత్సవము సాగినది. విభావరీ లక్ష్మి తన జ్యోత్స్నా నృత్యముతో సృష్టిని పరవశము చేస్తున్నది. పచ్చని చెట్ల ఆకుజొంపాలమీద, మలిమంచున చెమ్మగిలిన పూలరేకులపైన, మింట తునక తునకలై గుంపు గుంపులై రకరకాల పొడవులతో, చందమామను పట్టుకొనడానికిలాగు విచ్చలవిడి పరువెత్తుతున్న మబ్బులమీద సౌందర్యదేవత ఊర్పుల కమ్మదనము చక్కగా అలలువారిపోతున్నది.

ఈ దృశ్యమువల్ల, భర్తృసుఖస్పర్శవల్ల ఆమె మనస్సు కలతదేరి వికాసము వహించింది. ఉమాపతి ఉద్వేగరహితముగా ఆమె ఎడమచేతిని తన రెండు చేతులతో పట్టుకొని "లక్ష్మీ" అని రెప్పవేయకుండా ముఖము చూస్తూ అన్నాడు.

సమీపాన ఉన్న చెట్లలోనుంచి పక్షి ఏదో కూసినది. వెన్నెలవెల్లిలో ఈదుకొంటూ వచ్చి ఆ మధురకూజితము ఆశరద్రాత్రితోపాటు ఆ దంపతుల హృదయాలను పులకింపజేసింది.

లక్ష్మి నవ్వుతూ "విన్నారా?" అన్నది.

అతడు "అది రోజూ కూసేపక్షే. ఈవేళ దానికూత ఇంత మధురముగా ఉండడానికి కారణము నీ మహిమో, వెన్నెలమహిమో మరి !"అన్నాడు. కొంచెము ముఖముచిట్లిస్తూ "మీ కొంటిమాటల కేమిగాని అంత శ్రావ్యముగా కూస్తూ ఆనందపెట్టే నిరపరాధిపక్షులను తుపాకితో కాల్చి చంపడానికి మీకు మనసెట్లా పుట్టుతుంది చెప్పండి" అన్నదామె. ఆ మాటకు జవాబేమీ చెప్పలేక అతడు

తన మనస్సులో "వేటలో ఉన్న మజా, ఆనందమూ వేటకాళ్లకు తప్ప ఇతరులకెల్లా తెలుస్తుంది? అందులో ఆడవాళ్లకు బొత్తిగా అర్థముకాదు" అని అనుకొన్నాడు.

ఉమాపతి ఏది మరిపించడానికి యత్నము చేశాడో దాని ప్రసంగమే వచ్చి పడింది వెంటనే అతడు మరి మాటాడలేక "అబ్బా! నిద్ర వస్తున్నది" అని ఆవలించాడు.

"మీ మనసులో దయాదాక్షిణ్యాలు లేవు కాబోలు! పక్షులు ఎంత చక్కనివి. ఎంత తియ్యగా కూస్తవవి. అటువంటి అమాయికపు జీవాలను గుండ్లువేసి కాల్చి చంపే వాళ్లు——"

ఆమె మాట పూర్తికాకుండానే ఉమాపతి "అవి నీకంటె చక్కనివా? నీమాటల కంటె వాటిమాటలుతియ్యనివా?" అన్నాడు.

ఆమె నవ్వుతూ "అయితేచక్కదనాన్నీ, తియ్యదనాన్నీ కాల్చి చంపితేగాని——"

"ఛీ ఛీ-నీవు నా హృదయ పంజరశుకివి లక్ష్మీ!" అని రెండు చేతులతో పట్టుకోని ఆమె ముఖము తనముఖము దగ్గరికి తెచ్చుకోని ఆమె కళ్లలో కళ్లు గుచ్చి చూస్తూ "ఇటువంటి తలంపులు నీ మనస్సులోకి రానీయకు. వెళ్లి పడుకో. చాలా రాత్రి అయింది. నేను పెందలకడనే లేవవలసి ఉన్నది" అన్నాడు.

ఆమె ఒక నిట్టూర్పువిడిచి ఇంట్లోకి వెళ్లిపోయింది.

'పెందలకడనే లేవాలి'. అని ఉమాపతి అనడానికి కారణమున్నది. ప్రొద్దుటనే వేటకు వెళ్లడానికి బోటు సిద్ధము చేయుమని సాయంకాలమే సరంగుతో చెప్పాడతడు.

వేటసన్నాహము పూర్తిఅయింది. బోటులోనే భోజనము చేయడానికి ఏర్పాటు అయింది కావలసిన వంటసామగ్రితో వంటమనిషి రామచంద్రుడు ప్రొద్దున్నే బోటులోకి వెళ్లిపోయాడు. చలిదిఅన్నాలు తిని కళాసులూ, సరంగూ రేవులోకి వెళ్లినారు. ఉమాపతి స్నానముచేసి, వేటకు తగినవేషము వేసుకొని కాఫీత్రాగడానికి లోపలికి వెళ్లాడు. కాఫీత్రాగి మళ్లా తనపడకగదిలోనికి వచ్చాడు. అక్కడ అతనికి ముఖము చిన్నపుచ్చుకొని నిలుచున్నలక్ష్మి కనబడింది. మిలమిల మెరుస్తున్న ఆమెకాతరదృష్టులు అతనిని అడుగుసాగనీయలేదు. వెంటనే అతడు ఆమె దగ్గరికివెళ్లి "ఎందుకు అలా ఉన్నావు?" అన్నాడు. గుడ్లనీరు గుక్కుకుంటూ ఆమె అతనివైపుచూచి "బ్రతిమాలుకుంటాను. ఈ వేళ ఈపాడువేట మానివేయండి. నామనసు బాగాలేదు. రాత్రిపాడుకలలతో తెల్లవారింది" అని అతనిచేయిపట్టుకొని అన్నది.

అతడు చిన్ననవ్వునవ్వుతూ "ఆరోజు ఎవడోసన్యాసివచ్చి ఏవోపాడుమాటలుచెప్పిన దగ్గరనుంచి నీకు భయము ఎక్కువయింది. ముష్టికోసము నోటికి వచ్చినట్లల్లాపేలే సన్యాసులమాటలు విని మనసు పాడుచేసుకుంటే ఎలాచెప్పు?" అన్నాడు.

"సన్యాసిమాటలు కాదు" అని ఆమె అతనివక్షమున ముఖము ఉంచి వెక్కి వెక్కి ఏడుస్తూ "భయము కాదు. నిజముగానే ఈ రోజు మిమ్మల్ని విడిచిపెడితే ఇక మళ్లా మిమ్మల్ని చూడనేచూడనని నామనసు చెపుతున్నది. కలకూడా ఆలాగే వచ్చింది" అని అన్నది.

"అయితే చూడు. నీవుకూడా నావెంట రా. నేను అమ్మతో చెప్పివస్తాను."

"ఇప్పుడు నన్ను పడవమీద తీసుకొని వెళ్లడానికి మీ అమ్మ ఒప్పుకుంటుందా? అసలు పడవప్రయాణము పనికిరాదు" అని ఆమె నేలచూస్తూ అన్నది.

ఉమాపతి ఉలికిపడ్డట్టు అయి నవ్వుతూ ఆమెను తనహృదయముమీద చేర్చుకొని, మెల్లగా తనచేతితో నెలలునిండినగర్భము నిమురుతూ "నిజమే. నీవు పడవమీదరావడమునకు నేనుమాత్రము ఎట్లా సమ్మతిస్తాను? చూడు. దీపాలుపెట్టకముందే వచ్చివాలుతాను నీదగ్గర. నీకేమీ భయములేదు. పిచ్చిపిచ్చి ఊహాలు ఊహించకు" అని కళ్లుతుడుస్తూ ఆమెరెండుచేతులు తనభుజాలపై వేసుకొని ఒక్కముద్దు పెట్టుకొన్నాడు. ఆమెకు మరి మాటాడడమునకు అవకాశము లేకపోయింది. ఉమాపతి బోటున్నరేవుకు బయలుదేరి వెళ్లాడు.

లక్ష్మీదేవి కడుపునొక్కినట్లయి ఒక్క పెద్దనిట్టూర్పు విడిచింది.

గోదావరీమహాప్రవాహముమీద పడవ తేలిపోతున్నది. తెరచాప ఎత్తారు గాని వాలుగా ఉండడమువల్ల తెడ్లువేయవలసిన అవసరములేక కళాసులు ఒకచోట కూర్చొని సంసారకష్టసుఖాలు చెప్పుకొంటున్నారు.

శ్రావణభాద్రపదాలలో, రక్తచందనము పూసుకొన్న వీరాంగనవలె మానవులకు భయంకరమూర్తియై కనిపించే గోదావరి నడుకార్తీకమున నర్తకివలె ఆడుతూపాడుతూ సాగుతున్నది. ప్రవాహమున సుళ్లులేవు, పెద్దపెద్దకెరటాలులేవు. చుట్టచుట్టుకొన్న కోడెత్రాచులవంటి నురుగుపొంగులులేవు. కేవలము శాంతమూర్తివలె చిరుతరంగాల జలజలారావముతో మనస్సును పులకరింపజేస్తున్నది.

బాలాతపము నదీవక్షాన సౌందర్యజాలము పన్నుతున్నది. ఒడ్డున ప్రాకుల క్రింది బండరాళ్లమీద మహామునులలాగు కొంగలు దొంగజపము చేస్తున్నవి. కొన్ని చిన్నిచిన్ని నీటిపిట్టలు కిలాకిలా రావాలతో ఎగిరిపోతున్నవి.

గట్లమీద పొట్టవెళ్లనిజొన్నచేలు గాలితరగలకు వాలితేలుతూ సస్యలక్ష్మికి వింజామర వీస్తున్నట్లున్నవి. ఉమాపతి పడవలో కూర్చొని గట్టువంక చూస్తున్నాడు. లక్ష్మీదేవి విడిచిన నిట్టూర్పుగాలి ఇప్పటికీ అతనిహృదయాన్ని చలింపజేస్తున్నది కాబోలు!!

కాంతిపూర్ణమైన నీలాకాశము నదీప్రవాహములో ఖండఖండములై ప్రతిబింబిస్తున్నది.

గట్టున ఉన్న పెద్దమ్రాకులనీడలు తరంగాల తోపాటు నదీగర్భమున పాకులాడుతూ ముడుచుకొంటూ ఒకవింతదృశ్యాన్ని సృష్టి స్తున్నవి. నీటిప్రబ్బలిపొదలు ప్రవాహాన్ని అనుసరించి వంగిలేస్తూ నదీదేవతకు నమస్క రిస్తున్నట్లు కనబడుతున్నవి. గాలిపోసుకొన్న వెదురుపొదల లోనుంచి వచ్చే కలనాదాలకు ఈలకోళ్లు శ్రుతివేస్తున్నవి. ఈదృశ్యాలుగాని, ఈసౌందర్యముగాని ఉమాపతికి హృదయా కర్షకములు కాలేదు. వేటకోసము నదిమీద బయలుదేరినప్పుడెల్ల సౌందర్యముగ్ధమై పార వశ్యమును అనుభవించే అతనిమనస్సులో ఈవేళ తెలియని అలజడి ఏదో కలుగు తున్నది.

ఎండలో చురుకు ఎక్కువవుతున్నది. ఉమాపతి 'రిస్టువాచి' చూచి పదిగంటలయిం దనుకొని 'చంద్రూ' అని పిలిచాడు.

రామచంద్రయ్య 'బాబూ' అంటూవచ్చి నిలుచున్నాడు.

"వంట అయిందా?" అని అడుగుతూ కాలుస్తున్న సిగరెట్టు నీటిలో పారవేశాడు. అది 'చుయ్యి' మని ఆరి వెనకకు కొట్టుకో పోయింది.

"అయినట్టే. 'పోచారం' రావడము తోనే పడవ ఆపి భోజనము కానిచ్చుకోని మనము గట్టుచేరవచ్చు."

"సరే. మధ్యాహ్నము గాలి సరిగా ఉండకపోవచ్చు. ఎదురుకూడా. ఏలాగైనా ఇంటికి ఆరుదాటకుండా చేరాలి. ఆలస్యము కాగూడదు. మధ్యాహ్నానికి కావలసిన 'టిఫిన్' వగైరా ఇప్పుడే తయారుచేసుకో" అని ఉమాపతి పెట్టెతీసి తుపాకి చేతితో పుచ్చుకొన్నాడు. గుండెతోపాటు అతని చేయి వణికింది ఎందుచేతనో—అనాడు.

హింసాత్మకమైన వేటలోకూడా ఒకవిధ మైన రసానుభూతి ఉన్నది. ఆ ఆనందరసానికి ఈవేపథువు సాత్వికచేష్టకాబోలు!! కవులు వర్ణించకపోయినా, లక్షణవేత్తలు నిర్వచించక పోయినా, ఈఉల్లాసమును ఆనందమని చెప్పడ మునకు భయమెందుకు మనకు?

ఉమాపతి తుపాకిసరిచేసి అదీఇదీ తుడిచి ఒకసారి గుఱ్ఱము నొక్కిచూచి, మరల పెట్టెలో పెట్టాడు. తూటాలసంచి బయటికి తీసిపెట్టాడు. ఇంతలో చంద్రువచ్చి "బాబూ! పోచారం వచ్చాము. పడవ రేవుకు పట్టవలసిం దని చెప్పాను. భోజనము సిద్ధముచేశాను. దయచేయండి" అని చెప్పాడు.

"అచ్ఛా" అంటూ ఉమాపతి భోజ నానికి వెళ్లాడు.

భోజనముకాగానే తుపాకీ, తూటాల సంచి, కొట్టినపక్షులను వేసేసంచి తీసి, తుపాకి తాను పట్టుకొని, తక్కినవి చంద్రుచేతి కిచ్చి ఉమాపతి పడవ దిగి గట్టువెంటనే బయలు దేరాడు.

ఇదివరకు ఎండవేళలో పక్షులు గుంపులు గుంపులుగా చెట్లమీద ఉండేవి. కొన్నిపిట్టలు

ఈగట్టునుంచి ఆగట్టుకుపైన ఎగిరిపోతుండేవి. కాని ఆశ్చర్యము! ఆవేళ వేటకు తగిన పక్షి ఒక్కటైనా కాన్పించడములేదు. పక్షికులము ఏమయింది? ఇంద్రజాలమా, లేక ఏదైనా మంత్రప్రభావమా అనుకొన్నాడు ఉమాపతి. ఏసమయములోనైనా పని సరిగా అనుకొన్నట్లు జరగకపోతే కొంతమందికి విసుగుపుడుతుంది. కొంతమందికి విఘ్నము వచ్చినకొద్దీ ఉత్సాహ మెక్కువవుతుంది. వేటకూడా జూదమువంటిదేకదూ! ప్రయత్నము వ్యర్థమైనకొద్దీ ఉమాపతికి ఉత్సాహము, పట్టుదలా ఎక్కువవుతున్నవి ఏలాగైనా ఏవోకొన్నిపక్షులను కొట్టకుండా తిరిగివెళ్లే ప్రకృతికాదు అతనిది.

మూడుగంటలయింది పొద్దు వాలిపోతున్నది. ఎండవేడి కొంచెము కొంచెము తగ్గిపోతున్నది. ఆకాశాన ఒకమబ్బుతునకైనాలేదు. పోచారముదగ్గర నదీతీరభూమి అరణ్యమయము. నదీప్రవాహానికిలంటే పెద్ద పర్వత మున్నది. ఆపర్వతము చరియల్లో కోయలు పోళ్లు చల్లారు. జొన్నపైరు బాగా పెరిగిఉన్నది. దూరాన విప్పపూవు లేరుతున్న కోయపడుచుల 'రేలపాటలు' సన్న సన్నగా వినబడుతున్నవి. రాళ్లను ఒరుసుకుంటూ నదీప్రవాహము చప్పుడుచేస్తూ పోతున్నది. ఉమాపతి తుపాకి బుజము మీద పెట్టుకొని చెట్లమీదనూ, పొదలనూ పరికించిచూస్తూ ముందుకు వెళ్లుతున్నాడు. వేటకువచ్చి కొట్టడానికి ఏమీ దొరకనప్పుడు వేటకానిమనస్సు ఏలాగుంటుందో! వ్యర్థమవుతున్నదిగదా అని ప్రయత్నము మానివేయడము వేటకానిలక్షణము కాదు. అయినా 'రిష్టువాచి' చూచి 'నాలుగుకావచ్చింది. ఇక ఆలస్యముకాగూడదు' అనుకొని ఉమాపతి నలుదిక్కులా వెదకడ మారంభించాడు.

గట్టుకు కొంచెముదూరములో అంత ఎత్తుగాలేని చెట్టుకొమ్మమీద కలిసికూర్చున్న రెండుపక్షులు ఉమాపతికంట బడినవి.

అది జక్కవజంట. కావ్యప్రపంచములో దాంపత్యప్రణయమును వర్ణించేటప్పుడు ఏకవీ ఈజక్కవజంటలను స్మరించకుండా ఉండలేదు. సూర్యాస్తమయము కాబోతున్నది. రాబోయే వియోగమునుగూర్చి, ఆజంట మాట్లాడుకుంటూ, ఒకదానినొకటి ఓదార్చుతున్నదో, ఏమో! అప్పుడప్పుడు రెక్కలార్చుతూ ముక్కులు కలుపుకొని అవ్యక్తాలాపము చేస్తున్నది. మనుష్యుని అలికిడి వినే స్థితిలో లేదుకాబోలు ఆజంట.

చంద్రుడు ఇంకా వెనకనే ఉన్నాడు. ఉమాపతి మెల్లగా ఒకపొద చాటుచేసుకొని ఆ పిట్టలను గురిచూచాడు.

తుపాకిగుఱ్ఱము టక్కుమన్నది. పెద్ద మోత బయలుదేరి ఉఱుమువలె రాళ్లగుప్పల మీదుగా కొండచరియను మారుమ్రోగిస్తూ పరుగెత్తిపోయింది. గొట్టములోనుంచి సన్న పొగ వచ్చింది. పిట్టపడిన చిన్నచప్పుడు వినవచ్చింది. ఒకపిట్ట కాతరధ్వనితో పైకి ఎగి

రింది. ఆపక్షి ఆర్తధ్వనితో మళ్లా కొండ ప్రదేశము ఒకమారు కలగిపోయింది.

అటువంటి జాలిగొలిపేకూత ఉమాపతి ఇదివర కెన్నడూ వినలేదు. అతని హృత్పిండము కలుక్కుమన్నది. చీత్కారముచేస్తూ ఆకాశాన తిరుగుతున్న ఆపక్షి కేసి అదేపనిగా చూడడము మొదలుపెట్టాడు.

ఇంతలో చంద్రు వచ్చి "పక్షి పడ్డది పక్షి పడ్డది" అంటూ ఆచెట్టుకిందికి పరుగెత్తి నెత్తురోడుతున్న పక్షిమెడ పట్టుకొని పైకెత్తాడు.

పూర్వ మొకప్పుడు తమసాతీరాన వియోగకాతరమైన పక్షియేడ్పు మహాముని వాల్మీకిచెవిని పడింది. రామాయణకావ్యముతోపాటు, ఆపక్షియేడ్పు నేటికీ మానవజాతి హృదయమును స్పృశిస్తూనేఉన్నది. మానవుల యేడ్పుకంటె పక్షియేడ్పు తక్కువదా ?

తనప్రియురాలిని కోల్పోయిన చక్రవాకము కరుణమయమైన తనవిలాపముతో సమస్తాకాశతలమును నింపివేస్తున్నది. ఇటువంటి పక్షిశోకము ఉమాపతిచెవిని ఎన్నడూ పడలేదు. కాని వాల్మీకిహృదయమును ద్రవింపజేసిన క్రౌంచవిలాపముసంగతి హఠాత్తుగా అతనిమనసులో తోచింది. ఆసంగతి జ్ఞప్తికిరావడముతోనే అతనిమనస్సులో అతనికే తనచర్యమీద అసహ్యము వేసింది. దుస్సహమైన తనశోకముతో ఆచక్రవాకము మానవహృదయానికి ఎన్నడెరుగని యాతన కలిగించింది.

పక్షికళేబరమును చేతితో పట్టుకొన్న చంద్రునుచూచి "ఆపిట్టను అక్కడేఉంచు - ముట్టుకోవద్దు" అనిచెప్పి, తుపాకి వీపున తగిలించుకొని ఉమాపతి ఆపక్షివిలాపము వినలేక చెవులుమూసుకొని గబగబ పడవవైపు బయలుదేరాడు.

ఆకళేబరము చెట్టుకిందనే పడిఉన్నది. ఆమగపక్షివిలాపధ్వని, దానితోపాటు ఆచెట్టు చుట్టూ ఆకాశాన సుళ్లు తిరుగుతున్నది. హృద్భేదకమైన దానిఏడ్పు వాయుమండలమునుగూడా కరుణమయము చేసివేస్తున్నది.

ఉమాపతివాలకము చంద్రుకు అర్థము కాలేదు. సామాన్యమైనపక్షిచావు ఉమాపతి హృదయమును ఎందుకు కలతపెట్టుతున్నదో అర్థముచేసుకొనేశక్తి వాడికిలేదు.

మానవకాఠిన్యమువల్ల ప్రియురాలిని కోల్పోయిన ఆపేదపక్షిఏడ్పు వృద్ధగౌతమి ఓదార్పులతోకలిసి చెట్టుచెట్టుకు, పుట్టపుట్టకు గాలితరంగాలతోపాటు వ్యాపిస్తున్నది. ప్రతిదినమూ వియోగమును భరిస్తూ ఉన్న ఆపక్షికి ఎందరుసూర్యులుదయించినా మరి సంయోగమన్నమాటలేని నేటివియోగము జీవశక్తిమూలమును పెల్లగించివేస్తున్నది కాబోలు!!

పడవ ఇంటిమొగము పట్టింది. ఇల్లు చేరడమునకు ఉమాపతి ఎంతో ఆరాటపడుతున్నాడు. అతనిహెచ్చరికవల్ల కళాసులు శ్రమలెక్కచేయకుండా తెడ్లువేస్తున్నారు.

పొద్దు కుంకింది. చతుర్దశి వెన్నెల గౌతమీనదిపైన మిలమిలలాడుతూ, దూరాన ఉన్న వస్తువు కనబడకుండా ఒకసన్నని తెల్లని తెరతో సమస్తమును కప్పివేస్తున్నది. గౌతమీ తరంగాలనాదములో అడవిలోనుంచి వీతెంచుతున్న అవ్యక్తనాదములో, ఒకకరుణస్వరము తేలుతూవచ్చి ఉమాపతిచెవిలో ఏదో అశుభ సూచకమైనవార్తను ఊదుతున్నది. ఆజక్కవ యేడ్పు అతనికి మరుపురావడములేదు. ఆ యేడుపే అతనిలో మాటిమాటికి వ్యాపించి తలలో గిఱ్ఱునతిరుగుతూ, హృదయానికివచ్చి తగులుతున్నది. ప్రొద్దున బయలుదేరేటప్పుడు తనకంటబడిన లక్ష్మీదేవి చిన్నపోయినముఖము మాటిమాటికి మనసున ఆడుతున్నది. కన్నీటితో మిలమిలలాడుతున్న ఆమెకళ్లు పొడగట్టినపుడు, మరణయాతన అనుభవించేటప్పటి హతచక్రవాకి కనులు జ్ఞాపకమువస్తున్నవి. "నా ప్రాణానికి ప్రాణమైనలక్ష్మి వేటకువెళ్లవద్దనిచెప్పినమాట వినిఉంటే హృదయానికింత ఆవేదన లేకపోయి ఉండును. ఆమె నాకోసము ఎదురుచూస్తుంటుందికాబోలు!" అని మనసులో అనుకొన్నాడు ఉమాపతి. అందుచేతనే ఇంటికి చేరడానికి ఎన్నడూలేని ఆరాటము నేడతనికి కలుగుతున్నది. 'చంద్రూ ఎంతసేపటికి రేవుచేరగలము?' అని అడిగాడు ఉమాపతి. ఒక అరగంటలో చేరవచ్చు. దాదాపు వడ్డిగూడెముదగ్గరికి వచ్చాము" అన్నాడు చంద్రు. తెడ్లచప్పుడు వెన్నెలరాత్రిని కదిపివేస్తున్నది. విరహాకాతరమైన ఆజక్కవచిన్నిగొంతులోనుండి వెలువడే హాహాకారము ఇంత దూరానికికూడా తరుముకొనివచ్చి ఆకాశముతోపాటు ఉమాపతి ధైర్యశక్తినికూడా మింగివేస్తున్నది. అంత చిన్నపిట్టదేహములో ఇంతశక్తి, ఇంతప్రేమ ఎట్లా ఉన్నవో?

ఇంటికోసము ప్రాణ మెంతో తల్లడిస్తున్నది. రాత్రి తొమ్మిది కావచ్చింది. నిన్న రాత్రి ఈ వేళకే పక్షికూత వినవచ్చి లక్ష్మి అన్నమాట అతనికి జ్ఞాపకమువచ్చినవి పడవ శబరిమొగకు వచ్చింది. ఇంటికి దగ్గరవుతున్నకొద్ది ఉమాపతిఆరాటము హెచ్చిపోతున్నది. తల్లిమాట అతనికి స్ఫురణకు రావడమే లేదు. లక్ష్మి, తనలక్ష్మి, ఏమి చేస్తుంటుందో, తనమాట వినక బయలుదేరివచ్చానని ఎంత విచారపడుతున్నదో, ఆమె కిష్టము లేనిపని చేసి ప్రేమవిషయములో ఆమెకు సంశయము కల్గించడము మానివేయవలెను. ఈ వేటమీద మోజు తగ్గించుకోవలె. ఇక నాలక్ష్మిని విడిచి ఉండగూడదు. అని అతడు మనసులో నిశ్చయించుకొంటున్నాడు.

చంద్రు వచ్చి "పడవ రోడ్డురేవుకు వచ్చింది" అని చెప్పాడు.

వెంటనే ఉమాపతి ఒక్కదూకులో ఒడ్డుకుదూకి "సామ్మానూ, తుపాకీ నీవు వెనకనుంచి తీసుకొనిరా" అని చంద్రుతో చెప్పి రోడ్డు ఎక్కి ఇంటివైపు గబగబ నడిచిపోసాగినాడు.

కనపడుతున్నది ఆవెన్నెలలో ఇల్లు. ఇంటి ముందు అంతమందిజనము మూగి ఉన్నారెందుకు?

ఉమాపతిగుండె దడదడలాడింది. ఊపిరి బిగుసుకొనిపోతున్నది. వేళగానివేళ తన యింటికి ఈజనము రావడమునకు కారణ మేమిటో ఎవరినీ అడగడానికి అతనికి నోరు రాలేదు. ఆజనము ఇతన్ని చూచి తప్పు కొన్నారు. అక్కడున్నవాళ్ల మొగాన వికాస మన్నమాటలేదు. లోపలికిరాగానే సావడిలో ముఖము వంచుకొని గుమాస్తా కనబడ్డాడు. ఆ నివాలకము చూచి ఉమాపతికి ఆరాట మెక్కువయింది. అడుగుల చప్పుడు విని గుమాస్తా ఉలికిపడ్డట్టు ఉమాపతిని చూచి "వచ్చారా? త్వరగా లోపలికిపొండి. మూన వరముమునుంచి డాక్టరుగారు వచ్చి లోపల ఉన్నారు" అన్నాడు.

డాక్టరు రావలసిన అవసరమేమి వచ్చింది? తనభార్యకు నీళ్లాడపొద్దు లన్నమాట అతని కప్పుడు వెంటనే జ్ఞాపకము వచ్చింది. గబగబ లోపలిగదిదగ్గరికి వెళ్లాడు. లోపటి నుంచి సన్నని ఏడ్పు వినవస్తున్నది. ఆగది ముందే డాక్టరు నిలబడిఉన్నాడు ఉమాపతిని చూడడములోనే అతనిముఖము వెలవెల పోయింది. నెమ్మదిగా "వచ్చారా? కాని—" అని మరి మాట పెగిలిరాలే దతనికి.

ఉమాపతి గట్టిగా అతని చేయి పట్టు కొన్నాడు. ఆ గదిలోనుంచి, భద్రాచలము నుంచి రప్పించిన డాక్టరు, మంత్రసాని బయటికి వస్తున్నారు. ఉమాపతి ఆ గదిలోపలి కేగి చూచాడు.

అతని ప్రాణశక్తి, జీవితలక్ష్మి, లక్ష్మి కింద పడుకోబెట్టి ఉన్నది. డాక్టరు నెమ్మదిగా దగ్గరికి వచ్చి ఉమాపతిచేయిపట్టుకొని 'ఒంటి గంటనుంచి ప్రయత్నించినా, లోపల పోయిన పిండాన్ని బయటికి తీయడానికి వీలుకాలేదు' అన్నాడు.

పక్క గదిలోనుంచి ఉమాపతికి తల్లి యేడ్పు వినవచ్చింది.

మంత్రసానివచ్చి "ఎంతకష్టపడితే ఏమి లాభము? ఎనిమిదింటికే నొప్పులు వచ్చినవి. శిశువు లోపలనే పోయింది. బయటికి తీయ గలిగితే తల్లి బ్రతుకుందునేమో! కాని— పాపము! ఆ తల్లి అంతబాధలోనూ "వారు వచ్చారా? వారు వచ్చారా?" అని ఎన్నో సార్లు అడిగింది. మిమ్మలిని చివరసారి చూడ డానికి నోచుకోలేదు." అన్నది.

సర్వము శూన్యము జగత్తంతా ఉమాపతికి అంధకార మైపోయింది. ఎంతోదూరాన్నుంచి ఏదో హాహారవము అతని హృదయములోనూ, ఆ గదిలోను నిండిపోయినట్లై అతన్ని క్షోభింపజేసింది.

పడి ఉన్న లక్ష్మికనులు, మృత్యుగ్రస్తచక్ర వాకికనులు ఒకవిధముగానే తోచి అతని జీవశక్తిని కుదిల్చి వేసినవి. రెండుచేతు లతో ముఖము మూసుకొని ఆచక్రవాకమువలెనే అతడు కూడా ఆర్తనాదము చేశాడు.

---

# బ్రతుకు తెరువు—౬

వడ్లమన్నాటి కుటుంబరావు

౧౪

## దినమున కేది ఎన్ని గంటలు ?

గొప్పవేతనమైనను, స్వల్పవేతనమైనను ప్రతి యొక్కనికి దినమునకు మూడుగంటలకాలము విశ్రాంతియుండవలెను. నిద్ర, వృత్తి, ఆహారము, వ్యాయామ మనునవి ప్రతిమనుజజీవి దినచర్యలోని ప్రధానాంశములు. రెండవదిగ నుదాహరింపబడిన వృత్తికి సంబంధించిన కాలపరిమాణము తాబేదారీతనము, యజమానితో యువకుడు చేసికొన్న యేర్పాటు ననుసరించి యుండును. మధ్యాహ్నమువేళ విశ్రాంతికాలము ఒక గంటగాని, అరగంటగాని కలసి తొమ్మిది గంటలు నౌకరీక్రింద వినియోగింపబడుట యేయజమానియైన నంగీకరించును. అభివృద్ధికి రానెంచిన యువకుడు మరొకగంటకాలము క్రొత్తవిషయముల నవగాహన చేసికొనుటయందో, టెక్నికల్సును నేర్చుటయందో వినియోగించుట శ్రేయము.

ఆరోగ్యమే ఐశ్వర్యమని గ్రహించి ఆరోగ్యము నందు లక్ష్యముంపదలచిన యువకుడు నిద్రక్రింద నెనిమిది గంటలు వినియోగించవలెను.

ఆహారము తీసికొనుట, వార్తాపత్రికల పఠనము, సంసారమునందు పిచ్చిపాటీ చెప్పుకొనుటకు మొత్తము మీద మూడుగంటలకంటె హెచ్చుపోనీగూడదు.

ఇంటినుండి కార్యాలయమునకు, కార్యాలయము నుండి యింటికి మరలుటకు ఒకటిన్నరగంట చాలును.

మిగిలిన రెండున్నర గంటలకాలములో విశ్రాంతి, వ్యాయామము, వినోదములజూచుట, స్నేహితులతో నుల్లాసముగ గడపుట మున్నగువానిక్రింద వీలువెంబడి యువకుడు వినియోగించవచ్చును.

పత్రికాపఠనమునందు మనయువకులు బహు ఉదాసీనత నగుపరచుచున్నారు. అభివృద్ధికి రానెంచు యువకునకు పత్రికాపఠనము అత్యంతోపయోగకారి. పత్రికాపరిచయము విజ్ఞానసముపార్జనకు చక్కని మార్గము.

౧౫

## వినోదములు, వ్యాయామము

వేతనమెంతైనను, పదవి గొప్పదైనను, చిన్నదైనను ప్రతివానికి తననౌకరీకాక కొంత వినోదకాలక్షేపము, వ్యాయామము అవసరము. సాయంకాలము కార్యాలయమును విడిచినపిమ్మట కొంతతడవు పైవాటి కొరకు వినియోగించు టుచితము. పత్రికాపఠనమును కొందరు వినోదకాలక్షేపముగ తలంచుచున్నారు. కాని అయ్యది పొరపాటు. ప్రపంచవిశేషముల దెలిసికొనుట విజ్ఞానార్జన మనిపించుకొని మెదడు కెక్కుడు శ్రమ యగునుగాని వినోదకాలక్షేపముగ నెట్లు పరిగణింప బడదగును? ముఖ్యముగ యువకునకు శరీరవ్యాయామ మత్యంతావశ్యకము.

గడచిన అధ్యాయములం దొకచోట యువకుడు ఇంటినుండి కార్యాలయమునకు, కార్యాలయమునుండి యింటికి నడచుటవంటి మంచివ్యాయామము మరి వేరు లేదని యుదాహరింపబడినది. కార్యాలయమునకు సమీపమున కాపురముండెడు యువకునకు పైనపక లేనే లేదు. స్వల్పవేతనమును పొందుచు, ఎక్కుడులక్ష్యము అవసరములేని నౌకరీకి సంబంధించిన యువకుడు వ్యాయామము, వినోదము నెటులైన, నెవ్విధమునైన సాధింపగలడు. గొప్పవేతనమును గ్రహించుచు హెచ్చగు బాధ్యతతోగూడిన నౌకరీలోనున్నయాతనికి వినోద వ్యాయామములకు తీరికయుండదు. మెదడు నెల్లపుడును కార్యాలయపు పనులయందే లగ్నమొనర్చునాతడు



వీరరాఘవస్వామి దేవాలయ సన్నిధి, తిరువళ్లూరు. M. V.



హృత్తాపనాశని తీర్థము, తిరువళ్లూరు M. V.

వినోదవ్యాయామములన్నై పునకు మనస్సును మరల్ప లేక క్రమేపి మరచిపోయి జడ్డుదేరిపోవును. నౌకరీయందు లక్ష్యముంచవలసిన ఆవశ్యకత లేని యువకుడుగూడ రెండువత్సరములు గడచి కార్యాలయమునందొక పెట్టు పైకెక్కినపిమ్మట పైహెచ్చు జీతగాని వలెనే వినోద వ్యాయామములు స్మృతిపథమునుండి క్రమేపి తొలగిపోవుచుండును గాన ప్రతియొక్కరును యువకులుగ నున్నప్పుడే చిరకాల మారోగ్యముగ నుండ గలుగుటకు తగినంతపునాదిని వేసికొనవలెను. వ్యాయామము, వినోదముల యావశ్యకతను గ్రహించినాతడు వీటి నలక్ష్య మొనర్పక ప్రత్యేకశ్రద్ధ వహించి సాధ్యపడినపు డెల్ల అలవడజేసికొనును. కార్యాలయపు బరువులందేమాత్రపుతీరికగూడ లేనివారు మిగతదినముల సంగతి యెటులున్నను, శని ఆదివారములందైని కొంత శ్రద్ధ చూపవచ్చును.

ఆంగ్లేయుల సంసర్గమువల్ల మన కన్ని వ్యాయామములో దొరకినవి. అందు కొన్ని మన స్త్రీలాడుకొను పచ్చీసులాంటివి. అందు దేహపరిశ్రమ లేని కారణమున వ్యాయామ మనిపించుకొనదు. ఇతరములు కొన్ని ప్రాణాపాయములు దెచ్చిపెట్టునవి. ఇదిగాక యీ ఆటలన్నిటికి కొంతసంఘము సమకూడవలెను. ఈ హంగామాకింతటె ఒంటరిగ సాధింపతగున వెన్నియో జాతీయములైనవి కలవు. వడివడిగ నడచుట, పరువెత్తుట, త్రివ్వుట, బరువులెత్తుట, కసరత్తు మొదలగునవి. ఇవి ప్రాణాపాయములని యెవ్వరు ననజాలరు.

తెరుపు నాటకములు, సినీమాలు చూచుట వినోద కాలక్షేప మని మనలో కొందరిమతము. అది చాల పొరపాటు ఇయ్యవి చాలవరకు మానసనైతిక జీవితమును భంగపరచు[illegible]యున్నవి. నగరకతా పిశాచ [illegible] బలిపు చేం[illegible] [illegible] [illegible]స్తుంకు [illegible]. [illegible] [illegible], [illegible] [illegible]

ఫొటోగ్రఫీ, [illegible] [illegible] [illegible] , వార్తాపత్రికలకు వ్యాసములు వ్రాయుట, గ్రంథ ప్రచురణము, సువాసన తైలములు, ఔషధములు తయారు చేయుట మొదలగునవి కొన్ని కొందరకు Loby అని చెప్పకొనుచుండగా వినియున్నాము. యువకుడు తన నౌకరీతోపాటు పైవృత్తుల మాదిరి దేనినో ఒకదానిని సాధించు టుచితము. ధనాఢ్యుడైన యజమానియొక్క మాత్సర్యముచేతగాని, యువకుడే సేవకావృత్తియందు విసుగుచెందిగాని నౌకరీలేకుండ అల్లాడుచున్న సందర్భమున పైవృత్తులు కొంత చేదోడుగ నుండగలవు.

యువకుడు పలు విషయముల నేర్చుట కభిలాష, ఆసక్తి కలవాటుపడు టుచితము. బహువ్యాపారిగ నుండువానిని చూచుట ఆనందదాయకము. అట్టియుత్సాహి యితరుల ననేకుల మున్సలచేయుటేగాక తనకుగూడ గౌరవ మార్జించుకొనుచున్నవాడగును. కార్యాలయము, గృహము తప్ప వేరు ప్రపంచమెరుగని యువకుడు పది మందిలో బరువుగ దోచి మందమాక మనిపించుకొనును.

౧౬

## యువకుడు మరువదగని విషయములుకొన్ని

యువకు డెప్పుడును ఒకనోటుబుక్కును, పెన్సిలును వెంటనుంచుకొనుట ఆవశ్యకమని వెనుకటి అధ్యాయములందు తెలిసికొంటిమి. దానియొక్క యుపయోగ మెంతేని కలదు. బాటనుబోవుచున్న యొకానొక పెద్ద మనిషియొక్క పరిచయమును బొందునుద్దేశ్యముతో వానిచిరునామాను విచారించుటయు గమనార్హము. అప్పుడు జేబునందు దొరకిన యొక పిచ్చికాగితముమీద వ్రాసికొనుటయు, రెండుదినములైన వెనుక నది అంతర్ధానమగుటయు, అంతే నా చిరునామాకొరకు వగచుటయు మనలో ననేకమంది కనుభవైక వేద్యము. ఒక చిన్న నోటుబుక్కును జేబునం దుంచుకొనుట యేమాత్రము బరువు కాదు. దానిని పదిలముగ శ్రద్ధతో Maintain చేయుచున్నచో పై అవకతవక లనేకములు సంభవించకుండ చేయవచ్చును.

టెలిఫోను నుపయోగించు నవసరము [illegible] సపడి నప్పుడు [illegible] [illegible], [illegible] దానినంటు టుచితము. రెండవప్రక్కనున్న పిలిచెనువాని తాను తెలుపుదానిని వ్రాసికొమ్మని కోరి [illegible] కాగితము, కలము తెచ్చెదనని చెప్పి ఫోనువదలివెళ్లుట కొం

దరు సహింపజాలరు. యజమానియొక్క టెలిఫోనులో యువకుడు సరసములు, ఎకసెకలు, పకపకలు సలుపజనదు.

యువకు డెట్టివ్యాపారసంస్థలో ప్రవేశించిన నట్టి వ్యాపారమునకు సంబంధించిన గ్రంథములను సేకరించి పఠించుట మంచిది. గ్రంథముల సేకరించుట కష్టమైనచో వాణిజ్యమునకు సంబంధించిన పత్రికలనైన చదువుచుండు టుచితము. ఈ పరిచయము కొన్ని నూతన విషయముల తెలిసికొనుటకును, యజమాని యేదేని ఆజ్ఞాపించినప్పుడు తెల్లమొగము వేయక సులభముగ నెరవేర్పగలుగుటకును ఎంతో సహాయకారిగ నుండును.

పైవిషయము కొంత శ్రమయే. వాణిజ్యమునకు సంబంధించిన పత్రికలు మన భారతవర్షమున బహుకొలదిగ నున్నవి. గ్రంథములును బహుకొలదియే. పాశ్చాత్యదేశములం దట్టి ప్రచురణములు వేనకువేలు గలవు. గ్రంథములుగాని, పత్రికలుగాని దొరకక తంటాలుపడుచున్న యువకుడు ఈ విషయమును తన యజమానికెరింగించి అట్టిమార్గము నేర్పరచవలసినదిగ నివేదించుట మంచిది. ఈ నివేదనము యజమానిమనసు కెక్కినను, నెక్కకున్నను యువకుడు చాల ఉత్సాహవంతుడని, నూతనవిషయముల నవగాహన మొనర్చుకొనుటయం దాసక్తికలవాడని ఆతనికి తెలిసియుండును.

వాణిజ్యమునకు సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరములు ఒకరు మదరాసునందును, మరొకరు రాజమండ్రియందు నివసించుచున్న యిద్దరువ్యక్తుల మనోగతముల స్పష్టీకరించుచున్నది. ఉత్తరమును జాబు అందుము. ఈ జాబులు పెక్కుతీరులుగ నుండును. సంసారపక్షములో వ్రాసికొను జాబులపంథా వేరు. పాలకుడు పాలితునకు వ్రాయుపద్ధతివేరు. రైల్వేకంపెనీవారి పద్ధతి మరొకటి. వాణిజ్యసంబంధమైన జాబులందు వాడబడెడు మాటలకూర్పు సులభశైలి, పదములపొందిక, ఉదారత, సహకారతత్వము, బాహుళ్యమగు విషయమును క్లుప్తముగ నివేదించు నేర్పు మొదలగు ననేకాంశములు ప్రాధాన్యముగ నేర్పడి యియ్యదొకకళ యని స్ఫురింపజేయును. పైనుదాహరింపబడిన వివిధరీతులలోనుండు అనేక జాబులను విమర్శనాదృష్టితో తరుచు పరికించుచుండుటచేత యువకుడు వాణిజ్యసంబంధమైన జాబులం దగుపడు విలక్షణతను హృద్గతము చేసికొనగలడు. యువకు డిట్టి జాబులలోని తత్వమును గ్రహించి అట్టివి రచించుటకు సాధించుచుండవలెను.

వాణిజ్యమునకు సంబంధించిన గ్రంథములు స్వల్పమయిన వెలలకే లభ్యమగును. ఈ గ్రంథములయొక్క పఠనాభిలాష ప్రజలలో వ్యగ్యమగుటచేత శతకములవలె, ఎక్కాల పుస్తకములు, బాలశిక్షలవలె విరివిగ దొరకవు. Second hand పుస్తకముల నమ్మెడివారి చెంతను, హిగ్గింబాథమ్సు కంపెనీ లాటివారి చెంతను మాత్రమే లభ్యపడును. దినమున కొకణా చొప్పున హిందూపత్రికను కొని యిరువది పేజీల చెత్తను క్షుణ్ణముగ చదువుటకుం దాసక్తిచూపెడు యువకుడు నెలకొకరూపాయి వెచ్చించి వాణిజ్యసంబంధ గ్రంథముల సంపాదించి పఠించుట యాతని బ్రతుకుతెరువు కెంతో యుపయోగకారిగ నుండును. ఇక పత్రికాపఠనము కొరకొక అరగంటకాలము ఏ లైబ్రరీలో మారినను గడచిపోవును.

వ్యాపార సౌలభ్యమున కేర్పడిన తపాలు, తంతి, విమానము, రైలు, ఓడలు మొదలగువాటి నియమావళిని పరిశీలించి యువకున కత్యవసరమైన కొన్ని ముఖ్యాంశముల గుర్తించుకొనుట శ్రేయము. పెద్దజీతనముల గ్రహించు సంస్థలో పెద్ద ఉద్యోగులు పై చిన్నివిషయములకు తమ గుమాస్తాలపై నాధారపడియుందురు. గుమాస్తాగిరిలో నుండునాతడు అట్టి విషయముల యజమానికి చురుకుగ నందిచ్చుటచేత యువకుడు ఎల్లవేళల యజమానియొక్క కనుసన్నలలో మెలగుచుండగలడు.

యువకునకు ఒకటి రెండు వత్సరములు గడచిన యనంతరము వేతన మభివృద్ధియై చేసాయముగ నొక క్షుద్రగాని నా యువకునకు అధికారులు ఒప్పగింతచేసినారని తలంచెదను. అధికవేతన మైనంతమాత్రమున చేతిక్రింద నొక డున్నాడుగదా యని వానిని వేధింపకూడదు. వాడు గూడ మానవుడేనని, వానిదిగూడ మానవజన్మమేనని స్పృహాయం దుంచుకొనవలెను. చీటికిమాటికి

వానిని పిలిచి బహు స్వల్పపనులుగూడ చేయించుట అమానుష మనిపించుకొనును.

నూతనముగ కార్యాలయమున ప్రవేశించిన యువకుడు చాల బెదరుగ నుండుట సహజము. అట్టివానికి అధికారులు ఒకేసారి హెచ్చగు బాధ్యతలను కల్పించి మరింత బెదరగొట్టుట శ్రేయముకాదు. సంస్థయందు ప్రవేశించినయువకుడు సంస్థ కుపయోగపడునట్లుచూచు కొనవలెనేగాని రెండు మూడునాళ్ల పనికే హడలి సంస్థ విడుచునట్లు ప్రవర్తించజనదు అధికారులు.

మనుష్యప్రకృతు లనేకతీరులు. ఒక డొక పనిని తప్పుల తప్పులతో వడివడిగ ముగించును. మరొక డదే పనిని గుట్టుమట్టుల బాగుగ గ్రహించి పరిశుభ్రముగ, మరొకరు వ్రేలుపెట్టి చూపకుండ, నెమ్మదిగ చేయును. అధికారులు తాబేదారులచెంత దాస్యమును గ్రహించు పట్ల మనుష్యులయొక్క వివిధ ప్రకృతుల తీరుల నెరింగి యెవరికి తగినపనిని వారికి నియమించుచుండిన సంస్థలో పొరపులు సంభవించవు. తొందరపడి ఒకానొకవ్యక్తిని గూర్చి దురభిప్రాయపడుట చాల చెరుపు. తగినంత అవకాశమును తీసికొని దానిని వెలువరించుట యిరు పక్షములవారికిని శ్రేయము.

కొందరు యజమానులు కేవలము అమానుషముగ వర్తింతురు. తప్పుఅంతయు తమమీదనే గలదనునట్లు ప్రత్యక్షముగ రుజువు లగుపడుచున్నను వాటినెల్ల కప్పి పుచ్చుటకు తాబేదారులపై విరుచుకుపడి వారిని తొలగింప జూతురు. యజమాని తనలోగల లోటుపాటులను తెలిసికొని సవరించుకొనుటకు అనేక సాధనోపాయము లున్నను వారు చేయనొల్లరు. దీనికి కారణము ధన మదాంధత. ఇట్టి అసురజాతికి చెందిన యజమానులు పిదప తమలో తామే కుమిలియేడ్తురు.

మనుజునకు సంభవించెడు కష్టము లొకతీరుగ నుండవు; వివిధరీతుల నుండును. నౌకరీకి సంబంధించిన చిక్కులు తటస్థించినప్పుడు యువకుడు బహు జాగ్రత్తగ నుండి, ముందువెనుక పరిస్థితులు యోచనచేసికొని నిర్ణయమునకు దిగవలెను. కష్టముల ధైర్యముతో నెదు ర్కొని, సాధించి గెలుచుటే పురుషలక్షణముకాని వాటికి లొంగిపోవుటయందు నిపుణత లేదు. క్షణములమీద కష్టములనుండి తొలగి బయటపడ ప్రయత్నించుట కొరవితో తల గోకికొనుటవంటిది. మనోధైర్యము, యుక్తిలేనివా డట్లొనర్చి మరింత చిక్కుల పాలగును.

మానవునకు కష్టములు వజ్రమునకు వన్నెదెచ్చు సానరాయివంటివి. కష్టములమూలమున రాపిడివడిన మనుజుడు తప్పక ఉన్నతికి రాగలడు. గడచనిన కష్టములగూర్చి తలపెట్టజనదు. అవన్నియు మంచికే తటస్థపడినవని యూహించుటచేత ముందు జాగ్రత్త కంతేని అనుకూలించును. కష్టములగూర్చి ప్రతి యొక్కనితోడను మొరపెట్టుకొనుట గౌరవహాని. తీర్చగలవానియొద్ద, నిజముగ సాయపడగలవానియొద్ద వివరించుట గౌరవభంగము కానేరదు గోరంత విషయమును కొండంతచేయుట తగదు. ఒక ఉత్తమాదర్శమును మనమునం దుంచుకొని, దానికొరకు సాధించు యువకుడు కష్టములకు లొంగక, ధైర్యావలంబియై యున్నచో జయము నిస్సంశయము.

౧౭

## ఎదుగుబొదుగులు లేని విసుగుదల యుద్యోగము

చిరకాల మొకేసంస్థయందు, ఒకేశాఖలో నెట్టి యభివృద్ధిగాని లేక పనిచేయుటకు ఎట్టివానికైన విసుగుదలగ నుండును. ఆదర్శమును మనస్సునం దుంచుకొని శ్రమపడుచున్నయాతడు విసుగుదలచెందుట సంభవించునేని ఆసంస్థయందు రాజీనామా నిచ్చుటకు యోచనచేయును. ఇట్టి సందర్భమునందు యువకుడు తొందరపడజనదు. అట్టిపరిస్థితు లేర్పడుటకు ముఖ్యమైన బాధ్యులు యువకుడా, లేక యజమానియా యని యువకుడు మున్ముందు యోచనచేయవలెను. ఎట్టి అభివృద్ధి, ఎట్టిమార్పు లేక ఎక్కడవుంచబడినవా డక్కడే యెదుగుబొదుగులు లేకుండుటకు బాధ్యుడు యువకు

వైనచో సంస్థను మార్చుటనుగూర్చి యోచనచేయుట బహు అవివేకము.

సంస్థను మార్చుటచేత లాభకారిగ నుండునని మనసా తోచినట్లైనను వేరెట్టియోచనయు లేకుండ నాప్రయత్నమునకు లంఘింపవచ్చును. యోచన మనస్సునందు మూరినద్దేతడవుగ రాజీనామాను దాఖలు చేయుట తప్పు. వెనుకముందు లారయక ఈవిధముగ తొందరపడెడువారు పడెడు అగచాట్లు భరింపలేనివి.

ప్రయత్నమునకు దిగి, వేరొక నౌకరీ ఖాయపడి, Appointment Order చేతికి చిక్కించుకుని ఉన్న దానికి రాజీనామానిచ్చుట శ్రేయము. ఈనూతన ప్రయత్నమునందు ఏమాత్రము Speculation కూడదు.

క్రొత్తనౌకరీ చేత చిక్కించుకొనక త్వరపడి ఉన్న దానికి రాజీనామా నిచ్చుకున్న యువకుడు వారము ల్రయు, మాసములయు తరబడి నౌకరీదొరకక చిక్కుల పాలు కావలసియుండును. నౌకరీకొరకు కల్లాడుచు తిరిగెడి యువకుని కొందరు యజమానులు అంగీకరింప వెరతురు. "యథార్థముగ నీయువకుడు గట్టివాడు, నిపుణతగలవాడు అయినచో ఇంతకాల మూరకుండునా, యేసంస్థవారో ఈతని నెగురగొట్టుకుపోరా" యని వారి యూహ. ఈయూహ సరియైనదా, కాదాయను విమర్శతో మనకు పనిలేదు. నౌకరీకి వెడలెడు కొందరపట్ల నీయూహ సరియైనదే కావచ్చును. మరికొందరపట్ల తప్పుకావచ్చును. బహునిపుణతగల యువకు లెందరో సరియైన వారిఆదర్శములకు తగిన నౌకరీలభింపక తిరుగుచుండుట మనము నిత్యము చూచుచునేయున్నాము. యజమానులయొక్క ఔచిత్యానౌచిత్య విమర్శనముకంటె యువకుడే ఈవిషయమున శ్రద్ధ, యుక్తి గలిగి, చరించు టుచితము, ప్రజ్ఞ.

సంస్థయందు నౌకరీకి రాజీనామానిచ్చి, అయ్యది అంగీకరింపబడి కార్యాలయమును విడచుసమయమున యువకుడు కార్యాలయాధికారులచెంతనుండి తా నింతదనుక నొనర్చిన సేవను వ్యక్తమొనర్చు నొకప్రశంసాపత్రమును తీసికొనుట మంచిది. క్రొత్తసంస్థల నౌకరీకొరకు వెదకికొనునప్పుడీపత్రములు చాలసహాయపడును. కొందరు యజమానులు బహుపెంకితనము గలిగియుందురు. అట్టిపత్రములు కొందరుయజమానులు గౌరవింతురు. మరికొంద రధిక్షేపింతురు. వారిప్రకృతు లెట్టివైనను యువకు డిట్టి పత్రముల సేకరించి యుంచుకొనుటయం దేమరవగదు.

క్రొత్తనౌకరీకి వెడలునప్పుడు క్రొత్తయజమాని చెంత పాతవానిని దూలనాడి, వానిగుట్టుమట్టుల బయలుపెట్టజనదు. వానిగూర్చి యేవిధముగు నసంతృప్తి నగుపరచుట అనుచితము. ఇట్లు ప్రవర్తించు యువకునకు నౌకరీ లభ్యపడుట కొంతకష్టము.

ఒకానొక నౌకరీ ఒకయువకున కనుకూలముగ నుండెనంతమాత్రమున నా సంస్థయొక్క యజమాని తన యేర్పాటుల నీతనికొరకు మార్చవలెనని కోరుట మంచిగి కాదు. యువకున కక్కడి యేర్పాటు లనుకూలించకున్న నా సంస్థను విడుచు టుత్తమము. అక్కడి యేర్పాటులప్రకారము నడువని యువకుడు అనుక్షణము ఆ సంస్థకు కంటకముగ నుండును. నేటి వాణిజ్యపంథాయందు పరస్పర సహకార మత్యావశ్యకము. ఆ ఆవశ్యకతను గమనింపకుండు యువకుడు ఆ సంస్థయొక్క అభివృద్ధికి భంగకారి యగుచున్నాడు.

నేర్వతగినదెల్ల, నేర్వవలసినదెల్ల యువకు డొకే సంస్థయందు నిలుకడగ నుండి యవగాహన మొనర్చుకుని, ప్రజ్ఞ నార్జించినట్లు బాగుగ తెలిసికొని, ఆ సంస్థనే యింకను అంటిపెట్టికొని యుండుటవలన నెట్టి యభివృద్ధియు కానరానిచో మాత్రమే ఆసంస్థను విడుచుటకు, వేరొకనౌకరీని చూచుకొనుటకు ప్రయత్నము సలుపవలెనేగాని మిడిమిడిజ్ఞానముతో తొందరపడుట మిగుల నజ్ఞానము.

౧౮

## యజమానుల కొకమాట

ఒక డొకవ్యాపారమును సాగింప దలపెట్టినప్పుడు యజమానియైనవా డొక్కడే ఆపని నెల్ల చూచుకొనుట అసంభవము మరికొందరయొక్క సహాయముగూడ నత్యవసరము. యజమాని కానెంచినవా

ఇదివరలో నెక్కుడనేని తగ్గేదారితనము జేసి, సేవ కావృత్తియందు కష్టమును గ్రహించి, వాణిజ్యమునకు సామాన్యముగ నవసరమగు పనియందు తీక్ష్ణముగ వారి తేరియున్నచో వాతడు తలపట్టిన యానూతన వ్యాపారము తప్పక నెగ్గును.

ఈనాటి వ్యాపారాభివృద్ధికి, వ్యాపారమునందు విజయమునకు తామే కారకులమని కొందరు యజమానులు తలంతురు. అయ్యది పొరబాటు. అభివృద్ధి, ఆవిజయము తన సంస్థయందు పనిచేయుటకు తా నేరుకొను ఉద్యోగియులం దుండును. ఎందరో యజమానులు ధనికులుమాత్రమే యైయుండి పెట్టుబడిని మాత్రము పెట్టగలరు. మిగతవిషయములు వారికేమియు తెలిసియుండవు. అట్టిసందర్భమున వారి నేరిన, "ఒడలు వంచి కష్టపడెడు ఉద్యోగియుల నియమించుకొనిననేకాని బండి సవ్యముగ నడువదు. యజమానులు కొందరు పెద్దబ్బతో పనిలేని వ్యాపారమును సాగింప సమర్థులైయుందురు. వీరికిగూడ నిపుణులగు నితర యుద్యోగియు లవసరమే. ఏ విధమగు వ్యాపారమునకైన సమర్థులు, నిపుణులు, ఆరితేరిన యుద్యోగియుల అవసరమెంతేని కలదు. సమర్థతలేనివారు ఒకరేటికి తీసిన మరొకరు కాటికితీయుచు సంస్థయొక్క యభివృద్ధి కడ్డము తగిలెదువారు.

వాణిజ్యసంస్థయందు గల యుద్యోగియు లెల్ల యజమానితో సహా ఒక సమష్టి కుటుంబమువలె సంచరింపవలెను. ఒకరిలో నొకరి కెట్టి అరమరయు నుండ తగదు. యజమాని లేనప్పుడు ప్రతినిధులు యుద్యోగియులే. యజమానికి ప్రత్యామ్నాయముగ నారన్ని కార్యముల నొనర్పవలసినవారు. సంస్థకు గౌరవము, సంస్థకొక పరువుబడి, తద్ద్వారా యజమాని కొకస్థానము, ఆధిక్యత కూర్చవలసినవారు నుద్యోగియులే. కాన యజమానియైనవాడు తన యుద్యోగియులను సోదర భావమున చూచుకొనవలెను. వారి క్షేమమే తన క్షేమమని తలంచవలెను. వారైశ్వర్యముగనున్న తానైశ్వర్యమున నున్నట్లే భావింపవలెను. తన యుద్యోగియుల కష్టసుఖాల్ని గమనించుచుండవలెను యజమాని వారియొద్ద సేవను గొనుచు తనయొక్క సంస్థకు మూలకారకుడననీ, వారి పోషకుడననీ, తాను లేకున్న వారికి వేరుగతులు లేవనీ మొదలగు నీచములగు నూహలుగల యజమాని ప్రపంచమున మనలేడు. నేను గాకున్న లేపో యీ గర్వమునకు తగిన ప్రతిఫల మనుభవింప గలడు.

ఈ ప్రపంచమున నెవ్వడును సర్వజ్ఞుడు, సర్వ సమర్థుడు లేడు. పదివిషయములందు చేతుల జొనిపి ఒకదానియందును నిపుణత సంపాదింపలేనియాతడు ప్రయోజనము లేదు. అధికవేతనముల నొసంగి వివిధ శాఖలందు దారితేరినవారిని సంపాదించుట చాలకష్టము. కాన యజమానులు తమసంస్థకు నుద్యోగియుల నేరుకొను పట్ల జాగరూకుడై యుండి, తాము వారికొరకు నిచ్చుచుండు మొత్తమునకు తగిన ప్రతిఫలమును చూపు వారిని సేకరించుకొనవలెను.

సంస్థయొక్క యుద్యోగియులకు ఆ వాణిజ్యపు తీరును సంబంధించి తగిన Training యియ్యగలుగుట యజమానియొక్క మరొక ముఖ్యవిధి. దీనిని తానే గాని, లేక తగిన గ్రంథసముదాయమునుకూర్చిగాని, నేర్పి వార్తాపత్రికల చదువుట కాసక్తి కల్పించిగాని సహాయపడుట తనసంస్థ కెంతో యుపయోగకారి.

ఏదో పనిదొరకుటే ప్రధానమని యెంచు యువకుడు ప్రయోజనపరుడు కాడు. ఆశోత్సాహములు గలయాతడే ప్రయోజకుడు. అతడే జీవనభారమును కరతలామలక మొనర్చుకొనినవాడు. అతడే జీవయాత్రయందు విజయమును బడయువాడు. సంస్థ కట్టివాని సేవ ఎంతో ప్రయోజనపడును.

౧౯

## డబ్బుకాదు ప్రధానము

లక్షలాదిగ ధనము బ్యాంకులందు మూల్గుచుండును. తినుటకు పుష్కలముగనున్నది. ఇంటి కెలుపలను ముందు వెనుక అన్నాతురులహాహాకారములు చెవిచిల్లులు పడునట్లు వినుచుందురు. ఎవ్వరని యేగాని వారికొరకు

వెచ్చింపవలెను. వాని లక్షలాది ధనము దేశమునకు, సంఘమున కేమి ప్రయోజనము? దయ, సత్యము, శౌచము మొదలగు సద్గుణములు లేని జన్మ వృధ. లక్ష్మి నిలుకడ లేనిది. నిలుకడగలది, చంచలయగు లక్ష్మి విడనాడినను ఇంత అహ్లాదకముల దెచ్చిపెట్టునవి, ఆజన్మాంతము పలుకుబడిని సమార్చునవి ధనముకంటె కీర్తి, ప్రతిష్ఠలు. యజమానియే యగుగాక, తాబేదారేయగు గాక ఆకీర్తి ప్రతిష్ఠలకొరకు సాధించవలెను. అవియే మానవజన్మము నకు నిత్యసంపద. అవియే మానవజన్మకు ఆనంద సుధ.

మానవుడు తనయొక్క జీవయాత్ర ఆనందమయమై యుండవలెనని కోరుకొని కష్టపరంపరల కొరకు ఆరంభింపడు. అనిత్యానందజ్యోతికి సాధనభూతము లైన కీర్తిప్రతిష్ఠల నార్జించుటకొరకు శ్రమపడడు. ధనార్జన రెండవపక్షము.

(సమాప్తము)



ఇండియాద్వారము, అపోలోబందరువద్ద, బొంబాయి — D. A. R.

# ఆంధ్ర సామ్రాజ్యము నేపాళము వఱకును వ్యాపించెనా?

## తేకుమళ్ల రామచంద్రరావు ఎం. ఏ. బి. యల్.

### నేపాళము భారతదేశభాగము

రాజకీయముగ నేపాళదేశము ప్రస్తుతము భారత దేశమున నొకభాగముకాదు. నేపాళదేశము స్వతంత్రదేశము. ౧౯౨౩ వ సంవత్సరమునందు జరిగిన యొడంబడిక ననుసరించి నేపాళదేశముయొక్క స్వాతంత్ర్యమును బ్రిటిషువా రంగీకరించి, నేపాళదేశపుమహారాజుగారికి స్వతంత్రదేశాధిపతులయెడ మాత్రమే యుపయోగించు 'హిజ్ మెజస్టీ'[1] యను బిరుదునామము నుపయోగించుచున్నారు

కాని, భారతదేశముయొక్క చరిత్రమును, నేపాళదేశముయొక్క చరిత్రమును మనము శ్రద్ధతో పరిశీలించితిమేని అనాదినుండియు నీరెండిటికిని పరస్పర సంబంధము లుండుటమాత్రమే గాక, నేపాళదేశ మెల్లప్పుడును భారతదేశభాగముగ నున్నట్లు స్పష్టపడగలదు.

నేపాళదేశము భౌతికముగ భారతదేశమును ఆశియాఖండమునందలి తక్కిన దేశములనుండి వేరుచేయు హిమాలయపర్వతశ్రేణియొక్క దక్షిణపుదెసను నున్నది. కాబట్టి నేపాళము భౌతికముగ భారతదేశ భాగము గాక మఱియే దేశభాగమును కాజాలదు.

మన పురాణములను మనయాదిమ గ్రంథములను పఠించినచో నందు భారతదేశమునందలి అన్ని దేశములతోపాటు నేపాళముకూడ నొకదేశముగ పేర్కొనబడినట్లు తెలియగలదు.

ప్రపంచమునందలి యన్ని మతములలోను నెక్కువప్రజలు నమ్మిన దేమతమైయున్నదో యాబౌద్ధమత మునుపదేశించిన యవతారపురుషుడగు గౌతమబుద్ధుడు నేపాళదేశమున జన్మించియుండెను. అచ్చటనుండి యాతడు బౌద్ధమత సందేశములను చాటించెను. దీనిని బట్టిచూచినచో నేపాళదేశమునకును, భారతదేశమునకును కేవలము భౌతికముగమాత్రమే గాక విజ్ఞానవిషయములందు, నాగరకతయందు నైక్యభావమున్నట్లు స్పష్టపడగలదు. నేటికిని నేపాళదేశమున హిందూమతమే ప్రధానమతము. విష్ణ్వారాధకులే యచ్చటిభగవంతులు. వారల కచ్చట గొప్ప దేవాలయములుగలవు. హిందువులకు పవిత్రములగు దేవాలయములును, నగులును కొన్ని నేపాళదేశమున నున్నవి. అచ్చటినదులకు, అచ్చటి కొండలకు, అచ్చటి దేవతలకు భారతదేశపునామములే గలవు. కావున ననాదినుండి నేటివఱకు నేపాళదేశము విజ్ఞానసందర్భమున భారతదేశభాగమనుట నిర్వివాదాంశము.

ఇక చరిత్రనించుక చూచితిమేని చారిత్రకముగ గూడ నేపాళము భారతదేశభాగమైనట్లు మనకు తెలియగలదు. క్రీస్తు పూర్వము 250 సంవత్సర ప్రాంతములందు మగధదేశాధీశ్వరుడును, భారతదేశ చక్రవర్తియు నగు అశోకుడు నేపాళదేశమున రుమ్మిన్‌దేవి యను ప్రదేశమున శిలాస్తంభమును నెలకొల్పినట్లు పెర్సివల్ ల్యాండన్[2] అను గ్రంథకారుడు తెలుపుచున్నాడు. ఈ యశోకుడే నేపాళదేశమున స్వయంభూనాథ్ అనుచోట కొండకు పడమటి భాగమున కొన్ని బౌద్ధుల కట్టడములను కట్టించినట్లు చెప్పబడుచున్నది. అశోకుడు నేపాళదేశమున నితర ప్రదేశములందును బౌద్ధుల కట్టడములను కట్టించినట్లు నిదర్శనములు గలవు.

ఇంతేగాక అశోకుడు తన కుమార్తెయైన చారుమతిని దేవపటాణ్ అను ప్రదేశమున నివసించు

1. His Majesty.

2. Perceval Landon: Nepal, Vol I pp. 18 and 30 foot note. No 1. (1928)

చుండినవాఁడును, సుక్షత్రియుఁడును నగు నొక బౌద్ధ ధర్మదీక్షాపరతంత్రున కిచ్చి వివాహ మొనర్చినట్లు సంప్రదాయ ఐద్ధంబగు నొక విషయముగలదు.3

అశోకుని యనంతరమున మగధసామ్రాజ్యము విచ్ఛిన్నమైపోయినది. ఇతర దేశములతోపాటు నేపాళ దేశముగూడ సామ్రాజ్యాంతర్భాగముగ నుండుటను విరమించుకొనెను.4

ఈ విశేషము జరిగినపిమ్మట చాలకాలమువఱకును అంతగ నేపాళదేశపు చరిత్ర మెవ్వరికిని తెలియదు. కాని క్రీస్తు వెనుక ౩౮౦ సంవత్సర ప్రాంతములందు గుప్తవంశజుఁడును, భారతసామ్రాజ్యాధిపతియునగు సముద్రగుప్తుఁడు నేపాళదేశమును తాను జయించిన దేశముల పట్టీలో చేర్చెను. చరిత్ర ప్రసిద్ధమగు సముద్రగుప్తుని అలహాబాద్ స్తంభశాసనమునం దీపట్టీ కలదు.

కావున, భౌతికముగను, వైజ్ఞానికముగను, చారిత్రకముగను నేపాళము భారతదేశభాగ మనుట కెట్టిసందేహము నుండజాలదు. భారతదేశపుమతము, నాగరకత, శాస్త్రము మొదలుగాగల ఏవిషయమునందును నేపాళమునకును, భారతదేశమునకును భేదము లేదు. శకముల లెక్కలందుకూడ నీరెండిటికినైక్యతకానబడుచున్నది నేపాళదేశమునగూడ కలియుగాదినుండి సంవత్సరములు లెక్కపెట్టబడుచున్నవి. భారతదేశమున వాడుకలోనున్న విక్రమాదిత్య, శాలివాహన, గుప్తశకములు నేపాళదేశమున వ్యాపించి విరివిగ వాడఁబడియున్నవి 5.

## నేపాళము (క్రీ. పూ. ౨౫౦ మొ. క్రీ. వె. ౩౮౦ వఱకు)

క్రీస్తుపూర్వము ౨౫౦ సంవత్సర ప్రాంతములం దశోకుడు నేపాళదేశమును వశపరచుకుని బౌద్ధుల కట్టడముల నచ్చట కట్టించియు, స్తంభాదులను ప్రతిష్ఠించియు, తనకుమార్తెయగు చారుమతిని సుక్షత్రియుఁడగు దేవపట్టాణ నివాసికిచ్చి వివాహముచేసియు బౌద్ధధర్మాభివృద్ధి గావించిన యనంతరమున తిరిగి క్రీస్తువెనుక ౩౮౦ సంవత్సర ప్రాంతములవఱకును నేపాళదేశపు చరిత్రము మన కేమాత్రమును తెలియదు. ఈకాలపుచరిత్ర తెలిసికొనుటకుఁ దగిన సాధనములును లేవు. కావున నీకాలపు చరిత్రను తెలిసికొనదలచిన చరిత్రకారుఁ డతికష్టముతో ననేకవిషయముల నతిజాగరూకతతో పరిశీలించి, మేధాశక్తిని సవ్యముగ చరిత్రరచనానియమబద్ధముగ నడిపించుచో మాత్రమే శ్రమకుఁ దగిన ఫలితమును కొంతవరకైనను పొందగలఁడని నా యభిప్రాయము. ఈ యభిప్రాయముతోనే - నే నీవ్యాసరచన కుపక్రమించితిని.

నేపాళదేశము అశోకుని మౌర్యసామ్రాజ్యము నుండి క్రీ. పూ. ౨౫౦ సంవత్సరప్రాంతముల యనంతరము విడిపడినట్లు పైని చెప్పియుంటిని. అశోకుని సామ్రాజ్యమంతయు క్రీ. పూ. ౨౦౦ సంవత్సర ప్రాంతములలో విచ్ఛిన్నము కా నారంభించినట్లు చారిత్రక నిదర్శనములుగలవు.6 కావున నేపాళదేశము మౌర్య సామ్రాజ్యభాగముగ నుండక విడిపోయినది క్రీ. పూ. సుమారు ౨౦౦ సంవత్సరముల ప్రాంతమని మనము ఘంటాపథముగ నిర్ధారణ చేయవచ్చును.

క్రీ. పూ. ౨౦౦ సంవత్సర ప్రాంతములమొదలు క్రీ. వె. ౩౮౦ సంవత్సరము ప్రాంతములవఱకు— అనగా సుమారు అయిదున్నర శతాబ్దములలో నేపాళ దేశ మెట్టిస్థితిలో నుండెను? ఏయేదేశములు, ఏయే రాజ్యములు నేపాళదేశముపై తమ విజ్ఞాన ప్రాబల్యము చూపినవి? ఈ అయిదున్నర శతాబ్దాలలో నేపాళ దేశము స్వతంత్రదేశముగా నుండెనా? లేక నెవ్వైన

3. Perceval Land n: Nepal, ol. I pp. 241 and 211. (1928)

(4) Perceval Land n. Nepal, Vol. 1 P 18 (1928)

(5) Perceval Landon: Nepal, Vol. 1 P. 19 (1928)

6. మాధురి 1 - 3 లో నా వ్యాసమునం దది చర్చించియున్నాను.




శివభక్తమాహాత్మ్యమున వైశ్యాఖ్యానమున నొకరంగము

(శ్రీ కాశీనాథరావుగారి తంజాపుర ప్రాచీనచిత్రసంగ్రహమునుండి)

సామ్రాజ్యాంతర్భాగముగ నుండెనా? ఈ మొదలగు ప్రశ్నలకు సాధ్యమైనంత మట్టునకు నే నీవ్యాసమున సమాధానము చెప్పుటకు యత్నించెదను.

ఈ అయిదున్నర శతాబ్దములలోను రెండు సంవత్సరములు మనకు తెలియుచున్నవి. ఈ రెండింటిలో నొకటి క్రీ. పూ. ౧౧౦ వ సంవత్సరము, రెండవది క్రీ. పూ. ౧౫౦ వ సంవత్సరము. క్రీ. పూ. ౯౧౦ వ సంవత్సరము నేపాళదేశమును పరిపాలించిన లిచ్ఛావి వంశపురాజుల శక మారంభమైన సంవత్సరమైయున్నది. క్రీ. పూ. ౧౫౦ వ సంవత్సర ప్రాంతములలో నేపాళీయుల ప్రశంస భారతీ వాఙ్మయమున కానుపించుచున్నది. తళుక్కున మెరపుమెరసిన ట్లీ రెండు తేదులేగాని మరేదియు మనకు గానరాదు. తక్కినదంతయు కటికచీకటి. ఈ లిచ్ఛావిరాజులను గురించిగాని, వారి గొప్పతనమును గురించిగాని, వారి కట్టడములను గురించిగాని, వారి శాసనములను గురించిగాని చరిత్రకారుల కక్కరకువచ్చు విషయజాలము శూన్యముగనున్నది. క్రీ. శ. ౪౯౮ ప్రాంతములనుండియు లిచ్ఛావివంశజుల చరిత్రము వరుసగ (సమగ్రముగ) మనకు తెలియు చున్నది. అప్పటినుండియు బౌద్ధగ్రంథము లందు లిచ్ఛావి వంశజుల పేరెక్కుట యారంభించినది. అంతకుముందు నేపాళదేశస్థులు అనాగరికులుగాను, నేపాళదేశము అనాగరకదేశముగను భావింపబడుచుండెను. బౌద్ధగ్రంథములలో క్రీ. శ. ౪౯౮ సంవత్సరప్రాంతములందునుండి మాత్రమే లిచ్ఛావిరాజుల ప్రశంస కానబడుచుండుట చేతను, అంతకుముందు కానబడకుండుటచేతను లిచ్ఛావి రాజులు అంతకుముందు బౌద్ధధర్మమును వ్యాప్తిగావింప లేదనియు, వారు బౌద్ధమతసంబంధములగు నెట్టి నిర్మాణములను గావింపలేదనియు మన మూహించుట సమంజసము. లిచ్ఛావిరాజులేగాక వారి పూర్వులెవ్వరును కూడ అశోకుని యనంతరమున బౌద్ధగ్రంథములం దెక్కదగినంత మంచిపని గావించలేదని మనకు తెల్లమగుచున్నది.

కాని నేపాళదేశమున క్రీ. పూ. సుమారు ౧౦౦ సంవత్సరప్రాంతములందు స్వయంభూనాథ్ అను నొక పవిత్ర ప్రదేశమున బౌద్ధనిర్మాణములు గావింపబడి నట్లు తెలియుచున్నది. ఈ నిర్మాణములను గూర్చి చర్చించుటకు ముందు స్వయంభూనాథ్ క్షేత్రమును గూర్చి మన మించుక తెలిసికొనవలెను. నేపాళ దేశము కొండలతో నిండియున్నది. ఒకచోట కొండల చెంత నొక లోయగలదు. ఈలోయ పూర్వము నాగ వాసము అను పేరుగల గొప్పసరోవరమై యుండెను. ఇది మిక్కిలి లోతుగలదై అసంఖ్యాకములగు నీటిపక్షు లచే మనోహరముగ నావృతమై యొప్పుచుండెను. ఈ సరోవరమున కర్కోటకుడను నాగరాజు పరిపాలించు చుండెను. ఆకాలములో నాసరోవరమునం దొక్క తామరమొక్కయైనను మొలవకుండెను. ఇట్లుండగా అంతకు చాలకాలముక్రిందట విందుమతీ నగరమునుండి విపశ్యిబుద్ధుడచ్చట కేగుట సంభవించెను. అతి డొక తామరమొక్కను మంత్రించి యాసరోవరమున నాటి పై వి "ఈతామర పుష్పించినపుడు స్వయంభువగు బుద్ధభగవానుడు జ్యోతివలె భక్తులకు గాన్పించును" అని చెప్పి వెడలిపోయెను. ఈకారణముచేతనే స్వయంభూనాథ్, బోధ్నాథ్ దేవాలయములందు జ్యోతి యొక్కటి ఎల్లప్పుడును వెలుగుచునేయుండును. ఆ పిమ్మట శిఖిబుద్ధు డటకేతెంచి నాగవాసమొకచక్కని ప్రదేశముగపరివర్తనమందునని యు, యాత్రికులకును, బాటసారులకును హృదయాహ్లాదకరములగు ప్రదేశమగునని యు జెప్పి నాగవాసమునందే నిర్వాణమును పొందెను. ఆతరువాత విశ్వభూబుద్ధుడువచ్చి, బోధిసత్త్వుడొకడు నాగవాసమునుండి భూమిని వెలువరించిననాటినుండియు నీలోయ సమృద్ధికాలవాలము కాగలదని చెప్పిచనియెను. ఈ బోధిసత్త్వుడే మంజుశ్రీ. మంజుశ్రీ విశ్వకర్మ యాకారమును దాల్చి సరస్సుచుట్టును ప్రదక్షిణము గావించి తనఖడ్గముతో సరస్సునకు దక్షిణమునన్న కొండను చీల్చివైచెను. ఆచీలికలోనుండి నాగవాసమునందలి సలిలమంతయు దక్షిణసముద్రమునకు ప్రవహించెను. ఇదియే బగమతీనదియొక్క పుట్టుక. అటుపిమ్మట పూర్వప్రశాఖల యొక్క . సంరక్షణకుగా నొకబృందావనమును నిర్మించి ఖడ్గముతో పసులకొట్టుబచే సేర్ప

డిన పర్వతభాగములలో పదమూడికొండమీద నాతఁడు తన నివాస మేర్పరచుకొనెను. తూర్పుకొండమీద (పదమూడికొండగాక తూర్పుకొండయను సంశము మనము జ్ఞాపకముంచుకొనవలెను.) స్వయంభూనాథ్ దేవాలయము నిర్మితమయ్యెను. ఈ తామరకొండమీద మంజుశ్రీ శిష్యులు స్వయంభూనాథ్ స్తూపమును నిర్మించిరి. ఆ ప్రదేశమున నశోకుఁడు బౌద్ధనిర్మాణములను గావించెను. దానితూర్పు (పడమరకాదు) భాగమున సుమారు క్రీ. పూ. ౧౦౦ సంవత్సరముల ప్రాంతములందు మఱికొన్ని బౌద్ధనిర్మాణములు వెలసినవి.

ఈ నిర్మాణములకు బౌద్ధధర్మావలంబు లెవరో కారకులై యుండవలెను. నేపాళీయులు అప్పటిలో అనాగరకులని పైన తెలిపియుంటిని. వారే కట్టడములకు కారకులని యూహించుట కెట్టియావకాశమును లేదు. వారికట్టడములు క్రీ. శ. 500 సంవత్సర ప్రాంతములవఱకు కనబడలేకనబడవు. పైన చెప్పిన ప్రకార మెవడో మంజుశ్రీయనునతఁడచ్చటకు వచ్చియుండినట్లు కథకలదు.

నేపాళదేశపు సంప్రదాయములను మాచితిమేని, అందు స్వయంభూనాథ్ తూర్పుస్తూపాదులు గోరాడిస్[7] అనువానిచే నిర్మింపబడినట్లు తెలియగలదు.

## ఆకాలములో నేపాళము - భారత దేశము - ఆంధ్రులు

ఈమంజుశ్రీ, గోరాడిస్ అనువార లేదేశపువారో యాలోచించుటకుముందు క్రీ. పూ. 100 సంవత్సర ప్రాంతములందలి భారతదేశచరిత్రమును మన మొకింత పరిశీలించవలెను. క్రీ. పూ. 200 సంవత్సర ప్రాంతములందు ఆంధ్రులు మౌర్యసామ్రాజ్యమునుండి విడిపోయిరి. అప్పటినుండి స్వతంత్రులై వారు భారతదేశమున నొక గొప్పసామ్రాజ్యమును స్థాపించబూనుకొనిరి. ఈ సామ్రాజ్యకాంక్ష సందర్భమున వారు దక్షిణదేశములను లోబరచుకొని యుత్తరదేశములను గూడ స్వాధీనపరచుకొనఁ జూచుచుండిరి. ఇంతలో మగధదేశాధీశుఁడును, కణ్వాయనుఁడును అయిన సుశర్మ ఆంధ్రరాజులలో నొకనిచే నిహతుఁడయ్యెను. మగధరాజ్య మాంధ్రుల చేతిలోఁబడెను. ఇది జరిగిన సంవత్సరము క్రీ. పూ. ౨౭.[8] ఆంధ్రులు మగధదేశమును స్వాధీనపరచుకొనకపూర్వము (మౌర్యుల యనంతరమున) శుంగవంశజులును, కణ్వాయనులును రాజ్యము చేసిరి. వారితరువాత మగధ సామ్రాజ్యము క్రీ. పూ. ౨౬ వ సంవత్సరమున హిమాలయ పర్వతప్రాంతములవఱకును వ్యాపించెను.

ఆ కాలములో భారతదేశమున పలుకుబడిగల రాజన్యులలో కుషాణ్ వంశీయులు కలరు. వీరి విషయమై సరిగ నింతవఱకును కాలనిర్ణయము జరిగియుండలేదు. వీరెట్లున్నను యీవ్యాసోల్లేఖనమునకు సంబంధించినంతవఱకును వివాదము అప్రస్తుతము.[9] కుషానులాకాలపుప్రాంతములందుండిరని మన మంగీకరించినను, వారు నేపాళపరిసరప్రాంతములకు రాలేదనియు మగధాది దేశములందు వారినాణెములు వగైరాలు కనపడలేదనియు చరిత్రకారులును, పరిశోధకులును చెప్పుచున్నారు.

పైన వివరించిన సందర్భములనుబట్టి మగధలో మౌర్యులయనంతరము శుంగకణ్వవంశీయులను పిమ్మట భారతిసామ్రాజ్యాధీశులగు నాంధ్రులు నుండిరనియు పశ్చిమోత్తర హిందూస్థానమునందు కుషానులుండిన నుండియుండవచ్చుననియు స్పష్టపడుచున్నది. నేపాళదేశమున కుత్తరమున టిబెట్ (త్రివిష్టప) దేశము గలదు. కానీ టిబెట్ దేశమునకు రాజగు స్రాంగ్ త్సాన్-గంబో యనునతఁడు నేపాళదేశపురాజగు అంశువర్మ కుమార్తెను వివాహమాడిన యనంతరముగాని యీ

7. Perceval Land n. Nepa

8 Barnett Antiquities cf India.

9. John Marshall వగైరాల పరిశోధనలవలన కుషానులాకాలపు ప్రాంతములవారని ధృవపడుచున్నది

రెండుదేశముల సంబంధమువలన టిబెట్ దేశమునందుని బౌద్ధమతము వ్యాపించలేదు. ఈస్రాంగ్-త్సాన్-గంబో రాజు టిబెట్ దేశపు మొదటిరాజైయుండెను.10 ఈతని వివాహము క్రీ. శ. ౬౩౯ వ సంవత్సరమున జరిగినది కాబట్టి మనవ్యాసమునకు ప్రస్తుతమగుకాలమున, టిబెట్‌న చెప్పదగినరాజు లేడనియు, ఆకాలమునందు బౌద్ధమతము టిబెట్‌న వ్యాపించలేదనియు మనకు వెల్లడియగుచున్నది.

భారతదేశమున గుప్తవంశీయులగు చంద్రగుప్త విక్రమాదిత్యుడు, సముద్రగుప్తుడు మొదలగువారు క్రీ. శ. నాల్గవశతాబ్దమునందు నవతరించిరి. కావున వీరి విషయముగూడ మన కప్రస్తుతమేయగుచున్నది.

ఈ పై సందర్భములనన్నిటిని మనము నిష్పక్షపాతబుద్ధితోను, సరియగు చారిత్రకదృష్టితోను ఆలోచించితిమేని స్వయంభూనాథ్ మున్నగు బౌద్ధనిర్మాణములు ఆ కాలమునందు భారత సామ్రాజ్యసింహాసనము నధిష్ఠించియుండిన యాంధ్రులు తప్ప నింకెవ్వరును కారకులు కారనుటకు మనము సాహసింపవచ్చును. ఏలయన ఆంధ్రులు అమరావతీస్తూపాది బౌద్ధనిర్మాణములను నెలకొల్పి యనంతమగు కీర్తిని గడించినసంగతి లోకవిదితము. ఆకాలములో ఆంధ్రులుదప్ప బౌద్ధధర్మమును ప్రోత్సహించిన రాజన్యు లింకొకరు లేరు. మగధాధీశులగు శుంగులు బ్రాహ్మణ ధర్మపక్షము వహించి బౌద్ధమతమునకు పూర్తిగా వ్యతిరేకతను వహించియుండిరి. ఇట్టి సందర్భములో నాకాలపు బౌద్ధనిర్మాణము లాంధ్రుల కర్తృత్వమునకు సంబంధించినవిగాని, ఆంధ్రుల ప్రోద్బలమున నేపాళమున నెలకొల్పబడినవికాని అయియుండవలెను. ఈ రెండిటిలో నేది సమంజసమగు నూహయో యింకను చాలవరకు పరిశోధన చేసినగాని మనము తెలిసికొనజాలము.

ఏమి, ఆంధ్రులు నేపాళమువఱకును పోయిరా, యని సందేహముతో ప్రశ్నించు పక్షపాతబుద్ధిగల చరిత్రకారు లనేకులు గలరు. మగధదేశమును జయించిరను మొదలగు పైసంగతులను జాగరూకతతో పరిశీలించుచు నిట్టిప్రశ్నచేయుట కెట్టి యవకాశమును లేదు. ఇంతేగాక కలకత్తాకు చాలదూర్పున, అనగా నించుమించుగ బర్మా సమీపమున ప్రోం అను పట్టణముగలదు. ఆపట్టణము ప్రాంతములందలి యొకశాసనమును కొందఱు శాసనవేదులు పరిశీలించి క్రీ. శ ౫ లేక ౬ శతాబ్దుల నాటి యాంధ్రశాసనములకును దానికిని గల పోలికను చూచిచూచి యాశ్చర్యమందిరి. 11 దీనినిబట్టి చూచినచో బర్మావఱకునేగిన యాంధ్రులు నేపాళమునకు పోవుటలో నెట్టియాశ్చర్యమును లేదని పాఠకులకు విన్నవించుచున్నాను.

ఐనను, పైనచెప్పిన యుక్తియుక్తములగు నూహాజాలముమీదనే మనమాధారపడియుండవలసిన పనిలేదు. ఆంధ్రులు నేపాళమునకేగి యచ్చట విశేషప్రోద్బలము గలిగించిరనుటకు నేపాళదేశమునందే నిదర్శనములుగలవు.

## పుణ్యక్షేత్రములు

స్వయంభూనాథ్, బోధ్‌నాథ్, మహాబుద్ధ అను మూడు పుణ్యక్షేత్రములలో స్వయంభూనాథ్‌నుగూర్చి చిట్టచివరకు చర్చించితిమి. ఇప్పుడు తక్కినరెండిటిని గూర్చి మాత్రమే ఆలోచింతము. ఇందు మహాబుద్ధలోని నిర్మాణములు దక్షిణభారతదేశమునందలి నిర్మాణములను జ్ఞప్తికి తెచ్చుచుండెను. 12 కాని మహాబుద్ధాలయము, బోధ్‌నాథ్ నిర్మాణము క్రీ. శ. అయిదవ శతాబ్దిలోనిదని సిల్వయేన్ లెవీయను పరాసు చరిత్రకారుని అభిప్రాయమైయున్నది

---

10 **Political Founder.**

11. ఈ విషయము నాకు మ-రా-రా-శ్రీ నేలటూరి వేంకటరమణయ్య ఎం. ఏ., పి. హెచ్. డి., గారు ౨౫-౫-౧౯౩౭ దీన తెలిపిరి.

12. It will be observed that the central sikra is reminiscent of an Indian style .........the carving is excellent and recalls south Indian decoration...Landon.

గూర్చి పైన వ్రాయుచు నేపాళదేశమునందలి సాంప్రదాయములప్రకారము గోరాడిస్ అను నొకడు స్వయంభూనాథ్ దేవాలయ శిల్పములలో ప్రసిద్ధికెక్కిన స్తూపమును నిర్మించెనని తెలిపియుంటిని. కాని యీ గోరాడిస్ యెవ్వరో నిర్ణయించుటకు తగిన ఆధారములు నాకు లభింపలేదు.

పూర్వము నాగవాసమను సరస్సునకు దక్షిణమునందున్న కొండను చీల్చి బగమతీనదీ జననమునకు కారణుడై స్వయంభూనాథాలయమున్న కొండపై నివాస మేర్పరచుకున్న మంజుశ్రీ యెవ్వడని మన మిపుడు యాలోచింతము. కొందఱు పాశ్చాత్య పరిశోధకులు 'మంజుశ్రీ' యను పదములోని 'మంజు' యనుమాటను తీసికొని దీనికిని 'మంచూ' యనుమాటకును దగ్గఱచుట్టరిక మున్నదని ఘోషించిరి. ఇట్లు ఘోషించి చీనాదేశమును పరిపాలించిన చక్రవర్తులలో మంచూవంశమునకు జెందిన చక్రవర్తు లుండిరనియు, ఆమంచూవంశమునకు జెందిన చక్రవర్తి యొకడు కర్కోటక నివాసమైన నాగవాసమును నిర్జలముగ నొనర్చి బగమతీజననకారకుడయ్యెనియు కొందఱు పాశ్చాత్యపరిశోధకుల వాదన. సన్నని దారముమీద నాధారపడిన పెద్దరాతివలె, అసమంజసమును, నిస్సారమును నగు కారణముపై నాధారపడియున్న యీ పాశ్చాత్యపరిశోధనయొక్క ఫలము ఎట్టి పరిశోధనాసూత్రములకును అనుకూలించునది కాదు.

ఈవ్యాసమునం దింతవఱకును తెలిపిన యనేకములగు సంశయములనుబట్టి యాంధ్రులలో నిట్టి నామముగల వా డెవ్వడేని యున్నాడాయని మనము ప్రశ్నించుకొనుట సమంజసము. ఏల యన ఈమంజుశ్రీయను నామము చీనాదేశపునామము కాజాలదు. చీనాకును నేపాళమునకును ఆకాలములో నెట్టి సంబంధమును లేదు. నేపాళమునుండి చీనాకుబోవుటకు టిబెట్ దేశమ్ము నడుమనున్నది. మన మాలోచనలోనున్న కాలమున టిబెట్ అనాగరికత కాలవాలమై యుండెననుట నిర్వివాదాంశము. అప్పటిలో టిబెట్ దేశమును చీనావారు పట్టుకొన్నట్లెంగును గానరాదు. కావున చీనాదేశీయు డొకడు టిబెట్ నుండి నేపాళమును జొచ్చెననుట యూహాతీతమే యగునుగాని సత్యమగు పరిశోధన కాజాలదు. ఇంతేగాక నేపాళము భారతదేశ భాగముగాని చీనాభాగము కాదు. ఇట్టి సందర్భములో చీనావా డందు ప్రవేశించెననుట నిరాధారమగు ననుమానమై యున్నది.

ఇక మంజుశ్రీ యెవ్వడైయుండవలెనని మనము ప్రశ్నించుకొని యీప్రశ్నకు సమాధాన మిచ్చుటకు బూనుకొందము. ఆంధ్రరాజుల పట్టిని చూచినచో నందు కొన్ని పేరులు కానవచ్చును. అందుముఖ్యముగ శివశ్రీ యనునొక యాంధ్రరాజేంద్రుడును, యజ్ఞశ్రీ యనునొక యాంధ్రరాజేంద్రుడును, చంద్రశ్రీ యను మఱొక యాంధ్రరాజేంద్రుడును కనబడుచున్నారు.[14] కావున మంజుశ్రీ వంటి పేరులు క్రీస్తుపుట్టిన ఒకటిరెండుశతాబ్దుల ప్రాంతములో నాంధ్రరాజులకున్నట్లు పై పట్టియందలి నామములవలన స్పష్టమగుచున్నది. కావున పాశ్చాత్య పరిశోధకుల కారణములకంటె నెక్కువ సామ్యములును, శాస్త్రీయములును, అంగీకారార్హములును, అనుమానరహితములును నగు కారణము లాధారములుగ మంజుశ్రీ యాంధ్రుడగు బౌద్ధుడగునో, లేక యాంధ్రరాజుల వంశజుడో, యే యాంధ్ర చక్రవర్తికో సోదరుడో యని మనమూహించుటకు దగిన యవకాశమున్నది. ఇప్పటివఱకును ఈవాదము తప్పక నిజమని ఘంటాపథముగా నేను చెప్పజాలను. ముమ్ముందు చరిత్రకారులుచేయు పరిశోధనల ననుసరించి యీనా నమ్మకము ధృవపడునని నే నాశించుచున్నాను.

ఈ సందర్భముననే గోరాడిస్ విషయమైకూడ కొన్ని నా యనుమానములను చరిత్రకారులకును, పరిశోధకులకును తెలియజేయుట యుక్తము. గోరాడిస్ అనుపదము 'కర్ణ' 'కర్ణుడు' అను పదములతో సంబంధముకలదై యున్నట్లు అక్షరశాస్త్రజ్ఞు లంగీకరిం

14 See Pargiters list of Andhra Kings.

ఆంధ్రమహాపురుషులు :

# ౯. కూర్మా వెంకటరెడ్డి

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

ప్రజ్ఞాధురీణులైన వ్యక్తులు మానవులందు కోటికి తేజరిల్లు మానికములను గుణుతింపజాలువారు వీరిలో మంది మాత్రమే కలరు. ని అంతరంగములందు స్వల్పసంఖ్యాకులే! ఆత్మశక్తిని సద్వినియోగపట్టినవారిలో



సర్ కూర్మా వెంకటరెడ్డిగారు

కొందరికి మాత్రము దానిని విజృంభింపఁజేయఁగలుగు తెరుణములు లభించును. ఈ శక్తిమహత్త్వమును గుర్తించి దానిపై ప్రాపునొందు విసర నాతురపమునారి సంఖ్య అత్యల్పము. విజ్ఞానదృష్టిఁగల ఈ యల్పసంఖ్యాకులలో విశాలదృష్టిఁ గలవారెందఱో యుందురేమో అని అప్పుడప్పుడు తలపోయుచుందును విమర్శకులకన్న చూడ్కిఁ గలవారై యుండవలెనని నాకు కార్లయిలుమహాశయుఁడు. ఇట్టి చూడ్కి ఒక్కటియు చాలదు. చూపుఁగల వారిలో కొందఱు రవిబింబమట్లు కన్పట్టుట కాంతిలు ప్రజ్ఞకు ప్రణమిల్లుటకు నేమాఱు అంతరంగము నీర్ష్యా నలమును గవులొక్కలిపి, ఒకకంట దుమ్ము, రెండవ కంటఁ గారమును కొట్టి ప్రజ్ఞాశాలిని జునుప్సయందు గూలద్రోయఁజూతురు. పహ్యాదయులుకాక మేధావులైన విమర్శకులు కసాయిజాతివారు. వీరిచే తన మతి మందులకు ముసలము వచ్చితీరును ఈ ముస మునుంచి విశివశీనను వీ రసృష్టశేవతి ప్రసన్నతనందరేని సమీక్ష స్పర్శ దెలుగిని న మసంతతులట్లు వ్యర్థులై యుందురు. కావున పజ్ఞానురీణులను ప్రతిఘటించు ప్రతికూలపరిస్థితు లెన్నోకలవని నొక్కి చెప్పెదను.

శక్తి సమన్వితులైన వ్యక్తులందఱు తా మందవల యు ఆసీరానురాణ ములకై తపింతురని తెలుప లేము. ఒరులకన్నుల బడక కర్తవ్యము నెఱపి నిష్కామకర్మ ప్రేమల ననవరతము నిటలత ఘటితాంజలులైన మహనీయులెందరో లోకప్పుడు భారతసీమయందు వరలియుండిరి. ఈకాలమున నిట్టివారి నెందఱో కానలేము. తమశక్తి నెంచో యడఁగియుండనీయక, దానిని పృథ్వివాసుల ప్రేమల ప్రకాశమునరింప నాశరంపకు నల్పసంఖ్యాకు లును, ఏశక్తిలేక బహు సంఖ్యాకుల ప్రశంసకై ప్రాకు ళ్లు ప్రమింగు బహుళసంఖ్యాకులును తమ యుద్దేశసిద్ధికై పూర్ణ్వ లెఱుగని తెరవుల నెన్నేని నీడు కనుగొన గలుగు చున్నారు. విజయడిండిమమును ప్రమోగించుచు, స్థల కాలముల యడ్డంకులను నెట్టివేసి సైన్య సేను పృథ్వి వాసులను సన్నిహితులను చేయఁజాలు ప్రాముఖ్యమును పడయఁ గాంక్షించు ప్రజ్ఞాధురీణులు నేఁడవలీలగ కృతార్థులు కాఁగలుగుచున్నారు.

ప్రజ్ఞాసమన్వితులైన ఆంధ్రులలో పూర్వా వెంకటరెడ్డి ఒక్కఁడనుట నిస్సంశయము. ఇతఁడు పటిపది కృషిక కుటుంబమునందు. సరస్వతిగాని, లక్ష్మిగాని, తావులేనితావలమున నితఁడు తలసూపినాఁడు. నిరంతర పరిశ్రమను కనులఁజూచి శైశవమున దాని నీతఁడు తన దానిఁ గావించుకొనినాఁడు. గతబదారిద్ర్యములచే నల్లారుముద్దుగఁ బెరుఁగక భారతకృషికుఁడు ధృతి సహనములను తనవి గావించుకొనినాఁడు. ఉక్కుమీఁటి పైఁబడు ఇక్కట్టులలో పోరజాలు యోధుఁ డీతఁడు. వచ్చివారితో పోరి, తనసత్త్వమును జూపి రజతపారితోషికముల నందిన కుమందార్ సాంబయ్య వెంకటరెడ్డి తాతముత్తాతలలో నొక్కఁడని వినుచున్నాము. యోధ రక్తము రెడ్డిశరీరనాళములందు ప్రవహించుచుండుటచే, యోధగుణముల నీతఁ డలవఱచుకొన్నాఁడు. భయపమైన నిష్ఫ్చరముతో నీతఁడు తొలుత పోరుసలిపినాఁడు. లోకతంత్రములో జనింపుటఁ గని ఎత్తుకొండపై మంగాలీగ్రేళ్లపై నిలువవలెనని ఈతఁ డభిలషించినాఁడు. తనభావిజీవన మెట్లుండవలెనో నిశ్చయించుకొనినాఁడు. ఉద్దేశసిద్ధి నందితీఱవలెనని పట్టుపట్టినాఁడు.

ప్రత్యేకకాలపరిస్థితుల ననుసరించి ప్రత్యేకాశయములు ప్రాముఖ్యము నొందును. తమకాలమున ప్రజాళి పూర్వజనందు ఆదర్శములమీఁదనే బాలురును, యువకు లును దృష్టిసారింతురు. వాని నందుకొనవలెనని పెక్కువ పడుదురు. చారిత్రకకారణములనే, భావవాతావరణమున మార్పు గోచరించుతఱి ఈ యాదర్శములందును పరివర్తనము పొడసూపును. ననుకటి యాశయములనే ఇలువేలుపులు గావించుకొనిన యువకులు కొందఱు తరువాతికాలమున యువకులుకాక తమ యుత్సాహమును గోలుపడుటచేతనో, హృదయమం దొకప్పుడు పొందుకొనిన అపోహల నూడపఱుచుకొను కిచ్చగింపకపోవుటచేతనో తమ తొంటితెన్నునుండి కదలరు. ఒకప్పుడు తాము స్థిరపఱచుకొనిన గమ్యస్థానమును చేరుటకు సర్వశక్తులను వినియోగించి యెట్టకేలకు వీరు కృతకృత్యులగుదురు. కాని తరువాతికాలమున (కాలక్రమమున

నైనను, అట్టిశకమున తేజరిల్లు భాస్వదాశయములను చేరుటకై వీరు కృషిసలుపరేని వీ రారాధ్యదేవతలు కాఁజాలరు. ఇట్లని వీరిని దుర్విమర్శనకు గురిగావించుట పాడిగాదు. వెనుకటి పల్లవిని మార్చలేదని, నూతనగీతి కాలాపముతో తమ మధురస్వరములను మేళవింపలేదని, మనమాడు ఆటను వారును ఆడలేదని వీరిపై కారములను, మిరియములను చెరిగిపోయుట న్యాయముకాదు. వీరి కృషియందు నిహితమైన నిశ్చయశక్తిని, వీరికనులందు తళ్కొత్తిన స్థిరదృష్టిని, బహుళాభిప్రాయముల నెదిరింపజాలు వీరి స్వాతంత్ర్యబుద్ధిని, చలనమెఱుఁగని వీరిదీక్షాశక్తిని గని వానిపై పూలుచల్లుట సహృదయుల కర్తవ్యము.

వెనుకటి శకమందలి ఉన్నతాశయ మొకటి కొలదిమంది ఆంధ్రుల దృష్టి నాకర్షించినది. వీరిలో ముఖ్యులు మువ్వురు. మొదటివాడు బయ్యావరసింహేశ్వరశర్మ. రెండవవాఁడు ఉద్భగంటిరాఘవేంద్రరావు. మూడవవ్యక్తి కూర్మా వెంకటరెడ్డి. నిష్ఠురపరిస్థితులందు జనించినవారు ఉన్నతోద్యోగమందెనచో గొప్పపదవి నందినచో సార్థక జీవులగుదురని యువకులై యుండగనే వీరు తలంచిరి. ఈతలంపునకు తమ మనసులందు వీరు తులసికోటలు నిర్మించిరి. పెద్దలయ్యు, దానికే పూజాదులు సమర్పించిరి. ఈ యుపాసనముకతన వీరియాశయము, ముగ్గినపండువలె వీరి చేతులందుఁ బడినది.

'Genius is the Capacity of taking Pains" అనినాడు కార్లయిల్. ఈ భావమునే మరొక ఆంగ్లమనీషి స్వాంగ్యశ్లోకమున "Ninetyfive percent of perspiration and five percent of Inspiration Constitute Genius" అనినాడు అంతరంగమందలి అద్భుతశక్తిని తెలుపుచునది కావుననే పరిశ్రమకు సారస్వతాచార్యులు పట్టముఁగట్టిరి. వెంకటరెడ్డి ప్రధానగుణము పరిశ్రమ యంతేనిగదా! ఆత్మవిశ్వాసమును, ధైర్యమును దీనికి తోడుపడినవి. ఈ మూడును త్రిమూర్తులను పోలునవి. ప్రతికూలపరిస్థితులందు పుట్టిన వెంకటరెడ్డి వీనికతననే ముందంజవేయ జాలినాడు. అంజవేయజాలక జీవనజన్యమున నేలగూలినవేళలందు "హతోస్మి" యని పడియుండక హృదయమున దుఃఖమునకు, నైరాశ్య భావమునకును చోటీయక, అంతరంగమందలి సహన శాంతులను చలింపనీయక, ద్విగుణీకృతోత్సాహమున "హుమ్మ"ని తరువాతి పూనికకు గడంగి రెడ్డినాయుడు వీనికతననే జేగంట మ్రోగించినాడు. వీనివలననే వీని యంతరంగమందలి శక్తి ఆత్మప్రకాశము నందినది. తన్ను దాను గుర్తించుకొనిన ఈగడుసరి తన్ను గుర్తింపగలుగు వారియందుఁ జేరినాడు. భాగ్యదేవత ప్రసన్నత నంది తన క్రియాంగణమున విజయకేతనమును స్థాపించినాడు.

వెంకటరెడ్డి జీవనమును పుంఖానుపుంఖముగ పరిశీలించితిమేని ప్రతిక్రియాంగణమందును పైన దెలిపిన మూడు గుణముల నాతడు వ్యక్తీకరించుట గాంతుము.

శైశవశిక్షణము చక్కనైనపుడే అంతరంగమందలి ప్రజ్ఞాంకురము కాలక్రమమున మహోన్నత మహీరుహమై, సుమపూరిత హస్తములను దిక్కామినుల దెసజాపు వేలుపులట్లు భావప్రసూన విలసిత శాఖలను భావిజీవనమున సారించును. బాల్యమహత్త్వము వర్ణింపరానిది.* తూరుపుదిక్కున తళ్కొత్తు రంగారు బంగారు వెలుగురేకయే సహస్రమయూఖములకు కన్నతల్లియగు లీల, రక్తాధరంజిత శైశవమే ప్రభాకలిత భావిజీవనమును కనఁజాలును. విద్యావంతులైన తల్లిదండ్రుల శిక్షణముచే నేమి, మహనీయ గుణగరిష్ఠులైన గురువుల ప్రబోధముచే నేమి, సచ్చరిత్రులైన సహపాఠుల దృష్టాంతముచే నేమి, భావసంభరితమైన స్థల వాతావరణములచే నేమి, పవనాలోకముల కతన ప్రస్ఫుటించు మొగ్గవలె శైశవసమయమున మనుష్యశక్తి కుసుమించును. అధునాతన ఆంధ్రావనికి ప్రధానాచార్య

* "Bliss was it in that day to be alive
But to be young was very heaven — Wordsworth
See also Wordsworth's "Intimations"

లైన వీరేశలింగ వేంకటరత్నముల చరణోపాంతమున, గూర్చుని విద్య నభ్యసించుట వెంకటరెడ్డి అదృష్టము. వీరేశలింగమును మించిన ఆంధ్రపండితుఁడు లేడు. రఘుపతి వేంకటరత్నమును మించిన ఆంగ్లభాషావిశారదు లెందఱో లేరు. వీరిరువుర యుపదేశనమువలన వెంకటరెడ్డి ఆంధ్రాంగ్లములందు చక్కని పరిజ్ఞానమును సంపాదించినాడు. వీరికతన నూతనభావోద్యమ మహత్త్వమును పిన్నతనమందే హృదయంగమ మొనరించుకొనినాడు. అస్పృశ్యులకు జూపఁబడు అనాదరము నీతకు పలుమాఱు గర్హించినాడు. "మీసీమయందు హరిజనుల నణచియుంచు మీరు మాకడ నాదరభావము నెట్లపేక్షింతు?"రని భారతేతరులు పలుమాఱు దక్షిణాఫ్రికాయందు తన్ను ప్రశ్నించిరనియు, దుఃఖావమానములతో తాను తల వాంచికొనవలసివచ్చెననియు నొకప్పుడు వెంకటరెడ్డి పలికినాడు. "మేజువాణి" పేరిట, "కళోపాసన" మను మిషతో పవిత్రమైన పరిణయమహోత్సవములను కలుషవాతావరణముతో నింపు హిందూ దురాచారమును తన యాచార్యుఁడైన వేంకటరత్నమువలె నీతఁడు పెక్కుమాఱులు ప్రతిఘటించినాడు. సంఘసంస్కరణమునెడల విశేషాభిలాషఁ జూపినాడు.*

ఆంగ్లవిద్యాధికులంగు భక్తిగుణముఁ గలవారరుదు. విద్వాంసులయెడలను, జగదీశునియెడలను వెంకటరెడ్డికి చాల భక్తి కలదు

ఒండొరుల యెడందలను బంధించు అదృశ్య ఆధ్యాత్మికసూత్రము భక్తి. పృథ్వియంతయు స్వర్ణశృంఖలముచే నీశ్వరుని చరణములకు బంధింపబడినదని నాకు టెన్నిసన్ మహాకవి. ఆసూత్రమును, ఈశృంఖలమును మహత్తర ప్రేమబంధనమునకు వేఱుగావు. ప్రేమయును, భక్తియును దగ్గఱిచుట్టములు. ఆత్మార్పణమునకు వ్యక్తిని ప్రేరేపించు మహత్తరశక్తి లివి. ఒండొరులాత్మార్పణమునకై యాతురంపడునపుడు పరస్పర హృదయములందలి అద్భుతవిభూతిని తమిని గాంచుకొందురు. భక్తిగుణము బాల్యదశయందె దిగబడినపుడే మానవుని కది అభ్యున్నతిని ప్రసాదించును. భక్తిస్పర్శగాని, ప్రేమస్పర్శగాని యెఱుఁగని హృదయము పెండుకట్టియ యనునని స్మరించిరే, ప్రాచీనులు శైశవమందే ఇవి మనుష్యజీవనమున జీర్ణించుటకై బహుళముల్లైన వెరవులు గోసిరి. వీనిలో నాఁటి విద్యావిధానమొకటి. గురువునెడల ననురక్తుఁడైన నాటి విద్యార్థి గురువునందు కాంతిలు గుణములనవలీలగ నలవఱుచుకొనువాడు.

విద్యార్థి భక్తిశ్రద్ధ నాకర్షించు గురువులు నేఁ డెందఱో కానరాకుండుట మన దేశదౌర్భాగ్యము. నేటి విద్యార్థులకును, ఆచార్యులకును సన్నిహితసంబంధమున్నదనుట సత్యమునకు తలవంపులు తెచ్చును. నేటి విద్యావిధానమున ప్రణయభావముగాని, భక్తిభావముఁగాని లేకుండుటచే, అది రసమయముగాక, సుందరముగాక, మహదాశయసందీప్తముగాక, సౌరభసమన్వితముగాక ఎల్ల లెఱుఁగని యెడారివలె నున్నది. ఎడారిలో గూడ నిందందు పచ్చందనము గోచరించులీల నేటి విద్యావిధానమున నందందు ఒకొక్క ఆచార్యవాగ్యము గోచరించుట ముదావహము.

సూర్యస్పర్శకై రాత్రియంతయు తపించితపించి ప్రభాతమున ప్రభాకరదర్శనభాగ్యమంది వెల్లువెల్లువను బుఱుపిందు కాంతిపూరము నాత్మహృదయ మొలుకాడించుకొనుచు, కుఱుకు కమలము కరణి, భ్రమరముపై చూడ్కి నిలిపి ఇందిందిరమై మధురఝంకృతులు సలుపుచు పూవుపంతి యొడందయందు తావునందు కేటు

---

* "In the name of this religious neutrality urgent and imperative social reforms have been ignored or retarded. It is in the name of this religious neutrality that the consecrated nautch girl continues to ply her infamous trade and the Panchama — untouchable and oppressed — is left out side the pale of Hindu Society, a pitiable outcaste" Vide: Sir K. V. Reddy's Address delivered at the Annual convocation of Andhra university on the 19th December 1934.

కముకై వడి, ఈశ్వరునిపై దృష్టిని బద్ధమొనరించి కాలక్రమమున నీశ్వరశక్తినంది "సోఽహమ్" అని కంఠమెత్తి పలుకు పరివ్రాజకుని పగిది ఆదర్శాచార్యుని ఉద్బోధనము మీరను, దృష్టాంతము మీరను కన్నులుపు విద్యార్థి ఆతని గొప్పగొనముల నలవఱచుకొనగలడు.

మహత్తరచారిత్రులైన ఇర్వురాచార్యులను సేవించినందువలన వెంకటరెడ్డి కొన్ని మహాపురుష లక్షణములను చిక్కబట్టినాడు. ఈ యాచార్యుల నెరుగనిచో, నీతడేమైన నేడెందో పడియుండువాడని కంఠమెత్తి తెలుపుదును. ఇట్లని వెంకటరెడ్డికూడ గుర్తించెనని నా తలంపు. పంచశీలలలో గురువొక్కండు కదా! తన తండ్రిని బూజించినట్లే, తన యిలువేల్పైన వేణుగోపాలుని* గొలిచినట్లే, వీరేశలింగము వెంకటరత్నముల నీతడు పూజించినాడు. నేడును వారి గొప్పగొనముల నావేశపూరితుడై ప్రశంసించుచుండును.† కొంతకాలమునకు మున్ను మదరాసు విశ్వవిద్యాలయమున వెంకటరత్నము యొక్క పటము బహిర్గతమగుతఱి వెంకటరెడ్డి కావించిన మహోపన్యాసము గవర్నరు ప్రభృతుల హృదయములను తట్టినది.

పట్టాభిరతె నీతడు పదునెనిమిదవయేటనే పట్టపరీక్షయం దుత్తీర్ణుడైనాడు. తోడనే మెట్కాఫ్ దొర దృష్టి నాకర్షించినాడు. రాజమండ్రి కళాశాలయందు కొంతకాల మధ్యాపకుడై యున్నాడు. రామదాసు వలె శిష్యులలో నీతడు పట్టపరీక్షయం దుత్తీర్ణుడయ్యు, ఇతరవిజ్ఞానాంశములను వలచినాడు. రామదాసునకు ప్రీతి గొలిపినది అర్థశాస్త్రము. వెంకటరెడ్డి దృష్టి జూరగొనినవి చరిత్రయును, సాహిత్యమును. ఈతని శిష్యు లుపన్యాసములు సాహిత్యోపన్యాసము లట్టుండెడివట. బి. ఏ. విద్యార్థులకు బోధనచేయుటకై సాధారణముగా ఎం. ఏ. పరీక్షలో నుత్తమ తరగతియందు కృతార్థులైనవారే నియోగింపబడుచుందురు. బి. ఏ పరీక్షలో నెగ్గుదల నందినంతన అధ్యాపకవృత్తిని నిర్వహింపజాలుదు మను ఆత్మవిశ్వాసము ఎందఱికో యుండదు. శిష్యు లెక్చరరు అవ్వలికరిగిన మహూర్తమున, ఆతని యనుమతి ననుసరించి కావించినమాదిరి బోధనయందే ఈతడు తన వాకచక్యమును జూపినాడు.

ఆత్మవిశ్వాసమే మనుజునిచే నెంతెంత పనులైన జేయించును. కడపులో నించుక సరుకున్న జాలును. ధృతిగలవ్యక్తి ఆసరుకును వేయివిధముల విజృంభింపజేయజాలును. వెంకటరెడ్డి మహా విద్వాంసుడని తెలుపను. సాహిత్యమందును, తత్త్వశాస్త్రమందును, రాజకీయములందును, చరిత్రయందును ఈతనికి చక్కని అభినివేశ ముండుట నిక్కమే! కాని యీ జ్ఞానశాఖలం దీతడు నిండుకుండయైనాడనుట

---

* ఈవేలుపునెడల వెంకటరెడ్డి కెంతో భక్తికలదు. రాజమండ్రిలోని వేణుగోపాలస్వామి కీతడు కొంత భూదానముచేసినాడు. హిందూమతముపై నీతనికి ప్రీతిగలుగజేసిన దీతని యర్ధాంగలక్ష్మి దృష్టాంతము. తమ మగబిడ్డ లందరికి నీదంపతులు వేణుగోపాలనామముచే పెట్టిరి.

† "There are no two greater, more honoured, more inspiring names in the Brahmo Samaj movement than the late Kandukuri Veeresalingam Pantulu and Dr. Sir R. Venkataratnam Naidu, who happly is still in our midst, and whose whole life has been one of saintly devotion and who even in his old age, reminiscent of an ancient Maharishi, is the inspirer and guide of all the activities and movements that are spiritually uplifting and morally elevating in the Telugu Country. The social reform movement at the end of the last century made no greater and more fruitful advance any where in India than in the Telugu country under the inspiring guidance of Veeresalingam Pantulu. The social cankers infecting Hindu society withered before the fiery gospel that Veerasalingam preached in his journal Vivekavardhini" Sir. K. V. Reddi

కల్ల. అద్భుతపాండితిని ప్రదర్శించియు, సహజశక్తిని వ్యక్తపఱచియు నైదుఖండముల ప్రశంస నందఁగల మహా మనీషులందు వెంకటరెడ్డికి తావులేదు. నింగిమీది చుక్కలీతని విజ్ఞానము గాంచి తన్మయానందమున మల్లెలట్లు వీనిశిరమున రాలవు. అనంతకాల మీతని ప్రతిభను గుఱించి నిస్తబ్ధగీతికల నాలాపించి విహాయస మున బులకలు లేపవు. ఘనపరిశ్రమకతన దానందిన విజ్ఞానమును జంకుగొంకులులేక మహాసభలందు విజృంభింపఁ జేయజాలు దిట్ట కావుననే వెంకటరెడ్డి పెద్ద పలుకుబడి సంపాదించినాడు. ఈతనిమించిన విద్వాంసు లెందఱో ధైర్యగుణమున గొఱవడుటచే ఆత్మవిశ్వాసము నంతగా నెఱుఁగకపోవుటచే కోళ్ల బుట్టలోని మానికము లట్లు పడియున్నారు. బాల్యమునుండి ఈ రెండుగుణము లను విశేషముగా పట్టుపఱచుకొనిన వాడుకావున వెంకటరెడ్డి ఇంచుమించుగ నడుగడుగున విజయధ్వజ మెత్తగలిగినాడు.

ఏకాలమందైనను మానవునకు పూజనొసగునది సాహితి. సాహిత్యచక్రవర్తి కెందును శత్రువులులేరు. జగదీశునిసయితము మెదిరించు దుర్మతులు ప్రతిభాసమన్విత హృదయము ముందు సాగిలబడితీఱుదురు. రవీంద్రునకు ప్రణమిల్లుటకు నేఁ డైదుఖండములవార లువ్విళ్లూరుచుం డుటకు హేతువు సాహిత్యవసుంధరయం దాతడు సమ్రా ట్టగుటయే! శ్రీనివాసశాస్త్రి యశస్సిలకుడగుటకు హేతువు, ఆంగ్లసాహితియందు అద్భుతపరిజ్ఞానమునం ది, తన గంభీరోపన్యాసములందు దానిని ప్రసరింపగలు గుటే! రాధాకృష్ణుఁడు పల్వురు పాశ్చాత్యమనీషులచే తన్మయనృత్యము జేయించుటకు కారణము దివ్యసాహి తీబృందావనమున మసలివసలి, మధురమంజుల వేణు నాదమున భావధారలను వెడలింపజేయ గలుగుటే! రామలింగారెడ్డి శ్రోతల నానందాబ్ధి నోలలాడించుటకు హేతువు శైశవమునుండి రసపిపాసువై, అమరేంద్రు గెలిచి సుధగైకొన్న ఖగనాధునికరణి సాహితీసుధను గైకొని దాని నాత్మహృది నుమ్మరించుకొని, తన తల పులనందు తపెపితపెపి, తన పలుకులనుండి [illegible]రందమును వెలుపరింపజాలుటే! వక్తృతాకౌశలము[illegible] రచనానై పుణ్యమును ఈ నల్వురు మనీషులను దిగంతవిశ్రాంతకీర్తి మంతులను గావించినది.

ఆత్మప్రతిభ కతన ఆత్మభవసామ్రాజ్యమున విధా తయై తన యద్భుతసృష్టిచే యుగముల ను, మహాయుగ ములను అలరించువారు సాహితీసమ్రాట్టు. ఇట్టి ప్రతిభ ప్రతిభాపాసేవకునకును కలదనుం కల్ల. మెదడు గల ప్రతివ్యక్తియు పరిశ్రమకతన పండితుడు కాగలడు. మనుష్యప్రతిభ నైసర్గికమైనది. ఆంతరంగికమైనది. అది పూర్వభవతపస్సున పండినపంట. అది ఈశ్వరదత్తమైన అద్భుతశక్తి. అది మధురభావ విలసితమైన ప్రసూనము వంటిది. మనుష్యపరిశ్రమ వాతూలమువంటిది. హేల్లో లము సౌరభమును దశదిశల ద్రిప్పి దానికి పృథ్వీవాసుల ఆదరానురాగములను జేకూర్చునుగాని పరిమళమును సృష్టింపలేదు. అంతరంగమందు సహజశక్తి యుండెనేని విష్ణువును మూపునగొనిన విహంగపతివడువున పరిశ్రమ దాని ననంతకాలమున ద్రిప్పజాలును. వైకుంఠము కాని హృదయమున నిట్టిశక్తి యుండదు ఇది లేనితఱి పరిశ్రమ మెదడునుమాత్రము పట్టి ప్రాకులాడును. మానవుని పండి తుని జేయజాలును కాని నిలింపులందు నిలుపనేరదు.

నైసర్గిక ప్రతిభయొక్క ప్రధానగుణము ఆత్మ ప్రకాశము. అగ్నిని హృదయమం దిడికొనిన యంత్రము పొగలుచిమ్ముచు ముందులకుఱుకుచందమున, దీని నాత్మ హృదిగల తపసి తన యాదర్శముదెస సాగిపోవ నన వరత మువ్విళ్లూరుచుండును. ప్రతిభా సమన్వితుడు తపసుచేయక ఊరకొనియుండలేడు. సమీరస్పర్శచే దశదిశల రివ్వున నెగయు దివ్యగంధమట్లు, ఆధ్యాత్మిక మైన ఆవేశము హృదయమును సోకినంతన కోయిల కుత్తుకనుండి రాలి, నిస్తబ్ధప్రకృతిరాజ్యమును సుధా ప్లావిత మొనరించు "కూహుకూహూ" వలె ఈశ్వ రాననందిన రవిమయూఖము గగనహృదిపై ప్రాలిన చీకటులను వాడికత్తివలె పరపరఁ గోసితోడనఁ దోఁచు స్వర్ణవర్ణమువడువున, పూర్ణిమచందురుఁడు పక్కన నవ్వినంతన గిలకిల నేలరాలు తెలివెలుఁగులతీల, నంద నమునుండి జగన్మోహిని జారవిడిచిన దివ్యమణిమేఖ లయో యన ప్రకృతిసీమంతిని కటిప్రదేశమున తళుక్కుత్తు

మెఱపురేకపోలుపున, ప్రతిభాసముద్భాసిత హృదయము ఆవేశసంచలితమైనంతఁ వెడలు భాసమానభావరుచులు సహృదయులకపరిమితానందములనుగూర్చును. ప్రపంచచరిత్రలను పరికించితిమేని, ఇట్టి హృదయములు కలవారిని వ్రేళ్లపై లెక్కింపగలము. నోబెల్ ప్రైజు నందినవారిలో నగ్రగణ్యుఁ డనఁదగు రవికవి ఇట్టి మహనీయులలో నొక్కఁడు. ఈతనిహృదయము మహోన్నతము మైనది. తన్మయభావమున నోలలాడు పరమహంసవలె, దానియం దీతని యాత్మ మునుగీత నీదుచుండును. తన కలమును రవీంద్రుఁడు నిజాత్మ కందించును. దాని నది యమృతమున ముంచును. కావున నా లేఖినీముఖమునుండి ఆధ్యాత్మికభావ సుధాపూరము అవిరళధారగా వెల్వడును. రవీంద్రుని దాపున నిలుచుట కర్హతఁగలవారు వసుమతియందు నేఁ డెందఱో లేరు. ఆంధ్రులం దట్టి యర్హతఁగలవారు రాధాకృష్ణ రామలింగారెడ్డిమనీషులు మాత్రమే యగుదురు, పైన రవికవితో వీరల నిరువురను పేర్కొంటిని. వీరు కేవలము సాహిత్యోపాసనమందే తమజీవనమును కడపియుండిరేని, ప్రపంచ సారస్వతాంగణమున నాంధ్రసాహితీవధూటికి మహోన్నతస్థాన మొసఁగియుందురు. ఆంగ్లవిద్యాధికుఁడై ఆంధ్రమునకూడ పరిశ్రమచేసి చక్కని పరిజ్ఞానము నలవఱచుకొనిన వెంకటరెడ్డి సాహిత్యాంగణమున రామలింగారెడ్డి వెనుకను మఱి తక్కుంగల విద్యాధికుల ముంగలను నిలువనర్హుఁడు. ఈతని వాక్కులనుండి మెఱపులు రాలవు. ఈతని పలుకులనుండి పూలు రాలవు. ఈతనివచనమున పండువెన్నెలఁ గానము! అందమృతసేచనము సున్న. కవికి నుండవలయు భావనాబలము వెంకటరెడ్డికి లేనుకావున నీతనిరచనమున బృందావన సౌందర్యముగాని, నందన సౌరభముగాని కానరాదు. ఉద్యానము కాకున్నమానె, నది చక్కని కేదారము. లలితమైన పదములను అనర్గళధారతో వ్యక్తీకరింపఁగల వక్త వెంకటరెడ్డి.*

సాహిత్యమునకును, మతమునకును, తత్త్వశాస్త్రమునకును, కళలకును, మనుష్య జీవనమునకును అవినాభావసంబంధము కల దని వాకొనుచుండును. పలువు రాంగ్లవిద్యాధికులవలెఁగాక వీనియందు వెంకటరెడ్డి (వేంకటరత్నము వీరేశలింగముల శిష్యుఁడగుటచే) కొంతపరిజ్ఞానమును సంపాదించినాఁడు. గురువులను పూజించువాఁడయ్యు, తనస్వతంత్రభావము నీతఁడు గురుభక్తికి కానుకగా నొసఁగి తాను బానిసయై నిలువంబడఁడు. తన యాచార్యులిద్దరు బ్రహ్మసమాజికులే యయ్యు, నిర్గుణబ్రహ్మ నారాధించువారయ్యు నీతఁడు తన యిలువేల్పును (వేణుగోపాలుని) గొలుచుచుండును. మత మనిన తన నులికిపడువారును, గుడియందలి విగ్రహమునకు మ్రొక్కువారిని జూచి వెక్కిరించువారును ఆంగ్లవిద్యాధికులందు అధికులగుచున్నారు. వెంకటరెడ్డి దృష్టాంతము వీరికి చక్కని గుణపాఠమును చెప్పగలదు. ధైర్యముతో ముందంజవేయుట ఈతని యలవాటు కావున హిందూమతమహత్త్వమును గుఱించియు, హైందవతత్త్వశాస్త్రమును గుఱించియు దక్షిణాఫ్రికా మహాసభలం దీతఁ డుపన్యసించువాఁడు ఈతనికిముందు దక్షిణాఫ్రికాయందు గొప్పవక్తయని శ్రీనివాసశాస్త్రి ప్రఖ్యాతి నందినాఁడు. డొమినియనులందు భ్రమణ మొనరించినపుడు శాస్త్రి యశశ్చంద్రికలు దిక్కులను చుంబించినవి. శాస్త్రిగారు మహావ్యక్తి యనుక దక్షిణాఫ్రికాయందు కాలిడిన వెంకటరెడ్డి, తన పూర్వభాగమందలి కర్తవ్యమెట్టిదో గ్రహించినాఁడు. శాస్త్రి కీర్తి దుజ్జీ కాజాలదనియు, అతని కృషి నీతఁడు క్రిందు

* ఆంగ్లమందును, ఆంధ్రమందును కూడ వెంకటరెడ్డి చక్కగ మాట్లాడఁ గలఁడు. ప్రబంధములందలి పద్యములను సంతోషసమయములం దీతఁ డేకరువుపెట్టుచుండును. తెలుఁగులోని తియ్యందనమును మెచ్చుచుండును అందలి రంగురంగుల అలంకారములను కన్నులకద్దుకొని ముద్దుపెట్టుకొనుచుండును ఈతని యాంధ్రభాషా పరిజ్ఞానము కతన, భాషకు సంబంధించినకేసులను కక్షిదారు లీతని కప్పగించువారు శ్రీనాథుని "వీధి నాటకము"ను ప్రభుత్వము వారు నిషేధించినపుడు ఏలూరులోని ప్రకటనకర్తపైఁ దేఁబడిన అభియోగమున (౧౯౧౭లో) డిఫెన్సు పక్షమున రెడ్డి నాయఁడు నియోగింపఁబడినాఁడు. ప్రతిఫల మేమియుఁ గైకొనక ఈతఁ డాకేసున నెంతో కౌశలముఁ జూపినాఁడు.

మీదులు చేయుచనియు, నప్పటిలో నొకయలహాబాదు పత్రిక రాయిగ్రుద్ది చెప్పినది. తనకును శాస్త్రికిని నడుమ నెట్టి వ్యత్యాస ముండెరా దనుభావముతో నీత డత్తరి విశేషపరిశ్రమ సలిపినాడు. ఆత్మవిశ్వాసమును, ధైర్యసాహసములను తన ప్రత్యేకైశ్వర్యము గాంచుకొనినాడు కావుననే తనశక్తిని, తనమనుష్యత్వమును రూఢిపఱుచుకొనగల నేర్పరుడు కావుననే తనపరిశ్రమయందు నెగ్గుటలగాంచి దక్షిణాఫ్రికావాసులచే "శబాస్!" అనిపించుకొనినాడు. శాస్త్రి యొకప్పుడు శ్రీశంకరుని గురించియు, మాయావాదమును గురించియు నుపన్యసించినాడు. "నేను హిందూతత్వశాస్త్రమును ఏకళాశాలయందును పఠింపకపోయినను, అందు నాకుగల సామాన్య పరిజ్ఞానమును పురస్కరించుకొని నే డుపన్యసింప సాహసించుచుంటిని" అని శాస్త్రి పలికినాడు. ఎంత కట్టిదమైనను చేకొని కళాసామ్రాజ్యమున కవి దానిని కల్పకము చేయగలుగు లీల, తన కంతగా పరిచితముగాని జటిలాంశమైనను మహావక్త మధురమంజులస్వరమున వ్యక్తపఱచి శ్రోతల వీనులకు విందుచేయగలడు. శ్రీనివాసశాస్త్రి అట్లు కావించినాడు. మానస సరోవరమున తానమాడు మాలకాకి కూడ రాజహంస కాగలదని నాతలంపు. సురాపగయందు బుడుంగుమనిన కలుషాత్ముడు ధౌతాత్ముడు కావచ్చునని నాయుద్దేశము. బంగారునెలుగున తడిసిన వస్తువు లన్నియు కనకకాంతిసందీప్తము లైయుంట ప్రభాత సాయంసమయములందు చూడలేదా? కౌముదీస్నాతములైన పదార్థములన్నియు ధవళకాంతుల నీనవా? కొందఱు కొందఱు గక్కిసిమానిసులు కొన్నికొలనులందు మునిగి లేచినంతన లావణ్యాంతికలై నిండుజవ్వనులై చూపట్టువా రని పురాణములందు వినుచుందుము కదా! కవియును, వక్తయును కూడ కళోపాసకులే యగుటచే, వారిహృదయకవాటమునుండి వెడలుభావములును, ముఖవినిర్గతములగు పదములును దివ్యరూపములు కలవై ఎదుటివారి డెందముల కమందానందము చేకూర్చును. క్లిష్టాంశమునే యుపన్యాస విషయముగా గైకొనినను, శ్రీనివాసశాస్త్రి శ్రోతల హృదయముల నవలీలగ రసమయములు కావించుట గాంచి, తానుగూడ నట్లొనరింప వెంకటరెడ్డి నిశ్చయించినాడు. కొంతదనుక నెగ్గుటల నందినాడు.

మనుష్యచరిత్రను మహత్తర మొనరించునది మత పరిజ్ఞాన మని గుర్తించిన అల్పసంఖ్యాకులం దొకరుండై ఆధునిక విద్యావిధానమున కది మూలబంధము కావలెనని వెంకటరెడ్డి వాదించుచుండును.*

మనుష్య చరిత్రయం దనుగాక, జాతిచరిత్రయం దనుగాక జయమంగళమును పొందునది మతమే! మతమునేరిట జరుగు మహారిష్టములను మతము నెత్తికి కట్టుట తగదు. మతముకతన గాని మనుష్యహృదయ మందైనను, జాతిహృదయ మందైనను తరంగాయిత మహోదధివలె నావేశ ముప్పొంగదు. ఆలోచన మన్ని

* "Education is a moral force. With out a moral basis a nation is bound to fall to pieces. Selected text books, ample libraries, the lives of the teachers, college discipline, generous emulation in the class-rooms and healthy rivalry on playgrounds —these no doubt tend to inculcate mora-lity; but it is a morality that lacks a religious founda ion. Religious instruction is the truest and most enduring basis of morality. This has been denied to us Often science is misapplied and rationalism misused in distorting or decrying fundamental religious tenets and this is destro-ying the very foundat ons of our morality. This, in my humble opinion, is the reason why our educational system has failed largely to be a guarantee for moral ele-vation. That is why our education has not raised the standard of our character to the extent to which it is necessary or desirable." (Vide: Sir. K. V. Reddy's Convocation Address, Page 4)

యత్నములకును అక్కఱయైనదే! కాని దీర్ఘాలోచనము ఇచ్ఛాశక్తిని విజృంభింపనీయదు. మీన మేషములను లెక్కించువారు అనవరతము ఊర్ధ్వముఖులై మిడి గ్రుడ్లను త్రిప్పుదురు గాని మందంజవేయఁజాలరు. దీర్ఘాలోచన మనుగడునకు ప్రతిబంధకములను సృష్టించుకొనును. ఎన్నికట్టులను తెట్టివేయు కడుగదయమున ముందులకు పాఱు మందాకినివలెనే, భయసంశయములను దూరమునఁ దొలగించునది ఆవేశమే! కళోపాసనమునకే కాదు, ఏ ఘనకార్యమునకైనను అనివార్యమైనది ఆవేశమే! పంకిలమును పాఱనోలి, పూతభావమునకు పట్టము గట్టునది మతావేశమే! దీనిని గోల్పోయి, భానువలె తెయ్యమును పాశ్చాత్యనాగరకత వెనుక తాళము వేయుచుంటిమి గావున స్వర్గశిఖరము నుండి సుభాలున లోతుగోతిలోఁ గూలఁబడితిమి. భారతపునరుద్ధరణము—భారతపునరుద్ధరణమే కాదు. నేఁడు సుడి గుండమున బడుచున్న ప్రపంచముయొక్క పునరుద్ధరణము—మతమువలనను, కళలకతనను గాని కలుగదని రాయిప్రుద్ది చెప్పుచున్నాను. ప్రపంచనాయకు లీయంశమును గుర్తించిన మహూర్తమందే విశ్వదిగ్వలయమున రత్నద్యుతుల నీను శుభోదయము దృగ్గోచర మగు నని వాకొందును.

అల్పకాలముమాత్రము వెంకటరెడ్డి అధ్యాపక వృత్తియందున్నాఁడు. పిదంపశి చెన్నపురిలో బి. ఎల్. పరీక్షయం దుత్తీర్ణుఁడై న్యాయవాదివృత్తి నవలంబించినాఁడు. తనశక్తియందు నమ్మికగలవ్యక్తి కావున, కలమైన జనుపువెలుగకు కావున పట్టా చేతికందిననాఁడే ఈతఁడు ముఖ్యమైన ఒకకేసును చేబట్టి అందు నెగ్గుదలనందినాఁడు. వాశిమెదడు కలిగి, మోపుగా పడియున్న బహుశాంశములం దక్కఱకు మాలినవానిని పరపగోసి, నిహితమై యున్న నిక్కమును నిముసములో కన్గొనజాలువాఁడు న్యాయవాదవృత్తికి పచ్చతోరణము గట్టి తాను నిత్యకల్యాణము నందగలఁడు.

తన్ను మార్కొనువాదన మెట్టిదో ముందే యూహించి, దానిని తునియఁ జేయు వ్యవస్థను గడుసరియైన న్యాయవాది ముందే యేర్పఱచుకొనును. ఆకస్మికముగ ననుకొననిప్రతిఘటనము ప్రత్యక్షమైనపుడు, కనువడిగ నమ్ముల పొదినుండి వాడితూపు ఁతీసి వానిచే పగతుని రొమ్ముగను తునియలుచేయు సవ్యసాచివలె, వీరుఁడైన న్యాయవాది వాశియుక్తులచే దానిని తునాతునకలు చేయును. సంగ్రసము మనములందునను, ఆపత్కాలములందును ఇట్టిశక్తి రక్షణ మొసఁగును. ఈశక్తి కుశాగ్రబుద్ధికి సంబంధించినది. కయ్యములందు కాలుమగవేపు వాఁడు న్యాయవాది కావున అతనిబుద్ధి క్రమక్రమముగ నిశితమగును. న్యాయవాదులు కాకున్నను రామలింగారెడ్డి పట్టాభులు వాశిమెదడులు కలిగి వాదియగలు కాగలిగిరి. కావున నజేయులైన డిబేటరులు కాఁగలిగిరి. వెంకటరెడ్డికూడ కుశాగ్రబుద్ధిగల అదృష్టవంతుఁడు. కావున చక్కని న్యాయవాది కాఁగలిగినాఁడు. ప్రతికక్షి నప్రతిభజేయఁజాలు డిబేటరైనాఁడు. వివిధ ప్రతిసూల సభలందు విజయ మందినాఁడు.

వాడివాదనలకును, ఉద్రేకమునకును, ధ్వనికిని, విజృంభణమునకును నవకాశ మిచ్చునవి క్రిమినలుకేసులే! కావున వెంకటరెడ్డి పేరుగలిగిన క్రిమినలు లాయరు కాఁగలిగినాఁడు. కాని అతఁడు పెద్దపూశలున్న న్యాయవాదియని తలపఁజెల్లదు. తనమిత్రుఁడు మోచర్ల పంతులవలె బిల్లాకోర్టులోనే విశేషకాలముగడపినాఁడు. ౧౯౦౫ వఱకు రాజమండ్రిలోనుండి అందుండి అచటి జూరిస్ డిక్షన్ కొంతమార్పబడుటచే పెద్దాడ సాంబశివరావు, మోచర్ల రామచంద్రరావులవలె ఏలూరున కరిగినాఁడు. ౧౯౨౦ వఱకు ఏలూరునే నమ్ముకొనినాఁడు. తన పెద్దయుద్యోగములందు రంజి కానుపించినపుడు మదరాసు హైకోర్టులో వృత్తి సాగించినాఁడు కాని అందు యశస్విలకుడు కాలేదు తనవృత్తికతన వెంకటరెడ్డి అతులైశ్వర్యసంపన్నుఁడు కాలేదు.

ప్రథమశ్రేణి న్యాయవాదులలో నొక్కఁడు కాకున్నను, న్యాయశాస్త్రపరిజ్ఞానమున పెద్దలలో నొక్కండ ననిపించుకొనినాఁడు. శివస్వామిఅయ్యరు, తేజబహాదూర్ సప్రు, మోచర్ల రామచంద్రరావులవలె Constitutional Law లో విశేషపరిశ్రమ సలిపినాఁడు. మదరాసు లాకాలేజీయందీత డొసగిన ప్రత్యేకోపన్యా

సములను, **Constitutional Law, Constitutional History** లను గురించి ఈతఁడు వెలువరించిన రచనలును ఈవిషయమును రూఢిపఱచుచున్నవి. శాసనసభలందు Constitutional Law ను గురించిగాని, **Parliamentary Procedure** ను గురించిగాని జటిల సమస్యలు తలసూపినపుడు వెంకటరెడ్డి వాని నెదుర్కొని, అవలీలగ పరిష్కరించివేయును. ఈ యీ యంశములం దీతఁడు పల్వు రాధునికులకు బొజ్జబంతి యగుచున్నాఁడు.

న్యాయశాస్త్రమందును, భాషాప్రకాశమందును, రాజకీయాంశములందును, వివిధప్రకృతులను పఠించుటందును, మనశ్శాస్త్రమందును, ఈతఁ డందిన ప్రజ్ఞకు ఈతని క్రియాకౌశలమును, ధైర్యగుణమును తోడ్పడినవి. కావున పాలనమం దీత డందెవేసినచేయి కాఁగలిగినాడు. తన నెచ్చెలి రామచంద్రరావువలె యువకుఁడై యున్నప్పటినుండియు నీతఁడు స్థానికసంస్థలయెడల మిగుల ననురక్తుఁడై యుండెను. వీనిని నిర్వహించు భారమును తన భుజముల దాల్చినపుడు పాలనావిధానమున సముచితశిక్షణ మంది, కాలక్రమమున చక్కని నైపుణ్యమును సంపాదించినాడు. పదిపడి పెద్దపనులు చేబట్టినపుడు వెంకటరెడ్డిని కాచి, రక్షించినది తొలుతటి శిక్షణమే! మదమలిన గండకుంజరమును విఱిచుటకై దానికుంభస్థలిపై నుఱుకుసింగపుఁగొదమవలె, కఠినకార్యముపై లంఘించి (వెంకటరెడ్డి నున్నతికి దీసికొనివచ్చిన ప్రధానగుణ మిదియేకదా!) దాని నీతఁడు సాధించి తీఱును. భయసంశయములను తన నిఘంటువునుండి తడిమికొట్టినాడు కావున, తన యదృష్టముకతన దానూహింపఁజాలని దొడ్డపదవి సమ్ముఖీనమైనపుడు, కొమ్ములుతిరిగినవారిచే గూడ "నమో!" యనిపించు కఠినక్రియ ప్రత్యక్షమైనపుడు జబ్బగొట్టి దానిని మార్కొని పిడికిటఁ బట్టుచున్నాఁడు. ముఖ్యముగ, నీ ప్రత్యేక గుణమున వెంకటరెడ్డి దృష్టాంతము యువకులకును, యాత్రికులకును మేలుబంతి కావలెను. "**Pati nce and Perseverance overcome mountains**" అను వాక్యమునకు ప్రత్యక్షతార్కాణము రెడ్డి జీవనవిధానమని వారు గుర్తింతురు. గవర్నరులలో చిన్నవాఁడైన ఏంథ్‌హిల్ ప్రభువు ఇంగ్లాండులో రాజమంత్రిపోయి, తనకంటె చిన్నవయసువాడు వెంకటరెడ్డి అత్తటి అచట మునిసిపల్ చెయిర్‌మేనై యుండి తనకర్తవ్యమును కౌశలమున నెఱపుచుంట గాంచి మిగుల నలరి తనవెంబడికలము నాతనికి బహుమానముగనొసగినాడు. వెంకటరెడ్డివలె బహువిధములైన యున్నతిపదవుల నందినవారు భారతీయులం దింకొకరు లేరు. మంత్రియై, అంతర్జాతీయసమితియందు భారతసభ్యుఁడై దక్షిణాఫ్రికాయందు ఏజంటుజనరలై, మదరాసులో లామెంబరై, యువకుఁడై యున్ననాటి యుత్సాహమును ప్రదర్శించినాడు. అరువదేండ్లు కడచిన పిదప నేఁ డీతఁడు నడుముగట్టి గవర్నరుగద్దెమీఁద కూరుచుండి యున్నాఁడు!

సాహితీబృందావనమున వనమాలియై శ్రీనివాసశాస్త్రి ప్రపంచదృష్టి నాకర్షించినాడు. అతఁడు సాటిలేని యోజికగలవాఁడనిగాని, గట్టిపట్టుదలగల దిట్టలలో నగ్రజుఁ డనిగాని, విశేషపాలనాకౌశలము గలవాఁ డనిగాని తెలుపలేము. కళాసామ్రాజ్యమున నున్నతస్థలి నెక్కజాలని వెంకటరెడ్డి దుర్ఘటకార్యములను నిర్వహించుటందు గట్టిఘటమనిపించుకొనినాఁడు. పాలనము కమ్మతెమ్మెరలందును, మధురపరిమళమందును, బృందావనసౌందర్యమందును, పరమపరితోషమందును విలసిల్లు విరిసెజ్జవంటిది కాదు. దక్షిణాఫ్రికాయందు శాస్త్రి తాకివదలిన బహుళజటిలపాలనాంశములు వెంకటరెడ్డికై కాచుకొనియుండెను. పూలపానుపుకాక ముండ్లడొంక యీతని కెదురైనది. మదరాసులో మంత్రిగానుండి, పానగల్ ప్రభువు సర్వాధిపత్యము వహించినపుడు తనప్రజ్ఞను విజృంభింపజేయుటకు తగుతరుణముల నంపని వెంకటరెడ్డి దక్షిణాఫ్రికాయందు తనప్రకృతికి, తనయోపికకు, సరిపడిన క్రియారంగమును గాంచినాడు. బండెడన్నము కంచమునబడినపుడు భీముడు పొట్టనిమురుకొనుచు, లొట్టలువేయుచు ముందుకు కురుకువాఁడు! ఎత్తుకొండవోలు కర్తవ్యమును భీమకర్ముఁడు మహోత్సాహముతో మార్కొనఁడా?



నాట్యభంగిమము- లివర్పూల్ పాఠశాలావిద్యార్థిని. P. P. A.



౧౮ నెలల తనకూతురికి సర్కసుతంత్రములను నేర్పుచున్న తండ్రి. ౨౦ ఏండ్లు పెద్దసర్కసులో హాస్యగాడుగా నున్నవాడు. P. P. A

ట్రాన్స్‌వాల్‌లోని భారతీయుల చేతులందలి కొలదిపాటి సౌకర్యములను నేలపై నూడగొట్టుటకై Asiatic Land Tenure Bill of Transval భయదళ సువట్లు వెంకటరెడ్డికి ప్రత్యక్షమైనది. South African Nationalist Government ఈబిల్లునకు చేయూత నిచ్చుటకై కృతనిశ్చయమైనది. నేటివుల వోటుహక్కును త్రుంచివేయుటకై తలపడిన నేటివ్ బిల్లులు అమలునందువేళలోను, Ante-nonwhite feeling పెచ్చిల్లు వేళలోను, విశేషసౌకర్యములు తమకుకావలెనని భారతీయ లాందోళనము సలుపుసమయమందును ఎన్నోనిదిక్కులు ఏజెంటు జనరల్ నెదుర్కొనినవి. సంక్షుభితచిత్తుడుగాక వెంకటరెడ్డి నాటి క్లిష్టసమస్యలను ధైర్యసాహసములతో నెదుర్కొని అప్పటి యిబ్బందులను కొంతదూరము నెట్టివేసినాడు.

అక్కడివారి చెలిమి నందుకొనలము వెంకటరెడ్డికి గలదు. ఇతడు నియోగిబోలు లౌకికుడు. ఏయెండ కాగొడుగు బట్టగలవాడు. సమయానుకూలవర్తనమున నాటితేరినవాడు. చక్కని లోకజ్ఞానముగలవాడు. పక్కా గడసరి. చెలరేగ దలపడు చిత్తప్రవృత్తులను పిడికిట బట్టగలవాడు. వెనుకముందులను పరికింపక అడుగువేయడు. దూరమునుండి తనకన్నుగట్టు ఆదర్శమును చేరుటకై అనువాతనపద్ధతులకు సరిపడు నుపాయములను పన్నగలవాడు. తనకు సహకారులు కాజాలు వారిని దరిజేర్చుకొనగలుగు బుద్ధిశాలి, వ్యక్తినిబట్టి, వేళనుబట్టి మెలగజాలువాడు. అపాయము లేనపుడు కనుగొట్టజేయునుగాని తఱచుగ (లౌకికుడుకావున) నీతడు శాంతికవచమునే తాల్చును. ఈతనిసుండియములో సహనశాంతులేకాక, ధైర్యసాహసములేకాక, కారుణ్యప్రణయములునుకాపురమున్నవి. తనబిడ్డలను విశేషముగా ప్రేమించువాడయ్యు, గులాబులందును, హంసతూలికలందును వారు బ్రదుకులు కడపవలెనని, తానిచ్చు మేలికలిమిపై వారిభావిదశ ఆధారపడవలెనని ఈతడు కాంక్షింపడు. తనవలెనే చెమ్మటలోడ్చి స్వయంకృషిని, నిరంతరకృషిని ఇలువేలుపుజేసికొని దాని ప్రసన్నతకతన నుత్తుంగసుధరశిఖరముపై నాత్మజీవములను జ్యోతులట్లు వారువెలుంగజేసికొనవలెనని ఈతని యాశయము. స్త్రీపురోభివృద్ధిని కాంక్షించి స్త్రీ యుద్యమములకు వెంకటరెడ్డి ప్రోత్సాహము గూర్చును. పసిబిడ్డలన నీతనికి ప్రీతిమెండు. * జంతుహింస నుడుప నుద్దేశించుయత్నముల కీతడు చేయూత నొసగినాడు. మాంసాహారముకంటె మజ్జిగతో కలిసిన అన్నమే ఈతనికి విశేషప్రీతి గలిగించును. మజ్జిగయెడల తనకు మిక్కిలి మక్కువ గావున ఖైదీలకక్కరైనయేర్పాటు నీతడు గ్రహించినాడు. కౌన్సిల్ ఆఫ్ స్టేట్‌నుండి కదలి లామెంబరు పదవి నలంకరింపక మున్నే తొలుకొలుత దన్నెదుర్కొనునది మజ్జిగను గుఱించిన సమస్యయేయని స్వాంతభావమున వెంకటరెడ్డి ఢిల్లీలో వచించినాడు.

రెడ్డినాయుడు తన రాజకీయముల వలననే ఆంగ్లులకును, ఆంధ్రేతరులకును పరిచితుడైనాడు. మనుష్య

---

* ఇట్టి ప్రీతికతన బాలుర కెన్నడు జరుగుతిత ఈతడు చూచి సహింపడు. ఒక చిత్రమైన దృష్టాంతముకలదు. ఒకప్పుడు ఈ జమంద్రీవీధులలో వెంకటరెడ్డి నడచిపోవుచుండ గోపిశెట్టివారి గుఱ్ఱపుబండి ఈతని సమీపమునుండి పోవుచుండెను. బాలుడొకడు మెల్లగ బండివెనుకజేరినాడు. బండితోలువాడాతనిగాంచి నిర్దయుడై చేతనున్న కవిసీకఱ్ఱతో వానిని కొట్టనెంచలిడెను. ఈదృశ్యమునుచూచి సహింపక వెంకటరెడ్డి బండివానిమీదికురికి బండివాని చేతిలోని కవిసీకర్రను దీసికొని వానికి బహుమతులు సమర్పించినాడు. వానియజమానులు పెద్దపలుకుబడిగలధనాఢ్యులని లెక్కసేయక, తనకర్జమువారికెంతేని యాగ్రహము గలిగించుననునంశమును పాటింపక బాలునిమీది ప్రీతిపెంపున వానిపైబడినఅత్యాచారము నతడట్లు ప్రతిఘటించినాడు. ఈయంశము స్వల్పమైనదే! కాని వెంకటరెడ్డి చరిత్రయందలి ఒకముఖ్యవిషయము నిది స్వరూపించుచున్నది. ఎదుటివారెంతయెత్తువారైనను, వెరువక తనమనసునకు వచ్చినరీతిని ఈతడు జరపుచుండును. మీదమిక్కిలి ముంద్దురాలినను ఈతడు తనపట్టువదలడు. తన యభిప్రాయమును మార్చుకొనడు. తరువాతి జీవనమున పలుమారు వెంకటరెడ్డి ఈగుణమును స్వరూపపఱచినాడు.

వర్తనమును గ్రహింప యత్నించుతతి కేవలము రాజకీయములమీఁదనే కన్నుంచుట పాడిగాదు. కావుననే వెంకటరెడ్డి మనసును చూఱగొనిన ప్రత్యేక రాజకీయములను పురస్కరించుకొనియే నేనీ విమర్శనమునకు గడంగలేదు.

ఇతర దేశములందు చెల్లుబడియగు రాజకీయములట్లుగాక, భారతావనియం దిటీవల పొడసూపిన రాజకీయములు (గాంధిజీ సంపర్కముకతన) నాధ్యాత్మిక మహత్త్వము నందినవి. మన వ్యక్తిజీవనమునకును, మనస్వాత్మకును, మనుష్య హృదయమునకును, నేటి భారత రాజకీయములకును అవినాభావసంబంధము కలిగెను. గాంధియుగమున, రాజకీయక్షేత్రమున తలసూపిన నూతనాశయము వెంకటరెడ్డిదృష్టి నాకర్షించలేదని తొలుతనే తెలిపితిని.

నేటిరాజకీయములు పల్లెనాసి దృష్టికూడ నాకర్షించినవి. నేటికృషికుఁడు భారతస్వాతంత్ర్యమును కాంక్షించుట ముదావహము. కృషికునకు గల కన్ను, ఆతనికిఁ గలహృదయము మఱొకనికి లేదని నాయభిప్రాయము. డిప్లమసీతోకూడిన రాజకీయములను ప్రదర్శించువాఁడు, మాటలందే దేశభక్తిని ప్రదర్శించువాఁడు మాయకాఁడని, ఇంద్రజాలికుఁడని, నాటకమాడువాఁడని అతఁడు గుర్తింపగలఁడు. పరార్థజీవియై, ముముక్షువై, ఉత్తమాశయసిద్ధికై మహాత్యాగమొనరించినవాఁడే మహాపురుషుఁడని రోసించి అతఁడే జగదీశుని ప్రత్యక్షావతారమని అతని బూజించును. భారతసీమయం దెన్ని రాజకీయకక్షలున్నవో, అవి యేవేవో ఆతఁ డెఱుగఁడు. వ్యక్తిక్రియను గమనించియే అతఁడు వ్యక్తియొక్క హృదయమహత్త్వమును గ్రహించును. కృషికకులమునఁ బుట్టిన వెంకటరెడ్డి కృషికముక్తినే తన జీవనపరమావధిఁ గావించుకొని తనవారి హృదయములందు పూజాసనము నందినాఁడని తెలుపలేము. భారత భారమును వహించువాఁడు రైతనియు, కడుపునిండ అన్నమెఱుగక కంటినిండ నిదుర నెఱుఁగక నాగలి చేఁబూని రేబవళ్లు శ్రమించి పరార్థజీవియై యున్నవాఁడు ద్యకాడుకాఁడనియు, నేఁడు చెల్లుబడియగుచున్న చదువు, సంస్థల నీతఁ డెఱుఁగక, కట్టెదుటనున్న ఘోరసమస్యలెట్టివో యెఱుఁగక ఈతఁ డంధకారమున బడియున్నాఁడనియు, సుఖశాంతు లీతనికి బహుదూరమున విడిది నేర్పఱచుకొనినవనియు, ఆతనయోచనములను గంగాయమునలవ ట్లాత్మహృది నిడికొని సహనమునకు రెండవపేరై ఈతఁడు మనియున్నాఁడనియు, తనరైతుపుట్టమును ఉద్ధరించుటందు ఒకులకంటె తన కెక్కుడు హక్కు కలదనియు కృషికోద్ధరణమున భారతోద్ధరణమును గాంచి, కర్షకగృహమున తేజరిల్లు దివ్వెయందు భారతమంగళదీపికను విలోకించి ధన్యుఁడగుటకై తాను తపించియుండవలసినదనియు వెంకటరెడ్డి చాలకాలము నకుమున్నే గ్రహించియుండవలసినది. కృషికముక్తియే భారతముక్తియని యెంచి దానికై పాటుపడువారి కీతఁడు బుజమొడ్డియుండవలసినది. ఈతఁ డిట్లొనరింప లేగు సరికదా ప్రజాభిప్రాయమున కెదురు తిరిగినాఁడు. సైమన్ సప్తఋషులు మదరాసునకు వేంచేసినపుడు విశేషసంక్షోభము తలసూపెను. ప్రజలమనసు లుత్తలపాటుతో నిండియుండ, జస్టిస్‌పార్టీలోనే కాన్‌స్టిట్యూషనల్ పార్టీ లేవందీసి సైమన్ ప్రభృతులకు స్వాగతమునిచ్చినాఁడు. నాఁడు తోడి కృషికులకు కూడ నీతఁడు విశేషవ్యథ కలిగించినాఁడు. సహకారమునకు సంబంధించిన ప్రతియత్నమునుతోడను జోక్యముఁ గలిగించుకొనిన ఈతఁడు ప్రభుత్వములతో సహకరించినట్లు ప్రజలతో సహకరించి తోడుకొనుచు రైతుబిడ్డనని చెప్పుచు రైతులకీతఁడు నేఁడుగాని కాకపోవు టటులుండ ఇటుగు వాఁడననే గర్వించు నీతఁడు తెలుఁగులకు ప్రత్యేకసీమ యుద్దియోను చేయుటకాలకపోయినాఁడు.*

* "ఆంధ్రులకు ఆంధ్రరాష్ట్రము అవసర" మని అఱచినవారిలో వెంకటరెడ్డి ఒకఁడు. ఆంధ్రజాతియందు సహకార సంఘీభావములు రాజిలవలెనని ఘోషించినవారిలో వెంకటరెడ్డి యొకఁడు. అతని నుడువులు గమనింపుఁడు: "Ever since a national consciousness has been awakened, the demand for the formation of provinces on a linguistic basis came to be made. We

ఇతడును, ఈతనిపక్షమువారును, లిబరల్ దళము వారును కాంగ్రెసు నాయకులకు చేయూతనొసగియుండినచో సంఘీభావ ప్రణయభావములను గని భారతాంబ ఈపాటికే తన గమ్యస్థానమును చేరియుండెడిది. "అంగవస్త్రపు స్వరాజ్యోద్యమము" తన కేలయని వెంకటరెడ్డి దూరమున నిలిచినాడు. "భారతాంబ నొసలున 'అనదా! నీకడ్డలం దెన్నడు పొత్తుపొడసూప'దని విధాత లిఖించియుండు"నని కన్నీరొల్కుచు విమలధిషణా ధురంధరుడు ద్విజేంద్రుడు తెలిపియుండెను ("మీవారు పతనము"ను చూడుడు.) ఈనుడువు అసత్యమైయుండు గాకని పలుమారు ఆశపడితిని. కాని యిందలి సత్యము జ్వలత్ స్ఫులింగమట్లు పొడగట్టుచున్నది. మత్తదంతావళములనుపోలు మనపెద్దనాయకులు ఒకరినొకరుఢీకొను చున్నారు ధగధగజ్వలించు దేశదౌర్భాగ్యముపై మఱికొన్ని సమిధలు వేయుచున్నారు.

జూన్ ౧౮ వ తేదీని వెంకటరెడ్డి గవర్నరు గద్దెయం దాసీనుడై రమారమి నాలుగునెలలు 'చెన్నరాష్ట్ర' మును పాలించును. ఈతని కీపదవి లభించుచున్నందులకు పలువురు బంధుమిత్రు లానందపరవశులైరి. ఒకకొండకొననుండి వేఱొకకొండకొనకు, ఒక యత్నమునుండి వేఱొకయత్నమునకు మానవుని దోకొనిపోవు ఇచ్ఛాశక్తికి మ్రొక్కులిడనివా రెవరు? హృదయస్థితప్రజ్ఞకు నిశ్చయశక్తితోడైనపుడు, తన హక్కునుబట్టి తనకు ముట్టవలయుపదవిని (అది సర్వాట్టుపదవియైనను, అంతకంటె మహోత్తరమైన సన్యాసిపదవియైనను) మనుజుడు చేబట్టితీఱును. నిరుపేదయైపుట్టిన వెంకటరెడ్డి తన యాశయమును జేరి క్రమనిష్ఠయందలి పటుత్వ మహత్త్వములను వ్యక్తపఱచినాడు. క్రమనిష్ఠకు నేను జోహారందును; కాని, నేటి భారతీయుని పరమాశయము గవర్నరగుట యని నేను తలపను. పట్టినపట్టును క్రమదీక్షకఠిన నెఱ్ఱ ప్రజ్ఞాధురంధరుడు వెంకటరెడ్డియని సంతసంపడి, ఇఁకముందీతఁడు భారతీయుల హృత్సింహాసనమున నధిష్ఠింపవలెనని కోరుదును. ఇష్టగించెనేని ఈతడచ్చోటు నలంకరింపఁగలఁడని నొక్కివక్కాణింతును.

వెంకటరెడ్డికి నీయున్నతపదవిని ప్రసాదించు ప్రభుత్వమువారికనైన తమదృక్పథమును మార్చుకొనవలెను. స్వపరిపాలనమును భారతీయులకు తామప్పన మొనరింపకుండుటకు కారణము దానిని వారు నిర్వహింప జాలరనియేయని పాలకులు పలుమారు వాకొనిరి. తలపై పూనీపడినపు డెట్టికఠినకార్యమునైన నెఱపుటకు భారతీయులు సమర్థులని దేశనాయకులు తెలుపుచునేయున్నారు. మనప్రభువులు తమయభిప్రాయమునుమార్చుకొనరైరి. ఇంచుమించుగ నొకేసమయమున వీరిర్వురాంధ్రులకు ఉద్యోగము నొసఁగిరి. ఈ యిరువురును రైతుజాతి వారే! డయార్కీ యావిర్భవించిన పిదప మంత్రిపదవుల నతిసమర్థతతో నిర్వహించినవారిలో పల్వురు వీరికులము వారే! పాలనాకౌశల్యమున తామే యాంగ్ల మేధావికిని దీసిపోవువారము కామని వీరు ఋజువుచేసిరి. ఇట్లని పాలకులే గుర్తించిరి. ఈ ముఖ్యాంశము ప్రభువుల హృదయమునియుత్తలమున తటిత్తువలె తళ్కొత్తి అదృ

---

Andhras, ourselves have long urged upon the Government the need for the formation of an Andhra province .. ....... .We feel it our duty to humbly and respectfully but emphatically sound a note of warning that, while it may be desirable to respect the Oriya sentiment to put the Oriya-speaking population in one province, it may be dangerous to hurt the Andhra sentiment by disturbing their solidarity and by breaking asunder their long standing ties and associations, and that it is not possible to foresee the consequence of any such dismemberment." (Vide: Sir K. V. Reddy's Presidential Address delivered at the "The Andhra Mahasabha Conference Special Session, Bezwada on 31st July 1932.)

లామెంబరు కానపుడు మొన్నమొన్నగూడ నింగ్లాండులో నాంధ్రోద్యమముకొఱకై ఇతఁడు కొంత కృషి సలిపినాడు. బొబ్బిలిరాజాగారివలె పదపడి వెన్కకుతరలినాడు. ఆంధ్రభూమినుండి ముఖ్యమైన కొంతనేల ఓఢ్రరాష్ట్రమునఁ జేరుచుండ, నన్యాయము నడుపగట్టి యత్నముచేసి, పున్నెముఁ గట్టుకొనినాడుకాడు.

శ్యము కారాదు. ఇది స్థిరమై, సంపూర్ణపాలనాబాధ్య తను వారిచే భారతీయుల కరములందు సమర్పింపఁజాలె నేని తప్పక సార్థకమగును. వెంకటరెడ్డిపట్ల, రైతుల యెడ్ల పట్ల నేఁడు పాలకులు చూపిన సుహృద్భావము భావి భారతశుభోదయమును సూచించు అరుణరాగమే యగుచో, భారతీయుల యానందమునకు మేరయుండదు. నాఁడే వీరు పాలకుల నభినందింప గలరు.

కష్టజీవి యెప్పటికైన నీశ్వరాశీస్సు నందితీఱును. నిభృతమున చెమ్మటలోడ్చు నభాగుడు నేడు పల్వుర కరుణాదృష్టి నాకర్షించుచుంట ఆనందకరము. కాంగ్రెసు నెలకొని ఏబదేండ్లైనను, ఆర్థిక పునరుద్ధరణము దృష్టినిడికొని స్వరాజ్యసంపాదనమునకై ౧౯౨౦ నుండి శ్రమించుచున్నను, వార్షికసమావేశములందు పెద బొబ్బలుపెట్టుటందును, సత్యాగ్రహమును ప్రదర్శించుటందును మాత్ర మది కాలము కడపినది. "రైతునవియు, నేతగాఁడ" ననియు తెలుపుచు, నిరుపేదలందు తానొక్కఁడై గాంధితోచిన పవిత్రమహూర్తమున భారతమాత నూతన జీవమందినది. గాంధి రాజకీయప్రణాళిక నవలంబింపకపోయినను, పల్లెవాసుల ఆర్థిక పునరుద్ధరణమునకై అతఁడు చూపిన తెరువున నెల్లఱును నడచియుండవలసినది. విదేశీయులకుకూడ గాంధినామము పవిత్రవంతమైయుండ నీసంయమిని గాంచినంతన నెత్తురుడ్డను చూచి యెగిరిపడు నెద్దులట్లు కొందఱ అనుచితక్రోధప్రజృంభణమునకు దలపడిరి.

వెనుకటి రాజప్రతినిధు లట్లుగాక లిన్‌లిత్‌గో ప్రభువు నేఁడు భారతకృషికులపట్ల విశేషాదరము చూపుచుండెను. కబురులంగుగాక క్రియల దయాదరమును జూప నువ్విళ్లూరుచుంటినని అతఁడు వాకొనెను. చక్కని రెండు తెల్ల యెద్దులను భారతసేద్యమున బ్రవేశపెట్టెను. రాజప్రతినిధి దృష్టాంతము క్రమక్రమముగ మనధనికుల దృష్టి నాకర్షించుచున్నది. తన కష్ట మొకులకంట బడు ననిగాని, తనదురంతదుస్థితి నేటివిద్యాధికుల మనసులను చలింపఁజేయునని గాని కలనైన తలంపక, తగనిభారమును తనమూపున మోయుచుంటిననియైన నెఱుగక నిష్కామకర్మనే ఆరాధించు గ్రామవాసి భారతనాయకులందగ్రగణ్యుడైన మహనీయునకేగాక, భారతపాలనమును చేతులందిడికొనిన దొడ్డవ్యక్తికికూడ సన్నిహితుఁడగుచుంట సంతోషకరము. పాలనా విధానమున మార్పు గోచరింపనంతదనుక విశేషాభ్యుదయము ప్రత్యక్షముకాకున్నను, వ్యవసాయదారుడైన వైస్రాయికతన కొంత మేలు చేకూరునని ఆశింపవచ్చును. హృదయమునకించుక చల్లదన మొసగునంశములు నేఁడు పొడగట్టుచున్నవి. వెనుకటిభావములు నేఁడు డుల్లిపడినవి. మేడలందును, మిద్దెలందును స్వర్గభోగముల ననుభవించు విద్యాధికులు నేఁడు పొలములందును, కనుమలందును, గుడిసెలందును వసించు అభాగుల కుటీరగల నిలువవలచుచున్నారు. గ్రామపునరుద్ధరణక్రియ నెఱపుటందు గాంధి లిన్‌లిత్‌గో ప్రభువుల యుద్దేశము లొక్కటిండేకదా! గాంధి పొడగిట్టనివారు, ఆతనితో చేతులు కలుపుకొనుట ఆత్మగౌరవమునకు భంగము దెచ్చుకొనుటని యెంచువారు రాజప్రతినిధితోనైన జేతులు కలుపుకొనినచో, మాతృభూమి కెంతో సేవ జేసినవా రగుదురు.

గాంధిజీతోడను, లిన్‌లిత్‌గో ప్రభువుతోడను సఖ్యముచేయఁగల సమర్థుఁడు వెంకటరెడ్డి. రాజకీయములందు బహుళ సంఖ్యాకుల తెన్నున నడువకపోయినను, ఈతఁడు సహృదయుఁడను నంశమును, కపటమెఱుఁగని వ్యక్తియను విషయమును భారతీయులు మఱువరాదు. కొన్నికొన్ని సందర్భములం దీతఁడు లోపములు చూపుట నిక్కమే! లోపములు లేనిమానవుఁ డేడి? రెడ్డిజీవనమును పుంఖానుపుంఖముగ పరిశీలించితిమేని, తనలోపమును మాపుచేసికొన యత్నించు దొడ్డవారిలో నాతఁ డొక్కఁడనియు, పల్వురయాదరానురాగముల నందగాంక్షించువాఁ డనియు గ్రహింతుము. ఇతఁడవలీలగ ప్రేమభావమునకు లొంగువాఁడు. చులకనగ గుండెనుండి కినుకను తఱిమికొట్టగల ధీరుఁడు. స్వాతంత్ర్యపిపాస వు కఠినచిత్తుఁడు కాలేడని నేను ఋజువుచేతును. ఇతఁడు జగతినంతను తన్మయాలింగనమున జేర్చుకొనగలఁడు. మనసిచ్చినవారి సంశ్లేషమున నిముడగలఁడు.

తనభేదాభిప్రాయము లెవ్వియో జంకులేక వెంకటరెడ్డి పలుమాఱు వ్యక్తీకరించినను, వాని నెన్నఁడు

ఈతఁడు పెద్ద జేసియెఱుఁగఁడు. ప్రకృతులు వేఱైనపుడు అభిప్రాయభేదము లుంట సహజమేకదా! వీనిని హృదయమందు పెంచి, అందు వైరభావమును పెంపొందించి దురూక్తులు వ్యక్తీకరించి, దుష్క్రియలకు చేయి జేసికొనువారు మనుష్యులందధములు. వీరివలన మానవసంఘమున కెంతేని చేటువాటిల్లును. అభిప్రాయమునెడల నిష్టములేకున్నను, వ్యక్తియెడల గౌరవభావము జూపునాతండు విశాలహృదయుండు. వ్యక్తియైన గాంధీజీకి వెంకటరెడ్డి అనేకపర్యాయములు అంజలిఘటించినాడు. దక్షిణాఫ్రికాయందు తాను నిర్వహింపవలసిన క్రియలం దాతనిసలహా నపేక్షించి, దాని నందువాఁడు. తాను జస్టిస్‌పార్టీవాఁడైనను, బ్రాహ్మణేతరప్రముఖుఁడైనను, బ్రాహ్మణమిత్రులయెడల ననురక్తుఁడై వారిశక్తిసామర్థ్యముల నీఁ దుగ్గడించుచుండును. శ్రీనివాసశాస్త్రి ప్రజ్ఞాధురీణుఁడని, మహాపురుషుఁడని ఈతఁడు పలుమాఱు పలుకుచుండును. ఆతనినామము నుచ్చరించుచు, దక్షిణాఫ్రికాయం దాతఁడు మొదలిడిన కార్యమును కడుకౌశలమున నెఱపినాఁడు. ఒకానొక రాజకీయపక్షముతో జోక్యము కలిగించుకొని, Party Politics లోనే భారతావనియందు పాటుపడినను, దక్షిణాఫ్రికాయందున్నతఱి తాను భారతీయుఁడనను నంశమునుమాత్రమే దృష్టియం దిడికొని తనవారి యభ్యుదయమునకై పాటుపడి వారియాదరము నందినాఁడు. ఇట్టి విశాలదృష్టి నీతఁడు గవర్నరై యుండు కాలమందును, తదనంతరమందును చూపగలఁడని ఆశపడెదను. ప్రభువులతోడనే విశేషకాలము గడపువాఁడయ్యు, పేదల నీతఁడు బొత్తుగా మఱచెనని తలఁపఁ జెల్లదు.*

ఈవఱలో వెంకటరెడ్డి హృదయశక్తికంటె మేధాశక్తి నధికముగా వ్యక్తపఱచినాఁడు. ఇఁక నీతఁడు మేధాశిఖరమునుండి దిగి హృదయోద్యానమున మసలి, అందలి మధురభావముచే నాత్మజీవనమును సురభీకరింపవలెను. ఇఁక నీతఁడు స్వీయోన్నతికై పాటుపడనక్కఱలేదు. యువకుఁడై యెప్పుడో యెట్లో మనసున ప్రవేశపెట్టుకొనిన కోరికను, ఇన్నాళ్లవఱకు విశ్రాంతికిని, సంతృప్తికిని తనను దూరముజేసిన కోరికను ఈతఁడు తనిపినాఁడు. ఇఁక పరార్థచింత నీతఁడు నిజాంతరంగమున ప్రవేశపెట్టవలెను. ఈ చింతయే గంగోత్తరియై పొంగి, తెరలు తెరలై ప్రవహించి, ఈతని భావిజీవనమును పునీతమొనరించును. నాఁడది సౌందర్యసంక్షిప్తమై, భావియాత్రికులకు నోజబంతి యగును. నాఁడు వెంకటరెడ్డి గవర్నరనిపించుకొనకుఁగాని సేవకుఁ డనిపించుకొనును. ప్రజాసేవకుఁడేకదా సర్వసీమలందును, సర్వసమయములందును ఆరాధ్యదేవతయగును! నాఁ డీతని చరితము స్వర్ణాక్షరములతో, ప్రభాకలితపంక్తులతో వెలుఁగొందును! శతాబ్దుల సంకీర్తనమందును నాఁ డీతని కీర్తి దిగంతములందు పండువెన్నెలయై వెలయును! నాఁ డీతని దృష్టాంతము ధ్రువనక్షత్రమట్లు కాలవిహాయసమున కాంతిలి భావియుగముల కేలోత్కర్షల నందును!

---

* సహకారసభలకును, కృషికసభలకును అధ్యక్షుఁడై యుండినవేళలందు మంచిమాటలచే వెంకటరెడ్డి రైతులమనసుల నలరించినాడు. వారిసమస్యలను పరిశీలించినాడు. ఈ వాక్యములను గమనింపుఁడు!
"... ... .To the best of my ability I have tried to prove how in former times the condition of the cultivator was decidedly more secure and prosperous; how the ignorance, if not the short sighted policy of the British administration, has grievously injured the son of the soil; how, therefore, it is the imperative duty of the British Government in India to rectify that mistake and to redeem the lost position." (Vide Sir K. V. Reddy's Presidential Address delivered at the Second Malabar Tenants Conference held at Badagara on the 30th May 1924.)




చిత్రణము. —కె. వేణుగోపాల్.

# తెలివి జూపిన తెలివి

## కృష్ణకుమారి

"నల్లగా కక్కిందంటే కాకినే కక్కిం" దని విపరీతంగా, విస్తారంగా వాదులు పుట్టించే ఈ సృష్టి విశ్వంలో, ఒంటిగాళ్ళై తమ కోసమే తగని తంటాలు పడే ఈ ఏకాకి లోకంలో, పరుల పచ్చ చూచి ఓర్వలేక కంట నిప్పులు రాల్చే ఈ ఘాతుక జగత్తులో, సంతృప్తి అనేది లేక పరమలోభంతో పడి చచ్చేటంత పాపభూయిష్ఠమైన ఈ పాడు విశ్వంలో మంచిగా నడచీ మెప్పించలేము, నడవకా మెప్పించలేము. పరులకు సాయం చేసీ మెప్పించలేము, చేయకా మెప్పించలేము. మాటలాడీ మెప్పించలేము, ఆడకా మెప్పించలేము.

అలాటి ఈ లోకంలో పాటుపడక పోయినా, సంసారానికి పెత్తనం వహించక పోయినా, పేరుగల దానాలు చెయ్యక పోయినా, పెట్టుపోతలు సరిగా తెలియక పోయినా కేవలం నిరహంకారయుతములైన మంచి మాటల చేతనే ఎనలేని కీర్తి గడించకొంది మోతే కృష్ణరాయని సతీమతల్లి.

ప్రపంచమంటే ఏమిటో ఇంకా సరిగా అర్థంకాని పూపవయసు. భాగ్యకాలంలో భోగభాగ్యాలనుభవించే మనసు గల లేతవయసు. కలిమిలేముల కాట్లాటలతో కటకటలాడే కాలచక్రపు మాహాత్మ్యం తెలియని కసుగందు. పొచ్చెమొకించుకైనా లేని అచ్చపు అందంతో అచ్చరలను మఱపించే మచ్చెకంటి. ఇరవై దేండ్లు నిండని ఎలజవ్వని యైనా ముగురు పాపలకు మూలపుతల్లియై మచ్చలేని మాతృత్వాన్ని వహించిన మగువ. ఎఱుక ఉన్నా, లేకున్నా పలుకు మాత్రంతో బంధువులను తన డొందానికి బందీలనుగా జేసుకొన్న పడతి. ఉచితరీతిని ఉద్యోగస్థుల ఉపిదలను చూపుమాత్రంతో లోంగొన్న ఉత్తమురాలు. చనవిచ్చి సాటి ఈడువాళ్లను స్వాధీనం చేసికొన్న సాధ్వి కృష్ణరాయని సతి.

వైశ్యులలో నెల్లూరి సీమలో 'బి. యే' వారని బిరుదు పేరు పొందిన సుంకు నారాయణశ్రేష్ఠిగారికి కడపటి గారాబు బిడ్డ. ఈ మహితచరిత్ర రుక్మిణమ్మ దౌహిత్ర. ఇంతకంటె మోతుబరులు లేరని పేరు మోసిన మోతేవారింటి కోడలైంది. జమీన్దార్ మోతే కృష్ణరాయని చేబట్టింది. మెట్టినిల్లు పెట్టింది మొదలు వల్లభుని డెందపు పొలాన వలపు పంట పండించిన నెలంత. అరమరలు లేని కూర్మితో అనగి పెనగి, మర్మమెఱుగని మమతల కూడి మాడి పొరపొచ్చెములు లేని చెలిమితో పెంపేది జంటబాయని గువ్వలలాగు పతీ, తానూ ప్రణయ ప్రపంచంలో పావనదంపతులైనారు. సవతిని మఱపిం

చి సవతి సంతును —ఒక బాలిక— సొంత బిడ్డలకంటె ఘనంగా సాకింది. అత్తఆడబిడ్డలకడ అణకువతో మెలగి తగిన కోడలనిపించుకొంది. రాగ్గరగించే విమల గాంధర్వాన్ని కైవసంచేసికొన్న గంధర్వగాయకి అనిపించుకొంది కృష్ణరాయని పత్ని.

జమీన్ దారుని పత్నియైనా భర్తకు స్వయంగా పనులు చేసి "కార్యేషు దాసీ" త్వాన్నీ, పతికి ఆపత్కాలంలో ఆలోచనలు చెప్పి "కరణేషు మంత్రి" త్వాన్నీ, లోకం తెలియని తన అమాయికత్వాన్ని మందలించే పెద్దల హితవులను చిరునగవుతో స్వీకరించి "క్షమయా ధరిత్రీ" త్వాన్నీ సహజంగా భగవంతుడిచ్చిన సురూప సంపదచేత "రూపేచలక్ష్మీ" త్వాన్నీ, సాబంతినిగూరుచుండి చల్లనికబుర్లను చెప్పి మనః ఖేదాన్ని పోగొట్టి "భోజ్యేషు మాతా" త్వాన్నీ అనురూపసతియగుట "శయ్యాసురంభా" త్వాన్నీ సార్థకం చేసింది కృష్ణరాయని సతి పుణ్యశీల.

అట్టి గొనాలకున్న అందాలబరిణె తెల్వి మంతురాలు ౨౨-౮-౩౬ వ నాటి మధ్యాహ్నం ౨ గంటలకు సుఖప్రసవమై, ఆడుబిడ్డను కని పచ్చిబాలెంతతనమైనా తీరకమున్నే గుండెజబ్బుతో ౨౮-౮-౩౬వ నాటి ఉదయం ౯ గంటలకు పేరుసంపాదించుకొందామనే పేరాసతో పరలోకాలకి ప్రయాణం చేసింది. బంధువుల యొక్కా, భర్తయొక్కా విచారం చెప్పబూనుకోవడం అవివేకం పనీ, అనవకాని పనీను. ఆనాడేలూరి జనం ఇసుమువేస్తే రాలకుండా కళేబరం వెంట కాటికి తొడతొక్కిడితో నడిచిపోయినారు. పసుపూ, కుంకుమా, పువ్వులూ చల్లవచ్చిన పుణ్యవతులతో గవాక్షాలు నిండిపోయినాయి. ఆమెమృతికి కంటతడి పెట్టని వ్యక్తులు లేరు. ఆపుణ్యసాధ్వికి చేయెత్తి మ్రొక్కని జనులు లేరు.

అంతకు క్రితముదినమే జరిగిన **మోతే** గంగరాయని సతిమృతికి వగచు ఏలూరిజను లీవింత చావునకు అట్టుడికిపోయారు.

తెన్ను చూపిన ఈ తెఱవకు భగవంతు డుత్తరగతులు గల్గించుగాత మని మ్రొక్కుతాను.

---

# నక్షత్రమండలము

(ధాత సంవత్సర జ్యేష్ఠమాసము, ఆషాఢమాసము)

గోబ్బూరు వేంకటానంద రాఘవరావు




[నక్షత్రవేధచేయువారు ఈపటమును తలమీదుగా ఆయాదిక్కులు సరిపడునట్లు చూచి పట్టుకొని పరిశీలింప

1936 జూన్ నెల 8 తేదీని రాత్రి 8-55 గంటలకును, జూన్ నెల 15 తేదీని రాత్రి 8-27 గంటలకును
,, 22 ,, ,, 8- ,, ,, 29 ,, ,, 7-32 ,,
జూలై 7 ,, ,, 7- ,,

} వలెను. గ్రహనక్షత్రాదులు కనబడును.]

13 6- 13 ౭౮౭

"How infinitely grand the scene!
What Omnipotence!"—Schroeter.

అనంత తేజోవిరాజితమైన యీ నభోరంగ మెంత విచిత్రము? దీనిని నిర్మించిన భగవంతుడు ఎంత సర్వశక్తిసంపన్నుడు?

ఈ ధాతసంవత్సర జ్యేష్ఠబహుళ తృతీయ ౮-౬-౩౬ నుండి ఆషాఢబహుళచతుర్థి ౮ ౭-౩౬ వఱకుగల మాసములో రాత్రి తొలిజామున నగపడు గ్రహనక్షత్రాది ఖగోళదృశ్యములను పరిశీలింతము.

## పాలవెల్లి (The Milky Way)

**It is a road whose ground work is of stars."** నక్షత్రములతోనే నిర్మింపబడిన (దేవ) మార్గమిది అని Ovid మహాకవి వర్ణించిన యీ ధవళదృశ్యమిపుడు ఉత్తరసమీప ఈశాన్యదిశకడ దిక్చక్రముపై తేలియగపడుచు, తూర్పుక్షితిజమునకు సమాంతరముగా పోయిపోయి, దక్షిణమున గగనమధ్యరేఖను గడచి, నైరృత్యాకాశమున త్రిశంకు మండలమున కావల నదృశ్యమగుచున్నది. ఇట్లు వక్రముగబోవు నీ తెలుపును మనకవులు కొందరు "నభోంగమావత్రోజహారలతిక" అని వర్ణించియున్నారు. ఇయ్యది ఈశాన్యక్షితిజమున రాజహంసమండలముకడ, శ్యామసీమలకడ నారంభించి, వేదికమండలము వఱకు ఛాయాపథముచే నాక్రమింపబడినట్లు కనపడుచున్నది. నురగలుగ్రక్కుచు తెల్లనైతోచు సముద్రమధ్యమున శ్రీరాముడు నిర్మించిన సేతువు ఈ ఛాయాపథదృశ్యమును స్మరింపచేసెనని రఘువంశమున గల వర్ణనము మన మీవరకే గమనించియుంటిమి. రాజహంసమండల సమీపమున గల శ్యామసీమలు (Coal sacks) రెండింటిని గమనింపవలయును.

## ఉత్తరమున

ధ్రువక్షితిలో చిన్న ఎలుగు (Ursa Minor) తోకచివరను ధ్రువుడు మెఱయుచున్నాడు. నేటివలె అయస్కాంతదిక్సూచి (Magnetic needle) మొదలగు సాధనములు లభింపని ప్రాచీనకాలములలో దారి తెన్ను తెలియనిసముద్రమున మోటునౌకలతో యానము గావించువారలకు దిశలు తెలియుట ఈ చుక్కమూలముగానే. ఆసంగతి ఒకకవీశ్వరు డిట్లు వర్ణించెను.

Rude as their ships were navigated then,
No useful compass or meridian known
Coasting they kept the land within their pen
And knew no North but when the Pole-star shone!

చిన్న ఎలుగు తోకలో అగ్ని, మహేంద్ర, కశ్యపనక్షత్రములును, దాని శరీరమునందు ధాత, విధాత చుక్కలును చక్కగా కానవచ్చుచున్నవి. మిత్రనక్షత్రము ఆవగింజవలె చిన్నదైనను మిణుకు మిణుకుమనుచున్నది. ఎలుగునకు దిగువభాగమున, ఉత్తరదిక్చక్రముపైని ఊర్వశీపురూరవసులు కనబడుచున్నారు. ధ్రువక్షితిచుట్టును నరకుడు మెలికలుతిరిగి, లఘు-బృహదృక్షములనడుమ పరిహాస్య నదిలాగున నున్నాడు. ఈ యంశమునే వర్జిల్ (Virgi) మహాకవి ఈక్రింది పద్యములో హృద్యముగా వర్ణించియున్నాడు:

Ar und cur p.le the spiry Dragon glides,
and like a wandering stre m this Bears divides

నరకునికావల గగనమధ్యరేఖను గడచి సప్తఋషిమండల మున్నది. అందు పులహక్రతురేఖ ధ్రువునిసూచించుచున్నది. అందుచేతను ప్రాచీనకాలపు నావికులకు ఈ సప్తఋషిమండలముగూడ చాల ప్రయోజనకారియై యుండెను. ఆయంశమును Manilius) మెనీలియస్ మహాకవి ఇట్లు వర్ణించియుండెను:

Seven equal stars adorn this Greater Bear,
and teach the Grecian sailors how to steer.

సప్తఋషులకావల వాయవ్యాకాశముపైని విఘ్నేశ్వరుడు ఏనుగుతొండము, లంబోదరము, మూషకవాహనముతో మెఱయుచున్నాడు.

## పశ్చిమాకాశమున

పునర్వసుమహామీనము పగ మస్తమించినది. మృగశిర ఆర్ద్రనక్షత్రములతో కూడిన Orion ఇంతవు

ముందే అస్తమించినది. పునర్వసులో **Castor and Pollux** అను మిథునపు చుక్కలు మాత్రము కానవచ్చుచున్నవి. దానికీవల కర్కాటకరాశిలో పొట్లపూవువంటి పుష్యమి త్వరలో అస్తమింపనై యున్నది. ఆదిగువనున్నది సర్పదైవత్యమైన ఆశ్లేష. ఆశ్లేషపై సింహరాశిలో పల్లకివంటి ఆకారముతో మఘచుక్కలు అయిదున్నవి. అందును, సరిగా క్రాంతిరేఖపైనే ఉన్నది (**Regulus**) మఘనక్షత్రము తేజరిల్లుచున్నది. ఆమీదివంపు చుక్కలలో శృంగినక్షత్రము మిణుకుమిణుకుమని మెఱయుచున్నది.

## దక్షిణాకాశమున

నౌకామండలము చాలవఱకు అస్తమించినది. అండలిస్తంభము, తెఱచాపల మీదిచుక్కలు మాత్రము కొన్ని కనబడుచున్నవి. వాటికీవల త్రిశంకు విశ్వామిత్రు లున్నారు. త్రిశంకు మండలమున కెగువ అశ్వాశ్వ (**Centaurus**) మండలము కలదు. వానికి, కావల గగనమధ్యరేఖకు తూర్పున వృకమండలమును, అశ్వినులు (3) యయాతి మండలము లున్నవి. ఆగ్నేయభాగమున వేదిక కొంచెము కనబడుచున్నది.

## తూర్పున

శ్రవణము ఇప్పుడే ఉదయించినది. ఆగ్నేయదిశను ధన్వి అంతకుముందే ఉదయించి మెఱయుచున్నాడు. ఈశాన్యమున రాజహంసయు చక్కగా మెఱయుచున్నది. పాలపల్లికిని గగనమధ్యరేఖకును మధ్య శేషపాన్పుపై పవళించి, శ్రీ మహావిష్ణువు కానవచ్చుచున్నాడు. ఆతని నాభికమల సంజాతుడైన బ్రహ్మ వీణాధారిణియైన సరస్వతిని ముఖమున నిడుకొని తేజరిల్లుచున్నాడు. సంకర్షణునికి దిగువను మిత్రదేవతాకమైన అనూరాధయును, దానికావల తూర్పుగా ఎఱ్ఱని కాంతితో మెఱయుచు జ్యేష్ఠయు. జ్యేష్ఠకు దిగువ తూర్పుగా మూలచుక్కలును కనబడుచున్నవి. వీటితో కూడిన వృశ్చికరూపము ఇప్పుడు ఆకాశమున స్పష్టముగా నగపడుచున్నది.

## మధ్యను

గగనమధ్యరేఖకు తూర్పుగా భూతేశమండలములో స్వాతి పగడమువలె ఎఱ్ఱగా మెఱసిపోవుచున్నది. దానికిదిగువ దక్షిణముగా కుమ్మరిసారెవంటి రూపముగల విశాఖచుక్కలుగలవు. గగనమధ్యరేఖకు పశ్చిమముగా ముత్యమువంటి కాంతితో చిత్ర మెఱయుచున్నది. శ్రీనాథుడు వర్ణించినట్లు, గగనమధ్యరేఖకటునిటు తోరణస్తంభములవలె చిత్రస్వాతీనక్షత్రములును, చిఱుతవోయిన మూఁకుటిచెలువు దాల్చి విశాఖచుక్కలును ఇపు డాకాశమధ్యమున మెఱయుచున్నవి. చిత్రకు ఉత్తరముగా ఆపనక్షత్రమును, పశ్చిమముగా కణ్వ, పాణిని, నళ, ఆప్లవసు నక్షత్రములును కలవు. కన్యయొక్క వేణివలె వేణీమండలము కలదు. దాని దిగువ సవితృదేవతాకమైన హస్తయు, హస్తకు పశ్చిమముగా అర్జునీ నక్షత్రములు-పూర్వఫల్గునీ, ఉత్తరఫల్గునీనక్షత్రములును కలవు. వీటిదిగువ గ్రావములున్నవి. అందు తయారు కాబడిన సోమరసము ఆప్రక్క చమసములో నుంచుకొని దేవతలు త్రాగెడివారట! ఆదిగువ అహిమండలమును, వమ్రీమండలమును కలవు. వీటితో సంబంధించి వేదగాథ లున్నవి. కన్యరాశికి దిగువ వార్తిక పక్షికలదు. దీనింజూచి హస్తనక్షత్రమని కొందరు తలచుచున్నారు. కాని అది హస్తనక్షత్రము కాజాలదు. ఈ వార్తికము నొక్కకడిజేసికొని మ్రింగివేయవలెనని తెఱచిననోటితో సరభసముగా పైబడుచున్న వృకమును అశ్వినులు ఈటెతో పొడిచి వార్తికమును కాపాడినారు. దీనినిగూర్చి ఋగ్వేదమునందు పెక్కు ఋక్కులు కలవు. వార్తికము దిగువ నహుషుడు గగనమధ్యరేఖదాక వ్యాపించి, అజగరోపాఖ్యానమును స్ఫురింపజేయుచున్నాడు. గ్రహములలో గురుడు మాత్రము మన కిపుడు కానవచ్చుచున్నాడు. ఈమాసములో గురుడు జ్యేష్ఠలో వక్రగతుడైయున్నాడు. తేజోఘనుడైన ఈగురుడుగాక, మరి పగనొకందురూపములు మిక్కిలికాంతితో మెఱయుచున్నవి.

(౧) పశ్చిమమున నస్తమింపబోవుచున్న పునర్వసులో సాంబమూర్తి Pollux in Gemini.

(౨) సింహరాశిలో మఘ Regulus in Leo.

(౩) కన్యలో చిత్ర Spica in virgo

(౪) వృశ్చికములో జ్యేష్ఠ Antares in Sccrpios.

(౫) గరుడునిలో శ్రవణము Altair in Aquila

(౬) వీణామండలములో బ్రహ్మ Vega in Lyra.

(౭) భూతేశునిలో స్వాతిArcturus in Bootes

(౮) త్రిశంకు } త్రిశంకులోనివి
(౯) విశామిత్ర } Crux Alpha, Beta

(౧౦) } అశ్వినులు (3) Alpha & Beta
(౧౧) } Centaurus

ఇందును, పశ్చిమమునుండి తూర్పునకు వరుసగా క్రాంతిరేఖపై సాంబ, మఘ, చిత్ర, జ్యేష్ఠచుక్కలును, గురుగ్రహమును చేరి, విద్యుద్దీపమాలికవలె నభోమధ్యభాగమున వెలయుచు మనకు సంతోషాశ్చర్యములు కలుగ జేయుచున్నవి.

## విశేష విషయములు

౧. ఈ జూన్ నెల ౨౧ వ తేదీని Summer Solstice. అదే దీర్ఘతమ మైన దినము. అటనుండి సూర్యుడు దక్షిణాయనగతుడైనట్లు కనబడును. అహః ప్రమాణముకూడ క్రమముగా తగ్గుచుండును.

౨. ఈజూన్ ౨౭ తేదీని మన పంచాంగకర్తలు ఐంద్రీపూజ వ్రాసియున్నారు. జ్యేష్ఠనక్షత్రము ఇంద్ర దేవతాకము. అపు డింద్రపూజ జరుగుట సమంజసము.

౩. శయన ఏకాదశి:—జూన్ నెల ౩౦ వ తేదీ శయనఏకాదశి. ఏకాదశులకును, శ్రీమహావిష్ణు నక్షత్రముల గమనమునకును ఎడతెగని సంబంధ మున్నదని మనము అనేకసారులు తెలిసికొంటిమి. విష్ణునక్షత్రములు గగనమధ్యరేఖను సూర్యాస్తమానము కాగానే గడచిపోవు దినమునుండి విష్ణువు పండుకొన్నట్లు భావింపబడును. ఆదినము ఆషాఢశుద్ధ ఏకాదశియగును. అప్పటినుండి చాతుర్మాస్య మారంభమగును. మరిరెండునెలలకు విష్ణువు పడమట అస్తమించును; పడమటనుండి తూర్పునకు తిరుగుటలో నుండును. అదే పరివర్తన ఏకాదశి; పిమ్మట మరిరెండునెలలకు కార్తికశుద్ధ ఏకాదశికి తూర్పున నుదయించును. అదే బోధన - ఏకాదశి, ఉత్థాన-ఏకాదశి అని చెప్పుదురు. ఆషాఢశుద్ధ ఏకాదశినాడు విష్ణువు గగనమధ్యరేఖను గడిచి, పడమటకు వ్రాలి, శయనగతుడగుట గమనింపవలసిన విషయము.



# సెచిలీసు ద్వీపములు

కె. వి. స్వామి

సెచిలీసు ద్వీపములు మడగాస్కరు ద్వీపమునకు ౬౦౦ మైళ్లదూరములో ఉత్తరముగానున్నవి. ఈ ద్వీపములు మొదట ఫ్రెంచివారివి, తరువాత యింగ్లీషువారి స్వాధీనమునకు వచ్చినవి. ఈ ద్వీపములో ౧౦౦ చిన్నద్వీపములు కలవు. వీని విస్తీర్ణము మొత్తము ౧౫౬ చ. మైళ్లు. ఈ ౧౦౦ ద్వీపముల సమూహముకే సెచిలీసుద్వీపములని పేరు. ఈ సముదాయములో మాహీ యనునది అన్నిటికంటెను పెద్దది. దీనివిస్తీర్ణము ౫౫ చ. మైళ్లు. మాహీకి ముఖ్యపట్టణము విక్టోరియా. ఇది మంచి రేవుపట్టణము. మాహీకి తూర్పున ప్రాస్లీను ద్వీపమున్నది. దీనివిస్తీర్ణము ౯,౭౦౦ ఎకరములు. మాహీతర్వాత పెద్దది ప్రాస్లీను. మిగిలినవానిలో ముఖ్యమైనవి సిలుహాన్యేటు, లాడైగో, అమిరాంటె, కొస్మోలిడో, అసమ్షను, అల్డాబ్రాద్వీపములు. ఇందు అమిరాంటే ద్వీపసముదాయము పగడపుదీవులు. సెచిలీసు ద్వీపములు విషజంతువులు, విషజ్వరములు, ప్రాకృతికముల ప్రమాదమేమియు లేక మిక్కిలి ఫలవంతములై నివాసయోగ్యముగా నున్నవి. ఇంతేగాక, ఆఫ్రికాదేశములకు తిరుగ పోక తీర్చుట ఆగును.




ఈ ద్వీపములచుట్టూ కొబ్బరిచెట్లు దట్టముగా పెరిగియుండును. స్త్రీ మరుగులో పొదజనులను పిలుచుచు న్నట్లు వాని సూకులను ఆడించును. కొండలు దూరపుగానుండి ఆకాశమునంటున ట్లగుపించుచు, తమ శిఖరములను మబ్బులలో దాచికొనును. దట్టమైన యడవులమధ్యనుండి వెండితీగలవలె సెలయేళ్లు సముద్రమును చేరుటకు వడిగా ప్రవహించును. స్నానముచేయుటకు బహు అనుకూలముగానుండు నీటి

పట్టులు ఎక్కడచూచినను కనుపించును. రంగు రంగు పిట్టలు కిలకిలమనుచు చెట్లలో యెగురుచుండును.

శీతోష్ణములు:- సెచిలీసు ద్వీపములు ఈక్వేటరు సమీపమున నున్నప్పటికిన్నీ ౮౫° పైన వేడిమిలేదు. రాత్రియందు చలివిస్తారము వర్షము సుమారు ౯౮ అంగుళములు కురియును. ఒకప్పుడు సంవత్సరమునకు ౧౫౦ అం. కూడ కురియుటకద్దు.

పైరుపంటలలో ముఖ్యమైనది కొబ్బెర. కొబ్బెర నూనె, దాల్చినచెక్క, దాని తైలము, యూకలిప్టసు తైలము, నిమ్మగడ్డి, నిమ్మనూనె, సిట్రియోడోరా, పామ రోసా తైలములు- ఇవి ఎగుమతి చేయుచున్నారు. ఫల జాతులు సమృద్ధి. బొప్పాస, జామి, అరటి, సీతాఫలము, నారింజ, నిమ్మ, ద్రాక్షపండ్లు ఎక్కువగా పైరగు చున్నవి. తోటలను కాపాడనియెడల చెట్లపై ప్రాకు నత్త గుల్లలు పండ్లను భుజించి పోవును. కోకో, కాఫీకూడ పైరు చేయుచున్నారు. బంగాళాదుంపలు, క్యాబేజీ యీ ద్వీపములందు పైరుకావు. అందుచే వీనిని దగ్గరలో నుండు 'కెన్యా'నుండి దిగుమతి చేయుచున్నారు. కోళ్ళు, బాతులూ, టర్కీ, గినీకోళ్ళు ఎక్కువగా పెంపుచేయుచున్నారు. చేపలు పలువిధములైనవి సము ద్రమునుండి పట్టుచున్నారు. కాని చేపలు పట్టువారు వారి ప్రాచీన పద్ధతులను వదలక, అప్పటినావలనే ఉపయోగించుచున్నారు. ఈ సముద్రమందు ఒడ్డుననే భయంకరమగు పెద్ద 'పులిసొరలు' సంచరించును. (Tiger Shark) దీనిని ఆదేశస్థులు 'డిమోసలు' అని పిలిచెదరు. ఈపులిసొర ౨౦ అడుగుల నిడివికలిగినది. మను ష్యులను అమాంతముగా మ్రింగివేయును. నావికులు వీనిని పట్టుట తటస్థించిన ముందుగా దానికడుపు చీరి వేయుదురు. ఒకసారి దీనికడుపునుండి ఒక బంగారు ఉంగరము, డబ్బుసంచి తీయబడినవి. అమిరాంటి ద్వీప మున తాబేళ్లను విస్తారముగా వేటాడుచున్నారు.

జనులు ఈద్వీపములందు పెక్కుజాతులు కలరు. ఈ ద్వీపములలో నివసించి యున్నవారికి 'క్రియోలు'లు అనిపేరు. ఈక్రియోల్సు పూర్వము నావలను, ఓడ లను కొల్లగొట్టి బ్రతుకు సముద్రపు బందిపోటుదొంగల సంతతివారు. వీరిప్పుడు కొబ్బెరతోటలలో కూలిపని చేసి జీవించుచున్నారు. ౧౮ వ శతాబ్దమున విడుద లయిన నీగ్రోలు చాలామంది ఈ సెచిలీసునకు వలస పోయినారు. ఫ్రెంచి తిరుగుబాటులో (French Revolution) ఫ్రెంచిరాజన్యులీద్వీపమున తలదాచు కొన్నారు. వారిసంతతివారింకను ఈద్వీపమున కలరు. చీనాదేశస్థులుకూడ వచ్చిచేరినారు. మన హిందూదేశ స్థులును చాలామంది మాహియందు విక్టోరియా రేవు పట్టణమున వ్యాపారస్థులుగా ఉన్నారు. బ్రిటిషువారు యిటీవల వలస ప్రారంభము చేసినారు. ఈద్వీపవాసు లలో ౯౭% క్రైస్తవులు.

వృత్తులు:— డబ్బుగలవారు జాగీర్లను కొని యున్నారు. వ్యాపారస్థులు వ్యాపారము చేయు చున్నారు. క్రియోలు మనుష్యులు తోటలలో కూలి పని చేయుచున్నారు. క్రియోలు నేటివుమనుష్యులు కొంతమంది చేపలను వేటాడుదురు. చెట్లను దొలిచి దోన్నెలాగచేసి దానిమీద తేలుచుపోయి చేపలను పట్టుదురు. ఈ (Dug-out) నావను 'పిరోగి'అందురు. క్రియోలు మనుష్యులకు ముఖ్యమైన ఆహారము పనస పండ్లు. పనసతొనలను ఎండబెట్టి విసిరికాని, దంచికాని వండుదురు.

ప్రాస్లిను ద్వీపము మాహీకితూర్పుగా ౧౦ మైళ్ల దూరములో నున్నది. ఇదియే బైబిలులో చెప్పిన (Garden of Eden) 'యీడెను' తోట. ఇందే ఆదాము, అవ్వ నివసించిరి. వారిని దేవుడు తినవద్దనిన పండు యిక్కడ యిప్పటికిని పైరగుచున్న 'కోకోడి మెరు' (Cocodemer) యే! ఈపండు ఈ ప్రాస్లిను ద్వీపమునందు తప్ప ప్రపంచమునందు మరియెచ్చటను లేదు. ఈచెట్టు కొబ్బెరచెట్టును పోలియుండును. దీని యెత్తు ౧౨౦ అడుగులు. దీనికాయ 'కోకోడిమెరు' ౬ లేక ౭ మణుగుల బరువు. మరియేకాయయు ఇంత బరువు కలది కలదా? ఈకాయలోపల గుజ్జుకలదు. తినిన చాలా రుచిగానుండును. ఈఫలమును తినియే ఆదాము, అవ్వ దేవునితో విరోధము తెచ్చుకొన్నారు.

# అంతర్జాతీయ సమితి అంతరించినదా?

కపిల కాశీపతి

౧

ఒక అమెరికా దేశపు పత్రికలో ప్రకటించిన నిజమైన కథ:—

జేమ్సు, జార్జి ఇద్దరు అన్నదమ్ములు. అమెరికా సంయుక్తరాష్ట్రాల ముఖ్యపట్టణం న్యూయార్కులో, హావెల్ అనే ప్రదేశంలో పిత్రార్జితమైన ఒక ఇంట్లో నివశించేవారు. ఇద్దరూ బ్రహ్మచార్లు. తండ్రి పోగానే ఉమ్మడిగావున్న ఇల్లు పంచుకున్నారు: వున్న రెండు గదులలోనూ, ఎవరి భాగం వారికి తెలియడానికి మధ్యగా ఒక సుద్దముక్కతో గీతలుగీసినారు. వారికో బండికూడా వున్నది ఆబండిలోకూడా సుద్దముక్కతో మధ్యగా ఒక గీతగీసినారు. జేమ్సు, జార్జి ఆ యింట్లో ఆవిధంగా ౭౨ సంవత్సరాలు నివసించినారు. ఈ ౭౨ సంవత్సరాలలోనూ కూడా ఒక్కసారైనా అన్నదమ్ములు గీచిన గీతదాటి ఒకరిభాగంలో ఒకరు పోలేదు. పెరట్లో ఎవరిభాగంలోవారు కూరగాయలు పండించి, బండిలో చొప్పిడిగా ఎవరిభాగంలో వారి కూరలు సంతకు తీసుకుపోయి అమ్ముకునేవారు. తిరిగి వచ్చేటప్పుడు ఎవరికి కావలసిన సరుకులు వారిభాగంలో బండిలోవేసుకొని తెచ్చుకునేవారు. మాట లేదు, మంతిలేదు. అరవైరెండు సంవత్సరాలూ ఈ విధంగా గడిచింది. జేమ్సుకి పన్నిపాతజ్వరంవచ్చి చనిపోయినాడు. జార్జి గీతదాటి అతనికి ఉపచారం చెయ్యలేదు. ఆఖరికి పోయేప్రాణానికి గొంతుకలో నీళ్లుకూడా పొయ్యలేదు. జేమ్సుస్నేహితులువచ్చి అతనిశవానికి అంత్యసంస్కారాలు చేసినారు. పీనుగ గుమ్మందాటగానే జార్జి ఇంట్లో వున్న సుద్దగీతకూడా చెరిపివేసినాడు. బండిలో గీతకూడా చెరిపివేసినాడు.

ఏనాడో చదివిన ఈ కథ జ్ఞాపకం వచ్చింది, అబిస్సీనియా యుద్ధంతర్వాత యూరపు ప్రభుత్వాల వైఖరి ఆలోచిస్తే.

ముందుయుగంలో చరిత్రకారుడు బహుశః ఈ విధంగా వ్రాస్తాడీకథ: ఆ కాలంలో అంతర్జాతీయ సమితిఅనే సంస్థవుండేది. ఆ సంస్థలో ౫౨ దేశాలకు సభ్యత్వం వుండేది. బ్రిటను, ఫ్రాన్సు, ఇటలీ దేశాలు వీటిలో పలుకుబడికలిగిన పెద్దదేశాలు. అబిస్సీనియా అని ఒక అనాగరిక ఆఫ్రికా దేశంకూడా సమితిలో సభ్యరాలే. ఈ సభ్యరాండ్రలో ఒకరిమీద ఒకరు దౌర్జన్యంగా ప్రవర్తించకుండా వుండడానికీ, ఒకరి రాజ్యం ఒకరు అపహరించకుండా వుండడానికీ, మీదుమిక్కిలి ప్రపంచంలో యుద్ధంఅనే పశుసాంప్రదాయం రూపుమాపి, శాంతినెలకొల్పడానికీ ఈ అంతర్జాతీయసమితి స్థాపించినారు. కొన్నాళ్లు గడిచినతర్వాత ఇటలీలో జనసమ్మర్దం ఎక్కువైనది. బ్రిటనుకీ, ఫ్రాన్సుకీ వలసరాజ్యాలు వుండడం వల్ల వారికి ఆ ఇబ్బందులు లేకపోయినవి. ఇటలీకి వార్ని చూసి కన్నుకుట్టింది. తనకుకూడా వలసరాజ్యాలు కావాలని అబిస్సీనియా అనే ఆఫ్రికారాజ్యంమీద పడి అన్యాయంగా యుద్ధంచేసి వశపర్చుకున్నది. అబిస్సీనియా ఇటలీతోటి సభ్యరాలు సమితిలో. సమితిప్రణాళికప్రకారం సభ్యులు ఒకరిమీద ఒకరు అన్యాయంగా ప్రవర్తించకూడదు; యుద్ధంచెయ్యకూడదు. అల్లా ఎవరన్నా చేస్తే తక్కినసభ్యులంతాకలిసి అపరాధిని సమితిలోంచి వెళ్లగొట్టాలి. అప్పటికీ యుద్ధంచెయ్యడం మానకపోతే ఆ దేశంతో సంబంధబాంధవ్యాలు వదులుకోవాలి; ఆ దేశానికి వ్యతిరేకంగా బాధపడేదేశానికి సహాయంచెయ్యాలి; అవసరం అయితే సభ్యులంతా కలిసి అపరాధినిమీద యుద్ధం చెయ్యాలి. కాని, ఇటలీ అనేదేశం అబిస్సీనియా అనే దేశంమీద అన్యాయంగా దండెత్తినప్పుడు అంతర్జాతీయసమితి ఏమీ చెయ్యలేదు. ఇటలీకి తమతమ దేశాలనుంచి సరుకుల సరఫరా ఆపుచెయ్యాలని కొన్నిదేశాలు ప్రయత్నించినవికాని, సభ్యులందరిలోనూ ఏకీభావం లేకపోవడం వల్ల ఆ ప్రయత్నం ఫలించలేదు. వాయువిమానాలతో,

విషవాయువులతో ఇటలీసేనలు అబిస్సీనియాసేనల్ని రూపుమాపినవి. ఇటలీ గెల్చినది. అబిస్సీనియారాజు దేశంవిడిచి పారిపోయినాడు. బ్రిటను ప్రధానమంత్రి ఇదిచూసి తలవంచుకున్నాడు. కాని ఏమీ చెయ్యలేక పోయినాడు. ఫ్రాన్సుమంత్రి, అయింది అవనేఅయింది కాబట్టి ఇటలీతో స్నేహం చేసుకుని ఎప్పటిమాదిరిగా వుందామన్నాడు............ఇదేవిధంగా వుంటుంది భావిచరిత్ర.

అస్వాతంత్ర్యం ఎరుగని ఆఫ్రికారాజ్యం, అబిస్సీనియా అంతరించినది. దానితోపాటు అంతర్జాతీయ సమితికూడానా ? ఇకముందుగతి ఏమిటి ? ఈప్రశ్నే బాధిస్తున్నది జరిగిన, జరుగుతున్న విషయాలు పరిశీలించిన ప్రతివ్యక్తినీ. తిరిగిచూచుని వ్రాసపోక వేసే సోమరి ప్రశ్నకాదు. ఒకరాజకీయకక్షకు చెందినవారు స్వప్రయోజనంకోసం అడిగేప్రశ్న కాదు. ఇది ప్రపంచపు ముఖ్యసమస్య. జనబాహుళ్యానికి కలిగిన ఖంగారువల్ల, భయంవల్ల, అనుమానంవల్ల, ఆదుర్దాతో వేసే అత్యవసర ప్రశ్న.

ఈప్రశ్న యెందుకు బయలు దేరిందని ఆశ్చర్యపడనవసరం లేదు. అవగాహనకాని ప్రస్తుత అంతర్జాతీయ రాజకీయ పరిస్థితులు, ఏవిధంగా ఆలోచించినా, ఏమాదిరి శాంతినిర్మాణానికీ సరిపోవడంలేదు. ముఖ్య విషయం ఏమంటే అంతర్జాతీయసమితి తన కర్తవ్యం నిర్లక్ష్యం చేసింది. ఆకారణంవల్ల తనగొయ్యి తానే తవ్వుకున్నది. సమితి అవసానదశకు వచ్చింది. గడించిన రెండుమూడు సంవత్సరాలలోనూ, ముఖ్యంగా పోయిన అయిదారు మాసాలలోనూ, జరిగిన సంగతు లన్నిటిలో ఈ విషయమే అతిప్రాముఖ్యంగా గోచరిస్తుంది. ఈ సమస్యముందు తక్కినవన్నీ అంత పెద్దవిగా కనుపించవు.

ఇటలీ అబిస్సీనియాను ఆక్రమించింది. జాతిసమితి మిమ్మల్ని రక్షిస్తుంది, బ్రిటను మీతరఫున యుద్ధం చేస్తుంది అని అబిస్సీనియాను ఆశపెట్టిన స్నేహితులంతా మాటతప్పి, ఆదేశాన్ని గంగలోముంచారు. అనేకవేలమంది మరణానికి, భరించరాని బాధకు కారకులైనారు. చాలామంది అభిప్రాయంలో అంతర్జాతీయసమితి చెయ్యబోయేది ఏమీ లేదు. ఈప్రశ్నకు ముఖంచాటేస్తుంది. బ్రిటిషుప్రభుత్వం కూడా అంతే. నమ్మకంగా ఒకమాట మాత్రం చెబుతుంది. సమితిలో ఇతర సభ్యులు ఎంతవరకు తయారో, అంత వరకూ తానుకూడా సిద్ధంగా వున్నా నంటుంది. వుట్టి పోసుకోలుమాట.

సమితి ప్రణాళికపరతులు త్రోసిరా జన్నందుకు పర్యవసానం అప్పుడే గోచరిస్తున్నది. అసలు యూరపు అంతర్జాతీయ రాజకీయ నిర్మాణమే కూలిపోడానికి సిద్ధంగావున్నది. శాంతినెలకొల్పడానికి దేశాలమధ్య ఎన్నోరాజీలూ, ఒడంబడికలూ, సంఘులూ వున్నవి. అవి ఎన్నో, ఎటువంటివో చెప్పడం కష్టం. కొన్ని బహిరంగంగా చేసుకున్నవి ; కొన్ని రహస్యం. అంతర్జాతీయసమితి అధికార్లకు తెలిసినంతవరకు, యూరపు యుద్ధంతర్వాత యూరపుఖండ దేశాలనడుమ కనీసం ౨౫౦ ఒడంబడికలన్నా వున్నవి. ఇవన్నీ చూసి ఒక రాజకీయవేత్తకి ఒళ్లుమండి, యూరపుఖండానికి సంధిజాడ్యం పట్టిందన్నాడు. ఆసంఘులన్నీ ఇప్పుడు తెగడానికి సిద్ధంగావున్నవి. అవివ్రాసినపత్రాలన్నీ నాలుక గీసుకునేందుకు కూడా పనికిరావు. వాటిలో పరతులు ఎవరికి అనుకూలంగా వున్నంతవరకు వారు అనుసరిస్తారు. అనుకూలంగాని మరుక్షణంలో అతిక్రమిస్తారు.

ముస్సోలినీ విజయంలో వున్నది ఒక్కటేనీతి. రాజుకంటేగూడా మొండివాడు బలవంతుడని. పోతే పోయింది ప్రాణం, వస్తేవచ్చింది నష్టం అని తెగించినాడు. తక్కినవారికి ఆతెగింపూ, ఆమొండితనం లేకపోయినవి. నమిలినవాడికంటె మింగినవాడే దొడ్డవాడైనాడు.

ముస్సోలినీవిజయంవల్ల జర్మను నియంత హిట్లరుకి ధైర్యంకలిగి, వెర్సైయిల్సుసంధిపరతులు అతిక్రమించి, తటస్థప్రదేశమైన రైనునదీప్రాంతంలో తనసేనలు దింపినాడు. ముస్సోలినీ విజయంవల్ల టర్కీదేశపు నియంత కెమాల్‌పాషా ఒకవొడంబడిక అతిక్రమించి తటస్థప్రదేశ

మైన డార్డనెల్లీసు జలసంధివద్ద సేనలు నిలుపడానికి ప్రయత్నం చేస్తున్నారు. ముస్సోలినీ విజయంవల్ల ఆస్ట్రియా దేశపు నియంత డాక్టరు షూష్నిగ్గ ధైర్యంతో సెయింటు జెర్మెయిను వొడంబడిక అతిక్రమించి, 30,000 పైగా వుండకూడని తనదేశపు సైనికబలం వృద్ధిచెయ్యడానికి నిర్బంధసైనిక శిక్షణశాసనం అమలుపెట్టినాడు. ముస్సోలినీవిజయం యూరపుఖండాన్ని కలిచివేసింది, చిన్నచిన్నదేశాలకు భయంకలిగించింది, అన్నిదేశాలలోనూ ఆయుధనిర్మాణ కార్యక్రమం వృద్ధిచేసింది. యూరపు మహాయుద్ధం తర్వాత యుద్ధప్రయత్నం చెయ్యాని బ్రిటనులో ఆ ప్రయత్నం కలిగించింది.

ఏక్షణంలో బ్రిటనుకూడా బహిరంగంగా యుద్ధప్రయత్నం ప్రారంభించిందో ఆ క్షణంలో - శాంతి సంస్థాపన చెయ్యడానికి బ్రిటను తాహతునశించింది, బ్రిటను అంతర్జాతీయ - పలుకుబడి అంతరించింది. బ్రిటిషు సామ్రాజ్యపు పటుత్వంకూడా ఇందువల్ల దెబ్బతింటుంది. కెనడా ప్రభుత్వం అమెరికా ఖండాలదేశాలతో సహకారంవృద్ధిచేసుకొని, అక్కడి ప్రభుత్వాలు స్థాపిద్దామనుకుంటూన్న ఒక అమెరికా జాతులసంఘంలో చేరడానికి ప్రయత్నిస్తున్నది. కెనడా బ్రిటిషు సామ్రాజ్యంలో భాగం.

ఈ క్లిష్ట సమస్యలోంచి బయటికి దారేది? అంతర్జాతీయ సమితికి వున్నవి రెండేమార్గాలు. ఒకటి ఇప్పడింకా అమలులోవున్న ఇటలీమీద ఆర్థిక ఆంక్షలు అల్లాగేవుంచడం. వీలైతే ఇంకకొంచెం తీవ్రంచెయ్యడం. బ్రిటిషు పార్లమెంటులో లిబరలు, లేబరుపక్షంవారు ఈమార్గం మంచిదని వాదిస్తున్నారు. రెండవమార్గం ఆంక్షలుతీసేసి ఇటలీతో సఖ్యతచేసుకోవడం. ఈ మార్గం కన్సర్వేటివు పక్షంలో అధికసంఖ్యాకులు ఆమోదిస్తున్నారు. మరికొందరు స్ట్రెసాసభావేళంలో స్థిరపరిచిన మార్గం అనుసరించమంటారు. అంటే బ్రిటను, ఇటలీ, ఫ్రాన్సుదేశాలు ఏకమై జర్మనీ విజృంభణ ఆపడం, ఆస్ట్రియా స్వాతంత్ర్యం కాపాడడం. ఈవిధంగా అంతర్జాతీయసమితి మామూలుగానే నడపడం. ఇందులోకూడా కొన్ని అభిప్రాయభేదాలువున్నవి.

సమితి ప్రణాళిక ౧౦, ౧౬ షరతుల ప్రకారం యుద్ధసమయంలో అపరాధినిమీద ఆంక్షలు ప్రయోగించమని సభ్యులమీద నిర్బంధంవుంది. ఆనిర్బంధంతీసేసి సమితిప్రణాళిక సంస్కరించమంటారు. అంటే జాతిసమితి అటుతర్వాత సంప్రదింపులకీ, సమావేశాలకీ గాని మరెందుకూ పనికిరాదు. ఈపక్షంవారే బ్రిటను యూరపు వ్యవహారాలలో కలుగజేసుకోకుండా, ఒక బ్రిటిషుఛానలు సంరక్షణ విషయమే జాగ్రత్త పడడం మంచిదంటారు.

ఈమార్గాలన్నీ ఆలోచిస్తే చివరచెప్పినవి సమితి ఆత్మహత్యకు కారణం అవుతాయని బోధపడుతుంది. అసలు సమితిని నిర్మించిన ఉద్దేశ్యమే నశిస్తుంది. యుద్ధాలు ఆపడానికి నిర్మించబడ్డ సమితి యుద్ధసమయంలో ఏమీ చెయ్యలేనప్పుడు వున్నా ఒకటే, లేక పోయినా ఒకటే. ఆ ప్రకారం చేస్తే సమితి అంతరించినట్టే. అంతకంటె అవమానం వేరేలేదు.

ప్రపంచాన్నీ, సమితినీ ధిక్కరించి, దౌర్జన్యం చేసిన ఇటలీని జాతిసమితిలో కూర్చోనిచ్చి, ఇతరుల అంతర్జాతీయసమస్యలు చర్చించనియ్యడం కూడా నగుబాటుపని. అంతకంటె అవినీతి వేరేవుండదు. సమితి ఈవిధంగా చెయ్యాలనే ముస్సోలినీ కోరిక. అబిస్సీనియా ఆక్రమణతో ఇటలీకి సంతృప్తి కలిగిన దట. ఇకముందు రాజ్య తృష్ణ లేదన్నాడు. బ్రిటనుతోటే, ఫ్రాన్సుతోటే కలిసి యూరపులో ఇతరు లెవరూ వెర్సెయిల్సు వొడంబడిక షరతులు అతిక్రమించకుండానూ, జాతిసమితిని ధిక్కరించకుండానూ సహాయం చెయ్యడానికి సిద్ధంగా వున్నానన్నాడు ఇటలీ నియంత. బ్రిటనుకీ, ఫ్రాన్సుకీ అంగీకారం అయితే ఆపరకులమీద జాతిసమితి నడిపించవచ్చును. అక్షరాలా ఫ్రెంచివారుకోరేది అదే. అల్లాచేస్తే జర్మనీకి వ్యతిరేకంగా జాతిసమితి వెర్సెయిల్సు సంధిషరతులూ, పైచెప్పిన మూడు ప్రభుత్వాల నడుమువున్న రహస్య వొడంబడికలూ సంరక్షించడానికి ప్రయత్నించే ఒక యూరపు ప్రభుత్వాల సంఘంగా వుంటుంది.

ఈవిధంగా చేసేకంటె కన్సర్వేటివులు చెప్పిన విధానమే ఎక్కువధర్మంగా వుంటుంది. సమితి ప్రణాళికలో వుండేమరతులన్నీ అమలుపర్చడానికి మనకు శక్తిలేదు. లేనప్పుడు ఆమరతులు అనవసరం. అవి తీసేసి కొత్త ప్రణాళిక తయారు చేద్దామంటారు వారు. ఇందులో అబద్ధం ఏమీలేదు. వున్నదివున్నట్టు కార్యాచరణకు వీలుగా సలహాచెప్పినారు. ఆవిధంగా నిర్మించబడ్డ సమితి యుద్ధాలు ఆపడానికి వీలుండదు. ఆమాటకి వస్తే పాతసమితిమాత్రం ఆపగలిగిందా? యూరపులో ఎప్పటిమాదిరిగానే, సంధులతో, సంప్రదింపులతో శాంతినెలకొల్పాలి. ఆలోచనకిమాత్రం సమితివుంటుంది. రాజకీయాలుమినహా ఇతర నిర్మాణ కార్యక్రమానికి కూడా సమితి లాభిస్తుంది. నిజానిజాలు పరిశీలించి, వున్నది కప్పిపుచ్చకుండా చెప్పినసలహా ఇది. అదిచేసిన కూడా అంతర్జాతీయసమితి అనేసంస్థ అంతరించినట్టే.

ఇకమిగిలింది లేబరు, లిబరలుపక్షాలవారు చెప్పిన సలహా. ఆంక్షలకార్యక్రమం మరింత తీవ్రంచేసి ఇటలీకి ఇంకా నిర్బంధం కలిగించడం. ఇటలీచేసిన దౌర్జన్యానికి ప్రతిక్రియచెయ్యాలని ప్రతివారికి సహజమైన, న్యాయమైన కోరిక వుంటుంది. పైమార్గం అనుసరిస్తే ఆ కోరిక ఫలిస్తుంది. ప్రపంచానికీ, ఆ పనిచేసిన ప్రభుత్వాలకూ హృదయశాంతి కలుగుతుంది.

ఈ విషయంకూడా నిష్పక్షపాతంగా పరిశీలిద్దాం. ఆంక్షలకార్యక్రమం అమలుపర్చడం అబిస్సీనియాను సంరక్షించడానికి. సంరక్షించడానికి ప్రస్తుతం అబిస్సీనియా ఏమన్నా మిగిలిందా? అబిస్సీనియా ఒక అనాగరిక నీగ్రోరాజ్యం. పూర్వంగాని, ప్రస్తుతంగాని ఆధునిక దేశాలకు అవసరమైన నాగరికత అక్కడలేదు. సూక్ష్మంగాచూసినా, స్థూలంగాచూసినా అబిస్సీనియా ఒక అడవిజాతుల సమూహంగాని నిర్మాణబలంవున్న మానవసంఘంకాదు, సరియైన రాజ్యంకాదు. అబిస్సీనియా ఐక్యత, స్వాతంత్ర్యం, జాతీయాభిమానం-ఇవన్నీ చక్రవర్తిలోమాత్రం మూర్తీభవించినవి. చక్రవర్తివినా అబిస్సీనియా అంత ప్రాముఖ్యంగావుండదు. ఆచక్రవర్తి కూడా ఆ రాజ్యానికి న్యాయమైన వారసుడుకాడు. ధర్మమార్గంతో సింహాసనం అధిష్ఠించినవాడు కాదు. అటువంటి చక్రవర్తికూడా చివరికి తట్టతగలేసి పరారైనాడు. ఇక మిగిలిం అబిస్సీనియా ఎటువంటిది?

యుద్ధంవిషయమై వార్తలు సరిగారాలేదు. నిజానిజాలు తెలియావు. ఒక్క ఇటలీ గాలివిమానాలముందే, విషవాయువులముందే అబిస్సీనియా అంతరించింది అని చెప్పడానికి వీలుకాదు. క్లిష్టసమయాలలో ఆదేశంలో వున్న అడవిజాతులే చక్రవర్తిసేనలకు ఎదురు తిరిగి పోరాడినవి. అబిస్సీనియా అపజయానికి అదికూడా చాలామట్టుకు కారణం.

అంతర్జాతీయ సమితి ప్రణాళిక నిలబెట్టడానికి ఆంక్షలు ఎక్కువచేస్తే, ఆ కార్యక్రమం అంతా అబిస్సీనియా లేకుండానే చెయ్యాలి. అంటే అంతరించిన అబిస్సీనియా సంరక్షిస్తున్నామనుకుని ఇటలీకి నిర్బంధాలు కలుగచెయ్యాలి. అబిస్సీనియాకు ఇప్పుడు ఆ దేశపు రాజులేడు, సేనలులేవు, ప్రభుత్వంలేదు. భూమి, ఆ భూమిమీద చావగా మిగిలిన కొందరు అడవిజాతుల మనుష్యులూ వున్నారు. జాతిసమితి చెయ్యవలసిందేమంటే ఇటలీని అబిస్సీనియానుంచి వెళ్లగొట్టాలి. అటుతర్వాత ఒక కొత్త అబిస్సీనియా నిర్మాణంచెయ్యాలి.

అదే వుద్దేశ్యం అయితే ఏమార్గంవల్ల అని కొనసాగుతుంది? ఆంక్షల కార్యక్రమంవల్ల ఇటలీ అబిస్సీనియాలోంచి పారిపోతుందా? చమురు ఆంక్షలు అమలులోపెట్టడానికి ఆలస్యం అయిపోయింది. గత అక్టోబరులో ఆపనిచేస్తే అమెరికా కూడా ఏకీభవించేది. ఇప్పుడు వీలులేదు. అన్నీఅయిపోయిన అంతర్జాతీయ సమితితో అమెరికా సహకారానికి సిద్ధపడుతుందన్న మాట అసత్యం. అదీకాక ఈపాటి కప్పుడే ముస్సోలినీ కావలిసినంత చమురు జాగ్రత్తచేసినాడు. యుద్ధంకూడా అయిపోయింది. ఇంక అంతగా చమురుఖర్చు వుండదు. మరి ఇంకచేసేదేమిటి? ఇటలీతో రాజకీయ సంబంధాలు రద్దు చేసి, రోమునగరంనుంచి రాయబారుల్ని పిలిపించేస్తారా? ఇటలీని సమితిలోంచి వెళ్లగొడతారా? అల్లా చేస్తే లోకపు ఆగ్రహం కొంతవరకు శమిస్తుంది, అది

ఇటలీకి వెల్లడి అవుతుంది. కాని, ఈసమితిలోంచి వెళ్లగొడితే ఇటలీకి చాలానష్టం వస్తుందా? అల్లాచేస్తే విజయగర్వంలో వున్న ముస్సోలినీ జాతి సమితి కాళ్లమీద పడతాడా? అపనమ్మకం. ఇంక ఒక్కటే అంకుమిగిలింది. నిజంగా సమితితల్చుకుంటే క్రిందటి అక్టోబరులోనే అది చేసివుండవలసింది. ఇటలీకి ఆఫ్రికా చేరటానికి రహదారిలేకుండా చెయ్యడం. సమితిసభ్యులంతా కలిసి, తమ నావికబలం ప్రయోగించి ఇటలీ నావలు ఆఫ్రికా చేరడానికి వీలులేకుండా సూయజు కాలువ మూసెయ్యడం. అనుకోవడమే తప్ప ఫ్రెంచి ప్రభుత్వం దీనికి అంగీకరించదు. దాంతో ఆఖరుఅంకూ ప్రయోగంకూడా విఫలమవుతుంది. అబిసీనియాను సంరక్షించడానికిగాని, జాతిసమితిపరువు దక్కించుకునేందుకుగాని వుండే ఉపాయాలన్నీ ఆఖరవుతవి.

ఏతావతా చెప్పేదేమంటే, అంతర్జాతీయ సమితి అంతరించింది. ఆసంగతి చాలా విషాదకరమైనదే, కాని నిజం. ఆ అభిప్రాయంతో నూతన పరిస్థితులికి అనుగుణ్యముగా దేశాలు తమతమ అంతర్జాతీయ వైఖరి మార్చుకునేందుకు ప్రయత్నిస్తవి.

అబిస్సీనియా సమస్యవల్ల జాతిసమితి అంతరించిందనుకోవడం పొరపాటు. జపాను మంచూరియా ఆక్రమించినప్పుడు చూస్తూ వూరకున్నది. అప్పుడు సమితి నశించింది అనుకోవడంకూడా తప్పే. ఏరోజున సమితి స్థాపించబడిందో అప్పటినుంచీ అంతరించడం ప్రారంభించింది. ఏనాడు సమితి ప్రణాళికనూ, వెర్సెయిల్సు వొడంబడికనూ ముడిపెట్టినారో, ఆనాడే సమితి చతికిలబడినది.

వీటికన్నిటికంటే పెద్దకారణం ఒకటి వున్నది. అది మానవజాతినైజం. అబిస్సీనియాలో అడవిజాతి మనుష్యులు తోటిమనిషిమాంసం తింటారు అల్లాగే యూరపుఖండంలో పశుజాతి ప్రభుత్వంతోటి ప్రభుత్వాన్ని కబళించింది. ఒకమనిషి మనిషిని తింటే, ఒకసంఘం మరొకసంఘాన్ని, ఒకదేశం మరొకదేశాన్ని, ఒకజాతి మరొకజాతిని. అదే మానవగుణం. ఈగుణానికీ, సమితి ఆదర్శాలకూ వైరుధ్యం. సమితి మంచిదే, కాని అదినడిపినవారు దుర్మార్గులు. చేతకానివాడు బండితోలితే అది బోల్తాపడుతుంది. రాతు కొద్దీ గుర్రం అంటారు మనవారు. అదేసామ్యం ఇక్కడకూడా. గాంధిమహాత్ముడు భారతీయులికి సత్యాగ్రహం బోధించినాడు. దానివల్ల దేశానికి అరిష్టమేగాని లాభం రాలేదు. కారణం సత్యాగ్రహోద్యమంలో వున్న లోపంకాదు. అది అనుసరించడానికి ప్రయత్నించిన వ్యక్తుల నీరసం. ఉద్యమంకాదు విఫలమైనది, అదినడిపిన వ్యక్తుల ప్రయత్నం. జాతిసమితికూడా అంతే.



# *చైనాజాతీయోద్యమము

## మోచర్ల కృష్ణమూర్తి

ప్రాగుననే వుంది మనకు చైనాదేశం. చైనాలో ఎన్నో విప్లవాలు జరుగుచున్నాయి. అక్కడ ఆయుద్ధం జరుగుచున్నది. ఇక్కడ ఈయుద్ధం జరుగుచున్నది అని చైనానుగురించి వార్తాపత్రికలలో చదువని నెలలేదు. కాని వానిమూలకారణమును గురించిగాని ఆదేశ చరిత్రను గురించిగాని తెలిసికొనుటకు తగిన గ్రంథములు మన తెలుగుభాషలో చాలా అరుదు. లేవనేచెప్పవచ్చు. శ్రీయుత అయ్యదేవర కాళేశ్వరరావుగారు తెలుగులో చైనాజాతీయోద్యమమును రచించి నేటి కాకొరతను కొంతవరకు తీర్చారు.

ఇటువంటి గ్రంథము కాళేశ్వరరావుపంతులు గారివంటివారిచే రచింపబడుటలో విశేషమున్నది. ఏ విషయాన్ని గురించైనా తెలిసికోవాలంటే, ఆ విషయానుభూతిగలవారినుండి వినవలెనంటారు. జాతీయోద్యమచరిత్రలకుకూడా ఆమాట వర్తిస్తుంది. కాళేశ్వరరావుగారు "జగమెరిగిన బ్రాహ్మడు" ౧౬ సంవత్సరాలనుండి కామధేనువువంటి న్యాయవాదవృత్తినికూడా వదిలేసి, భారతజాతీయ స్వాతంత్ర్యంకొరకు, అనేకమార్లు కారాగారహింసలనుగూడ అనుభవించి, మొక్కవోని కార్యదీక్షతో భారతజాతీయోద్యమంకోసం తపించి, పోరాడుచున్న ఆంధ్రనాయకుడు. చైనాజాతీయోద్యమముయొక్క - ఆమాటకువస్తే, ఏ జాతీయోద్యమముయొక్క అయినాసరే- హృదయంలో ప్రవేశించి దానిని విప్పిచెప్పడం ఇట్టివారికి సాధ్యమైన ట్లితరులకుగాదు.

నిస్సారమైన కేవలచరిత్రగ్రంథంగా వ్రాయలేదు. కాళేశ్వరరావుపంతులుగారీ గ్రంథాన్ని. భారతజాతిలాగే, చైనాజాతిగూడ స్వాతంత్ర్యంకొరకు తపిస్తూ నానాహింసలు అనుభవిస్తూన్నది. ఒకేఆదర్శం కొరకు తంటాలుపడేవారు ఒకరికష్టాలనుండి మరియొకరు గుణపాఠాలు నేర్చుకొని లాభం పొందవచ్చు. చైనాజాతీయోద్యమమునుండి భారతీయులు నేర్చుకొనవలసిన విషయాలు చాలావున్నవి. పాఠకులు వీనిని గుర్తించేటట్టుల చేయుటగాను ఉభయదేశ పరిస్థితులనుపోల్చుచు కాళేశ్వరరావుగారు చర్చించారు. దీనివలన పాఠకులకు గ్రంథప్రయోజనం చాలా హెచ్చిందనుటకు సందియంలేదు.

ఇరుగుపొరుగు దేశములగు భారత, చైనా దేశములకు గల పోలికలు స్వల్పంగాదు. భారతజాతివలెనే చైనాజాతిగూడ క్రీస్తుపూర్వం వేలకొలది సంవత్సరముల ముందునుండియు, నేటికిని దిగ్భ్రమగొలుపు నాగరికతా విజ్ఞానములుగల జాతి. 3౫కోట్ల జనాభాతో భారతదేశం ప్రపంచములో రెండవస్థానమాక్రమిస్తూంటే ౪౫ కోట్ల జనాభాతో చైనాదేశం అగ్రస్థానం అధివసిస్తూంది. విజ్ఞానమునకుగాని జనబలమునకుగాని, ఒకరికివెనుకబడని ఈ ఉభయదేశములనుగూడ రాజకీయస్వాతంత్ర్యమును గోల్పోయి సకలవిధదాస్యములకును గురియైకుందుచు, గౌరవరహితమగు జీవితమును గడుపుచున్నవి. ఇపుడు తిరిగి మేల్కొని, రాజకీయ స్వాతంత్ర్యమును సాధించి స్వీయజీవిత పరమార్థమును బడయుటకు తపించుచున్నవి.

చైనాదేశమునకు స్వతంత్రమగు జాతీయప్రభుత్వము గన్పించుచున్నది. వారిది, ప్రపంచములోకెల్ల పెద్దదగు ప్రజాస్వామ్యము. భారతదేశమునవలె, అచట రాజ్యమేలుచున్నది విదేశీయప్రభుత్వము గాదు. ఇక నచట వేరుగ స్వతంత్రోద్యమమేమి? జాతీయోద్యమమేమి? యను ప్రశ్నలు సామాన్యముగ పాఠకులకు గల్గుటసహ

---

* గ్రంథకర్త అయ్యదేవర కాళేశ్వరరావుగారు. జాతీయగ్రంథమాల ౬ వ ప్రచురణము, రెండుసంపుటములు, రెండేసివందల పేజీలు. వెల సంపుటము ౧ కి ఒకరూపాయి. వలయువారు భారతీనికేతనము, కాకినాడ.

జము. కాశీశ్వరరావు పంతులుగారీగ్రంథమున మొదటి భాగమున నీవిషయమును పూర్తిగచర్చించుచు పేరున కచట స్వతంత్రమగు జాతీయప్రభుత్వమున్నను అచటి ప్రజలు పారతంత్ర్యమునందుకంటె హీనమగు దాస్యమెటు లనుభవించుచున్నదియు వివరించిరి. పెకింగును రాజధానిగనిడుకొని చైనాసామ్రాజ్యమునంతను పరిపాలించుచున్న మంచూచక్రవర్తులు, బ్రిటిషువారిచే ౧౮౪౦ సం॥న నల్లమందు వ్యాపారముకొరకు సాగింపబడిన యుద్ధమునందు పరాజయమందినప్పటినుండియు చైనా జాతికి పారతంత్ర్యము ప్రారంభమయ్యెను. బలవంతులగు తమను నిరోధింపగల సైనికబలము చైనాప్రభుత్వమునకు లేదని తెలుసుకొని ఇంగ్లాండు, జర్మనీ, ఫ్రాంసు, రష్యా మొదలగు పాశ్చాత్యప్రభుత్వములు అదనును కనిపెట్టి దండెత్తియు, దండెత్తెదమని బెదరించియు, చైనాప్రభుత్వమునుండి వేర్వేరు ప్రాంతములను కైవశమొనర్చుకొనెను. కొంతకాలమునకు పొరుగుననున్న జపానును, ఇతర యైరోపారాష్ట్రములును, అమెరికాయును ఈదోపిడీయందుచేరెను. బలవంతముగ వీరు చైనాప్రభుత్వముచేనొప్పించిన ఒడంబడికలవలన చైనాయందలి విదేశ వ్యాపారమొనర్చు రేవుస్థలములన్నియును గూడ విదేశీయుల హస్తగతమయ్యెను. విదేశీయుల దిగుమతులపై నూటికి ౫ కంటె నెక్కువసుంకములు విధింపరాదని నిషేధింపబడెను. ఈ సుంకములవిధించి వసూలుచేయు నధికారము విదేశీయాధికారుల చేతులందుంచబడెను. ఎగుమతి దిగుమతుల వ్యాపారమంతయు విదేశీయుల స్వాధీనమయ్యెను. వారీయధికారము నుపయోగించి దేశీయపరిశ్రమల నంతమొందించిరి. దేశీయపరిశ్రమలపై నున్న సుంకమును తొలగించుటకు చైనాప్రభుత్వము ప్రయత్నించుటకూడ విదేశీయప్రభుత్వముల కాగ్రహకారణమయ్యెను. "ఎక్స్ట్రాటెరిటోరియాలిటీ" అను పేర చైనాయందువసించు విదేశీయులపై చైనాప్రభుత్వమునకుగాని, వారి న్యాయస్థానములకుగాని ఏవిధమగు నధికారమును లేకుండజేయబడెను. విదేశీయులు వాదిగాగాని ప్రతివాదిగాగాని యున్న సివిలుక్రిమినలు వ్యవహారములయందు విచారణాధికారమంతయును ఆ విదేశీయ ప్రభుత్వ ప్రతినిధిదేగాని చైనాప్రభుత్వమునకులేదు. "స్ఫియర్సు ఆఫ్ ఇన్ఫ్లుయన్సు" అను పేర చైనాప్రభుత్వ పరిపాలనయందున్న దేశమునంతను విదేశీయప్రభుత్వములు తమలోతాము పంచుకొనిరి. అనగా ఆప్రాంతములలో వర్తక, పారిశ్రామికాది విషయములయందాయా ప్రభుత్వములవారిమాట చెల్లుబడి కావలెనన్నమాట. దేశమునాక్రమించుట తటస్థించినపుడు ఆయాప్రాంతములాయాప్రభుత్వముచే కబళింపబడుననన్నమాట. అంతపని అవసరమనిదలచియును, తమలో తమకు ఈర్ష్యలవలనను మానిరేగాని కానిచో—విదేశీయప్రభుత్వము లిదివరకెన్నడో—చైనాప్రభుత్వమును తీసివేసి, దేశమును పూర్తిగ నాక్రమించియుండెడివి. జపానువారిటీవల మంచూరియాను, మరికొన్ని ఉత్తరరాష్ట్రములను వేరుచేసి తమ పలుకుబడిక్రిందనుండు స్వతంత్ర ప్రభుత్వముల స్థాపించిరి. చైనాదేశస్థితి—ఈ విధముగ— యజమానిదుర్బలుడై మూలబడియున్నపుడు బందిపోటుదారులు ఇంటప్రవేశించి కొల్లగొట్టి అనుభవించుచున్నటులున్నది. చైనీయులీవిధముగ స్వదేశమునందే దిక్కులేనివిదేశీయులైరి. స్వతంత్రప్రభుత్వముండియు అనాథలైరి. ఇట్టి స్థితినుండి దేశమునుద్ధరించి నిజముగ స్వపరిపాలితదేశముగ నొనర్చుటకుగాను చైనాయందలి జాతీయోద్యమము ప్రారంభమయ్యెను.

చైనాజాతీయోద్యమమునకు గల అనుకూలపరిస్థితులగురించి కాశీశ్వరరావు పంతులుగారు మొదటి అధ్యాయములలో బాగుగచర్చించిరి. భారతదేశమునందువలెగాక చైనాయందు ప్రజలందరొకేజాతివారమని భావించెదరు. దేశమంతటికి నొకేభాష, ఒకేలిపి. మన దేశమునవలె అనేకభాషలు, అనేకలిపులు లేవు. దేశమంతయు వేలకొలది వత్సరములుగా నొకేచక్రవర్తిపాలనమునందుండెను. చిన్నచిన్నరాజ్యములు లేవు. చక్రవర్తి వేర్వేరప్రాంతములను రాష్ట్రములుగ విభజించి గవర్నరులద్వారా పరిపాలించుచుండెను. ఏకజాతీయతకవసరమగు నీలక్షణములన్నియు చైనాయందు బలముగగలవు దేశమున విస్తారముగ వ్యాపించియున్న కన్ఫూషియసు బౌద్ధమతములతో బాటు, మహమ్మ

దీయమతమును, ఇటీవల క్రైస్తవ మతమునుగూడ వ్యాపించియున్నను, భారతదేశమునందు వలె నింతగ మతవిభేదములును వానిని ప్రోత్సహించువారును తక్కువ. పాశ్చాత్య ప్రభుత్వ సైన్యముల వెంట ప్రవేశించిన క్రైస్తవబోధకులవలన క్రైస్తవులలో స్వీయాధిక్యతాకాంక్ష కొంత విభేదకారణమైనను, తరువాత తగ్గిపోయెను. జాతీయస్వాతంత్ర్యోద్యమనిర్మాతయగు డాక్టరు సన్ యటు సేనుగారును చాలమంది జాతీయనాయకులును గూడ క్రైస్తవమతస్థులే. ఈ యనుకూలపరిస్థితులతో బాటు, జాతీయోద్యమమున కనేక ప్రతిబంధకములు గూడ గలవు. విదేశీయ దౌష్ట్యముల నరికట్టుటకు మొదట చైనాచక్రవర్తులును, వారి అనంతరము ౧౯౧౨ సం॥ నుండియు పరిపాలనకువచ్చిన ప్రజాస్వామ్యమును గూడ అనేకమార్గ యుద్ధములకుదిగెను. కాని సైనిక దౌర్బల్యముచే యుద్ధములం గోడటచే విదేశీయులు తామిదివరకు తగిలించిన దాస్యశృంఖలముల మరింతబలపరచుచువచ్చిరే కాని ఈ చైనా ప్రభుత్వ లోపముచే గాదు. ఇదిగాక భారతదేశము వలె చైనాదేశమున ప్రజలు ప్రభుత్వముచే నిరాయుధులుగ నొనర్పబడలేదు.

ఇట్టి అనుకూల పరిస్థితులుగల చైనా జాతీయోద్యమము తనయాశయము నెంతవరకు సాధించెను? పూర్తిగ సాధింపజాలకపోయినచో, వారికిగల ప్రతిబంధకములెవ్వి వానినెటుల తొలగించుకొనుచున్నారు. అను ప్రశ్నలు పాఠకులకు గల్గుట సహజము. కాశీశ్వరరావు పంతులుగా రీసమస్యలను రెండవ సంపుటమున వివరముగ చర్చించిరి. ౧౯౦౮ ప్రాంతమున డాక్టరు సన్ యట్ సేను గారిచే ప్రారంభింపబడిన కుమింగు టాంగు (జాతీయపక్షము) వారి ఆగ్రహమునకు విదేశీయ దౌష్ట్యముల నివారింపజాలకపోయిన, రాజవంశము మొదట గురియయ్యెను. అప్పటి చక్రవర్తి మంచూవంశము వాడగుటచే ఆవంశముపై వైరమూనియున్న పూర్వరాజవంశాభిమానులగు చైనీయుల సహాయముతో డాక్టరు సన్ యట్ సేన్ మొదలగు జాతీయవాదులు చక్రవర్తిపై తిరుగబాటులు లేవదీసిరి. వాని నణచలేక తుద కప్పటి రాజమాత, మైనరుచక్రవర్తితరపున రాజ్యమును త్యజించి ప్రజాస్వామ్యమును స్థాపించుకొనుట కనుమతించెను. ౧౯౧౨ సం॥న యువాన్ షికాయిగారి అధ్యక్షతను పెకింగునగరమున స్థాపింపబడిన ప్రజాస్వామ్యము జాతీయవాద పక్షము వారిని మన్నింపమిచే ౧౯౧౭ సం॥న సన్ యట్ సేను గారు దక్షిణమున కొన్ని రాష్ట్రములచేర్చుకొని కాంటనునగరమును రాజధానిగ నేర్పరచి మరియొక ప్రజాస్వామ్యమును స్థాపించెను. ౧౯౨౭ వరకును రెండుప్రజాస్వామ్యములును వేర్వేరుగనుండి అంతఃకలహములలో మునిగియుండెను. ఆ సంవత్సరమున కుమింగుటాంగు సైన్యములు చాంగ్ కాయిషేక్ గారి నాయకత్వమున పెకింగునుగూడ నాక్రమించి, చైనానంతనుతిరిగి ఒకేరాజ్యాధిపత్యమునకు తేగల్గెను. కాని కేంద్రజాతీయప్రభుత్వము యొక్క అధికార మింకను అన్ని రాష్ట్రములందును బాగుగ చలామణియగుచున్నటుల గన్పింపదు. ఇంకను జాతీయప్రభుత్వముయొక్క అధికారము దేశమున సుస్థాపితముగా లేదు. సుస్థాపితమగువరకును విదేశీయులసమస్యల పరిష్కరించుటకు తగినశక్తి గలుగదు. ఈమధ్యకాలమున చైనాయువకులలో జాతీయోద్యమ ముద్ధృతముగవ్యాపించి విదేశవస్తుబహిష్కారరూపమున విజృంభించెను. విదేశీయులు తమ ప్రత్యేకహక్కుల వదలుకొనవలెనని వారు గోరిరి. కాని ఆయుద్యమము కార్యసాధకముగా లేదు. జపానీయులు సైనికదండయాత్రలతోడను, మంచూరియా నాక్రమించుటతోడను ఈయుద్యమమునకు ప్రత్యుత్తర మొసగిరి. విదేశీయపారతంత్ర్యము సంబంధించినంతవరకు చైనాస్థితి ౧౯౧౨ సం॥ పూర్వము చక్రవర్తుల పాలనమునం దెటులున్నదో, ఇపుడును అటులనే యున్నటుల పైకిగన్పించుచున్నది. ౧౯౦౪ సం॥న చైనా రాజమాత సూచించినటుల ప్రభుత్వము పాశ్చాత్యపద్ధతులననుసరించి సైనికబలమును సమృద్ధిగ సంపాదించుకొనువరకును చైనాస్వాతంత్ర్యోద్యమము విజయమందదు. విదేశీయు లపుడు తమంతదామే ప్రత్యేకహక్కుల వదలుకొనెదరు. చాంగ్ కాయిషేక్ మొదలగు జాతీయవాద నాయకు లీరహస్యమును దెలిసికొని కార్యపరులుగ నున్నారు.

చైనాజాతీయోద్యమము నెదుర్కొనియున్న సమస్యలను గురించి కాళేశ్వరరావుగారు తుదియధ్యాయములలో చర్చించిరి. రెండుగొప్పసమస్యలు వారి నిపు డెదుర్కొనియున్నవి. ఇంతవరకును వ్యాపించి యున్న రాష్ట్రీయ సైనిక నాయకుల కలహములు చాలవర కిపు డంతరించె ననుకొనుచుండగా దేశమున విభేదకారణమగు నుద్యమము మరియొకటివ్యాపించుచున్నది. అది సాముదాయికవాదము. రష్యానుండి వ్యాపించిన సాముదాయవాదము కొన్నిపశ్చిమోత్తరరాష్ట్రములలో వ్యాపించి అచట సోవియటుపద్ధతిని రాష్ట్రీయ ప్రభుత్వములు స్థాపింప ప్రయత్నములు జరుగుచున్నవి, ఆస్తిపరులగు చైనీయులకందరకును ఇది కంటకమగు విషయము ఇక విదేశప్రభుత్వములకును వర్తకులకునుమరింత కంటకమని వేరుగ చెప్పనక్కరలేదు. జాతీయప్రభుత్వ మిపుడేమిచేయవలెననునది గొప్పసమస్య ప్రభుత్వాధ్యక్షుడగు చాంకైషేకుగారు, సామ్యవాదరాష్ట్రములపై దండెత్తి, నిర్మూలింప నిశ్చయించుకొనెను. ఈ పద్ధతివలన, చైనా యైక్యత నిలచుననియు, ఆస్తిపరులగు చైనాప్రజలందరు సంతసింతురనియు, విదేశీయులుగూడ తమప్రభుత్వము నభిమానింతురనియు చాంకైషెయికుగారి అభిప్రాయమై యుండవచ్చును. దీనిచేగల్గిన అభిమానముచే విదేశీయులు తమప్రత్యేకహక్కుల వదలుకొనెదరని భావించియుండ వచ్చును. కాని ఈ యాశ లెంతవరకు సఫలమగుననియు కాలమే నిర్ణయింపవలెను. విదేశీయాధిపత్యమును తొలగించుట రెండవసమస్య. మిగిలిన పాశ్చాత్య ప్రభుత్వములు ఇటీవల చైనాజాతీయ ప్రభుత్వమునకు క్రొత్తవత్తిడి గలిగింపకున్నను, ఇదివరకుగల అధికారముల వదలుకొనుటలేదు. జపాను దేశము వీరికి నాయకస్థానము వహించుచున్నదా యనునట్లు క్రొత్తగా చాలవత్తిడి గలుగచేయుచున్నది. మంచూరియాను విడదీసెను. ఉత్తరరాష్ట్రముల స్వతంత్రముగ నొనర్చెను. ఇక మిగిలిన ప్రాంతములనుగూడ చీల దీసి చిన్నచిన్న స్వతంత్ర ప్రభుత్వములుగ నొనర్చి వాని నన్నిటిని వేరువేరుగ తనపలుకుబడిక్రిందను నుంచుకొనుటకు జపాను ప్రయత్నించుచున్నట్లు గన్పించుచున్నది. జపానుజాతీయాత్మరక్షణ కిది చాల అవసరము. ౪౮ కోట్ల జనసంఖ్యగల, పెద్దఖండము వంటి చైనాదేశ మొక్క ప్రభుత్వము క్రిందనుండి దుర్నిరీక్ష్యమగు సైనిక బలమును నిర్మించుకొన్నచో, జపాను దేశీయాధిక్యత అంత మందకతప్పదు. ఈవిషమస్థిలో చైనా జాతీయ ప్రభుత్వ మవలంబింప వలసిన మార్గమును నిశ్చయించుట సులభ సాధ్యముగాదు. తగినంత సైనిక బలములేకుండ జపాను నిపుడెదుర్పజాలదు. ఎదుర్పకున్నచో, జపాను చెలరేగి చైనాను చీల్చుచున్నది. ఇట్టి స్థితిలో, చైనాజాతీయ ప్రభుత్వమువారు, జపాను రష్యా మొదలగు పెద్ద ప్రభుత్వములకు సంభవింపగల మహాసంగ్రామములపై నాశపెట్టుకొని యున్నచో ఆశ్చర్యముండదు.

చెన్నరాజధానియందు 1934-వ సంవత్సరము జూలై ప్రారంభము మొదలు సెప్టెంబరు తుదివరకు గల మూడునెలల కాలమున ముద్రితములయి ప్రకటితములయిన

# ఆంధ్ర గ్రంథముల పట్టిక*

## కథలు, ఐతిహాసికములు, పౌరాణికములు

కుచేలోపాఖ్యానము—(ప్ర) మారుతిరామ్ అండ్ కో., బెజవాడ

మార్కండేయపురాణకథలు—కె. చెంచురామయ్య

శ్రీమహాభారతసారము—జి. శంకరరావ్

శ్రీరామావతారతత్వము భా. ౬—జె. శేషాద్రిశర్మ

## కల్పితములు

కథలు, ప్రకృతిపాఠవివరణలు—(ప్ర) సి.డి. మోహన్ మేదక్

బంగారునాణెము—(ప్ర) కె. పలనియాండిపిళ్లై అండు కో., మదరాసు

## చారిత్రకములు

ఉదయనుడు—పి. సత్యనారాయణశాస్త్రి

కలింగదేశ కథలు—ఆర్. అనంతాచార్యులు

## కల్పము

శ్రీమద్ధన్వంతరి వ్రతకల్పము —(ప్ర) డి.సన్యాసిరాజు విశాఖపట్నము

శ్రీరామపూజావిధానం — (ప్ర) యన్. సుబ్రహ్మణ్యశాస్త్రి, రాజమహేంద్రవరము

## కావ్యములు

గీతారామాయణము—వెంకటరాజేశ్వరరావు

నిర్ణయరామాయణము భా. ౧—(అను) వై. శ్రీనివాసరావు, రామచంద్రపురము

విష్ణుమాయానాటకము—ఆర్. సి. యల్లనార్య

శ్రీమదాంధ్ర కిరాతార్జునీయము—(అను) బి. విజయరామయ్య

శ్రీరామాయణం భా. ౧. ౨—వాల్మీకి

శ్రీ వాసిష్ఠరామాయణము—(ప్ర) సఖ్యాభివర్ధక నిలయం, సరిపల్లె

## గణితము

దివాఘుటికచంద్రిక—యల్. బంగారయ్య సిద్ధాంతి

నవీన ఆరంభగణితము, బుక్ ౨—యస్. నారాయణ అయ్యర్

నూతనగణితము, బుక్ 3—కె. రంగాచారి

పసిడికాలపు గణితము—టి. యస్. రాఘవ అయ్యర్

ప్రాథమికగణితసారము, భా. ౧, ౨—పి. సుబ్బారెడ్డి

బాలురగణితము బుక్ ౨—కె. యస్. శ్రీనివాసాచార్యులు

లీలావతీగణితము—భాస్కరాచార్య

వావిళ్ల గణితబోధిని—(ప్ర) వి. రామస్వామిశాస్త్రులు అండు సన్స్, మదరాసు

సామాన్యగణితము—యస్. వి. రామదాస్

## గేయములు

కీర్తనలు—డి. గోపాలం

దశరాకీర్తనలు—కె. వెంకటనరసదాస్

పాశురపరిమళములు—(అను) యం. యం. వెంకటాచారి

బొబ్బిలినాటకమునందలి కీర్తనలు—పి. లక్ష్మీకాంతకవి

రామదాస్—(ప్ర) ఈస్ట్ ఇండియన్ ఫిల్మ్ అండ్ కో., బొంబాయి

* ఈ పట్టికయందుగల సంకేతపదముల వివరణము: అ.—అధ్యాయము. అను.—అనువాదము, అనువాదకులు, పద్యము. ప.—ప్ర.—ప్రకాశకులు. భా.—భాగము. వ.—వచనము. సం.—సంపాదకులు. సటీ.—సటీకము.

రామాయణనాటకమునందలి కీర్తనలు—పి. లక్ష్మీకాంత కవి

రైతు భజనావళి —(ప్ర) రామానీడువిద్యాలయము, నిడుబ్రోలు

విగ్రహనిర్మాణము—సి. పురుషోత్తమకవి

శ్రీ తారకనామ భజనకీర్తనలు—కె. బాలకృష్ణదాసు

శ్రీనగర సంకీర్తనలు—పి. సుబ్బారావు

శ్రీ పాండురంగభగవాన్ భజనకీర్తనలు—(ప్ర) యన్. సరయ్యా, టి. వీరరాఘవయ్య చిలకలపూడి

శ్రీ పాండురంగనామ సంకీర్తనము —(ప్ర) యన్. సరయ్యా, టి. వీరరాఘవయ్యా, చిలకలపూడి

శ్రీరామభజనానంద షోడశోపచార సంకీర్తనలు—భ. జానకిరామరాజు, యం. వేంకటలక్ష్మీనృసింహరాజు

శ్రీహరి భజనోత్సవచంద్రిక —(ప్ర) శ్రీరామపూజా మందిరము, మచిలీపట్టణము

శ్రీ హరిహరకీర్తనలు—పి. సుబ్బారావు

సంకీర్తనరామాయణము—(ప్ర) శ్రీ సీతారామసంకీర్తనమందిరం, గుంటూరు

సతీసావిత్రి—(ప్ర) జి. పుల్లయ్యా, కడప

సతీసావిత్రి ఫిల్మునందలి కీర్తనలు—(ప్ర) ఇ. సుబ్బారావు.

సతీసావిత్రి,ప్రహ్లాదపాటలు—(ప్ర) జె.సుబ్బారాయుడు కడప

సీతారామసేవ—పి. సుబ్బారావు

హరిశ్చంద్ర చరిత్రము—యస్. చంద్రయ్యశెట్టి

## చరిత్ర

చతుర్థమను చరిత్ర—యం. సుబ్రహ్మణ్యశాస్త్రి

విదేశయాత్రికులు, ప్రాచీనాంధ్రదేశము—భ. వెంకట కృష్ణరావు

హిందూదేశ చరిత్ర, హిందూయుగము, మహమదన్ యుగము, బ్రిటిష్‌యుగము (తృతీయముద్రణము) బ్రిటిష్‌యుగము (చతుర్థముద్రణము) హిందూ యుగము (పంచమముద్రణము)—డి. అప్పారావు, ఆర్. సూర్యనారాయణ (చతుర్థముద్రణము)

## జీవితములు

కృష్ణరాయవిజయము—ఎ. కుటుంబరాయకవి

గాంగేయుడు—ఎ. కుటుంబరాయకవి

భక్తశిరోమణులు—యన్. శేషగిరిరావ్

వలీఉద్దీను—పి. వెంకన్న

శ్రీ మహమ్మద్ రసూల్ ప్రవక్తవారి చరిత్రము—ఉమర్ అలీషా

శ్రీరామకృష్ణలీలామృతము —(ప్ర) శ్రీరామకృష్ణ మఠ్, మదరాస్

## జ్యోతిషశాస్త్రము

ఆయుర్దాయప్రకరణము —(ప్ర) సి. లక్ష్మీనృసింహ శాస్త్రి, మచిలీపట్టణము

జ్యోతిషఫలచంద్రిక—(ప్ర) వి. శంకరశర్మ, పత్తికొండ

మహాగోచారదర్శనీ—యన్. చెంగల్వరాయాచారి

లఘుబ్రహ్మస్వామిశము —(ప్ర) సి. లక్ష్మీనృసింహ శాస్త్రి, మచిలీపట్టణము

## దండకము

పాండురంగదండకము—(ప్ర) యన్. సరయ్యా, టి. వీరరాఘవయ్యా, చిలకలపూడి

## నవలలు

ఇంద్రజాలము—యం. శ్రీరామమూర్తి

వసుంధర—శేషాద్రిరమణకవులు

విద్యుత్ప్రభ—భ. చెన్నకృష్ణమ్మ

సమరకాంత భా. ౧—కె. నాగభూషణచౌదరి

హరిదాసి—పి. లక్ష్మీనరసింహం

## నాటకములు

దూతాంగదము—సుభట

పుష్పవేణి కల్యాణము—సి. సుబ్రహ్మణ్యకవి

ప్రతిమానాటకము—(అను) వేటూరి ప్రభాకరశాస్త్రి

బొబ్బిలియుద్ధనాటకము—వి. వేంకటరాయశాస్త్రి

భోజకుమారము—టి. లక్ష్మీనరసింహారావు

మధుసేవ—యం. శ్రీరామమూర్తి
లంకాపతనము—డి. గోపాలకృష్ణరావు
శ్రీభక్తవిశోభా—క. సి. మునుసామినాయుడు
దిలీప—సి. సీతాంబ

నిఘంటువు

ఆంధ్రవాచస్పత్యము, భా. ౧—కే. శ్యామలకామశాస్త్రి

నీతి

మార్గోపదేశిక—వి. చినసీతారామస్వామి
సదుపదేశము భా. ౧—జి. శ్రీరామశాస్త్రి
సన్మార్గదర్శిని—జి. శ్రీరామశాస్త్రి

పరిశిష్టము

అభినయదర్పణము—నందికేశ్వర
ఆంధ్రతేజము—పి. శేషగిరిరావు
ఆంధ్రదేశీయవాచకము, తరగతులు, ౧, ౨, 3—సి. నరసింహరావు
ఆరవతరగతి పుస్తకము—(ప్ర) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు
ఆర్యవాచకము, తరగతి ౧, ౨—సి. భీమశంకరం, యం. వెంకటరత్నం
ఆరోగ్యము, దీర్ఘాయువు—(ప్ర) హ్యూమనిటేరియన్ సర్వీస్ లీగ్, కాకినాడ
ఉపన్యాసము—వి. రాఘవయ్య
ఉపన్యాసము—కె. సూర్యనారాయణమూర్తి
కలము—వి. రామసుబ్బరాయుడు
కలియుగనిద్ర—బి. ఆశీర్వాదం
కవిత్రయావేదన—పి. సత్యనారాయణరాజు
కావ్యగుచ్ఛము భా. ౨—(ప్ర) కె. శ్రీనివాసరావ్, విజయనగరం
కావ్యతరంగిణి భా. ౧, ౨—(ప్ర) సుందరరామ్ అండు సన్సు తెనాలి
కాలజ్ఞానతత్వములు—అప్పాస్వామి
గాంధిమహాభారత రత్నములు—డి. రఘువచంద్రయ్యశాస్త్రి
గాండీవిస్య—జె. వి. రాధాకృష్ణశాస్త్రి
గులాబివాచకము తరగతి 3—(ప్ర) ఆర్. కృష్ణస్వామి అయ్యంగార్, వెల్లూరు
గోముఖవ్యాఘ్రము మండలము—జె. వెంకటనారాయణకవి
గ్రామమునసబుల పరిక్షాదర్శిని—బి. లక్ష్మీనరసింహం
గ్రామకరణముల పరిక్షాదర్శిని—బి. లక్ష్మీనరసింహం
చిరంజీవి—ఎ. కుటుంబరాయకవి
జీవితలక్ష్యము—యం. వెంకటలక్ష్మీనరసింహారావు
తిరుపతిగంగజాతర పకీరువేషపుకథ—జే. రామయ్య
నూతనపద్ధతి ఆంధ్రవాచకము బుక్ ౧, ౨—వీ. వి. నరసింహం
పరలోకదర్శనములు—(సాధు) సుందరసింగు
పూర్ణానందము—ఖాదర్ మొాదిన్
ప్రసన్నజనానుష్ఠానప్రకాశిక—(ప్ర) జి. సీతారామయ్య, జి. క్రిష్ణమూర్తి, బెజవాడ
బాలబోధిని—కె. కృష్ణాచార్య
బాలుర సుఖాధారమార్గము, భా. ౨—యం. ముత్తుకుమారస్వామిపిళ్లై
భీమకవిప్రశ్నలు—(ప్ర) సి. లక్ష్మీనృసింహశాస్త్రి, మచిలీపట్టణము
మనస్వాతంత్ర్యము, భా. 3—వి. సూర్యనారాయణ
మహాపురుషులు—డి. సీతారామరావ్
మాతృహృదయము—(ప్ర) కార్మికసంఘము, అనంతవరము
మానవజీవితచరిత్ర—సి. రామలింగశాస్త్రి
రత్నమాల, భా. ౨, 3, ౪—పి. సీతారామయ్య
రద్దెహిందూదేశ చరిత్రము—(ప్ర) మోహద్ ఇమాక్ సాహెబ్, కాకినాడ
లోకజ్ఞానబోధిని, తరగతి 3—కె. వెంకటరావు, యం. సీతాపతిరావు
విజ్ఞానశాస్త్రము—కె. వీరభద్రయ్య
విభ్రమతరంగిణి—యన్. వీరరాజు

వావిళ్ల వాచకపుస్తకము తరగతి, ౧—జె. గంగన్న
శాస్త్రవాచకపాఠములు సెం. ౪—యం. సాంబశివ రావు
శ్రీకృష్ణబాణాసురయుద్ధము—జె. స్వామినాథయ్య
శ్రీయోగి పార్థసారథిస్వామి—(ప్ర) దర్భశయన భగవత్సన్నిధి, గోలఘాట్, అయోధ్య
శ్రీరామాంజనేయయుద్ధము—జె. స్వామినాథయ్య
శ్రీ శైవోత్సవరత్నాకరం — (ప్ర) యస్. సుబ్రహ్మణ్యయ్యశాస్త్రి, రాజమహేంద్రవరము
సంబంధవాచకపుస్తకము, సెం ౨ — (ప్ర) టి. వి. చెల్లప్పశాస్త్రి అండ్ సన్స్, మదరాసు
సత్యనారాయణచరిత్రము—యన్. వెంకటరామయ్య
సారస్వతవాచకము, బుక్ ౨, ౩, ౪ జి. రంగారావు నాయుడు, యం. వెంకటరత్నం
సుగుణమణి—వి. నరసింహం.
సుబ్రహ్మణ్యచరిత్ర—యన్. వెంకయ్య
సుభాషితములు—యం. వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి
స్వరచింతామణి— (ప్ర) టి. శ్రీరంగాచార్యులు, మదరాసు

## ప్రకృతిశాస్త్రము

ఎలిమెంటరీసైన్సు పాఠములు—యం. యస్. సుబ్రహ్మణ్య
ప్రకృతిశాస్త్ర పాఠములు, తరగతి ౫, ఫారం ౧, ౩—జి. వెంకటరామయ్య
సామాన్యశాస్త్రవిషయములు భా. ౧—డి. సూర్యనారాయణశర్మ

## భూగోళశాస్త్రము

కాకినాడ తాలూకా భూగోళము—కె. వెంకటరావు, యం. సీతాపతిరావు
గన్నవరము తాలూకా భూగోళము — యన్. ఆంజనేయులు
గుంటూరుజిల్లా భూగోళము — (ప్ర) వెంకటరామ్ అండ్ కో., ఏలూరు
గుంటూరుజిల్లా భూగోళము—సి. ప్రకాశరావు
నవీనబాపట్లతాలూకా భూగోళము — సి. ఆదినారాయణ, వి. వెంకటేశ్వర్లు
ప్రపంచభూగోళము—యన్. సుబ్రహ్మణ్యం
భూగోళశాస్త్రము—యన్. సుబ్రహ్మణ్యం
భూగోళశాస్త్రము బుక్, ౨, 3 — (ప్ర) టి. వి. చల్లప్పశాస్త్రి, మదరాసు
భూగోళశాస్త్రపాఠవివరణలు—(ప్ర) సి.డి. మోహన్ మెదక్
విశాఖపట్టణముజిల్లాపటములు — (ప్ర) యం. గురుమూర్తి, విశాఖపట్నం

## మతము — హిందు

అమావాస్యతర్పణము—(ప్ర) సి.లక్ష్మీనృసింహశాస్త్రి, మచిలిపట్టణము
శ్రీరామపూజ—(ప్ర) సీతారామనామ సంకీర్తన మందిర్, గుంటూరు
స్మార్తకారికావృత్తి—నృసింహపండిట్

## ఇతరములు

జ్ఞానబోక్కసము—యం. (రెవ్) ఇగ్నాటస్
దేవదూత మహత్త్వము—యం. (రెవ్) ఇగ్నాటస్.
బైబిలు పాఠవివరణలు—(ప్ర) సి. డి. మోహన్ మేడక్
మిత్రశ్రేష్ఠుడు—(ప్ర) క్రిశ్చియన్ లిటరేచరు సొసైటి మదరాసు

## మాహాత్మ్యములు

పాండురంగ మాహాత్మ్యము—తెనాలి రామకృష్ణకవి
శ్రీ ఘటికాద్రిక్షేత్ర మాహాత్మ్యము—ఎ. నారాయణదాసు
శ్రీ పెంచలకోనమాహాత్మ్యము—వి.సుందరరామశర్మ

## రాజకీయములు

ఆధునికరాజ్యాంగసంస్థలు భా. ౧, ౨ — జి. రంగనాయకులు
నేటిరష్యా—నార్ల వేంకటేశ్వరరావు
రాజ్యపాలనాశాస్త్రము—యన్. సుబ్బరావు

## వేదాంతము

ఓం—భ. గోపాలకృష్ణయ్య
భగవద్గీత—(ప్ర) హెచ్. నారాయణరావు, నంద్యాల
తైత్తిరీయోపనిషత్ — (ప్ర) వి. రామస్వామి శాస్త్రులు అండు సన్స్, మదరాస్
భగవద్గీతోద్దేశము—సి. వెంకట లక్ష్మీనరసింహం
వేదాంత పంచదశి—విద్యారణ్యస్వామి
శ్రీవీరబ్రహ్మోపదేశ పద్యరత్నావళి—(ప్ర) సి. సుబ్బయ్య, కంది మల్లయ్య
సీతారామాంజనేయ సంవాదము—పి. లింగమూర్తి గురుమూర్తి

## వైద్యశాస్త్రము

జీవరసాయనశాస్త్రసారము—వై. చలపతిరావు
సారూప్యామధ శాస్త్రసారము, వస్తుగుణదీపిక—వై. చలపతిరావు

## వ్యాకరణశాస్త్రము

త్రిలింగ లక్షణము—డి. యెగ్గన్న
ఆంధ్రలక్షణము—(ప్ర) వి. వేంకటరామయ్య గణపవరం

## శతకములు

అభినవసుమతిశతకము—డి. సుబ్రహ్మణ్యశర్మ
శ్రీ యలమందకోటేశ్వర శతకము—బి. కోటినాగయ్యదాస్
శ్రీ రాజేశ్వరశతకము, శ్రీ చంద్రమౌళీశ్వరశతకము—యం. వీరభద్రశాస్త్రి
శ్రీ వరాభయదాంజనేయశతకము — కె. ప్రభులింగాచార్యులు
సుమతిశతకము—మారుతిరామ్ అండు కో., బెజవాడ

## సాంఘికము

ప్రారంభసాంఘికశాస్త్రము—సి. శ్రీనివాసరావు

## సారస్వతము

వ్యాసావళి—ఐ. హనుమచ్ఛాస్త్రి

## స్తోత్రములు

కన్యకాపరమేశ్వర అష్టోత్తరశత నామావళి—(ప్ర) ఎ. లక్ష్మయ్య, మదరాసు
గ్రంధసూచి, శ్రీ సత్యనారాయణ స్తుతి—(ప్ర) పి. పేరరాజు అండ్ బ్రదర్స్, అన్నవరము
శ్రీబిల్వాష్టోత్తర శతనామపూజా—(ప్ర) సి. లక్ష్మీనృసింహశాస్త్రి మచిలీపట్టణము
శ్రీత్రిపురసుందరీ స్తవము—యం. ఆర్. కే. యల్. వి. శేషగిరిరాయకవి
హంసతారావళి లలితాశతకము—యస్. విశ్వనాథశాస్త్రి

## హరికథలు

కుచేలోపాఖ్యానము—బి. బాలాజీదాసు
నలచరిత్రము—బి. బాలాజీదాసు

---

# షర్లీటెంపుల్

చూడటానికి 'షర్లీ' ఏడేండ్లునిండిన పసిపిల్లే. కాని భావప్రకటనలో ప్రసిద్ధిచెందిన నటీనటులనుకూడా మించిపోయింది. 'ప్రపంచ సినీమా నటులపోటీ' లో ౧౯౩౪ సం॥ లో గ్రేటాగార్బో తరువాత మూడోస్థానం గెల్చింది షర్లీ.

౧౯౨౯ సంవత్సరం ఏప్రిలు నెల ౨౩ వ తారీకున 'షర్లీ' పుట్టింది. ఆమెతండ్రి 'హాలీవుడ్డు' లో ఒక 'బ్యాంకి' లో ఓచిన్నగుమాస్తాగా వుండేవాడు. నెలకి ౬౦ పౌనుల జీతం. సంసారం బొటాబొటీగా సాగుతోండేది. వాళ్లమ్మకి యిద్దరు మొగపిల్లలతరవాత ౯ సంవత్సరాలకి పుట్టింది షర్లీ. అంచేత తల్లిదండ్రులకి ఆమె అంటే అతిప్రేమా, గారాబమ్నూను. 'షర్లీ' పెద్దన్నయ్య యింజనీరింగు చదువుతోన్నాడు. పద్దెనిమిదేళ్లుంటాయి. రెండో అన్నని వాళ్లనాన్న పనిచేసేబ్యాంకిలోనే లెఖ్ఖలు నేర్చుకోటానికి వదలిపెట్టారు. అతనికి ౧౬ యేళ్లు. తరవాత ౯ సంవత్సరాలకి షర్లీ. మళ్లీ పిల్లలు లేరు.

'షర్లీ' నాలుగేళ్ళపిల్లగా వున్నప్పుడు ఓనాడు 'ఫాక్సు' (Fox) ఫిలింకంపెనీలో డైరక్టరొకాయన షర్లీతండ్రితో మాట్లాడ్డానికి వాళ్ళింటికివెళ్ళేడు. ఆ వాళ ఆదివారం. 'షర్లీ' అన్నలిద్దరూ చర్చికెళ్ళేరు. తండ్రీ, ఆవొచ్చిన డైరెక్టరు గదిలోకూర్చుని మాట్లాడుకుంటున్నారు లోపలినుంచి తల్లితోపాటు పియానో మీద పాడుతోందిషర్లీ. శ్రావ్యంగానూ, మధురంగానూ, ముద్దొస్తోన్న ఆమెపాటనివింటూ తన్మయుడైపోయాడు డైరెక్టరు. "నాకూతురు షెర్లీ. ఆపాడుతోంట" అని షర్లీతండ్రి చెప్పాడు.

"ఓమాటు యిలా పిలుస్తారా?" అని ఆదుర్దాగా అడిగాడు డైరెక్టరు.

తండ్రి వెళ్లి 'షర్లీ'ని యెత్తుకువచ్చాడు. ఆపిల్లని ఆతని చేతుల్లోంచి పుచ్చుకుని ముద్దులు కురిపిస్తో నలిపేశాడు డైరెక్టరు.

"ఇప్పుడు మాకంపెనీవారు, మీషర్లీ లాంటి పిల్లకోసమే వెతుకుతున్నారు. మీషర్లీని యెందుకు సినిమాలోకి పంపించకూడదు?" అని అడిగాడు. "నేను సినిమాకి వెడతాను నాన్నా!" అంది షర్లీ. వెంటనే పిల్లనెత్తుకొని 'ఫాక్సు ఫిలిం' (Fox Film) కంపెనీకి వెళ్లాడు ఆడైరక్టరు.

సాయంత్రం వారానికి ౧౬౦ పౌనులయిచ్చేపద్ధతి మీద 'కాంట్రాక్టు' రాసియిచ్చారు . కంపెనీవారు షర్లీకి. తరువాత ఆడైరక్టరే షర్లీనివాళ్లింటికి ఎత్తుకెళ్లాడు. అప్పటినుంచీ 'షర్లీ'ద్వారా ఆడైరెక్టరుకెళ్ళానికి, షర్లీ తల్లికి అపారమైన స్నేహం కుదిరింది.

అప్పటినుంచీ 'షర్లీ' మొదటి ఫిలింలో నటించింది. 'ఛార్లీచాప్లిన్' ఫిలింకన్నా ఎక్కువజనం తోసుకొచ్చారు. ఎక్కువగా చిన్నపిల్లలు. క్రమంగా జీతంతోపాటు 'షర్లీ' ప్రతిభకూడా హెచ్చింది. ప్రస్తుతం షర్లీకి వారానికి ౭౬౦ పౌనులు జీతం.

టాప్‌డాన్సు (Tap Dance) చెయ్యడంలో 'షర్లీ' కున్న చాతుర్యం యింకోవాళ్ళకి లేదు. 'షర్లీ'కి ఒక్కవిదేశాల్లోనే కాదు, మనదేశంలో కూడా మంచి పేరుంది. భావప్రకటన ముద్దొస్తోంటుంది. నవ్వితే మబ్బులోంచి చంద్రుడు నవ్వినట్లుంటుంది: కంపెనీలో వుండే నటులంతా 'షర్లీ' చుట్టూ చేరి "ఒక్కసారి నవ్వు షర్లీ" అని బ్రతిమాల్తారు. ఆమె నవ్వగానే సంతోషం పట్టలేక ఆమెని నలిపేస్తారు, పిసికేస్తారు.

షర్లీది అమిత కరుణార్ద్రహృదయం. ఆమెని గురించి ఓపాశ్చాత్యపత్రికలో ఆమెతల్లి వ్రాసిన "ప్రేండ్లీ షర్లీ" అనే వ్యాసంలో ఒహ ఘట్టం.

'షర్లీకి పెంపుడు జంతువులతో ఆడుకోటం అంటే ఎక్కువయిష్టం. వాటిల్లో 'పింకీ'అంటే దానికి ప్రాణం. పింకీని వాళ్ల నాన్న చీనా దేశంనుంచి షర్లీకి తెచ్చిచ్చాడు. ఓరోజున 'పింకీ' అకస్మాత్తుగా చచ్చిపోయింది. చచ్చిపోయిన ఆ తాబేటిపిల్ల మీదపడి నాబిడ్డయేడ్చినయేడ్పు అంతాయింతాకాదు నాలుగైదురోజులు. అన్నం, నీళ్ళుకూడా ముట్టకుండా యేడ్చింది. మాటిమాటికి పింకీని పెట్టే గాజుతొట్టిదగ్గిరకి వెళ్లి దాంట్లో పింకీలేదని బావురని యేడుస్తుంది. ఎవళ్లొచ్చిఓదార్చినా వూరుకోదు. షర్లీ యేడుస్తోందనగానే 'Fox' ఫిలిం కంపెనీ డైరెక్టర్లూ, నటులూ, పనివాళ్లూ అంతా చిన్న బుచ్చుకొని మాయింటికి వొచ్చి వోదార్చారు. "పింకీ, పింకీ" అంటూ షర్లీ ఎక్కియెక్కి ఏడ్చింది. తరువాత షర్లీని ఫిలింకోంపెనీలో చేర్పించిన డైరెక్టరుపెళ్లాం వొచ్చి పింకీని మరిచిపొయ్యేదాకా వాళ్ళింటో వుంచుకుంది షర్లీని.

షర్లీవల్ల వాళ్ళసంసారం బాగుపడింది. మొదట ఒక బ్యాంకిలో చిన్నగుమాస్తాగా పనిచేసిన షర్లీతండ్రి యిప్పుడాబ్యాంకిలోనే ఒక భాగస్వామి.

'షర్లీ' అంటే 'హాలీవుడ్డు' లో అందరూ ప్రేమిస్తారు. ప్రసిద్ధనటుడు లైనల్ బారీమోర్ (Lional Barrymore) కి షర్లీ అంటే ప్రాణం. రోజుకి అధమం రెండుసార్లేనా షర్లీని చూడందే వుండలేడు.

దేశదేశాలనుంచి షర్లీకి, ఆమెను అభినందిస్తూ అనేకమంది కానుకలూ, వుత్తరాలూ పంపుతారు. ఆకానుకలు జాగ్రతపెట్టినందుకూ, అవుత్తరాలు వివరించి చెప్పేందుకూ షర్లీ వాళ్ళమ్మకి వారానికి ౧౦ పౌనులు యిస్తుంది.

సినిమాలో నటించేటప్పుడు మాట్లాడవలసిన మాటలూ, చూపించవలసిన భావప్రకటనమూ వాళ్ళమ్మే షర్లీకి స్వయంగా బోధిస్తుంది. సాయంత్రం షర్లీని తీసుకొని వాళ్లమ్మా, నాన్నా షికారువెళ్తారు. అక్కడ యిసకతిన్నెలమీద 'టాప్‌డాన్సు' (Tap Dance) కూడా వాళ్ళమ్మే నేర్పుతుంది షర్లీకి. వారానికి ఓమాటు వాళ్ళకుటుంబం సినిమాకు వెళ్తారు. అదేనా పగలుప్రదర్శనానికే (Matinee). కారణం రాత్రి నిద్రసరిగా పోకపోతే 'షర్లీ' ఆరోగ్యానికి భంగంవస్తుందని ప్రతిరోజూ ఎనిమిదయేప్పటికి షర్లీని నిద్రపుచ్చి యింకోపని చూసుకుంటుంది వాళ్ళమ్మ.

ఓనాడు 'షర్లీ'దొంగనిద్రపోతోందిట. ఆరాత్రి వాళ్ళమ్మా, నాన్నా ఏవోరహస్యాలు మాట్లాడుకున్నారుట, తెల్లవారాక "అమ్మా! రాత్రి నువ్వూ, నాన్నా మాట్లాడుకున్నది విన్నాను.........అట్లా చెయ్యాడం పాపమేకాదూ.........ఛీ.......ఇంకెప్పుడూ అలా చెయ్యను........." అందిట. ఆమెకున్న పాపభీతి చూసి వాళ్లమ్మ ఆశ్చర్యపడింది.

షెర్లీ పిరికిదికూడా. ఓసారి 'బోరిస్ కార్లాఫ్' (Boris Karloff) నటించిన 'ఫ్రాంకెన్ స్టైన్' (Franken sten) అనే ఫిలించూసి దడుసుకుందిట. మర్నాడు జ్వరం వొచ్చింది. వాళ్లనాన్న కార్లాఫ్ దగ్గిరకెళ్లి 'రాత్రి మాషర్లీ మీఫిలిం' చూసింది. జడుసుకుంది. తెల్లవారి జ్వరంకూడా వొచ్చింది...'అనిచెప్పాట్ట. కార్లాఫ్ చాలా నొచ్చుకుని ఆరోజు వాళ్లింటికెళ్లి షర్లీని తీసుకెళ్ళి ఆరోజుగూడా మళ్లీ ఆఫిల్మే చూపించాట్ట. తెల్లవారి మళ్లీ షర్లీ లేచి ఆడుకుంది.

'షర్లీ' యింతవరకు ఆరుఫిలుముల్లో నటించింది. అన్నీ ప్రసిద్ధిచెందినవే.

'కళావినోది'



షెర్లీ టెంపిల్, ప్రఖ్యాతిగన్న బాలికానటి; ఏడవపుట్టినదినము (౨౩-౪-౩౬)నాడు విందురొట్టెను తినబోవుచున్నది

P. P. A.




'ఎగిరే మనుష్యుడు.' ఇతడు 'క్లెంసోను' అను అమెరికానివాసి. రెక్కలవంటి సాధనములతో పదివేల అడుగులఎత్తువరకు ఎగిరినవాడు G. S. A.

# గానుగెద్దు

కవికొండల వేంకటరావు

నువుగింజ చూడ్డానికి చాలా చిన్నదిగా అగుపించినా అది పోసి, ఆడి, నూనితీసే గానుగ మిక్కిలి గొప్పదిగాను, పెద్దదిగాను, పేరుకీర్తులు కలదిగాను కనబడుతుంది. సున్నపు గానుగ అంటారు గాని దానికి మొత్తసున్న. చెఱుగ్గానుగంటారు గాని దానికి మెత్తన హుళక్కి. కాని తెలుకుల గానుగ అనగా నువుపప్పు ఆడి నూనితీసే గానుగయొక్క పొంకం, బింకం, చాయ, వాయ, చెప్పదగ్గ విషయాలోనివి ఆ గానుగునంటి వ్యాసంగా తిరిగే బల్లకూడా తదనుగుణ్యంగా పెద్దదే. ఆ బల్లను లాగుతూవుండే గానుగెద్దుకూడా బలమైందీ, ఒక రకమైన అలవాటు చూపు గలదీ, ఒక విధమైన నడకగలదీ అయియుండాలి. అన్నిటికంటె అనుకో దగ్గది ఆగానుగ కిర్రు, ఆగానుగ దగ్గర కూర్చుంటేవేసే కమ్మని దిగుదాయి నూనె ఘుమాయింపు.

ఇక నువ్వులు పప్పగాజేసే తెలుకుల సత్తెయ్య అంటూ వుంటాడు! అతణ్ణెప్పుడన్నా చూచేరో లేదో పెద్ద జంగిడిబుట్టతో పప్పు కడిగి చెఱువుగట్టుమీద గోచిపాతతో అంత ఆజానుబాహువు మనిషీ నిటారుగా నిలబడి పప్పారబోస్తూంటే నల్లని శరీరం అతనూ కోరుకొండ కొండమీది రెడ్డి విగ్రహంలా గగడిస్తాడు!

"ఇతడేనా ప్రతివాది?" అన్నాడు అమీనా వెంకన్న ఊళ్లోకి ప్రవేశిస్తూతనతో వున్న వాదిగారితో. అమీనాతో వున్న వాదిగారిదీ ఆ గ్రామమే! వాదిగారి పేరు వేదాల పనసయ్యగారు. ఆయన బ్రాహ్మణులు, బ్రాహ్మణుల్లో లౌక్యులు, లౌక్యుల్లో మంచి వడ్డీవ్యాపారం గలవారు. పనసయ్యగారికి వయస్సు ఏభైయేళ్లు రమారమీ వుంటాయి.

పనసయ్యగారు వేలెట్టిచూపకుండానే కనుసైగమాత్రం చేతనే అవునన్నట్టుగా కనబడి అమీనాను మఱోత్రోవకు తీసికొని వెళ్లినారు.

తెలుకుల సత్తెయ్య అదేం గమనించనే లేదు. ఆరబోసిన పప్పకాళ్లతో రాస్తూ మండుటెండలో ఆలోచిస్తూవున్నాడు, ఆ పప్పు సాయంత్రాని కింటికి జేరబోసికొని రాత్రి నాలుగాటలమీద నూనిగావిద్దామని.

పనసయ్యగారు అమీనాను మఱోవీథి మార్గంగా దీసికొనివెళ్లడం తీసుకొనివెళ్లడం తిన్నగా సత్తెయ్య గానుగదగ్గఱకు తీసుకు వెళ్లినారు. "చెయ్యివోయి! అమీనా! జప్తు చెయ్యివోయ్! ఆయెద్దును" అని గానుగులాగుతూవున్న యెద్దును చూపించినారు.

గానుగాట అప్పుడెవరాడుతున్నారు? గానుగెద్దు నప్పుడెవరు తోలుతున్నారు?



సత్తెయ్య పెళ్లాం......పప్పు గానుగులోకి తోస్తూవుంది......పనసయ్యగారికొడుకు......గానుగ బల్లమీద కూర్చుని ఎద్దును తోల్తూవున్నాడు.

# గానుగెద్దు

కవికొండల వేంకటరావు

నువుగింజ చూడ్డానికి చాలా చిన్నదిగా అగుపించినా అది పోసి, ఆడి, నూనితీసే గానుగ మిక్కిలి గొప్పదిగాను, పెద్దదిగాను, పేరుకీర్తులు కలదిగాను కనబడుతుంది. సున్నపు గానుగ అంటారు గాని దానికి మొత్తనున్న. చెఱుగ్గానుగంటారు గాని దానికి మెత్తన హుళక్కి. కాని తెలుకుల గానుగ అనగా నువ్వు పప్పు ఆడి నూనితీసే గానుగయొక్క పొంకం, బింకం, చాయ, వాయ, చెప్పదగ్గ విషయాలోనివి ఆ గానుగునంటి వ్యాసంగా తిరిగే బల్లకూడా తదనుగుణ్యంగా పెద్దదే. ఆ బల్లను లాగుతూవుండే గానుగెద్దుకూడా బలమైందీ, ఒక రకమైన అలవాటు చూపు గలదీ, ఒక విధమైన నడకగలదీ అయియుండాలి. అన్నిటికంటె అనుకోదగ్గది ఆగానుగ కఱ్ఱు, ఆగానుగ దగ్గర కూర్చుంటేవేసే కమ్మని దిగుడాయి నూనె ఘుమాయింపు.

ఇక నువ్వులు పప్పుగాజేసే తెలుకుల సత్తెయ్య అంటూ వుంటాడు! అతణ్ణెప్పుడన్నా చూచేరో లేదో పేద్ద జంగిడిబుట్టతో పప్పు కడిగి చెఱువుగట్టుమీద గోచిపాతతో అంత ఆజానుబాహువు మనిషీ నిటారుగా నిలబడి పప్పారబోస్తూంటే నల్లని శరీరం అతనూ కోరుకొండ కొండమీది రెడ్డి విగ్రహంలా గగడిస్తాడు!

"ఇతడేనా ప్రతివాది?" అన్నాడు అమీనా వెంకన్న ఊళ్లోకి ప్రవేశిస్తూ తనతో వున్న వాదిగారితో. అమీనాతో వున్న వాది గారిదీ ఆ గ్రామమే! వాదిగారి పేరు వేదాల పనసయ్యగారు. ఆయన బ్రాహ్మణులు, బ్రాహ్మణుల్లో లౌక్యులు, లౌక్యుల్లో మంచి వడ్డీవ్యాపారం గలవారు. పనసయ్యగారికి వయస్సు ఏభైయేళ్లు రమారమీ వుంటాయి.

పనసయ్యగారు వేలెట్టిచూపకుండానే కనుసైగమాత్రం చేతనే అవునన్నట్టుగా కనబడి అమీనాను మళ్ళోత్రోవకు తీసికొని వెళ్లినారు.

తెలుకుల సత్తెయ్య అదేం గమనించనే లేదు. ఆరబోసిన పప్పుకాళ్లతో రాస్తూ మండు టెండలో ఆలోచిస్తూవున్నాడు, ఆ పప్పు సాయంత్రాని కింటికి జేరబోసికొని రాత్రి నాలుగాటలమీద నూనిగావిద్దామని.

పనసయ్యగారు అమీనాను మళ్ళోవీధి మార్గంగా దీనికొని వెళ్లడం తీసుకొని వెళ్లడం తిన్నగా సత్తెయ్య గానుగదగ్గఱకు తీసుకు వెళ్లినారు. "చెయ్యివోయి! అమీనా! జప్తు చెయ్యివోయ్! ఆయెద్దును" అని గానుగులాగుతూవున్న యెద్దును చూపించినారు.

'గానుగాట అప్పుడెవరాడుతున్నారు? గానుగెద్దు నప్పుడెవరు తోలుతున్నారు?



సత్తెయ్య పెళ్లాం......పప్పును గానుగులోకి తోస్తూవుంది......పనసయ్యగారికొడుకు......గానుగ బల్లమీద.కూర్చుని ఎద్దును తోల్తూవున్నాడు.

సత్తెయ్య పెళ్లాం ఆడుతూవుంది. ఒయ్యారంగా చిన్న తవుకోల్లాంటి సాధన మెటిసిపోతో వో చేతిలోవుంది. రెండో చేత్తో ఊరికే పప్పును గానుగులోకి తోస్తూవుంది. గానుగు కిర్రుకిర్రు తిరుగుతూవుంది. పనసయ్యగారి కొడుకు ఏడెనిమిదేండ్ల గుంటడు హుంహే అని గానుగు బల్లమీద కూర్చుని ఎద్దును తోల్తూవున్నాడు.

ఎప్పుడైతే పనసయ్యగారి గొంతుక వినబడిందో అప్పుడు పనసయ్యగారి కొడుక్కి లోపలప్రాణాలు లోపల్నే ఎగిరిపోయినాయి. "వెధవా! ఇక్కడ తెలుకలాళ్లగానుగదగ్గఱ తెలికపిండి రుచిమఱిగి వాళ్లెద్దుని తోల్తున్నావటా అని చితకావుతకా కొట్టేస్తాడేమో తనతండ్రి తనను అన్నభీతే ఆ కుఱ్ఱాడికి.

కనిపెట్టింది సత్తెయ్యపెళ్లాం పనసయ్యగారు వచ్చినరాకడ, అయినా చేయబోతూ వున్న జప్తు అన్నిటికంటే పనసయ్యగారి కొడుక్కి పుట్టుకొచ్చిన గుండె దడానున్నూ, తక్కినవాటి మాటటుంచి వెంటనే ఏం చేసింది ఆ అమ్మి? పనసయ్యకొడుకుని చంకనెట్టుకుంది. "అబ్బాయిగారూ! మనెద్దు నెవరు తీసుపోరులేండి" అంది.

ఈ సత్తెయ్యపెళ్లాం ఎప్పుడైతే ఎత్తుకుని ఆ ముక్కందో అదివఱకు తండ్రి కొడతాడేమో నన్నేభయం పోయి మఱొకం మానసిక ప్రవృత్తి పిల్లవానిలో కలిగింది. "గానుగెద్దు నెక్కడికో ఎవరో తీసుకుపోతారు." అనేదుఃఖం ఉద్భవిల్లి కళ్లమ్మట నీళ్లూరికే కారాయి; ఆ కుఱ్ఱాడు తనమొగం సత్తెయ్యపెళ్లాంయొక్క బుజమ్మీద పెట్టి ఒకటేయేడుపు ఒకటేయేడుపు! ఆమెపయటంతా తడిసిపోయింది.

పనసయ్యగారూ అమీనాకూడా ఓనిమిషం ఆదృశ్యం చూచారు. ఏమైనా బాకీ వసూలు అయిపోవడం తప్పనిసరి కాబట్టిన్నీ, అది సత్తెయ్యవల్ల గానుగెద్దురూపేణా తప్ప మఱోవిధంగా వసూలుకాదు కాబట్టిన్నీ "ఆ వెధవను నీవు ముందు కిందకుదింపి, మీ యెద్దును గానుగునుంచి విప్పేసెయ్యి- అమీనాగారు దాన్ని జప్తు చేయడానికి వచ్చారు." అన్నారు పనసయ్యగారు సత్తెయ్యపెళ్లాంతో.

సత్తెయ్య పెళ్లాంకదే మొదటిమారి పనసయ్యగార్ని చూడ్డం. పనసయ్యగారి గొంతుక రెండు మూడు పర్యాయములు వీధంట వినబడితే వినబడి వుండొచ్చుగాని ఆయన ముఖం ఆమెకు కనబడ్డ దావేళే.

సత్తెయ్య పెళ్లాం అంటే అందఱి పెళ్లాల్లాంటి పెళ్లాం కాదు. అసలైన పెళ్లాం. కోక కట్టిందన్నా రైక తొడిగిందన్నా ఆ తుంటి నా కోకే కట్టాలి అనుకొనేవారు చుట్టుపక్కలవాళ్లు; ఆచంటి నా రైకే తొడగాలి అనుకొనేవారు ఇరుగుపొరుగువాళ్లు. సత్తెయ్యకూడా తన పెళ్లాంపూసు వచ్చినప్పుడు అతి పుపురుసంగా అతిసరసంగా "నా పెళ్లాం!

నా పెళ్లాం!" అని చెప్పొచ్చేవాడు అందం అనేది అన్ని కులాల్లోను అన్నివృత్తుల్లోనూ వుంటుందని చెప్పక తప్పదనుకోండి ఆమెను చూచిన తరువాత!

ఆమె ఆ కుఱ్ఱవాణ్ణి కిందకు దింపి కొం చెం ఎడంగా నిలబడి సన్న గొంతుకతో "అమీనాగార్నే విప్పు కెళ్లమనండి" అంది.

సత్తెయ్యా వచ్చేదాకా ఆగండి అని అన లేదు. సత్తెయ్యలేకుండా చూచి దొంగల్లాగ తోలుకెళ్ల డానికి మీకేం హక్కు అని ముద లకించలేదు. సత్తెయ్యవుంటే మీ పని పట్టి వుండును.ఇలా గుమ్మంమెట్టు ఎక్కి యుం దురా? అని స్వగతంగా నైనా బొమముడి వేసియుండలేదు, ఆ యిల్లాలు.

అంత నిర్లిప్తంగా ఆమె చెప్పడానికి కార ణమేదో వింతైంది వుంది అని చదువరులు అనుకోనేరు గనుక, ఏమీలేదు.

సత్తెయ్యకు అతనిమీద పనసయ్యగారు తెచ్చినదావా అతనికి వ్యతిరేకమై ఏడెనిమిది నెల్లైంది. సత్తెయ్య పనసయ్యగారికి నూట ఇరవై రూపాయిలు ఇవ్వ తేలినాడు. అవి ఎక్కణుంచి తీసుకురావడానికి వేఱే అవకా శంలేదు అతనికి. తానై ఎద్దుని అమ్మలేక పోయినాడు. అమ్మితే మఱో ఎద్దును కొను క్కునే సామర్థ్యంలేదు. అంచేత పనసయ్య గారినే బతిమాలుకుంటువచ్చాడు. బాకీ అడగొద్దని, ఆబాకీ మఱోఅందుకు మఱో అందుకు తాను చేసిందికాదనీ, ఓముండకూ ముట్టకూపెట్టిందిలేదనీ, గానుగు పాతుకైం దని, తెలుకులుగానుగంటే సామాన్యపు గానుగకాదనీ, దానికీ మఱోదానికీ పోలికే లేదనీ, మఱెన్నీ మఱెన్నీ ఎన్నెన్నో ఏకరువు పెట్టేవాడు. ఏకరువుపెట్టి ఎంతకాళ్లా వేళ్లా బడ్డా పనసయ్యగా రంగీకరించలేదు. అంచేత పెళ్లాంతో అదివఱకే చెప్పేశాశాడు సత్తెయ్య "ఉన్నన్నాళ్లుంటుంది ఎగ్గు. లేనప్పుడు మాట గదా ఆలోచించుకోవడం మనపని ఎల్లాగునా అవి" ఆ కారణంచేత, పనసయ్యగారు అమీ నాతో కూడావచ్చి ఎద్దును జప్తుచెయ్యడం సత్తెయ్యపెళ్లానికి ఏమిన్నీ కొత్త అనిపించ లేదు.

పనసయ్యగారు ఎద్దును అమీనాచేత జప్తుచేయించి అమీనాకు తా మొక పూచీ కత్తు వ్రాసియిచ్చి తమ సొంతజవాబుదారీ మీద ఎద్దును తమదొడ్లోనే కట్టించివేసి కొన్నారు.

పనసయ్యగారి కొడుకు ఆకాడేవుండి ఆ జప్తాగిప్తా అంతా చూచి తమ యింటికే ఆ మెద్దును తోలుకెడుతూ వున్నారని తెలిసి కోపడంతోనే ఎద్దుకంటె ముందుగానే తమ యింటికి వెళ్లి తల్లితో అన్నాడు."అమ్మోయి! గానుగెద్దుని మన దొడ్లో కట్టివేస్తున్నారేవ్! గానుగెద్దేవ్! గుండ్రంగా ఎంచక్కా తిరుగు తుందేవ్!" అన్నాడు.

తల్లి "వెధవా! గానుగూలేదు! గాను గెద్దూ లేదు. నోరు మూసుకో" అంది.

ఆమెలో ఆ జప్తూ గిప్తూ వ్యవహారం ఏమాత్రం సంబరం గొలుపలేదు.

పనసయ్యగారు తన యింటికొచ్చి ఆ యెద్దును తమ దొడ్లో కట్టించి అమీనాను పంపించి ఎప్పట్లాగే నిత్యకృత్యాల్లో పడ్డారు.

సాయంత్రం పడేసరికి సత్తెయ్య తాజేసిన పప్పుతో యింటికి వచ్చాడు. ఇంటి కతగా చూచ్చేసరికి సత్తెయ్య పెళ్లాం కొంగు నట్టింట పఱుచుకొని పడుక్కొని వుంది. సత్తెయ్య "ఏమే ఆలా పడుకున్నావు!" అన్నాడు. "మన యెద్దును జప్తుచేసి పనసయ్యగారు తోలించుకు వెళ్లిపోయినారు. అనుకున్నంతా జరిగింది. ఇక మన బ్రతుకెలాగ?" అంది. సత్తెయ్యకు ధైర్యం చావలేదు. "ఓసి పిచ్చి దానా! ఆలా తొంగుంటే గానుగు తిరుగుతుందే? నేను తిప్పతాగా: ఎద్దుకు మాఱుగా నేను తిప్పతానే గానుగ! ఇంతేనా నీ విచారం" అన్నాడు సత్తెయ్య. "ఏమంటుంది" ఆ పడుచు. లోలోవున్న కు ములులోలోపలే దిగమింగుకుని ఒంటిచేతి మీాద లేచి జుత్తు రెండుచేతులా ముడేసుకుని "అంత పప్పా మనకీరాత్రివల్ల పడుతుం దంట్రా?" అంది. "పణ్ణాతే ఆయిరి" అన్నాడు సత్తెయ్య.

సత్తెయ్యా సత్తెయ్యపెళ్లాం ఇద్దఱూకూడా గానుగసాల్లోకి వెళ్లినారు. సత్తెయ్య అడి గాడు "ఎద్దుగంతలుకూడా జప్తుచేసుకుపోయారుటే?" అని. "ఎద్దు మువ్వాలుకూడా పట్టుకుపోయినారుటే?" అని. "ఎద్దుకు సంబంధించినవన్నీ పట్టుకుపోయినార." అంది సత్తెయ్యపెళ్ళాం, గానుగెక్కుతూ. సత్తెయ్య గానుగు తిప్పుతూన్నాడు.

రాత్రి రెండోజాము గానుగెద్దు, జప్తు అయిన ఎద్దు, పనసయ్యగారిదొడ్లో కట్టివేయబడ్డ యెద్దు తాడు తెంచుకుని మువ్వాలతోటి గంతలతోటి ఎక్కడికో పాఱిపోయింది అని ఊరంతాపుకారు. ఊరంతా బయలుదేరారు. పనసయ్యగారు మునసబుగారు కరణంగారు అందఱూకూడా సత్తెయ్య ఏదో మాయో పాయం పన్ని తిరిగి తనయెద్దును తన గానుక్కు కట్టుకుని గానుగ తిప్పుకుంటూ వున్నాడని ఊహించేరు, అంతదూరాన్నుంచి గానుగసాలలో కిర్రు కిర్రుగానుగు తిరుగుతూవున్న చప్పుడవుతూవుంటే——.

కాని సాలలోకి వెళ్లకముందే సాల ముందు పనసయ్యగారి కొడుకు "నడువు! గానుగుకాడకు నడువు!" అంటూ గానుగెద్దును సాలలోకి గెంటుతూ వున్నాడు.

ఊరంతా ఆ కుఱ్ఱవాని చేష్టచూచి "పనసయ్యగారూ! మీారు జప్తుచేయిస్తే మీా అబ్బాయిగారు జప్తు విడుదల చేయించేరండో!" అని కేకేశారు.

"మఱిసాల్లో గానుగెవరు తిప్పుతున్నారు?" అని అడిగేరు పనసయ్యగారు.

"వాళ్లే కాబోలు మగడు పెళ్లాలిద్దరూ కామోాసు" అన్నారు అంతా.



"నడువు, నడువు, గానుగకాడికి నడువు."

పనసయ్యగారి కొడుకు మాత్రం కొం లాగుతున్నాడు!" అన్నాడు. ఆ మాటతో చెం తొంగిచూచి "లేదు! సత్తెయ్యవొక్కడే లోకానికి కాయకష్ట దేవత ప్రత్యక్షమైంది. గానుగలాగుతున్నాడు! పాపం! గానుగ

---

# టాకీ డైరెక్టరు పి. వి. దాసు

గన్నవరపు సుబ్బరామయ్య

ఇప్పటికి తయారయిన తెలుగుటాకీ లన్నింటిలో చెప్పుకోదగినవి వేల్ పిక్చర్సు వారి సీతాకల్యాణము, కృష్ణలీల టాకీలు రెండే. వాటిని చూచి కనీసం పామరజనమయినా లక్షలకొలదిగా ఆనందించగలిగారు. వాటివల్ల వేల్ పిక్చర్సువారు అపారంగా ధనం ఆర్జించారు. అవయినా కళాసృష్టికి ఏమాత్రమూ తగినవి కావు. కేవలం ఆ పామరజనరంజకత్వమే వాటిలో ఉండే గొప్పతనం. తక్కినటాకీలు, తెలుగువి, అందుకుకూడా నోచుకోలేదు.

ఆ రెండుటాకీలను ఆ విధంగా తయారుచేయించింది పి. వి. దాసు; వేల్ పిక్చర్సు భాగస్వాములలో ఒకరు. అతను మొన్న మేనెల్లో ఉన్నట్టుండి చనిపోయినాడు.

టాకీలను తయారుచేయించడంలో అతను మిక్కిలి సమర్థుడు. అతను తయారుచేయించిన రెండు టాకీలనుబట్టి చూస్తే కళావేత్తలహృదయాలను ఆకర్షించగల చక్కని టాకీలను అతను ముందుముందు తయారుచేయించగలుగుతాడన్న విశ్వాసానికి అవకాశం ఏర్పడింది. అందువల్లనే నేడతనిమృతికి విచారించవలసి వచ్చింది.



కీ. శే. పి. వి. దాసు

అతణ్ణి మొట్టమొదటిసారి కలుసుకోవడం వెనకటి డిసంబరులో ఒకనాటిరాత్రి. అదీ చెన్నపట్టంలో బ్రాడ్వేటాకీసువద్ద. అతని టాకీలవల్ల అతనిపేరు అంతకు పూర్వమే తెలుసును. కాని అతణ్ణి మాత్రం చూడలేదు.

అతనప్పుడు శశిరేఖాటాకీ స్వయంగా తీయించాలని సంకల్పించి ఆప్రయత్నంలో ఉన్నాడు. దానికి సినేరియో వ్రాసేవారు కావలసివచ్చింది అతనికి. ఆవిషయంలో ఇంకొకరిద్వారా అతనిపరిచయం కలిగింది. (అతనికోరిక ప్రకారం అందుకు తగినవారి నొకరిని ఏర్పాటుచేయడమూ అయింది.)

ఆదినాల్లో బ్రాడ్వే టాకీసులో కృష్ణలీల దినానికి మూడుమార్లు ప్రదర్శింపబడుతూ ఉండేది. ఇసుక చల్లినా క్రిందరాలకుండా జనంమూగి తొక్కిసలాడిపోతూ ఉండేవారు. అలాటిదినాల్లోనే ఒకనాడు సాయంత్రం ఆరుగంటలనుంచి అతనికోసం అక్కడ కనిపెట్టుకొని ఉండవలసివచ్చింది. అతను ఏడున్నరదాకా రాలేదు. అంతలో అతనితో పరిచయం కలిగించినవారు 'దాసుగారు వస్తూఉన్నా'రని గేటుదగ్గర వస్తూవున్న ఒకవ్యక్తిని చూపారు.

ఆ వ్యక్తి బక్కపలచగా పొడవుగా ఉన్నాడు; రంగుమాసిన చెంగావిపంచె దోవతిగా కట్టుకున్నాడు; పట్టుదో, పాప్లినుదో కాని బొత్తాములు తగిలించకుండా ఒకకుడుతా తొడుగుకొని ఉన్నాడు. అతని భుజంమీద ఒకచిన్న కండువా ఉంది. చేతివ్రేళ్లసందున సగము కాలిన సిగరెట్టు ఉంది. ఆ వ్యక్తి ముందుకు చూచుకోంటూ గబగబా నడిచి ఆఫీసుగదిలోకి పోయినాడు. అతనికి ఆ సామాన్యవేషంమీదకూడ శ్రద్ధ ఏమీ లేనట్లు కనబడింది. ఆ వ్యక్తిని ఆనాటివేషంలో చూడగానే కలిగిన ఆశ్చర్యం ఇంతా అంతా కాదు. లక్షలకొలది ధనం ఆర్జించిన 'వేల్ పిక్చర్సు'లో భాగస్వామి అంత సామాన్యంకంటె తక్కువతరగతి వేషంలో ఉంటాడని ఊహకుకూడా తట్టలేదు.

పావుగంటకు తర్వాత ఆ వ్యక్తి మీద కండువా కూడా లేకుండా వచ్చి ప్రక్కను కూర్చొని మాటకది

పాడు. అతని నడకతీరులో ఉత్సాహాతిశయమూ, చూపు మెరుగులో తెలివితేటల చురుకుదనమూ, మాటవరుసలో కార్యసాధన కౌశలమూ కనుపడేవవి.

కొంతమేర పరిచయం ఏర్పడ్డతర్వాత అతను తనకోరికను తెలియపరిచాడు. ఆమాటలసందర్భంలోనే ప్రస్తుతం తెలుగుటాకీలను పట్టిన దుస్థితిని గూర్చిన ప్రసంగం వచ్చింది. అతను తీయించిన రెండు టాకీలలో లోపాలమాటకూడా వచ్చింది. అతను లోపాలను అంగీకరించాడు. కాని ఈ ప్రారంభదశలో ఆలోపాలు లేకుండా చేయడం అనివార్యం అన్నాడు.

“కళకోసం కళను నిలబెట్టవలెనంటే నోటిమాటా? కాదు. లక్షలకొలదిగా సొమ్ము కావాలి. అందులోనూ టాకీకి. దానికి కావలసిన అంగాలనన్నిటిని సరిగా సమకూర్చేవాళ్లు కావాలి. ఏదో కష్టపడి, నష్టపడి తయారుచేస్తే దాన్ని మెచ్చుకొనేవాళ్లు కావాలి. కళకు సహృదయుల హృదయరంజనమే ప్రామాణ్యము. అలాటి సంస్కారంకలవాళ్లు మనదేశంలో చాలతక్కువ. ఏలాగో చేయడానికయినా సొమ్ము ఎక్కడ! ఎవరు దండుగకు సొమ్ము నష్టపడుతారు? ఏపనిచేసినా దానివల్ల కొంత ప్రయోజనం ఉండాలి. లాభంమాట ఎట్లాఉన్నా నష్టమయినా కలుగకుండా వ్యాపారం చేసుకోలేనివాడు నిష్ప్రయోజకుడు. అది నామతంకాదు. నాకు కూడ కళాదృష్టితో టాకీని తయారు చేయించాలనే కోరిక ఉంది. తగినఆయతి చేకూడినతర్వాత తయారు చేయిస్తాను తప్పకుండా. ఇప్పుడయినా నేను తయారు చేయబోతూఉండే శశిరేఖటాకీలో కొంతమార్పు కళాదృష్టితో చేయతలచాను. చూడవచ్చు”నని అన్నాడు. అతనిమాటల్లో ఎంతో సత్యమూ, సరసతా, కళాప్రీతీ గోచరించింది.

మరల రెండుమూడుమార్లు, ఆ వెంబడివెంబడే, అతణ్ణి కలుసుకొని మాట్లాడడంలో అతని సంస్కారమూ, బుద్ధికుశలతా, కార్యతత్పరతా, కార్యనిర్వహణ సామర్థ్యమూ, స్వతంత్రశక్తీ ప్రతిమాటలోను ప్రతిబింబిస్తూఉండినవి.

శశిరేఖ కథను అతను పొందికగా సంగ్రహంగా చెప్పినాడు. ఎంతకొమ్మలు తిరిగిన పండితుడయినా, అంతపొందికగా, అంతసులువుగా తూచినట్లు చెప్పలేడనిపించింది.

అవతల పదిరోజులకు శశిరేఖటాకీ ప్రారంభించారు. ఆనాడు అతని ఆహ్వానంమీద అక్కడకు వెళ్లవలసివచ్చింది. తనక్రింద అన్నిశాఖలకును తగినవాళ్లు ఉన్నారు. ఉన్నా అతనికుండే నిర్మాణకౌశలమూ, నేర్పూ, ఊహా వాళ్లల్లో ఉన్నట్లుకనుపడలేదు. అడుగడుగునా అందరికీ అన్నింటిలోనూ దిద్దుతూ ఉండేవాడు. సీనులుతయారుచేయించడం, వేషాలు వేయించడం, అభినయం చేయించడం, మాట పలికించడం, పాటపాడించడం, వెలుగునీడలను సద్దడం, బొమ్మలను తీయించడం, శబ్దగ్రహణం చేయించడం మొదలయిన ప్రతి విషయంలోకూడ అతను స్వయంగా పాటుపడి డైరెక్టుచేశేవాడు. అతనిలో అప్పుడేదో ఒక అపూర్వశక్తి ఆవేశించి ఉంటుందనుకోక తప్పిందికాదు. అతను టాకీకళను ఎలాగో అంతగా అనుభవానికి తెచ్చుకొన్నాడు.

అతను మర్యాద తెలిసినమనిషి; గర్వము లేనివాడు. అయితే అనవసరంగా అన్నప్పుడల్లా ఎవర్నీ నెత్తికి ఎక్కించుకోడు; తిరస్కారమూ చేయడు. ఎవరిని ఎంతలో ఉంచవలెనో అంతలో ఉంచేవాడు. అతను తనకార్యంమీదనేకాని వ్యక్తిమీద లక్ష్యం ఉంచడు. అతనికి మోమోటం కొంచెమయినా లేదు. అతని లక్ష్యం ఏదో విషయంమీద ఉన్నప్పుడు ఎదట వచ్చి నిలిచినవాడెంతటివాడయినాసరే వానిమీదికి అతనిదృష్టి మరలదు. అలా ఉండడం ఒకొక్కప్పుడు నచ్చకపోవచ్చును. అట్లా లక్ష్యం స్థిరంగా ఉంటేనే కాని కార్యాన్ని సాధించడం ఎవ్వరికీ పడదు.

అతడు దండశాసనుడు; చిన్నతప్పయినా క్షమించడు. తప్పుకుతగినట్లు దండిస్తూఉంటాడు. ఇదంతా కార్యసాధకుని లక్షణం. కాబట్టే అతను చనిపోయినా అతని పేరును తెలుగు టాకీప్రపంచంలో స్థిరంగా నిలిచేటట్లు చేయగలిగినవి ఆతను తీయించిన టాకీలురెండున్నూ—సీతాకల్యాణము, కృష్ణలీలలు. ఇక ఇతని తర్వాత మళ్లయింతటి డైరెక్టరు లేదంటే నిత్యమూ తెలుగుటాకీలను చూస్తూఉండేవాళ్లలో తెలివితేటలు గలవాళ్లెవళ్లు కాదంటారు? ఇతను ఇంకా ౧౦, ౧౫ ఏండ్లు బ్రతికిఉండగలిగితే తెలుగుటాకీలను నిజంగా ఉన్నతస్థితికి తేగలిగేవాడేమో ననిపించింది. కాని శశిరేఖ సగంసగంలో ఉండగానే అతను చనిపోయాడు. అందులో అతని వ్యక్తిత్వమూ, కళాదృష్టితో అతనుచేసిన మార్పులూ ఎంతవరకు కనుపడుతుందో— లేక, అతను లేడని, అతని ఏర్పాటే అసలు మారిపోతుందో— అది బయటపడితే తెలుస్తుంది.

# గాంగులు: కళింగము

మల్లంపల్లి సోమశేఖరశర్మ

న్యూ ఒరిస్సా అనేదినపత్రిక మే 16-వ తేది సంచికలో "Parlakimedi Gajapathis and Gidugu's arguments" అనే పేరుతో పర్లాకిమిడి సత్యనారాయణరాజగురుపు గారు ఒకవ్యాసం వ్రాశారు[1], కళింగగాంగ వంశం ఆంధ్రదేశీయమనీ, కళింగం ఆంధ్రదేశంలో ఒకభాగమనీ శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు వాదించేవాదాన్ని విమర్శిస్తూను. ఈమధ్య పంతులుగారికి స్వాగత మివ్వడానికి రాజమహేంద్రవరంలో జరగిన సభలోకూడా పంతులుగారు అయథార్థాలనే (fictitious matters) ఏకరువు పెట్టారట మరి.

రాజగురువు గారివాదసారాంశం ఇది:

(౧) గాంగులు గంగానదీతీరానవుండే చంద్రవంశక్షత్రియులు. బంగాళంలోని తమ్లూక్, మిడ్నపూరు ప్రాంతాలవారని ఎల్ఫిన్‌స్టను వ్రాశాడు. ఆర్. సుబ్బారావు గారు గాంగులది ఉత్తరాదివంశమనీ, గంగానదీతీరాన్నుండబట్టే ఆవంశానికి ఆపేరు వచ్చిందనీ, వారు బంగాళం, బీహారాల్లో నుంచి కళింగానికి వ్యాపించి దాన్ని పాలించారనీ వ్రాశారు.

(౨) వారిదేశానికి గాంగవాడి అని పేరు. ఇది ఓఢ్రమాట. ఈగాంగవాడి మైసూరులోది కాదు. గోత్రాలు వేరవడంచేత—(మైసూరుపశ్చిమగాంగులది కాణ్వాయనస; కళింగగాంగులది ఆత్రేయస)—కళింగగాంగులకూ, మైసూరు పశ్చిమగాంగులకూ సంబంధంలేదు. వారు వేరు; వీరు వేరు.

(3) పర్లాకిమిడి ఆంధ్రదేశంలోది కాదు; కళింగంలోది. కళింగం వేరు; ఆంధ్రదేశంవేరు ఆంధ్రులు పర్లాకిమిడి దక్షిణపు సరిహద్దుదాకాఅయినా రాలేదు.

(౪) కళింగోత్కలాలు రెండూ ఎంతకాలంనుంచో, అథమం గంగవంశంవారికాలంనుంచైనా ఒక్కపాలనకింద వుండేవి. ఉత్కలాధిపతిఅయిన ఖారవేలుడు కళింగాన్ని పాలించాడు. కలకత్తా ఇండియన్ మ్యూజియములో వున్న ఒకతాళపత్రగ్రంథంలో అతడు "ఉత్కలఒరిస్సా"దేశపు మొదటి బౌద్ధరాజని వుంది. కళింగాన్ని పాలించిన మొదటి గంగరాజు కామార్ణవుడు ఓఢ్రదేశాన్నికూడా పాలించాడు; పదకొండో శతాబ్దిలో రామపాలుడు గంగవంశంవారి యేలుబడికింద వున్న కళింగోత్కలాలు జయించాడని సంధ్యాకరనంది "రామచరితం" వల్ల తెలుస్తుంది.

(౫) పర్లాకిమిడిరాజవంశంవారికీ, పూరీ గజపతులకూ ఎడతెగనిసంబంధబాంధవ్యాలు

1. ఈ వ్యాసం మిత్రులయిన శ్రీ జయంతి కిరీటిరావుగారిమూలాన చిక్కింది నాకు.

ఉన్నవనేటందుకు (౧) శ్రీకాకుళానికి ఈశాన్యంగా ౪౦ మైళ్లదూరాన వున్న కిమిడి ఒరిస్సారాజవంశానికి సంబంధించిన గజపతి దేవులనే ఒక సామంతరాజవంశానికి రాజధాని; (౨) కిమిడి మొట్టమొదట ఈ దేశాలకన్నిటికీ అధిపతిగావుండే జగన్నాథంరాజావారి పుత్రుని సంతతివాడు, నారాయణదేవుగారివంశీకులకిందవుండేది చాలా కాలం. తండ్రి జగన్నాథరాజు కొడుకును ఈ రాజ్యానికి నియమించడంవల్ల ఇది వేరుపడి పోయింది; (౩) ఇప్పటిపర్లాకిమిడి, పెద్దకిమిడి, చిన్నకిమిడి జమీందారులు తాము ఒరిస్సాగజపతులవంశం వారమని చెప్పకొంటారు; (౪) ప్రవల-అఖి-ముండో (ప్రవాళాక్షిశిరస్కుడు) అన్నదాని భ్రష్టరూపమే పర్లాకిమిడి. అది యీజిల్లాను పాలించిన ఆదిమజాతివారిలోని కట్టకడపటి ప్రభువుపేరు. ఇతన్ని జయించాడు కాలాహాంవీరుడు. ఇతను ఒరిస్సా రాజవంశీయుడయిన కపిలేంద్రదేవు కుమారుడు. వంశచ్ఛిద్రాలవల్ల అతడు సోదరులతో కటకం వదలివచ్చేశాడు[2].

చిట్టచివరకు రాజగురువుగారనేది యిది:

"I now ask Mr. Ramamurthy to either withdraw his statement or to give convincing authorities to justify his points"

శ్రీ రాజగురువుగారీవిధంగా వ్రాయకుండా వుంటే బాగుండేది.

రాజగురువుగారి వ్యాసంలోని విషయాలు సవిమర్శగా పరామర్శిస్తూ, ఈ సందర్భంలోనే వారుకూడా బాగా ఆలోచించవలసివచ్చే విషయాలు కొన్ని వారికి తెలుపుతున్నాను.

రాజగురువుగారి వాదంలోని విషయాలు గ్రహించి ఒకపొందిక వుండేటట్టు పైని నిరూపించాను. పైని చూపిన పద్ధతి క్రమం నాది.

గాంగులు గజపతులా?

రాజగురువుగారు చెపుతున్నారు-పర్లాకిమిడిరాజాగారు గంగవంశీయులనీ, ఒరిస్సా గజపతుల వంశంవారనీని; అనగా గాంగులూ, ఒరిస్సా గజపతులూ ఒక్కరే అని వారి అభిప్రాయమయినట్టు తేలుతుంది. ఇది ఎంతవరకు సత్యం?

గజపతి బిరుదం ఒక్కకటకం కపిలేశ్వర వంశం వారికే దక్షిణ హిందూదేశచరిత్రలో నిరూఢంగా వాడుతున్నారు. గాంగులను కళింగ గాంగులని వాడుతున్నారు కాని గాంగ గజపతులని కాని, కళింగ గజపతులని కాని వ్యవహారంలేదు. ఇట్లా లేకపోవడం సమంజసమే కూడాను; ఎంచేతంటే ఒక్క కపిలేశ్వరవంశంవారే గజపతిబిరుదాన్ని దర్పంతో వాడుకచేశారు; చూడండి: సరస్వతీ విలాసంలో "సతతదాన రాధాసుత

2. రాజగురువుగారు వ్రాసిన జనాభా విషయాలనుసరించి యిందులో యెత్తుకోలేదు నేను. వాటిని గురించి యిదివరకే శ్రీగిడుగు సీతాపతిరావుగారు మొదలయినవారెందరో వ్రాసేవున్నారు.

ప్రతాప కపిలేశ్వరో గజపతిః కథం వర్ణ్యతే" అని కపిలేశ్వరుణ్ణి, "వీర శ్రీపురుషోత్తమో గజపతిః" అని పురుషోత్తముణ్ణి, "వీర శ్రీ రుద్రదేవో గజపతి రభవ ద్యత్ప్రతాపాగ్ని రుచ్చైః" అని ప్రతాపరుద్రుణ్ణి వర్ణించారు. గజరాట్, గజపతి అనేవి కపిలేశ్వరవంశం వారికి మాత్రమే పరిపాటిగా వాడబడ్డ బిరుదాలు. "వీర శ్రీ గజపతిగౌడేశ్వర" అనే బిరుదంతో ప్రారంభంకాని వీరి శాసనాలే లేవు. ఈ కారణాలవల్లనే చరిత్రకారులు కపిలేశ్వరవంశంవారిని కటకం గజపతులనీ, ఒరిస్సా గజపతులనీ రూఢంగా వాడుతున్నారు. గజపతిబిరుదం కళింగగాంగులకు లేదా అంటే ఉన్నది; కడపటిరాజుల శాసనాలలో మాత్రమే—అదయినా అరుదుగానే—కనబడుతుంది. మూడవ వజ్రహస్తదేవు, అనంతవర్మ చోడగంగదేవు మొదలయినవారి శాసనాలలో ఉంటే "త్రికళింగాధిపతి" అని వుంటుంది, లేదా "గంగాన్వయావలంబనమూలస్తంభ" అనో, "గంగాన్వయావలంబనస్తంభ" అనో వుంటుంది కాని "గజపతి" అన్న బిరుదంమాత్రం కనబడదు. వజ్రహస్తుడు మొదలయినవారికే లేనప్పుడు "పూర్వగాంగు" లనబడే అతని పూర్వులకు అసలే కనబడదని వేరే చెప్పడమెందుకు? చోడగంగదేవు తర్వాతివారు —ఎవరయితేనేం— గజపతిబిరుదం సకృత్తుగా అయినా ధరించడానికీ, అతని పూర్వులు దాన్ని అసలే ధరించకపోవడానికీ కారణం లేకపోలేదు. కళింగంలో గాంగపరిపాలనం ఆరంభ మయినప్పటినుంచీ—అది యెప్పటి నుంచి అయితేనేం—వారికి స్వాధీనమైనదల్లా ఒక్క సముద్రతీరప్రదేశమే. తూర్పున సముద్రతీరం మొదలు పశ్చిమాన మహేంద్రం మొదలయిన కొండలదాకా ఉండేదేశం గాంగుల అధికారంలో ఉన్నట్టు కనిపిస్తుంది. పూర్వగాంగ శాసనాలలో ఉదాహరింపబడ్డ గ్రామాలన్నీ ఈ ప్రదేశంలోనే గుర్తింపబడుతున్నవి. దీన్నిబట్టిచూస్తే పర్వతకళింగాటవీప్రదేశం అంతా గంగవంశేతరుల స్వాధీనంలో వుండేదని తేలుతుంది. ఇందుకు నిదర్శనాలు కొన్ని చూపవచ్చు. గంగాతీరాన్ని పరిపాలనం నెరపిన మౌఖరివంశీయుడు శర్వవర్మ కొమారుడు ఈశానవర్మ (ఆరవశతాబ్ది) "జిత్వాంధ్రాధిపతిం సహస్రగణిత త్రేధాక్షరద్వారణమ్" అని వేలకొలది యేనుగులున్న ఆంధ్రాధిపతిని—కళింగాధిపతినికాదు—జయించాడని హరహాశాసనంలో వుంది. మౌఖరి రాజ్యానికి కళింగం దగ్గరకదా, వాటిని కళింగాధిపతిని జయించి తీసుకొన్నట్టు ఎందుకు చెప్పలేదు? ఆంధ్రం కళింగానికి ఇంకా దక్షిణ, నైరృతి దిశలనేగా వుంది? అంటే, వేలకొద్దీ యేనుగులు దొరికే కళింగాటవీప్రదేశం ఆంధ్రులకిందే వుండేవాలి. ఈశానవర్మకు, అనగా ఆరోశతాబ్దికి తరువాత ఈకళింగాటవులను స్వాధీనంచేసుకోడానికి ఎన్నెన్నోవంశాలవారు ఎన్నెన్నో యుద్ధాలు చేస్తూవచ్చారు. పర్వతకళింగాటవీ

ప్రదేశం స్వాధీనంచేసుకొన్నవారంతా త్రికళింగాధిపతిబిరుదం వహిస్తూవచ్చారు. కళింగగంగవంశస్థుడు మొదటిఇంద్రవర్మకు త్రికళింగాధిపతి బిరుదం ఉండడంచేత కొంతకాలం ఆప్రదేశం అతనికింద వుండేదనడానికవకాశం వున్నా, ఆబిరుదం అతడితరువాతివారికి లేకపోవడంచేత ఆప్రదేశాన్ని ఇతరులు స్వాధీనపరుచుకొన్నారనే చెప్పాలి. కొంతకాలం ఈప్రాంతం వేంగీచాళుక్యుల వశంలోకూడా ఉండేది. దీన్ని మొదట జయించినవాడు గుణగవిజయాదిత్యుడు. అతడు జయించేనాటికి కళింగాన్ని ఎందరో రాజులు పాలిస్తున్నారు. ఈవిషయం "వారణఘటోరూఢాః కళింగాధిపాః" అన్నదానివల్ల తెలుస్తోంది. అతనితరువాత మొదటి చాళుక్యభీముడూ, అతనికొడుకులు విజయాదిత్య విక్రమాదిత్యులూ కూడా త్రికళింగసహితంగానే వేంగిని పాలించారు. చాళుక్యులు దాన్ని ఎప్పుడు నష్టపోయినారో తెలియదుకాని వజ్రహస్తుడినాటికది గాంగులస్వాధీనంలో వుండిపోయింది. అతడిమనమడు చోడగంగు పరాక్రమించి పూర్వపశ్చిమోత్తరాల రాజ్యం బాగా వ్యాపింపజేశాడు. అంతతో యావత్తు కళింగానికే కాదు, ఉత్కలానికికూడా అధిపతులయినారు గాంగులు. ఎప్పుడో నికరంగా తెలియదుకాని--ప్రాయశః కళింగోత్కలాలు శాశ్వతంగా తమవంశంలో నిలిచిపోయినప్పటినుంచీ అయితే కావచ్చు—చోడగంగువంశంవారు గజపతిబిరుదం ధరిస్తూవచ్చారు. ఈ వంశంలో మరీ కడపటిరాజులశాసనాలలోనే ఆబిరుదం బహుఅరుదుగానూ, కేవలం అలంకారప్రాయంగానూ కనబడుతుంది. దీన్ని దీక్షతోనూ, దర్పంతోనూ ధరించినవారు ఒక్కకపిలేశ్వరాదులే. ఒకవేళ కళింగగాంగుల సైన్యంలో గజదళం ఎక్కువగా ఉంటూ రావడంచేత వారిని గజపతు లనడంలో కొంతన్యాయం వున్నా గాంగుల కాబిరుదం నిరూఢంమాత్రం కాలేదు కటకంగజపతులకులాగ. అంచేత కపిలేశ్వరవంశంవారిలాగ గాంగవంశంవారు గజపతులనేపేర ప్రసిద్ధులు కారనే చెప్పాలి.

కపిలేశ్వరుడికొడుకు కాలాహంవీరుడే "ప్రవల-అఖ-ముండో" అనేఆదిమజాతివాణ్ణి చంపాడనీ, వాడే ఈ జిల్లా(గంజాం)ను పాలించిన చిట్టచివరి 'ఏబొరిజినల్ రూలర్', అనగా ఆదిమజాతిప్రభువనీ అంటారు రాజగురువుగారు. అట్లాగయితే, కపిలేశ్వరుడికీ, కపిలేశ్వరుడికొడుకుకీ పూర్వం ఎంతకాలంనుంచో పర్లాకిమిడిప్రాంతాన్ని ఏలుతూవున్న గాంగు లేమయినట్టు? గాంగు లక్కడ రాజ్యం చేస్తూవుండగా "ప్రవల-అఖ-ముండో" ఎట్లా వచ్చాడు?—మొత్తంమీద, ఎంతప్రయత్నించినా అతుకు సరిగా కలవనట్టే కనిపిస్తుంది—. సరి, పీటిజోలెందుకు? *అసలు ఆంధ్రచరిత్రకత్యావసరమయిన గాంగసమస్యలనుగురించి ఆలోచిద్దాం.

**గాంగులు గంగాతీరవాసులా ?**

కళింగాన్ని పాలించిన గంగవంశంవారు అసలు గంగాతీరవాసులనీ, అంచేత ఉత్తరాదివారనీ, అక్కడినుంచే కళింగానికి వచ్చారనీ రాజగురువుగారూ, మరికొందరూ వాదించడం పరిపాటి అయిపోయింది. ఈ విషయాలు నిజమేనా అని మనం ఆలోచించాలి.

కళింగగాంగుల చరిత్రకు శాసనాలూ, వాఙ్మయమూ ఆధారాలు. ముందు వారి శాసనాలు చూదాం ఈ విషయం ఏమన్నా నికరంగా తేలడానికవకాశం వుందేమో. కళింగ గాంగశాసనాలు మొదటివీ, తరువాతవీ అని కాలాన్నిబట్టి, రెండు విభాగాలు చేయవచ్చు. తరువాతివనే కళింగ గాంగశాసనాలు పదకొండోశతాబ్దినుంచి ఆరంభమయేవి; మొదటివనేవి పదకొండోశతాబ్దికి పూర్వపువి. మొదటివనే శాసనాల్లో గాంగుల సంపూర్ణ వంశవృక్షమే వుండదు; తరువాతివనే శాసనాల్లో సంపూర్ణ వంశ వృక్షమే కాకుండా పౌరాణిక వంశకథనంకూడా వుంటుంది. కాబట్టి మన కేటువచ్చీ తరువాతివనే శాసనాలే ముఖ్యమైనవి. వీటినిబట్టి చూస్తే వీటిలో గాంగులు ఉత్తరాదివారని కాని, దక్షిణాదివారని కాని యేమీ లేదు. వీటి ప్రకారం, యయాతి కొడుకయినతుర్వసువుకు సంతానం లేకపోతే అతడు గంగ నారాధించాడనీ, అందుమీదట అతడికి గాంగేయుడనే కొడుకు కలిగాడనీ, అతణ్నిబట్టే ఆతడి వంశానికి గాంగేయవంశ మనేపేరు వచ్చిందనీ తెలుస్తుంది. గాంగేయుడివంశంలో కోలాహలుడు పుట్టి గంగవాడివిషయంలో తన పేర ఒక పట్టణం కట్టించాడు. ఆ కోలాహలపురంలో ౮౧ మంది రాజులు పాలించిన తర్వాత వచ్చే వీరసింహుడనేరాజుకి అయిదుగురు కొడుకులు పుడతారు. వీరిలో పెద్దవాడు కామార్ణవుడే కళింగంలో గంగరాజ్యాన్ని స్థాపించాడు.

గాంగులు ఫలానమార్గంగా కళింగానికి వచ్చారనికాని, గంగవాడి ఫలానచోట వుందనికాని శాసనా లేమీ చెప్పవు. అందువల్ల శాసనాలనుబట్టి కళింగగాంగు లుత్తరాదివారనడానికిగాని, దక్షిణాదివా రనడానికిగాని ఏమిన్నీ అవకాశం లేదు.

తుర్వసువు వంశంవారు కాబట్టి గాంగు లుత్తరాదివారే అంటే దక్షిణాపథంలో రాజ్యమేలిన యేరాజు లుత్తరాదివారుకారు అనవలసివస్తుంది. దక్షిణాదిని రాజ్యంచేసిన వాళ్లందరూ తాము ఇక్ష్వాకువంశీయులమనో యదువంశీయులమనో, పాండుసంతతివారమనో, ద్వారకావతి కాలింజరపురం అయోధ్య అహిచ్ఛత్రాలనుంచి వచ్చామనో చెప్పుకొన్నవారే. అందుచేత దక్షిణాదిరాజన్యులందరికీ సామాన్యధర్మమైనదాన్ని పురస్కరించుకొని విశేషవాదమూ, ప్రత్యేకవాదమూ చేయడానికి అవకాశం లేదు. కాబట్టి తుర్వసుప్రస్తావాన్నిబట్టికూడా గాంగులు ఉత్తరాదివారూ, గంగాతీరంవారూ అనడాని

కాస్కారం లేదు. పైగా తుర్వసువుకొడుకు గాంగేయుడనికూడా యే పురాణంలోనూ లేదు. పౌరాణికకథ అతికించుకోడానికీ, తాము సూర్య, చంద్రవంశస్థులమని దర్పంగా చెప్పు కోడానికీ తమవంశంపేర ఒకణ్ణి సృష్టించి అతుకుపెట్టుకోవడం దక్షిణాదిరాజవంశాల వారిలో చాలామందికి అభ్యాసమైపోయిన విద్దె పల్లవులు పల్లవుణ్ణీ, చాళుక్యులు చళు క్యుణ్ణీ—ఇట్లా ఎందరో తమవంశంపేర ఒక మూలపురుషుణ్ణి సృష్టించుకొన్నవా రున్నా రు. ఎందు కివన్నీ తడవడం?—చెప్పవచ్చే దేమంటే, పదకొండోశతాబ్దినాటి కళింగ గాంగశాసనాల్లోనిపౌ రాణికగాథనుబట్టివా రుత్తరాదినుంచికాని, గంగాతీరంనుంచికాని వచ్చారనడాని కవకాశం లేదని.

అంగరాజ్య మేలుతూవుండే బలి అనే రాజుభార్య సుధేష్ణకు జాత్యంధుడైన దీర్ఘ తమసుడనే ఋషివల్ల బాలేయక్షత్రియులు అంగ, వంగ, కళింగ, పుండ్ర, సుహ్ములని అయిదుగురుకొడుకులు కలిగారని ఒకపురాణగాథ వుంది. దీన్నాధారం చేసుకు కూడా గాంగు లుత్తరాదివారనడాని కవ కాశంలేదు; ఏమంటే దీనిలో గాంగప్రస్తావమే లేదుకాబట్టిన్నీ, కళింగం గాంగులకాణాచి అని యెక్కడా చెప్పివుండలేదు కాబట్టిన్నీ. ఈ పురాణగాథ నాధారం చేసుకొని కళింగాని కుత్తరాది దేశాలతో ఎక్కువసంబంధం వుందీఅంటే వుండవచ్చుగాక; కాని అది. గాంగు లుత్తరాదివారని యెట్లా ఋజువు చేస్తుంది? ఆమాటకొస్తే ఆంధ్రులకూ వుంది అట్లాటిసంబంధం వుత్తరాది దేశాలవారితో. వాయుపురాణంలోని ఈశ్లోకం చూడండి:

> కోసలాం శ్చాంధ్ర పౌండ్రాంశ్చ
> తామ్రలిప్తా న్ససాగరా౯ ।
> చంపాంచైవ పురీం రమ్యాం
> భోక్ష్యంతి దేవరక్షితామ్।

కాబట్టి ఈగాథవల్లకూడా ప్రయోజనం లేదు.

కళింగగాంగు లుత్తరాదివా రనడాని కల్లా వున్నఆధారం వొక్కటే: అదిప్లినీ వ్రాత. ప్లినీ, టాలెమీలనేవారు క్రీస్తుశకం మొదటిశతాబ్దుల్లో భూస్వరూపశాస్త్రం కొంత వ్రాశారు. దానిలో ఏయేజాతులు, ఏయే నదులు, ఏయేదేశాలు ఎక్కడెక్కడ ఉన్నవో వుదాహరించారు. అయితే వీరి ద్దరూకూడా సముద్రాలమీద సబుర్లుచేసి స్వయంగా ఆదేశాలన్నీ చూసి వ్రాసిన విషయాలుకావవి అనిమాత్రం మనం జ్ఞాపక ముంచుకోవాలి. ఆయాదేశాలను చేరివుండే సముద్రాల్లో సబురులుచేసిననావికులు చెప్పిన మాటలు — ఆనావికులయినా ఆదేశాలు స్వయంగాచూస్తే చూసివుండవచ్చు లేకపోతే లేకపోవచ్చు; వారు చెప్పిన అన్నివిషయాలూ వారు స్వయంగా వెళ్లి చూసి తెలిసికొన్న విషయాలే అనడానికవకాశంలేదు: ఆనోటా ఆనోటా విన్న విషయాలు కూడా చెప్పి వుండవచ్చు; వీటిలో అబద్ధాలెన్నో సుబద్ధా లెన్నో—. మొత్తంమీద ఆనావికులుచెప్పిన

సంగతుల నాధారం చేసుకొని వ్రాసినవ్రాతలే ప్లీనీవీ, టాలెమీవీని2. అందులో ప్లీనీ మెగాస్థనీసు వ్రాసిన సంగతులనే అనువదించాడంటారు. కళింగగాంగులు గంగాతీరవాసు లనడానికి చరిత్రకారులు చాలామంది ఉదాహరించేవి ప్లీనీవ్రాతలే. ఇతడు మక్కొ-కళింగాన్నీ 'గంగారిడే కళింగాన్నీ, మొడో కళింగాన్నీ పేర్కొన్నాడట తన గ్రంథంలో. దీన్ని పురస్కరించుకొని చరిత్రకారులు "మక్కొ-కళింగం" మధ్యకళింగమనీ-ముఖలింగమనికూడాను—"మొడొకళింగం" అంటే "మూడుకళింగం", అంటే త్రికళింగం అనీ – లేక వాక్కొ-కప్పుడు మధ్యకళింగమే అని కూడాను- "గంగారిడే కళింగం" అంటే "గంగా"కళింగ"మనీ, "కళింగ గంగు"లనీ - ఇంకవా రెవ్వరవుతారు మరి గాంగులు తప్ప - అర్థాలు చేశారు; చేస్తున్నారు; అన్నిటికంటె ప్రధాన మయినది "గంగారిడే కళింగ"అన్నది. ఈ పదానికిగంగాతీరపుకళింగమన్నా, కళింగగాంగులన్నా ఇక్కడ మనం రెండువిషయాలు ఆలోచించాలి. కళింగం ప్రాచీనకాలంలో గంగానదీతీరందాకా వ్యాపించిందా అని వకటీ, ఆప్రాంతాన్ని ప్రాచీన కాలంలో గంగజాతివా రున్నట్టు నిదర్శనాలేమైనా వున్నాయా అని వకటీని. చూదాం.

ఎంతవరకు కళింగం ?

మహాభారతంలో కళింగానికి వుత్తరపు సరిహద్దు వైతరిణీనది అనీ, దక్షిణపుసరిహద్దు గోదావరినదిఅనీ వుంది (ఈవైతరిణీనది యిప్పటి కటకంజిల్లాకు ఉత్తర సరిహద్దుగా వుంది). వైతరిణి కుత్తరం ఉత్కలం. ఈ విషయం మనో మోహన్ గంగులీగా రంగీకరించిందే. "పూరీగెజెటీర్"లో మహాభారతాన్నిబట్టి కళింగం గంగాసాగరసంగమం దగ్గరనుంచి దక్షిణానికి వ్యాపించిందని వుంటే అది తప్పని గంగులీగారు పైవిధంగా దిద్దారు. ఆఖరుకు ఆర్. డి. బెనర్జీగారి అభిప్రాయంలోకూడా కళింగం గంగానది వరకూ వ్యాపించలేదనే. ప్రాచీనకళింగం రెండుభాగాలుగా వుండేదనీ, దామోదర నదికీ (ఇది మిడ్నపూరుజిల్లాలోది) మహానదికీమధ్యఉండేది ఒకభాగమనీ, మహానదికీ గోదావరినదికీ మధ్యఉండేది ఒకభాగమనీ వ్రాశారు వారు ఆర్. జి. బాసక్‌గారి ఉద్దేశ ప్రకారం దక్షిణతోసలంలో చేరినకొంగోడ మండలానికీ గోదావరినదికీ మధ్యవుండేదేశం కళింగమని. (కొంగోడమండలమంటే చిల్కా సరస్సుప్రాంతమన్న మాట). ప్లీటు, రేప్సన్ మొదలయిన ప్రాచ్యపరిశోధకపండితులు మహానదీగోదావరినదులకుమధ్య వుండేదే కళింగమన్నారు. కేయూరబాహుచరిత్రలో పిఠాపురం కళింగంలోనే వున్నట్టుంది. ఇంతే కాదు బి. సి. మజుందారుగారు :

"We thus clearly see that the Kalinga empire of old lay wholly outside Utkala and Odra, and the people of Kalinga had

2. టాలెమీ భూస్వరూపశాస్త్రంలో చెప్పినవిషయాలు ఎంత అసంబద్ధంగా వున్నవో తెలుసుకోవడానికి "ఎన్‌సైక్లోపేడియా బ్రిటానికా" పదిహేనో సంపుటం (తొమ్మిదోకూర్పు)లో యిచ్చినపటం చూస్తేచాలు.

no manner of connection with the people of the rude high land tracts (Odras)" అనీ,

"We also learn from the account of HieunTsang that the people of Kalinga in the Ganjam district had their own Dravidian tongue and were different from the people of Orissa in every respect."

అనీ వ్రాశారు. రాజగురువుగారిలాగ నేను పాతపడిపోయిన చరిత్రకారులు ఎల్ఫిన్‌స్టన్, విల్సన్‌దొరలను పేర్కొటం లేదు; వీరంతా ఇప్పటివారే, ఇటీవలివారే- ఈ యిరవైయో శతాబ్దిలో నిన్నా మొన్నా ఉన్నవారు. అయితే ఒకటి మాత్రం చెప్పాలి - ఈ వ్రాతలన్నీ ఓఢ్రులు ప్రత్యేకరాష్ట్రంకోసం తీవ్రాందోళనం చేయకపూర్వపువి.

పై విషయాలనుబట్టి చూస్తే కళింగం ఎప్పుడూ - భారతకాలాన్నుంచీకూడా - గంగాతీరంవరకూ వ్యాపించలేదనే తెలుస్తోంది.

పోనీ వీటిని నమ్మడం ఎందుకు, శాసనాలనుబట్టి చూడాం అంటే గంగానదికీ గంజాం జిల్లాకూ మధ్యవుండే దేశంలో ఎన్నో రాజవంశాలవారి శాసనాలు - ఎక్కువగా కాకపోతే మానె, కొద్దిగానే అయ్యే - దొరికినవి. భౌమవంశం వారూ, నందవంశం వారూ, కోసల గుప్తవంశంవారూ, భంజవంశంవారూ, శైలోద్భవవంశంవారూ ఎందరో పాలించారు ఆ ప్రదేశాన్ని. ఈ వంశాల్లో కొన్ని సమకాలికాలు కూడా వున్నవి. వీరి శాసనాలలో ఎక్కడా కళింగంవూసే రాదు. కళింగదేశాధిపతులమని కాని, కళింగాధిపతులమని కాని చెప్పుకొన్నవారొక్కరూ లేరు పైవారిలో, ఒక్క కోసల గుప్తవంశంవారు యయాతి, జనమేజయాపరనామాలు కల మహాభవగుప్త, మహాశివ గుప్తాదులుమాత్రం త్రికళింగాధిపతి బిరుదం ధరించారు. త్రికళింగమనేపేరు సముద్రతీరాన వుండే కళింగానికి అసలు-న్యాయతః—వర్తించదనీ, కళింగపశ్చిమాటవీప్రదేశానికే వర్తిస్తుందనీ యిదివరకే వ్రాశాను. భౌమవంశీయులయిన శుభకరదేవు మొదలయిన వారి శాసనాలనుబట్టి చూస్తే పూర్వకాలంలో మహానది కెగువనుండేదేశం ఉత్తరతోసలమనీ, దానికి దక్షిణానవుండే దేశం దక్షిణతోసలమనీ తెలుస్తుంది; కాగా, కళింగాని కుత్తరపు సరిహద్దు తోసలమన్న మాట. భౌమ వంశంవారు ఉత్కలేంద్ర బిరుదం వహించడం వల్ల తోసలం ఉత్కలంలో దైనట్టు తేలుతోంది. ఆర్. డి. బెనర్జీగారి అభిప్రాయాన్ని బట్టి ఈ తోసలం ఉత్తరాన మిడ్నపూరువరకు వ్యాపించింది. ఈ భౌమవంశంవారు ఏడెనిమిది శతాబ్దాలలో పాలించినవారంటారు చరిత్రకారులు; అసగా గాంగవంశంవారి పరిపాలనం కళింగంలో ఎప్పటినుంచి ప్రారంభమని చెబుతున్నారో రాజగురువుగారు అప్పటినుంచీ గంజాముజిల్లాకుత్తరదేశం తోసలమని సూక్ష్మంగానూ, ఉత్కలమని సకృతుగానూ వ్యవహారంలో వుంది. తోసలానికి పశ్చిమాన వున్న దేశం

కోసలం. చిలక సరస్సుకు పశ్చిమానా, దక్షిణానావున్న కొంత ప్రదేశానికి కొంగోడమండలమని పేరు. ఇదిన్నీ దక్షిణతోసలంలోదే అని శాసనాలవల్ల తెలుస్తుంది. తోసలదేశమయినా నాటిదీ నేటిదీ కాదు. భరతుడి నాట్యశాస్త్రకాలాన్నుంచీ వుంది. నాట్యశాస్త్రకారుడు

> కోసలా స్తోసలాశ్చైవ
> కలింగా యవనో౽శలాః
> ద్రవి డాంధ్ర మహారాష్ట్రా
> వైష్ణావై (ఉష్ట్రా ?)వానవాసజాః.

అని తోసలుల్ని కోసలులతో కలిపి చెప్పాడు. దీన్నిబట్టిచూస్తే తోసలమనే ఉత్కలానికి దక్షిణాన వుండే దేశానికి మాత్రమే కళింగమని చాలా పూర్వకాలం నుంచీ వ్యవహారం వున్నట్టు ఋజువౌతోంది.

మరికొంద రంటారుకదా ఉత్తరకళింగమే ఉత్కలం అయిందని అని. శబ్దరీత్యా సాధిస్తే సాధించవచ్చేమో కాని బాగా ఆలోచించాలి ఈ విషయం. అశోకచక్రవర్తి కళింగం జయించింతరువాత దాన్ని ఉత్కలంలో చేర్చి తోసలిని దానికి రాజధాని చేశాడు. అసలు తోసలినిబట్టే దానిచుట్టుపట్ల దేశానికి తోసలమన్న పేరు వచ్చిందనుకొంటాను. ఇప్పటి ధౌలే తోసల మంటున్నారు. వాదంకోసం దీన్ని అంగీకరించినా కళింగం (ఉత్కలంతోకూడిందే) దామోదరనది దాకా వ్యాపించిన ట్టవుతుంది. అంతేకాని గంగానదివరకూ వ్యాపించలేదని చెప్పక తప్పదు.

ఉత్కలం మహాభారత కాలాన్నుంచీ కూడా వొక ప్రత్యేకదేశంగానే పరిగణితం అవుతూ వచ్చింది. చూడండి ద్రోణపర్వంలో

> ఉత్కలా మేకలాః పౌండ్రాః
> కలిం గాంధ్రాశ్చ సంయుగే
> నిషాదాశ్చ త్రిగర్తాశ్చ
> బాహ్లికాశ్చ జితా స్త్వయా.

అని కళింగోత్కలులు భిన్నజాతులవారయినట్టు చెప్పివుంది.

గంగానదీదక్షిణతీరానికీ కళింగానికీ మధ్య పుండ్ర, సుహ్మ (రాఢ), తోసల (ఉత్కలం), కోసలా లున్నవి. కళింగం గంగాతీరంవరకూ వ్యాపించిం దంటే ఈమధ్య దేశాల గతేమిటి? అ వేంకావాలి?

ఈవిధంగా ఉత్కలం ఒకప్రత్యేక దేశంగానే వ్యవహారంలో వుంటూవచ్చింది. అది కళింగాని కుత్తరానవున్న దేశం. ఈ సందర్భంలో అసలు ఉత్కలులు వేరూ, వోఢ్రులు వేరూ అనేవిషయం మనం జ్ఞాపకముంచుకోవాలి. దీన్ని గురించికూడా యిపుడే చెపుతాను, కళింగం గంగానదివరకూ వ్యాపించలేదనే సంగతి ఋజువై పోయిందిగనుక. కళింగమే గంగానదిదాకా వ్యాపించకపోతే కళింగగాంగు లెక్కడినుంచి వచ్చారు గంగాతీరాన ? కళింగదేశీయులను గురించిసవి. సి. మజుందారుగా రేమిన్నారో చూడండి:

"In ancient times almost the whole of the Andhradesa of today was the principal home of the Kalinga people."

ఇ తేకాదు,

"The people of Kalinga were different from the people of Orissa in every respect."

వృత్తిపదేశనూ గాంగులది ?

ఇక మనం ఆలోచించవలసిన రెండో విషయం కోసలాదిసముద్రతీర దేశాల్లో పూర్వకాలంలో గంగవంశీయులున్నట్టు నిదర్శనాలేమైనా ఉన్నవా అని.

గంగవంశంవారు కళింగానికి రాక పూర్వం దాన్ని శబరులు పాలిస్తూవుండేవారనడాని కవకాశం వుంది కళింగగంగ వంశంవారి పూర్వుడు కామార్ణవుడు శబరాదిత్యుడనేవాణ్ని చంపి కళింగంలో గంగ రాజ్యం స్థాపించినట్టు కళింగ గాంగశాసనాలే చెపుతున్నవి. శబరులు ఈప్రాంతాన రామాయణ పురాణకాలంనుంచీకూడా వున్నట్టు తెలుస్తుంది. వీరికి నివ్వాడు సవర అంటారు కళింగశబరులకు ఉత్తరానవుండేవారుఓఢ్రులూ, ఉత్కలులూ, మేఖలులూను. మేఖలాపర్వత ప్రాంతాన నివసించేవారు మేఖలులు. ఈ ప్రాంతాలు ఇప్పటి ఒరిస్సాకు నైరృతి దిశగా వున్నవి వీటిమాట మనకెందుకి పుడు? మనకు కావలసింది ఓఢ్రులూ, ఉత్కలులూను; ప్రాచీన సంస్కృతగ్రంథాలలో ఓఢ్రపదం కనబడదు. అది ఉడ్ర, ఉద్ర అనే వుంటుంది. ఓఢ్ర అనేది ఇటీవలిరూపం. వరాహమిహిరుడు బృహత్సంహితలో ఉడ్ర, ఉత్కలాలు రెంటినీ వేరువేరుగా చెప్తాడు. మహాభారతంలో చెప్పినదాన్ని బట్టిచూస్తే కూడా ఉత్కలం వేరుగానూ, ఉఢ్రం వేరుగానూ తెలుస్తుంది. కళింగం కొడితేయెట్లాగో అట్లే ఉఢ్రంవెళ్ళినా ఆర్యుడు పునస్సంస్కారం చేసుకోవలసినట్టు మనువు చెపుతాడు. ఇంతెందుకు,ఓఢ్రులు వేరూ,ఉత్కలులు వేరూఅన్నది చరిత్రకారులంతా అంగీకరించినవిషయం. ఉత్కలులు సముద్రతీరవాసులనీ, ఓఢ్రులు పర్వతనివాసులనీ, క్రమంగా ఓఢ్రులు తూర్పుగా సముద్రతీరానికంటా వ్యాపించి ఉత్కలులతో కలిసిపోయారనీ కూడా అందరూ వొప్పుకొంటారు. ఓఢ్రులసలు పశ్చిమకళింగాటవుల్లోనూ, సంబలపుర ప్రాంతంలోనూ వుండేవారని చెపుతారు కొందరు. ఉత్కలులూ, ఓఢ్రులూ కలిసిపోయిన తరువాతనుంచి ఆ రెండు తెగలవారికీ అవినాభావం కలిగింది. ఉత్కలులన్నా, ఓఢ్రులన్నా ఒక్కరే అయినారు. సంస్కృతగ్రంథాలల్లో వారిని ఉత్కలులని బహుళంగా వాడుకచేస్తూ వచ్చారు. దేశీయులు వారినే వోఢ్రులని వ్యవహరిస్తూ వచ్చారు. "ఓడు" అనే ధాతువులోనుంచి ఓఢ్రపదం వచ్చిందనీ, "ఓడు" అంటే పరుగెత్తడం, పలాయనం చేయడం కాబట్టి స్వదేశాన్ని విడిచి దేశాంతరానికి పలాయనంచేసినవారు ఓఢ్రులనీ వొక అపూర్వమైన వ్యుత్పత్తి కల్పించారు కొందరు. కాని 'ఓడు' అనేది శుద్ధద్రావిడ

మాట అనేవిషయం మరచారు వారు. అసలుపదం ఉడ్ర, ఉద్ర, ఊర్ధ అవడంవల్ల దానిమూలస్వరూపం ఉష్ట్రి అనో, ఉత్తర అనో అయివుంటుందేమో. ఏమయితేనేమి వీటి అర్థం బోధపడటం లేదు. ఉష్ట్రిలు, ఉష్ట్రికర్ణులు అనే జాతివారు మహాభారతంలో వస్తారు. ఈ ఉడ్రులు వారికి సంబంధించిన వారు కారుకదా అని నాసంశయం. ఏమయితేనేమి, ఉత్కలోడ్రులు కలిసి వాసంచేస్తూ వచ్చిన దేశాన్నే ఇప్పుడు ఒరిస్సాఅంటున్నాం. ఒరిస్సాఅనేది ఇటీవలిరూపం. ప్రాచీన వ్యవహారం 'ఉడిశా' అనే. మహమ్మదీయులు దక్షిణదేశంమీద దండయాత్రలు చేసే నాటికే ఉడిశాపదం వాడుకలోవుంది. కాబట్టే మహమ్మదీయ చరిత్రకారులీ దేశాన్ని ఉడిశా అనే వ్రాశారు తమ గ్రంథాల్లో. ఒరిస్సావారి భాష ఉరియా. దీని ప్రాచీనరూపం ఉడియా. ఉడ్రకు ఉద్ర అని వ్యవహారం వున్నట్టే ఉడిశా, ఉడియాలకు ఉదిశా ఉదియాలనీ వ్యవహారంవుంది. పూర్వకాలంలో డ, దలకుభేదంఅంతగా పాటించేవారు కారు. ఇది ఋజువుచేయడానికిశాసనాల్లోనుంచే ఎన్ని వుదాహరణాలయినాఇవ్వవచ్చు. ఉడిశా అనే పదాని కర్థం ఏమిటంటే ఉత్తరాదివారన్నమాట. "ఉదీచ్య" శబ్దభవమే ఉదిశా. కళింగానికి "ఉదీచ్యాః" ఉత్తరాదినున్నవారు కాబట్టి 'ఉదిశా'లయినారు. ఉడియా ఉత్తరాదివారి భాష. అందువల్ల కళింగులు ఉత్కలోడ్రులందరినీ ఉత్తరాదివార్లని వ్యవహరించడంవల్ల కళింగం వేరనీ, ఉడిశా వేరనీ, కళింగ భాషకూ జనులకూ, ఉడిశాభాషకూ జనులకూ భేదం అనాదిగా వుందనీ, కళింగానికుత్తరాన అనాదికాలంనుంచీ వున్నవారు ఉడ్రులూ, ఉత్కలులూ కాని గాంగులు కారనీ తేలుతోంది.

ఉత్కలులను విడిచిపెట్టి మనం ఇంకా ఉత్తరానికి వెడితే ఆ ప్రాంతాన అనాదికాలంనుంచీ శబరులు (సవరలు), నగ్నపర్ణులు (పానులు), పత్రసరులు (జాంగులు), కైవర్తులు (కేవతులు) కనబడతారు. వీరంతా ప్రాచీనకాలంనుంచీ ఈ ప్రాంతాన నివసిస్తూవచ్చిన జాతులవారు. వీరిలో కొంతమంది 'భగవతీసూత్రాలూ' మొదలయిన జైనుల మతవాఙ్మయంలోకూడా వస్తారు. మిద్నపురప్రాంతానకూడా కైవర్తులూ, శబరలూ వున్నట్టే తెలుస్తుంది కాని గాంగు లున్నట్టు తెలియదు. అశోకుడు తనధర్మానుశాసనాలలో కేవతులను (కైవర్తులను) పేర్కొంటాడు. ఈవిధంగా మిద్నపూరుప్రాంతం మొదలు గంజాం మండలందాకా అనాదికాలంనుంచీ పైనిచెప్పిన జాతు లున్నట్టే తెలుస్తుంది కాని గంగజాతివా రున్నట్టు తెలియదు. పురాణాదులు కాని, శాసనాలుకాని కళింగగాంగులు గంగాతీరవాసు లనడానికిగాని, వారు ఉత్తరాదినుంచి వచ్చారనడానికిగాని ఋజువివ్వవు.

ఇక గాంగవంశంవారి శాసనాలనుబట్టి ఈ విషయం ఏమీన్నీ తేలదనే యిదివరకు తెలుసుకొన్నాం. బాగా పరిశీలిస్తే వారి శాసన

నాలవల్ల వారు కళింగాన్నుంచి ఉత్కలానికి వ్యాపించారనే స్పష్టమవుతుంది. వజ్రహస్తుడికి పూర్వం పాలించిన పూర్వగాంగులెంతవరకూ తాము సకలకళింగాధిపతులమనో, సకలకలింగాధిరాజులమనో చెప్పుకొంటారు కాని ఉత్కలాధిపతులమని వొక్క శాసనంలోనూ చెప్పుకోరు. వారు మొదటినుంచీ ఉత్కలదేశస్థులయితేనూ, ఉత్కలంవారికిందే వుండివుంటేనూ వారు— ఉత్కలాన్ని పాలించిన కొన్ని వంశాలవారు చెప్పుకొన్నట్టు—ఉత్కలేంద్రులమనీ, ఉత్కలేశ్వరులమనీ ఎందుకు చెప్పుకోలేదు? గాంగుల జన్మదేశం ఉత్కలమే అయితే వారు తమశాసనాలు వేటిలోనూ ఉత్కలాన్ని ఎందు కుదాహరించరు ఒకమారైనా? వజ్రహస్తుడుకూడా త్రికళింగాధిపతేకాని ఉత్కలపతి కాడు. అతని మనమడు చోడగంగు "పూర్వస్యాం దిశి పూర్వ ముత్కలపతిం రాజ్యే విధాయ చ్యుతాం" అని చెప్పుకొంటాడు. ఉత్కలపతి తానే అయితేనూ, ఉత్కలం తనకిందే వుంటేనూ ఏమిటి దీని కర్థం? ఉత్కలపతి చోడగంగు సామంతుడే అంటే అప్పుడయినా దానికి స్వారస్యంలేదు. ఉత్కలపతి తనకు సామంతుడు కాకుండా భిన్నుడయితేనే చోడగంగు ఆవిధంగా దర్పంతో చెప్పుకోవడం కలుగుతుంది. చిట్టచివరకు చోడగంగు ఉత్కలాన్ని జయించినట్టు కూడా శాసనదృష్టాంతమే వుంది. చూడండి శాసనం ఏమని చెప్తూతోందో:

"నిర్మథ్యోత్కలరాజసింధుమపరం
గంగేశ్వరః ప్రాప్తవా
నేకః కీర్తిసుధాకరం పృథుతమం
లక్ష్మీం ధరణ్యాసమాం
మాద్యద్దంతిసహస్రమశ్వనియుతం;
రత్నాన్యసంఖ్యాని వా
తత్సింధోః కిమియం ప్రకర్షమథవా
ప్రుమస్త (?) దున్మాథినః."

గంగేశ్వరుడు ఉత్కలరాజసింధువును మథించేటప్పటికి కీర్తి అనే చంద్రుడూ, లక్ష్మితో సమమయిన ధరణీ అతడికి సంప్రాప్తమైనవట.

ఈ విధంగా చూస్తే కళింగగంగవంశంవారికి జయించినమీదటే ఉత్కలం స్వాధీనమయినట్టు స్థిరపడుతోంది. ఇది యిట్లా వుండగా గంగవంశంవారు — పూర్వగాంగులైతేనేం, పరగాంగులైతేనేం — కళింగంలో రాజ్యం చేస్తూవున్న కాలంలో కోసల గుప్తవంశంవారు కటకంప్రాంతాన్ని పాలిస్తూవున్నట్టు వారి శాసనాలే దాఖలాయిస్తవి. అటువంటప్పుడు ఉత్కలంకూడా మొదటినుంచీ గంగవంశంవారికిందే వుందనడాని కెట్లావీలు? అందువల్ల గంగవంశంవారు గంగాతీరంవారు కారనీ, వారు కళింగానికి గంగాతీరాన్నుంచి రాలేదనీ, కళింగాని కుత్తరాన్నుండే దేశాలకూ కళింగగాంగులకూ—వాటిని జయించి స్వాధీనం చేసుకొన్నదాకా—ఏమీ సంబంధం లేదనీ నిష్కర్షగా తేలుతోంది. దీన్నిబట్టే

గంగవాడి — గంగవంశంవారి ఆదిమ నివాసస్థలం — వుత్తరాదిని లేదని తేలుతూవున్నప్పుడు అది గంగాతీరానవున్న దేశం మాత్రం కాదని మళ్లీ చెప్పడం ఎందుకు?

గంగవంశంవారు ఉత్తరాదివారా, గంగాతీరవాసులా, గంగాతీరంనుంచే కళింగానికి వచ్చారా? గంగవాడి గంగానదీ తీరస్థ దేశమా? గాంగు లసలు ఉత్కలులా అనే విషయాలు చిక్కువిడడంచేత మైసూరు గాంగులకూ, కళింగగాంగులకూ సంబంధం వుందాలేదా? గంగవాడి ఎక్కడిది అనే విషయాలు ప్రస్తుతం, అంత ముఖ్యమైనవి కావు. పశ్చిమగాంగులకూ కళింగ గాంగులకూ సంబంధం వుంటేనేం ఉండకపోతేనేం, గంగవాడి ఎక్కడిదైతేనేం - అదిమాత్రం ఉత్తరాన లేదు, గాంగు లుత్తరాదినుంచి రాలేదు అన్నవే మనకు ముఖ్యంగా కావలసినవిషయాలు.

"గంగారిడీ"లు "గంగారాఢీ"లే.

ఇకమరి ప్లినీవ్రాత మాటేమిటి? అంటే అతను వ్రాసింది యిది:

"ఇమోడియన్ పర్వతాలు దాటిం తరువాత ఉండేజాతు లేమిటంటే — ఇసరి, కొసరి, ఇజి; చిసిరోతొసగి అనే కొండలలో అసంఖ్యాకు లయినజను లున్నారు. వారిని "బ్రాక్మనే" అంటారు. వారిలో "మకొకలింగు"లున్నారు... ..."కలింగ"జాతివారు సముద్రానికిదగ్గర. వారికెగువ "మండై", "మల్లి" అనేవా రున్నారు... గంగానదిలో చాలాపెద్దలంక వక టుంది. ఆ లంకలో నివసించేవారు వక్కటేజాతివారు. ఆ జాతివారిని "మోడొకలింగ" అంటారు ... గంగాతీరాన్నుండే కడపటిజాతి "గంగారిడీస్ కలింగ." వారిరాజు నివసించే పట్టణం "పార్థాలిస్".

ప్లినీవ్రాసిం దిది. ఇతడు మెగాస్థనీసు వ్రాసిందా న్ననుసరించే వ్రాసినా, అతని వ్రాతకూ ఇతనివ్రాతకూ కొంత తేడా వుంది. మెగాస్థనీసు కలింగులను "గంగారిడీస్"తో కలపడు. అతను వట్టి "గంగారిడీస్" అనే చెపుతాడు. ఈతేడా యెందుకు రావాలంటే యెవరికి తెలుసు?

ప్లైవ్రాతల నాధారంచేసుకొని మోడొకలింగాన్ని, మకొకళింగాన్ని, గంగారిడీస్‌ని కళింగంతో ముడిపెడుతున్నారు చాలామంది. ప్లైవ్రాతలో ఈవిధంగా ముడిపెట్టడాని కెక్కడ అవకాశం వుందో తెలియదుమరి. ఒక్క కళింగశబ్దం తప్ప మిగిలిన వర్ణన లేమీ సరిపడవు ఆ విధంగా అన్వయించుకోడానికి. ప్లినీవ్రాత కంటేనూకూడా మెగాస్థనీసువ్రాతే మనకు ముఖ్యం; ఎంచేతంటే ప్లినీకి మెగాస్థనీసు వ్రాసినవృత్తాంతమే మాతృక కాబట్టి. అందువల్ల, అంటే మనం గంగాతీరంజాతిని 'గంగారిడీస్' అనే అనాలి కాని "గంగారిడీస్ కలింగే" అనకూడదు. "గంగారిడీస్" అంటే నేను "గంగారాఢీ"లని అర్థంచేస్తాను.

పశ్చిమ బంగాళానికి సుహ్మానుభీ, రాఢా మండలమనిపేరు. ఇది గంగానది దక్షిణ తీరాన్నే వుంది. రాఢామండలంలోని జనులు రాఢీయులు. గంగాతీరరాఢీయులనే మెగాస్తనీసు "గంగారిడీస్" అన్నాడు. గంద్రగోళపడి యేకారణంచేతో ప్లినీ కలింగపదం దాని కంటగట్టాడు. అందువల్ల ప్లినీవ్రాత వల్ల మనకు వచ్చే చిక్కేమీ లేదు. ఆ వ్రాతను యథాతథంగా తీసుకోడానికీ, అంగీకరించడానికీకూడా వీల్లేదు. పోనీ, ఇతరప్రమాణా లెవ్వయినా ప్లినీవ్రాతని సమర్థిస్తవేమో అంటే అవీ లేదు. అందువల్ల ప్లినీవ్రాత ప్రమాణం కాదు.

కళింగమూ : ఆంధ్రమూను :

ఇక మనమాలోచించవలసింది కళింగానికీ ఆంధ్రానికీ సంబంధం వుందా లేదా అనే విషయం. ఆంధులు పర్లాకిమిడి దక్షిణపు పొలిమేరకూడా తొక్కిచూడలేదంటున్నారు రాజగురువుగారు. ఇది నిజమేనా అని ఆలోచించాలి.

ఆంధ్రులయిన శాతవాహనులు కళింగాన్ని పాలించారని యుగపురాణంలో చెప్పి వుంది. కళింగం అతివిస్తీర్ణమయిన దేశం గనకనూ, శాతవాహనులీదేశాన్ని ఎక్కడనుంచి ఎక్కడిదాకా పాలించారో నికరం తెలియదు గనుకనూ మనకు దీనివల్ల అట్టే ప్రయోజనం లేదు. కళింగానికీ ఆంధ్రులకూ సంబంధమే లేదంటే అప్పుడు చూపవచ్చు నీ ప్రమాణం. ఆ మాటకొస్తే ఇదొక్కటే కాదు, చాలా వున్నవి ప్రమాణాలు. చాళుక్యులు కళింగం జయించారు; కాకతీయులు కళింగం జయించారు; రెడ్లు కళింగం జయించారు; విజయనగరాధీశులు కళింగం జయించారు. ఇక జయించనివా రెవ్వరు కళింగాన్ని? అందువల్ల ఆంధ్రులకూ కళింగానికీ సంబంధమే లేదు అనడానికి మాత్రం వల్ల కాదు.

అయితే ఆంధ్రరాజులు మహేంద్రం దాకా పాలించారనడానికి అవకాశంకూడా లేకపోలేదు. శాతవాహనసంస్థాపకుడయిన గౌతమీపుత్రు డేలిన రాజ్యంలో మలయమూ, మహేంద్రమూకూడా వున్నట్టు చెప్పివుంది. మహేంద్రమంటే మహేంద్రగిరే. కాబట్టి ఆంధ్రులయిన శాతవాహనుల రాజ్యం మహేంద్రం దాటి ఎంతవరకు పోయిందో చెప్పడానికి వీలు లేకపోయినా మహేంద్రందాకా అయినా వ్యాపించిందనడానికభ్యంతరం లేదు. అందువల్ల ఆంధ్రులు పర్లాకిమిడి దక్షిణంపొలిమేరయినా తొక్కిచూశారా లేదా అంటేతొక్కిచూశారనే ఘంటాపథంగా చెప్పాలి. అంతేకాదు కళింగంలో చాలాభాగం ఆంధ్రదేశంలోదే అని కూడా చెప్పవలసివస్తుంది. చాళుక్యులు పాలించిన వేంగీదేశానికి ఉత్తరం మహేంద్రమూ (మహేంద్రగిరి-పర్లాకిమిడికుత్తరం), దక్షిణాన మన్నేరూ సరిహద్దులని శాసనాల్లో వుంది. వేంగీదేశం అంటే ఆకాలంలో ఆంధ్రదేశమన్నమాటే. ప్రాగాంధ్రదేశానికి వేగిని పర్యాయపదంగా వాడారు. అదట్లా

వుండగా చాళుక్యచోళుడయిన రెండవరాజ రాజు శాసనం వొకదానిలో

"పూర్వాంభోనిధి కాలహస్తిశిఖరి
శ్రీమన్మహేంద్రాచల
శ్రీశైలీ ర్వలయీ కృతాంధ్రవిషయం"

అని తూర్పుసముద్రానికీ శ్రీశైలానికీ మహేంద్రాచలానికీ కాళహస్తిగిరికీ మధ్యవుండేది ఆంధ్ర దేశంఅని చెప్పివుంది. మహేంద్రాచలం అంటే గంజాంజిల్లాలోని మహేంద్రగిరే. మహేంద్రగిరిదాకా ఆంధ్రదేశమే అని శాసనాలు—ఇప్పుడు వ్రాసినవికావు; ఎనిమిది తొమ్మిదివందల సంవత్సరాలకింద వ్రాసినవి; ఓఢ్రులకూఆంధ్రు కూ ప్రత్యేకరాష్ట్రంకోసం పరవ్వారట్టా పుట్టనికాలంలో వేసినశాసనాలు — ఘోషిస్తూవుంటే ఆంధ్రులు పర్లాకిమిడి దక్షిణంపొలిమేర సరిహద్దయినా తొక్కి చూడలేదంటే చెల్లుతుందామరి? శాసనాల్లో ఏదో వ్రాసుకొన్నారు, తీరి పోయిందంటే వాఙ్మయాన్నిబట్టికూడా ఆ విధంగానే ఊహించవలసివస్తుంది: చూడండి శ్రీనాథుడు కాశీఖండంలో ఏమనివ్రాశాడో—

ప్రాకటవిక్రమస్ఫురణ
రాజమహేంద్రము రాజధానిగా
నేకసితాతపత్రమున
నేలెను వీరనృపాలుఁ డుత్తమ
శ్లోకుఁడు వేమశౌరియనుజుం
డు సమున్నతవైభవాభ్యుదై

చీకటియుం గళింగమును
జిల్కసముద్రము సింహశైలముం.

అని అల్లాడరెడ్డి కొడుకు వీరభద్రారెడ్డి—పర్లాకిమిడివరకేకాదు — చిల్కసముద్రం (చిల్క సరస్సు)దాకా కూడా పాలించాడని చెపుతున్నాడు. ప్రత్యేకరాష్ట్రంకోసం తగాదా వచ్చినప్పటివాడు కాడుకదా శ్రీనాథుడు అబద్ధాలు వ్రాస్తున్నాడనుకోడానికి; ఎప్పుడో అయిదువందలయేళ్లకింద వున్నవాడు. అల్లయ దొడ్డారెడ్డి నెట్లా వర్ణించాడో చూడండి:

ఔరా! యల్లయరెడ్డిదొడ్డవసుధా
ధ్యక్షుండు ధాటీచమూ
భేరీభాంకృతి ఘోరఘోషమున ని
ర్భేదించె నొడ్డాది శృం
గారంకోటయు లోతుగడ్డయును ను
ద్ఘాటించె నత్యుద్ధతిన్
కీరాంభోధితటంబున న్నిలిపె ది
క్సీమాజయస్తంభముల్[4].

కీరాంభోధితటాన్ని అంటే చిలుకసరస్సు వొడ్డున జయస్తంభాలు పాతాడట అల్లయ దొడ్డారెడ్డి. అందువల్ల చిల్కసరస్సుదాకా వుండే దేశం ఒకప్పు డాంధ్రుల ప్రతాపాన్ని చవిచూసింది అని ఘంటాపథంగా తేలుతోంది.

అందువల్ల ఆంధ్రులు పర్లాకిమిడి దక్షిణపు సరిహద్దేకాదు, చిల్కసముద్రందాకా కూడా తొక్కిచూశారు; మెట్టిచూశారు. ఆం

4. పరిష్కర్తలకు బోధపడకపోవడంచేత అచ్చుప్రతుల్లో యిది "క్షీరాంభోనిధి" అయింది.

ధ్రానికి కళింగం భిన్న దేశమని మహాభారతం లో చెప్పినప్పటికీ కళింగాంధ్రాలకు చాలా దగ్గరసంబంధం అనిచెప్పడానికి పైవాటికంటె వేరేప్రమాణం ఏమికావాలి? వైతరిణీనది దాకా వుండేకళింగం అంతా కాకపోయినా దానిలో చాలాభాగం ఆంధ్రదేశంలోదే అనడానికభ్యంతరం వుండకూడదు.

ముఖలింగం, (శ్రీ) కూర్మాలలో వుండే శాసనాలు — ఎక్కడో అరుదుగా తప్ప — అన్నీ ఆంధ్రభాషలోనే వున్నవి. దేశం వోఢ్రదేశమయితేనూ, కళింగం ఆంధ్రంకంటె జాతిభాషావిషయాలలో భిన్నమయినదయితేనూ తెలుగులో ఎందు కుండాలి? గాంగులు వోఢ్రులే అయితే వారు శాసనాలు తెలుగులో ఎందుకు చెక్కించి వుంటారు? ఒరిస్సా గజపతులు రాజ్యానికి వచ్చారు; వారి శాసనాలలో చాలాభాగం అన్నీ వోఢ్రంలోనే వున్నవి. ఇది చాలదూ వారుమాత్రమే వోఢ్రులనడానికి?

అదిన్నీగాక కలింగలిపి అంతా వేంగీలిపే. వజ్రహస్తాదులు — కొందరు గంగవంశం రాజులునాగరిఅక్షరాల్లో కొన్నికొన్ని శాసనాలు చెక్కిస్తూవచ్చినా వారిశిలాశాసనాలు చాలాభాగం అన్నీ వేంగీలిపి (కళింగమోడీ) లోనే వున్నవి. గంజాం దాటివెడితేసరి లిపి మారుతుంది. అక్కడనుంచి కనపడేశాసనాలు బంగాళీఖత్తు నాగరే, కుటిలాక్షరాలు. గుప్తవంశంవారినాటి నాగరిలిపి మారిమారి బంగాళీ నాగరిలిపి అయింది. ఓఢ్రదేశం పాలించినవారిశాసనాలలో చాలాకాలం యీ బంగాళీరకం నాగరే కనిపిస్తుంది. ఒరిస్సా కపిలేశ్వర గజపతులనాటికి ఓఢ్రదేశబంగాళీ నాగరాక్షరాలకు బాగా వ్యక్తిత్వం వచ్చి ఓఢ్రాక్షరాలుగా గడ్డకడతవి. సర్వవిధాలా ఓఢ్రులకు వ్యక్తిత్వం వచ్చేటందుకు పాటు పడ్డవాళ్లు కళింగగాంగులే; గంగవంశంలోని కడపటి రాజుల తామ్రశాసనాలలోకూడా ఓఢ్రలిపి కనిపిస్తుంది కొంత — అవ్యక్తంగానో, సువ్యక్తంగానో —. ఆవిధంగా తమ దేశానికీ భాషకూ జాతికీ అంతవుపకారం చేసిన గాంగుల్ని వోఢ్రులు తమవారే అని చెప్పుకొంటే చెప్పుకోవచ్చు కాని చారిత్రకంగా సత్యం చెప్పవలసివస్తేమాత్రం వారు ఈ పై విషయాలన్నీ గమనిస్తూవుండాలి.

కళింగోత్కలాలు రెండూ చాలాకాలం ఉత్కలులపాలనకిందే వున్నవిగనుక వాటికెక్కువ సంబంధం: అందువల్ల కళింగం ఉత్కలంలో చేరవలసిందే అంటే పండితులయినవారు హర్షించనిమాటఅది. సుమారు నాలుగు వందలయేళ్లకాలం ఉత్కలం కళింగగంగవంశంవారికింద వుంది; అందువల్ల ఉత్కలం కూడా మాకే రావాలంటే చెల్లుతుందా? ఇంతకూ ఉత్కలం కళింగపాలకులకిందో, ఆంధ్రులక్రిందో వున్నంతకాలం కళింగంఉత్కలులకింద లేదు. ఆంధ్రులమీద ఉత్కలుల యేలుబడి సాగిందల్లా ఒక్క ఒరిస్సాగజపతుల కాలంలోనే. కపిలేశ్వరగజపతీ, పురుషోత్తమగజపతీ, ప్రతాపరుద్రగజపతీ —







సముద్రతీర వ్యాయామ వినోదములు

కుమారరాజా, పిఠాపురం.

ఈ ముగ్గురే ఆంధ్రదేశాన్ని యేలిన ఉత్కళ రాజులు తరువాత ఉత్తరాంధ్రదేశం గోలకొండ కుతుబుశాలకు వశమై వారి రాజ్యంలో చేరిపోయింది. దానితో కళింగం కూడా మహమ్మదీయరాజ్య మయింది. ఉత్తరసర్కార్లలో వొకటైన శ్రీకాకుళం సర్కారు ఆక్రమించింది కళింగాన్నే గా. గజపతులకు పూర్వం నాలుగువందలేళ్లు కళింగాన్నే కాదు ఉత్కళాన్ని కూడా నిరాఘాటంగా పాలించిన వారు. కళింగగాంగులే. వారు ఉత్కళులు కానేకారయ్యె.

ఇక చెప్పవచ్చే దేమంటే తాత్కాలిక రాజకీయవాదప్రతివాదాలెట్లావున్నా సత్యమే కావలసింది మనకు. వినమ్రతతో సత్యాన్వేషణకు పూనుకొని యథార్థ చరిత్రకోసం పరిశోధన చేయడమే చరిత్రపరిశోధకుడి విధీ, ధర్మమూను.

# గోపిక

**చావలి బంగారమ్మ**

అణువణువులో తనే యవతరించినయట్టు
కనులలో దుమ్మోసి తనువు దగ్ధము చేసి
        తానెట్టు పోయినాడో
        చెలి నాదు
    దాహంబు తీర్చరాడో
చూచినా తనె కన్ను మూసినా తనె నిజము
చూడలేకనె నేను నిలువలేకున్నాను
        తానెట్టు పోయినాడో
        నా హృదయ
    తాపంబు మార్చరాడో.
మాటలేకనె నేను మందంబుగా నుండ
డెందంబులో నీడ చిందులాడగ జేసి
        తానెట్టు పోయినాడో
        నాకంటి
    తడిమైన ఒత్తరాడో.

*   *   *   *   *

# భూమిక

కొంపెల్ల జనార్దనరావు

(ఉదయినీ సంపాదకుడు)

## ౧

ఇది నిరూపించుకొనకిక వీడదు మనస్సు
 తనను మాంసము, రక్తమ్ము, మనసుపట్టి
దారి తన్నుకనడిచిన తఱి, తలంపు
పట్టినోంచిన స్వప్నమ్ము బహువులిపుడు
తాసిఁక ప్రభుత్వమున నూప్చనేని ?—
(కనలు మాంసము, రక్తమ్ము, మనసునడచి
ద్వారిమెట్టెడుననూ, పురాతథ్య శిథిల
మూర్తి లింగమిా యెండిన భూమిక నొకట
తడవిచూచెడు, నాచూడ్కి తరిచి, తరణి.)
 —ఇదియు

తన వికృతసుందరత నవ్వి, తనపురాస్తి
తకు పితృత్వమె మండి, యీ ప్రకటజగము
దిద్దుకొనెడు నామది తెర తెరలు తానె
తలఁపుకట్టెడు—ఈ జగత్కళలు జార
ఇది జగము మెచ్చనిది వస్తువు;—ఎపుడొ
నవసి బూడిదకాన వఙ్ఞబడఁగాక [నవసి
ఈ నిరర్థక బీభత్స మిచట విడియ
నిచ్చిరే ?—
 —కాని యిదిమాత్ర మిది గణింపఁ
జనదు : కరఁగెడుమనసు మూర్తనిఖిలమ్ము
కరఁగి ఆవిరికట్టు లోకములఁజొప్పి,
తాను బూడిదకాక, ‘భూతమ్ము’ ‘నిపుడు’
పఱచిచూపిన వికృతసుందరత మెఱసి తీరు!—
తానొక్క మానవుతీరు, పశువు
తీరు—ఒకజీవియై యిటతిరిగె ననుము :
నన్నుఁగసరించి కఱకు స్వప్నములు మొఱయు
ఎన్నిగడవవు నాదృష్టియెడలి?—మొఱఁగి
నదినమస్తము, తానె నామదిఁ గరంచి,—
తానవోలెనే స్మృతుల మొదలఁగ వరించి.

## ౨

ఎదలుచూపులుకలపి అంచించురూపు
తను నిరూపించుకొని, తృషితము స్వకీయ
మెద ప్రకృతిలోఁగు విందు వరించి మెలఁగి,
తనదు ఆవృత్తి దొరలి నిల్చినది—బ్రదుకు
తీపులకు లోఁగని వికారతృష్ణ మెఱయ
ఈ శిథిల కర్కశముగ— ఆకృష్టచేత
నార్చితపునఃప్రణీతభోగ్యమును—
 —తఱిమి

నాకొక సుఖప్లుతితలంపు నడచుచవుల
భూతజని సాఁగి తివుడు ఈ పొడవుపొడవు
విధురజిహ్వము కొరియవెట్టు—ఈ త
లమ్ము సకలము జ్వాలాకులమ్ము మదికి
లేచి రూపించు తుదకే అలిప్తయష్టి,
ఈతరణి వెల్గుతుడుపులు, ఈవిరుద్ధ
సక్తిచుంచితవృత్తి—

ఈ ప్రకృతివన్నెరుచులు నాయెద మరుత్తు
గమి తడవి ఋతుపుచ్ఛశాపముల బ్రదుకు

బశి జ్వాలన్మ్రదలిడు మృతిస్వాదములకు
కొంతలీపులు విచ్చియు కూర్మి కలపు
ఈ బొమికనిల్చినదికాని—హృతసమస్త
జీవదనుకంపము, ప్రభూతచిద్విలసిత
మస్మదనుభూతిమెడ, అట్టి అనుకృతిమెడ,
ఒకట జీవన్త మది యెటులోర్చు ప్రీతి ?
(మునుపు మాంసము, రక్తమ్ము పసవికదలు
బ్రదుకు నామది శల్యము వడిని గ్రుచ్చి
లాగినదివోలు నిటు—ప్రాప్తలవ నిజాను
బంధచోద్యము.)—

కాక, ఆస్మృతిరేఁగిన కదలికతటి
నాపదము తాఁకు నిది మదన్యము, నిరస్త
గోచరాకృతి, తన్నునకు పడి విరిగె.

ఏను నొక్కఁడనని మెట్టి యేఁగఁజూతు
ఇది వికృత సుందరమొ : నాదు మది మలంగి
నానడలె ఆఁచి, చూడికి ఆని, నాదు
జిహ్వబడిసె పల్కు. 'మొదల?—చివర ?'
[అనుచు.

అది విరిగిపడ్డ దిటు భస్మమగుట కొక్క-
అడుగు మెట్టినదని చూచినాను నింగి :
పలుకమానదు, 'మొదల ?-చివర ?' అటన్న
వాసన—దినాలు తిరుగు నావాక్కు పొదివి,
నామెదడుత్రోవ—

3

ప్రాకృతము నాసమస్త మవజ్ఞపాలు :
అట ప్రపుష్టము గూటి తొల్లిటిది కూర్చ
తలము దివ్యము తలఁపుగా తడవి తడవి,
నా బ్రదుకు చెప్ప బొమికల నర్తనమ్ము
నొక నటప్రభు గళమాల వికటసుంద
రతకు అంకించు నిది భావి రగులనేసె,
నాయిపుడు నిల్చు బ్రదుకుమంటగమి చొచ్చి.
నాసమస్తము తనకు నగ్నమని యీ వి
ముగ్ధ వికృతమ్ము విజయించు మునుపు. నాదు
బ్రదుకు తనయందె ఒకజిత పడ్డరుచికి
వెదకులో, అధఃకృత మతివిధురమూర్తి
యిదియు నావాక్కు-పొదువు ఆకృతికిమురియు
భస్మమయి, కాక, ఒకప్రాణి పదమె వెలిఁగి.



# కలగూరగంప

## జవహర్ లాల్ నెహ్రూ

ఈమహామహునిజన్మమువలన ౧౮౮౯సం॥ నవంబరు మాసపు ౧౪వ తేదీ అతిపవిత్రమైనదయ్యెను. ఈయన ఆంగ్లేయవాతావరణమున పెరిగెను. ఆంగ్లేయదాదులచే ఈయనకు చిన్నతనమున విద్యాబోధ జరిగినది. ఆత్మహత్య యొనర్చుకొని చనిపోయిన ఎఫ్. టి. బ్రూక్సు గారు, తరువాత మూడుసంవత్సరములు జవహర్ లాలు



జవహర్ లాల్ నెహ్రూ

నకు చదువుచెప్పిరి. ౧౯౦౫సం॥లో మోతీలాలుగారు యీయనను ఇంగ్లండు తీసుకొనిపోయి హేరో (Horrow) పబ్లిక్ స్కూలులో చేర్పించిరి. ౧౯౦౭ లో ఈయన కేంబ్రిడ్జివిశ్వవిద్యాలయమున చేరెను. ఇక్కడ, యీయనకు, డాక్టరు సైఫుద్దీన్ కిచ్లూ; టి. ఏ. కె. షేర్వానీ. డాక్టరు సైయద్ మహమ్మద్, కె. యమ్. ఖ్వాజా, న్యాయమూర్తి సర్ షా మహమ్మద్ సులేమాన్ గార్లు సహాధ్యాయులు- ౧౯౧౦ లో పట్టభద్రుడై ఐ. సి. యస్ పరీక్షకు హాజరగుటకు లండను వచ్చాడు. ఆపరీక్షలో తప్పిపోయాడు. అది దేశమునకు అదృష్టమే. ఆయన ఒక గొప్ప అధికారిగానే ఉండెడివాడు. కాని సివిల్ సర్వీస్ పోగొట్టుకొనిన ఆయన దేశమునకు ఎక్కువగా లాభించాడు.

తరువాత న్యాయశాస్త్రము చదువ నారంభించాడు జవహర్ లాలు. ౧౯౧౨ లో ఇన్నర్ టెంపుల్ (Inner Temple) లో చదివి న్యాయవాది అయాడు. ౧౯౧౨ లో ఆయన ఇండియాకు తిరిగివచ్చినపుడు ఆంగ్లేయుని వలె ఉన్నాడు. ఇటీవల దేశమును దుఃఖ సాగరములో ముంచిపోయిన కమలా కౌల్ గారిని ౧౯౧౬ లో వివాహము చేసుకున్నాడు.

జవహరలాల్ బంకిపూర్ ౧౯౧౨ సంవత్సరమున మొట్టమొదటిసారి కాంగ్రెసునకు వెళ్ళెను. మరుచటి సంవత్సరముననే, రాష్ట్రీయ కాంగ్రెసు కమిటీలో సభ్యుడుగాచేరాడు. రాజకీయములవిషయమై యీయన దృష్టి వేరువిధముగానుండెను. ఆకాలములో న్యాయవాదులును, జనప్రముఖులును రాజకీయములను క్రీడగా భావించుచుండిరి. దక్షిణాఫ్రికాగొడవ ఆరంభమైనపుడు యీయన చాలాతీవ్రముగా పనిచేసెను; బెసెంటమ్మగారు హోమ్ రూల్ లీగు (Home Rule Leaqhe) ను స్థాపించినపుడు దానికొరకు హృదయ పూర్వకంగా పనిచేశాడు జవహర్ లాల్ నెహ్రూ. మోతీలాల్ నెహ్రూగారు అప్పటివరకు రాజకీయ దృక్పథములో వారిమార్గమును మార్చుకొనలేదు. అందువలన కుమారునిమార్గము నాయన నిరసించెను. కాని జవహర్ లాల్ వెనుకంజవేయువాడు కాడు. అది అంతే కావాలి, అనేవాడు. ఇదిచాలతీవ్రమగు విషయము కాన తండ్రి కొడుకులు అప్పుడప్పుడు యీ విషయములో ఎడమొగము పెడమొగముగా ఉండేవారు.

౧౯౧౯ లో గాంధీమహాత్ముడు సత్యాగ్రహమును ప్రకటించెను. మోతీలాల్‌గారి యిష్టమునకు వ్యతిరేకముగా జవహర్‌లాల్, ఆ ఒడంబడికమీద సంతకము చేసెను. గాంధిగారికి మిక్కిలి సన్నిహితుడై, గాంధి తత్త్వమును అనుగమించాడు. ౧౯౨౦ లో ప్లీడరీనివదలి పెట్టేశాడు. నిజానికి న్యాయవాదవృత్తిలో ఆయనశ్రద్ధ తీసుకోనేలేదు.

౧౯౨౦-౨౧ సంవత్సరములలో జరిగిన బొడ్ పాలాల కల్లోలములో, పంచపైకికట్టుకొని మైళ్ళ తరువాత మైళ్లు నడుస్తూపోయే జవహర్‌లాల్ స్త్రైహానుచూచి ప్రజలు మహా ఆశ్చర్యముపొందేవారు. అసహాయోద్యమవాదులలో జవహర్‌లాలు ప్రముఖుడయాడు. ముఖ్యంగా మహాత్మగాంధీకి కుడిభుజమయాడు. కాంగ్రెసుకు జనరల్ సెక్రటరిఅయాడు. దేశీయదినపత్రిక అయిన ఇండిపెండెంటు (Independent) కొరకు చాల్లాపనిచేశాడు దేశసేవకొరకే ఆయనకాలమంతా వినియోగించాడు.

ఈసమయమునందే వేల్సుయువరాజు భారతదేశసంచారముచేసెను. కాంగ్రెసు దానియొక్క విముఖతను ప్రకటించెను. అందువలన కాంగ్రెసు న్యాయవ్యతిరేక ముసంస్థగా ప్రకటింపబడెను. జవహర్‌లాలు కారాగృహమున నుంచబడి, మూడునెలలపిదప వదలివేయబడెను. విదేశీవస్త్ర బహిష్కరణోద్యమము ప్రతిచోటను కొనసాగింపబడెను. జవహరలాలు హృదయమిచ్చి యట్టిపానికొరకు పనిచేసెను. ఈయనకు యేడాదిన్నరశిక్షవిధింపబడెను కాని యెనిమిదిమాసములవెనుక ౧౯౩౩ లో వదలివేయబడెను.

పురపారిశుద్ధ్యపరిపాలనా విధానమును చెప్పవలసివచ్చినప్పుడు, అలహాబాదు మ్యునిసిపలుబోర్డు. అధ్యక్షుడుగానుండి జవహర్‌లాలు చేసిన కార్యములు గణనీయములు. ౧౯౨౬ లో అధ్యక్షతను వదలుకొని కమలానెహ్రూగారికి వైద్యముచేయించుటకు యూరపునకు వెళ్ళాడు. ఈయన యూరపు, రష్యాలలోచేసిన సంచారములు యీయనను సంపూర్ణ సాంఘికవాదిగా మార్చివేసినవి. యూరపులో నున్నపుడే బ్రస్సెల్సు అంతర్జాతీయమహాసభలో .యీయన యెక్కువకృషి చేశాడు. ఆ సంస్థకు ఉండే అయిదుగురు అధ్యక్షులలో ఒకడు కూడను.

లాహోరు కాంగ్రెసునకు యీయన అధ్యక్షుడుగా యెన్నుకొనబడ్డాడు. ఈయన అధ్యక్షతక్రిందనే మహాత్ముడు సంపూర్ణస్వాతంత్ర్య తీర్మానమును తెచ్చెను. తరువాత ఉప్పుసత్యాగ్రహమువచ్చెను. జవహర్‌లాలు మరలనిర్బంధించబడెను. విడుదలకాగానే మరల తనపని కొనసాగించాడు. పదిహేడురోజులుమాత్రమే ఆయన స్వాతంత్ర్యమనుభవించెను. వెంటనే నిర్బంధించబడెను. గాంధీ—ఇర్విన్ ఒడంబడికకాగానే మరలవిడుదల చేయబడెను. ఆయన విశ్రాంతిని అనుభవించలేదు, కలకొత్తాలో యిచ్చిన ఉపన్యాసమునకై మరల నిర్బంధించబడెను. జబ్బుగా నున్న తన భార్యను చూచుటకు స్విట్జర్లండు పోవుటకు యిటీవల విడుదలపొందెను.

రాజకీయములలో యీయన సాంఘికవాది. పద్ధతిలో దౌర్జన్యరహితుడు. జెయిలులోనున్నప్పుడీయన పుస్తకములువ్రాయుటలో కాలముగడిపేవాడు. మూడు పెద్దసంపుటాలను పూర్తిచేశాడు. Glimpses of the world History ; Letters fr.m a father to a Daughter అనే యీయనవ్రాసిన రెండుపుస్తకాలు, సాహిత్య, శాస్త్ర, చరిత్రములమువ్వలు. Whither India అనేది నూతనదృక్పథముతో వ్రాయబడిన రాజకీయతత్త్వము

(కృష్ణదేవ ప్రసాదగౌర్‌గారు The New Call అనేపత్రికలో The Pr.phet cf Young India అనే శీర్షికలో వ్రాసిన వ్యాసమునుండి)

(చక్రవర్తి)

---

## యుద్ధములను జయించుటకు తోడ్పడిన పక్షులు

పావురములు, వార్తాహరులుగా యుద్ధములో చాల ఉపకరించినవి. చరిత్రలో యిదియొక ప్రశస్తమగు విషయము. చాలసార్లు యీరెక్కల బేగిరావులు యుద్ధములను జయించుటకు తోడ్పడి దేశముల భాగ్య

మును తారుమారు చేయుటకు కొంతవరకు సమర్థము లైనవి.

ప్రథమమున ౩౬౦ సంవత్సరములకు పూర్వము ఆశ్చర్యకరముగ పనిచేసి యీపక్షులు యుద్ధమును జయించుటకు సహాయభూతము లయ్యెను.

౧౫౭౩-౭౪ సంవత్సరములలో దక్షిణ హాలెండుదేశ రాజధానియగు లేడెన్ (Leyden) నగరమును స్పెయినుదేశ సైన్యములు ముట్టడించినవి. ఆహార పదార్థములు లోనికిపోకుండ అడ్డగింపబడుటచే నగర వాసులును పట్టణ రక్షకులును మాడిపోవుచుండిరి. వేరు సహాయమేమియు తమకురాదని నిర్ధారణ చేసుకొని నగరరక్షకులు లొంగిపోవుటకు నిశ్చయించుకొనిరి. ఈ నిశ్చయమునకు వారు వచ్చిరో లేదో యింతలోనే ఒకవార్తాహర పారావతము రెక్కలల్లాడించుచు పట్టణపైభాగమున ఆకాశమున నెగురుచుండుట చూచిరి. వారిలో నొకసైనికుడు ఆపక్షిని కేవలము మాంసము కొరకు కాల్చిచంపెను. కాని క్రిందపడ్డ పక్షిని పైకి యెత్తుటతోడనే దానికాలికి కట్టియున్న చీటి నాతడు చూచెను. ఆచీటిలో ఆరేంజి యువరాజు (Prince of Orange) తమ సహాయమున కొక గొప్ప సేనతో వచ్చుచున్నాడని యుండెను. ఈవార్త వచ్చుటకు ఫలితముగ, ఆరేంజి యువరాజు వచ్చువరకును ఆపట్టణము కాపాడ డెను. యువరాజు, స్పెయిను సైనికులను తరిమివేసి ఆ పట్టణమును ముట్టడినుండి విడిపించెను. అదృష్టసూచకముగ ఆవార్తను తీసుకొనివచ్చిన ఆపావురము మరిచిపోబడలేదు. దానిశరీరము యిప్పటికిని లేడెన్ పురమందిరము (City Hall)న, గాజుతొట్టిలో పెట్టబడి కాపాడబడుచున్నది. ప్రసిద్ధమైన వాటర్లూ యుద్ధమునకూడ పావురములు వార్తాహరులుగా మంచిపని చేసినవి

౧౮౯౯ నుండి ౧౯౦౨ వరకు జరిగిన దక్షిణాఫ్రికా యుద్ధమున జయముపొందిన బ్రిటిషువారికి పావురములుచేసిన సహాయము సామాన్యమైనది కాదు.

ఇటీవల, యీ శతాబ్దాది జరిగిన రష్యా జపాను యుద్ధమున పావురముల సాహాయ్యము చాలవరకు వినియోగించుకొనబడెను. ఇరువాసులవారికిని పావురములు చాల యుపయోగించినవి.

౧౯౧౪-౧౮ ప్రపంచ మహా యుద్ధమున పావురములు నిజముగ ప్రసిద్ధతను గాంచగల్గినవి. వేలకొలది సైనికులు యీ పావురములమూలముననే తమ జీవితములను కాపాడుకొనగల్గిరి. టెలిఫోనులు సాధారణముగా ఉపయోగింపబడు చుండుటచే యుద్ధారంభమున పావురముల ప్రసక్తి తేబడలేదు. యుద్ధములో అగ్ని మిక్కుటముగా ఉపయోగింపబడుచుండుటచే టెలిఫోనులమీద పూర్తిగా ఆధారపడుటకు వీలులేక పోయెను. చెడిపోయిన టెలిఫోనులను బాగుచేయుటకు ధనవ్యయము యెక్కువగుచుండెను. అందువలన వార్తలను దీసుకొనిపోవుటకు పావురము లుపయోగింపవలసిన అవసర మేర్పడెను. ఆ అవసరమునకు పావురములు బాగుగా ఉపకరించెను.

మిత్రమండలి సైనికులకొరకు సందేశములను గొనిపోవుటకు ౫౦౦౦ పావురము లుండెడివి. వానిలో ౯౦% పావురములు వర్తమానములతో తమ నిర్ణీత స్థానమునకు చేరగలిగినవని చెప్పినచో ఎంత జయప్రదముగా తమవిధి నవి నిర్వర్తించుకొనగల్గినవో తెలియగలదు. తక్కిన ౧౦% పావురములు శత్రువులచేత కాల్చి చంపబడినవి. అనేకమారులు కాల్చబడినను, క్రిందబడకుండ రెక్కలల్లార్చుకొనుచు కొన్ని పావురములు తమనిర్ణీత స్థానమునుచేరి ప్రాణములు వదలినవి. ౧౯౧౫ సంవత్సరపు మార్నె (Marne) యుద్ధములో ఆశ్చర్యకరమగు యీ విషయము జరిగినది. సందేశమును మోసికొని పోవుచున్న ఒక పావురము ఒకజర్మను సైనికుచే కాల్చబడెను. తుపాకిగుండు ఆపావురము కుడికాలును చీల్చుకొనిపోయెను. అమిత బాధపడుచును ఆ విహంగము నిర్ణీతస్థానమునకు వచ్చిచేరెను. సందేశమును వారు చదువుకొనులోపల ఆ పక్షిరాజము చచ్చిపోయెను. అదితీసుకొని పోయిన సందేశమువలన

మిత్రమండలివారు జర్మను సైన్యమును వెనుకకు తరుమ గల యవకాశము వారికి తెలిసెను.

ఈ. కె. పాటర్సనుగారు 'అహింస' అను పత్రికలో వ్రాసిన వ్యాసమునుండి.

(చక్రవర్తి)

---

## చీనాలోని యాచకుల సమస్య

'ముష్టివాండ్రబాధను తొలగించుటకు, అధికారులు చర్యతీసుకొనుట మిక్కిలి యవసరము. ప్రస్తుతము, అధికారులు తీసుకొను చర్యయంతా సమర్థమైనదికాదు. 'నిర్ణయము' ప్రకారము అప్పుడప్పుడు పోలీసువారు ముష్టివాండ్రలో మిక్కిలి బాధకరముగువారిని పట్టుకొని అందరిని వొకేసారి దేశము పొలిమేరలకు తరిమివేయుదురు. కాని ఆముష్టివాండ్రు మరల దేశములోనికి మెల్లగా జేరుదురు. ఈ పద్ధతి కేవలము వ్యర్థ మయినది. ఉచితమును కాదు. చీనామ్యునిసిపలు సంఘములవారు పోలీసువారి సమ్మతిమీద మిక్కిలి వ్యాధిపీడితులును, వికలాంగులును అగు ముష్టివాండ్రను శరణాలయముల లోనికి చేర్పించెదరు. ఈవిధానము 'నిర్ణయము' విధానముకంటె మంచిదేయని చెప్పవచ్చును; గాని యిది యును అంతతృప్తికరముగ లేదు. శాస్త్రీయమైనపద్ధతి లేకుండుటయే యీ యాచకసమస్యా పూరణమునకు వేరుపుర్వును, ముష్టి యెత్తుకొనుట, చీనాలో కోర్టులలో శిక్షింపబడు అపరాధము కాదు. పోలీసువారు ముష్టివాండ్లవిషయమై కలగచేసుకొనునపుడు స్వతంత్రముగ వ్యవహరించుటయేకాక న్యాయశాస్త్రము ప్రకారము వారు కలిగియుండవని అధికారములనుకూడ చెలాయించవలసివచ్చుచున్నది. 'నిర్ణయము' ఆచారము ప్రకారము ముష్టివాండ్రను పొలిమేరలకు తీసుకొనిపోయి వదలుట ఎట్లు దౌర్జన్యమో, అట్లే దయపేరుచెప్పి న్యాయముగా ముష్టివాండ్రను పోలీసువారి సమ్మతిమీద తీసుకొనిపోయి శరణాలయములలో పెట్టుట, విచారణ లేకుండా ఖైదుచేయుటవంటిది. పై రెండు విధానములును, న్యాయవిరుద్ధములు కాకపోయినను న్యాయాతిరేకములే. ఇట్టివానిని విశ్వాసముతో పరికించుటకు వీలులేదు.

తత్కాలవిచారణచేయుటకు పోలీసువారికి అధికారమునిచ్చుట ఉచితవిషయము కాదు. సాధారణులైన ముష్టివారికి శిక్షావిధిమూలమున సంస్కారము నిచ్చుట కంటె వారిని విరాళిసంస్థలవలనదారికి తెచ్చుటకు ప్రయత్నించినచో ఆవిరాళిసంస్థలకు చేయుసహాయమంతయు ఉపయోగకారిగ నుండెడిది. ఐచ్ఛిక ప్రయత్నములు, ఏవిధమైనగాని, యీసమస్యను ఊరికే కదలించుటకు మాత్రము చాలుచున్నవి. ఈనిర్భాగ్యతకు కారణము, ప్రస్తుతము దేశములోని ప్రజాసామాన్యములో పెక్కురు అనుభవించుచున్న కటికి లేమి. దీనిని పోగొట్టుటకు ప్రజాసామాన్యము గడుపు-జీవితవిధానమును అభివృద్ధి చేయుటకు వీలగునట్లు ధనమును వారికి పంచిపెట్టవలయును. ఇట్లు చేయుటలోని పరమార్థము ముష్టివాండ్రను తొలగించుటకాక, దారిద్ర్యమును తొలగించుటయై యుండవలెను. నిజమైన దరిద్రునికి పైపద్ధతి యుపయోగకరమే కాని ఎటు దారికినిరాని మొండి గుడ్డి ముష్టివాండ్ర కీపద్ధతి ప్రయోజనకారికాదు. అంతేకాదు; అంత పెద్ద ఊహ ప్రస్తుతపు పరిస్థితికి సహాయకారికాదు. కాని ఇప్పుడు సంస్కరించవలసినది ప్రస్తుత పరిస్థితి.

ముష్టియెత్తుకొనుట పూర్తిగ తొలగొట్టబడకపోయినను చాలవరకు తగ్గించుట ప్రస్తుతపు టవసరము. బజారులలో ముష్టియెత్తుకొనుటకు ముష్టివాడు మొగము చూపుటతోడనే, తప్పనిసరియైన, తొలగించుటకు వీలుకాని, నిర్ణీతమైన శిక్ష వానికి గనపడవలయును. మరియును, యీముష్టివాండ్రమీద ఆధారపడి వీండ్రసంపాదనమీద భుక్తిగడుపుకొనేవాళ్ళని అమితమైన శిక్షలకు పాల్పడ చేయవలయును.

(ది పీపుల్సు ట్రిబ్యూన్ సంపాదకీయమునుండి)

ఈసమస్య భారతదేశములోకూడా తీరనిదిగానే వుంది. ప్రజాప్రభుత్వములదృష్టి యీవైపుకి మరల వలసిన అవసరము యెక్కువగానే వుంది.

(చక్రవర్తి)

---

## మనము దేనిపై నాధారపడవలెను

రవీంద్రనాథటాగూరు గారు, భారతదేశీయులను తమకార్య సాఫల్యత కొరకు న్యాయము, కష్టసహనము, త్యాగములపై నాధారపడి యుండవలెనని యిచ్చిన సలహాను విశ్వభారతి ప్రకటించినది.

"నా దేశీయులకు పలుమారు నేను హెచ్చరించునది యిదే: మీ కార్యసాఫల్యమునకు మీకు ఆధారమయినదేది! మీ శరీరసత్వమా! అది మీకు లేదు. మీ మాట పలుకుబడియా! అది మీ రనుకొనినంత చొరవకలది కాదు. గొప్ప ఆంగ్లేయ దేవుడైన మీకు బాసటగా నున్నాడా! అట్టి మహనీయ దేవుడును కనపడడే! కాని; న్యాయము మీ వైపునున్నచో దానిపైననే మీరు పూర్తిగా ఆధారపడియుండుడు. కష్టమును సహించుటకు మీకుగల హక్కు నెవరును తొలగింపజాలరు. మీ దేశీయులకొరకు, సత్యముకొరకు, న్యాయముకొరకు మీ ఆత్మత్యాగము చేయుట వలన కల్గు పరమానందము, మీకొరకు ఎదురుచూచుచున్నది. మీకు యోగ్యత యున్నచో మీ కోరికలను, మీ ఆత్మశక్తియే కొనసాగింపగల్గును. "చక్రవర్తి"

---

## మనము పిల్లలను తయారుచేయు యంత్రములు కాము

శ్రీమతి సరోజినినాయుడు గారి యధ్యక్షతను మోతీనగరములో జరిగిన విషయనిర్ణయసభా స్త్రీ సమావేశమున మాట్లాడుచు, పెక్కురు స్త్రీలు, హైందవ స్వాతంత్ర్యసమరమున స్త్రీలు పంచుకొనవలసిన బాధ్యతలను గురించి యుపన్యసించిరి.

'మనము కేవలము పిల్లలను తయారుచేయు యంత్రములము కాము. అంతకంటె ఉపయుక్తమైనదియు, గొప్పదైనదియునగు కార్యభాగము మనము చేయవలసియున్నది. మన హైందవ స్వాతంత్ర్యోద్యమమునకు ఎనమే ఆయువుపట్టు కావున మనము హైందవ స్వాతంత్ర్య సమరమున మనకు వీలైనంత సహాయము చేయుచుండుము మనలో ప్రతివారును సరోజినినాయుడువలె గావచ్చును; కాంగ్రెసు ప్రెసిడెంటు గవచ్చును. కాని మనము దానికొరకు పనిచేయవలెను; మనవిధిని సరిగా నిర్వర్తించుకొనవలెను. పూర్వము హైందవ మహిళాలోకము ముగ్ధత్వమునకలిగి, ప్రతివిషయమునను వెనుకంజవేయుచుండెడిది. జాతీయస్వాతంత్ర్య సమరము వచ్చినతరువాత స్త్రీలు మార్గదర్శికలై లాఠీ దెబ్బలు తిని జైళ్లకుకూడ పోయియుండిరి. ఇది నూతనశకమని చెప్పవచ్చును. ఇది చాలమందికి ఆశ్చర్యకరమైన విషయము. ఈ ఉత్సాహమును పోగొట్టుకొనక, జాతీయతా పునరుజ్జీవనమును నిలుపవలెను.' అని శ్రీమతి మణిబెన్, కారా మూల్జీగారు చెప్పిరి.

శ్రీమతి జుట్షిగారు మాట్లాడుచూ, హైందవ మహిళాలోకము ముందంజవేయుటకును, ధైర్యసాహససంపన్న మగుటకును గాంధీమహాత్ముడుచేసిన పనిని గూర్చి ప్రస్తావించుచు స్త్రీలు పరదాను వదలివేయవలయుననియు, బాల్యవివాహములను పోగొట్టవలయుననియు, దేశదాస్య విమోచనకొరకు పనిచేయవలయుననియు చెప్పిరి.

భారతదేశము స్వాతంత్ర్యసంపాదనకొరకుచేయుచున్న సమరమునను, భూతదయా పరకార్యములందును హైందవ నారీమణులు తీసుకొనుచున్న శ్రద్ధయును, చేయుచున్న స్వార్థత్యాగమును అభినందనీయములు-కాని శాంతముగ బిడ్డలనుకని వారిని ఉత్తమ మానవులుగా తయారుచేయు కన్న ఉత్తమమైన కార్యమేమియు గనపడదు.

స్త్రీలు బిడ్డల తయారుచేయుయంత్రములు కాని మాటయు, కేవలము అటులనే ఉండకూడ దను మాటయు నిజమే కాని, బిడ్డలనుకనుట వారి స్వాభావిక ధర్మమనుమాట వారు మరచిపోకూడదు. సంతానమును గనుట గౌరవప్రదముగ గాని అగౌరవప్రదముగ గాని చేయగలవారు తల్లులే. సంతానము కనుట యను ప్రకృతి ధర్మము మాత్రము యెప్పటికిని అసహ్యించుకొనదగినది కాదు. శ్రీమతి మణిబెన్ కారామూల్జీ గారి తల్లిగాని, శ్రీమతి జుట్షిగారి తల్లిగాని, మహాత్మగాంధిగారి తల్లిగాని ఎప్పటికైనను తమ మాతృత్వమునుగూర్చి సంతాప పడవలసిన యగత్యముండునా! మాతృత్వమును అనాగరికముగా నొసర్చి, దానినిగూర్చి చులకనగా మాటాడవలదని ప్రార్థన.

మాతృహృదయము, మానవస్వాధీనము లగు అన్ని ఆస్తులవలెనే నిలువగలది. మాతృహృదయము వికసించి సంతానమును కనుచున్నది.

(మాడరన్ రివ్యూ సంపాదకీయమునుండి) "చక్రవర్తి"




## శ్రీ హరనాథావతారము

శ్రీహరనాథ సీరీసు, 3 వ ప్రచురణ. డెమ్మీ ౧౬౬ పుటలు. వెల ౫ అణాలు. సంపాదకులు, ప్రకాశకులు; శ్రీహరనాథతత్త్వ ప్రచారిణీసభ, (రిజిష్టర్డు) హెడ్డాఫీసు:— రాజమండ్రి.

ఇప్పుడు హిందూదేశమున అనేక మతములు వెలయుచున్నవి. వీని లక్ష్యము ఒకటియే; మార్గములు చాల భిన్నములు. ఆ యా మతావలంబకులు తమతమ మతకర్తలను అవతారపురుషులనుగ భావించి వారివారి మహిమాతిశయములను వేనోళ్ల గొనియాడుచుందురు. వారు తమతమ మతప్రచారమునకు కొన్ని సంస్థలను నెలకొల్పి జనులను తమ మతమున కలుపుకొన ప్రయత్నింతురు. ఇందొక మతము చెడ్డదని, ఒకటి మంచిదని అనుకొనుటకు కూడ అవకాశము లేదు. అట్టి నూతన మతప్రవర్తకులలో శ్రీ కుసుమ హరనాథబాబాగారొకరు.

ముక్తిమార్గములగు భక్తి, కర్మ, జ్ఞానములలో భక్తి సర్వజనసులభము. కర్మము క్లిష్టము; జ్ఞానము క్లిష్టతరము. ప్రాచీనకాలమున జ్ఞానమే మోక్షదాయకమనియు, భక్తి, కర్మములు జ్ఞానసంపాదనమునకు మార్గములనియు ఆమోదింపఁబడి జ్ఞానసంపాదనార్థమే ప్రబలములగు ప్రయత్నము లాచరింపఁబడినవి. మన వైదికవాఙ్మయ మీ యర్థమునే బోధించుచున్నది. అద్వైతాదిమతము లీసూత్రమునే అనుసరించినవి; కాని జ్ఞానసంపాదన ముత్తమమాత్రసాధ్యము. తక్కినవారికిఁ గూడ ముక్తియభిలషణీయమగుటచే తత్తత్కాలోచితముగ కర్మకు, భక్తికిఁ గూడ ప్రాముఖ్య మీయఁబడుచుండెడిది. ప్రస్తుతకాలమున కర్మాచరణమును కష్టసాధ్యమగుటచే భక్తియే అన్ని మతములవారికి పట్టుగొమ్మ అయినది. విశ్వప్రేమ, విశ్వమానవసోదరత్వము; భగవద్భజన అన్ని మతములకును ప్రధానాంగములు.

శ్రీహరనాథమతమునకును భక్తియే ప్రధానము. ముక్తినపేక్షించువారు హరనాథనామసంకీర్తనము చేయుచు శివకారుణ్యము, విశ్వప్రేమ కలిగియున్నఁజాలును. ఫలసంసిద్ధి యగును. శ్రీవారు భగవదవతారమూర్తులని తెలిసికొనినవారికి వారియెడ తప్పక భక్తి కల్గి తన్మతావలంబనమున కోరిక కలుగును. అందులకు శ్రీవారి మహిమానువర్ణనము ప్రధానము.

ఇప్పుడు తెలుఁగునాట లెక్కలేని మతములు ప్రచారమున నున్నవి. శ్రీరామకృష్ణమతము, చైతన్యమతము, రాధాస్వామిమతము, తిరుజ్ఞానదీను బాబామతము, దివ్యజ్ఞానమతము, హరనాథమతము, బ్రహ్మసమాజమతము, చాల ప్రచారమున నున్నవి. తెలుఁగుదేశమున పయిమతములకుఁ గల ప్రచారము మఱి యే దేశములలోను లేదు. ప్రాచీనమతములయెడ రోఁత జనించినది. ఇదంతయు తెలుఁగువారి స్వాతంత్ర్యమునకు ప్రబలమగు నిదర్శనము. ప్రాచీనమతములు ప్రతిపాదింపని సులభమార్గములు నవీనమతములలో కన్పింపవు. అయినను 'క్రొత్తవింత,' 'లోకో భిన్నరుచిః'

శ్రీ హరనాథావతారము తన్మతవ్యాప్తి నుద్దేశించి వ్రాయఁబడినది. ఇందు శ్రీ బాబాగారి జీవిత చరిత్ర, అద్భుతచర్యలు వివరింపఁబడినవి. శ్రీబాబాగారి భగవదవతారత్వమును నిర్ణయించుచు భక్తులు వ్రాసిన లేఖ లిందనేకము లున్నవి. ఇది హరనాథభక్తులకు భక్తులు కాఁబోవువారికి ఉపయోగించు గ్రంథము. శ్రీ హరనాథులవారి తత్త్వము తెలిసికొనఁగోరువారు తప్పక చదువవలసిన గ్రంథము. దీని మూల్యము, ప్రచారమున కనువగునట్లు చాల తక్కువగా నున్నది.

[illegible]

## సీతాకల్యాణము

స్నేహలతా కవితాసంఘపు ౫౦వ పుష్పము: పద్యకావ్యము; గ్రంథకర్తలు శ్రీవాజపేయయాజుల, రామసుబ్బారాయ, వేంకటనారాయణ సోదరకవులు; స్నేహలతాకవితా సంఘాధ్యక్షులు; కొల్లాపురము, (జటప్రోలుసంస్థానము.) క్రౌను ౩౬ + ౧౨౩ పుటలు, మూల్యము ఒకరూపాయి.

'సీతాకల్యాణ' మను పేరుగల యీ మూఁడాశ్వాసముల 'మహాప్రబంధము'లో రామాయణమునందలి బాలకాండకథ సంగ్రహముగ సరళమగు శైలిలో వివరింపఁబడినది.

మొదటి యాశ్వాసమున ఆర్యావర్త వర్ణన, అయోధ్యావర్ణన, సూర్యవంశరాజవర్ణన, దశరథవర్ణన, పుత్రసంతానార్థియగు దశరథుండు అశ్వమేధ మొనర్పఁదలఁచి వసిష్ఠాదులను రప్పించి వారి యనుజ్ఞ పొందుట కలవు.

ద్వితీయాశ్వాసమున అశ్వమేధ ప్రయత్నములు, దేవతలు విష్ణువును, రావణుని సంహరింప భూలోకమునఁ బుట్టవలెనని కోరుట, విష్ణువు వల్లె యనుట, అశ్వమేధవర్ణన, పుత్రకామేష్టి, కౌసల్యాదుల గర్భోత్పత్తి, దోహదము, రామాదుల జననము, శైశవము, రామవర్ణనము, వివాహాలోచన, విశ్వామిత్రుని రాక, విశ్వామిత్ర, దశరథుల సంభాషణ, రామలక్ష్మణులు విశ్వామిత్రునితో పోవుట కలవు

తృతీయాశ్వాసమున తాటకవధ, ఆశ్రమరక్షణ, అహల్యా శాపవిమోచనము, శివధనుర్భంగము, కల్యాణము, పరశురామ గర్వభంగము, అయోధ్యా పునరాగమనము వర్ణితములు

ఈ 'మహాప్రబంధము' ప్రాచీనపద్ధతులనే యవలంబించుచున్నను, కృత్యాద్యవసరము, షష్ఠ్యంతములు మొదలగునవి లేకయే యిందు గ్రంథారంభ మొనర్పఁబడినది. ఈ గ్రంథమున వర్ణనభాగము పెంచఁబడినది; కథాభాగము కుదింపఁబడినది. వర్ణింపఁబడిన వాని వర్ణనమే తిరిగి చాలసారులు కన్పించుచున్నది. కథ సీతకల్యాణముతోఁ బూర్తిచెందక బాలకాండము నంతము చూడవలసివచ్చినది.

ఇందలి శైలి సరళము; ధార అనర్గళము; కవిత నిర్దుష్టము. శ్రేష్ఠవస్తువాచకమగు రత్నశబ్దమునకు, బర్యాయముగ మణిశబ్ద మిందుఁ దఱచుగఁ బ్రయోగింపఁబడినది. (ఉ. నదీమణి, మీనాక్షీమణి.) పద్యముల కుదురుబాటున కిం దప్పటప్పుడు 'అల, అల్ల, చక్క, అంచిత' మొదలగు పదములు వాడఁబడినవి.

'గీ. ప్రమథగణముల నలరారు స్వర్గమట్లు? [పుట ౧౧] (ఇచట 'కైలాసమట్లు' అని యుండిన యుక్తమేమో!)

'సీ. స్మృతికర్తయై లోకనుతి గాంచి మించిన మను వాని నేవంశమున జనించె? [పుట ౭౧.] (మనుస్మృతిని రచించినది వైవస్వతమనువు కాదు.)

దశరథుఁడు అశ్వమేధ మొనరింపఁ దలఁచి పర్యాలోచింప వసిష్ఠాదులను పిలుచుటకు సుమంత్రుని బంపుచు 'ఉ.' కావున నో యమాత్యవర! క్రందుగ నేగి వసిష్ఠముఖ్యులన్, బావనమానితల్లజుల బ్రహ్మసమానుల నాప్రయత్నమున్ భావముఁ దెల్పి తోడుకొని వత్తువె? ' అనియడిగెను. దీనింబట్టి తన యాలోచనమును వారికిఁ దెలుపవలెనని రాజు చెప్పెనని తెలియుచున్నది. వారు వచ్చిన పిదప రాజు తిరిగి '...మీరు తెలిసియుండు మేము సుంతయుఁ దెలియలేము; కరతలామలకములు లోకములు మీకు; నట్టి మీబోంట్ల కింక నాయభిమతంబుఁ జెప్ప నేమిటికైనను జెప్పవాఁడ' నని తన యనపత్యతకు విలపించుచు దీర్ఘోపన్యాస మొసంగెను. ఇది గ్రంథమును పెంచుటకే యుపయోగించును.

శ్రీవాజపేయయాజుల సోదరులు నవకవులు; కాని ౦ంా గ్రంథమున నవ్యత కొంతపడినది. అవతారపురుషుఁడగు శ్రీరాముని చరిత్ర మిందలి కథావస్తువగుట నీగ్రంథ మందఱికిని ఆదరణీయము. శ్రీసోదరకవులికముందు క్రొత్తపోకడలతో క్రొత్త గ్రంథములను వ్రాసి తమ కవితకు వన్నెపెట్టుకొందురు గాక!

బు. వేం. ర.

## మంచివాళ్లెవరు

గ్రంథకర్త: సాహిత్యలతసంపాదకుడు శ్రీకర్లపాలెం కృష్ణారావుగారు. ప్రకాశకులు, సాహిత్యలత, చీరాల.

'ఈ మంచివాళ్లెవరు?' వాడుకభాషలో వ్రాయబడిన సాంఘిక నాటకము. జనసామాన్యమున కర్థమగుచు, రంగస్థలమున కనుకూలమగునట్లు రచయింపబడినకావ్యములు నేడత్యవసరములు. నిత్యము కనులయెదుట జరుగుచున్నదృశ్యములే కావ్యరూపమును దాల్చినవి. జాతీయతను స్థిరపరచి, సంఘమును బాగుచేయగల కథాశరీర మిప్పుడవసరము' అని గ్రంథకర్త సంపాదకీయమున చెప్పినాడు.

ఇది వాడుకభాషలో వ్రాయబడిన సాంఘిక నాటకమే. జనసామాన్యమునకు విరివిగా వాడబడిన యింగ్లీషుముక్కలు దక్క తక్కినదంతయు చక్కగా నర్థమగునదే. రంగస్థలానుకూలత, కథనురంగములుగా విభజించుటవలన మాత్రమే కలుగదు. కథయొక్క ఔచితి, సభ్యతలుకూడ ప్రదర్శనమునకు ముఖ్యముగా పరిగణించవలసిన విషయములు. రంగస్థలప్రదర్శన యోగ్యతకు 'మంచివాళ్లెవరు?' దూరముగా నున్నది. నిత్యము మనకనుల యెదుట జరుగువిషయములెన్నియో యున్నవి. అవియన్నియు కావ్యరూపము, గ్రంథరూపము దాల్చుటకు యోగ్యమైనవికావు. జాతీయతను స్థిరపరచి, సంఘమును బాగుచేయగల శక్తి 'మంచివాళ్లెవరు'? కథాశరీరమున గనుపట్టదు. కథారచనయందును, పాత్రప్రవేశపోషణలయందును తరుగు మెండుగాగోచరించుచున్నది. మొత్తముమీద గ్రంథకర్త సంఘలోపమును సంస్కరించుటకు వ్రాసిన యీ గ్రంథమున కథావస్తువు చక్కని పరిణామము నొందలేక పోయినది.

'మంచిపూలను సేకరించగల నేర్పు, అందముగ మాలనల్లగల కూర్పు గల సమర్థుల నిర్మాణములు యేరూపమున నున్నను రాణించగలవుగదా? విశాలదృష్టిగల విద్యార్థికు లివి గ్రహింపగలరు' అని సంపాదకీయమున నే గ్రంథకర్త మరొకచోట వ్రాసినాడు. పూలను సేకరించుటలోని, మాలనల్లుటలోని నేర్పుకూర్పులసమర్థతగల వారినిర్మాణములు యేరూపముననున్నను రాణించునా? అట్లగునేని యిదియును రాణించుచున్నదని చెప్పవచ్చును. విద్యాధికుల విశాలదృష్టితో చూచినను' విద్యాహీనుల సంకుచిత దృష్టితో చూచినను లోపములు లోపములే. అసమర్థతతో కార్యకరణమునకు పూనుకొని, మెండుగ లోపములను కనుపరచినపుడు, విశాలదృష్టిగల విద్యాధికులు గూడ గర్హించకమానరు.

---

## కూలోడా

చిన్నసైజు, పు. ౧౭.

వాసిరెడ్డి నాగేశ్వరరావు, గద్దెలింగయ్యా-రచయితలు.

ప్రకాశకులు: ఏలూరు లేబరు ప్రొటెక్షనువారి రెండవ ప్రచురణము.

కూలివాళ్ల దుస్థితిని వివరించుచు ప్రబోధమును గలిగించు గేయరచనమిది.

---

# గ్రంథస్వీకారము

---

## రామమోహన విజయము

క్రౌను ౧/౭ సైజు, పు. ౬౩, వెల రు. ౦-౭-౦

గ్రంథకర్త: ద్రోణమరాజు రామమూర్తి, సాధన కుటీరము, అగ్రహారము, పిఠాపురము.

---

## కళ

క్రొత్తమాసపత్రిక సంపాదకుడు: యం. యస్. శాస్త్రి, పిఠాపురము.

సం. చందా రు. ౧—౭—౦

విడిపత్రిక వెల ౦—౨—౦

---

### వయోజనవిద్య

క్రౌను ౧/౮ సైజు, పు. ౧౬.

గ్రంథకర్త: శనివారపు సుబ్బారావు, సరస్వతీ నికేతనం, వేటపాలెం, గుంటూరుజిల్లా.

---

### శ్రీరాధా మాధవము, ప్రబంధము

క్రౌను ౧/౮ సైజు పు. ౪౮ + ౩౪౬. సొగసయిన సంపుటము. వెల రు ౧—౮—౦.

కవి: 'రాధామాధవ' చింతలపూడి యెల్లనార్యుడు.

ప్రకాశకులు: కపిలేశ్వరపురం జమీందారు, కపిలేశ్వరపురం, తూర్పుగోదావరి.

---

### మాఘ మాహాత్మ్యము

ఆరాశ్వాసముల ప్రబంధము. గ్రంథకర్త: శ్రీ అబ్బరాజు శేషాచలశర్మ. డెమ్మీసైజు, ౨౨౮ పుటలు.

ప్రకాశకులు అబ్బరాజు హనుమంతరాయశర్మ, ఆంధ్ర పండితుడు, బోర్డుమిడిల్ స్కూలు, గురజాల, పల్నాడు తాలూకా, గుంటూరుజిల్లా. వెల సాదాప్రతి రు. ౨-౦-౦. ఫెదర్వైటు, క్యాలికో, రు. -౦-౦. వలయువారు ప్రకాశకులకు వ్రాసికొనవలెను.

---

### వివాహతత్త్వము

క్రౌను ౧/౮ సైజు పు. ౧౬౦.

గ్రంథకర్త: బంకుపల్లె మల్లయ్యశాస్త్రి, నరసన్నపేట, గంజాముజిల్లా.

ప్రకాశకులు: ఆంధ్రగ్రంథమాల, ౭, తంబుశెట్టి వీథి, మద్రాసు.

---

## నాట్యకళ



### ఘంటసాల రాధాకృష్ణయ్య

వీరు నెల్లూరు నివాసులు. పేరుగన్న నెల్లూరు నటకులలో నొక్కరు. వీరు నిండుదనముగల చక్కని స్వరూపముగలవారు. ఉత్తమనటలక్షణములు వీరి యందొప్పియున్నవి. రామదాసు నాటకమున రామదాసు పాత్రమును, కబీరుపాత్రమును ధరించి ఆంధ్ర నాటకరంగమునకు వన్నె తెచ్చినారు. 'కబీరు' టాకీలో కబీరు పాత్రనుధరించి టాకీప్రపంచమునను గణ్యత కెక్కినారు. ప్రకృతము 'తులసి'టాకీలో నారదపాత్రమును నిర్వహించుచున్నారు.

# సాభిప్రాయ విశేషములు

> నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే,
> తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి.

ప్రపంచ ధర్మపరిణామమునందు జ్ఞాన యోగముల ధర్మపరిణామములు దివ్యాధ్యాయములు. ప్రజాపతి ప్రపంచధర్మ పరిణామమునకు ప్రజలను యజ్ఞ సహితముగా సృజించి పురుషార్థమునకు సాధనములను నిర్ణయించెను. ధర్మార్థకామ సాధనములైన యజ్ఞములు యోగసంసిద్ధములై జ్ఞానపరిణామమును పొందుచున్నవి. యోగసంసిద్ధమైన జ్ఞాన మాత్మయోగారూఢమై సకలార్థములకును సాధనమగుచున్నది. యోగసంసిద్ధముగాని జ్ఞానము స్వానుభవ రహితమై విపరీత పరిణామము గలుగుచున్నది. వర్తమానకాలమునందు మహాసంస్థలందువలెను సామాన్య సంస్థలందును, పండితులందువలెను పామరులందును, నాయకులందువలెను అనుచరులందును, శ్రీమంతులందువలెను పేదలందును, అగ్రజులందువలెను అంత్యజులందును, వృద్ధులందువలెను యువజనులందును యోగసిద్ధి వ్యవహారములు వివాద సందేహములకు, భయభ్రాంతులకును మూలములగుచు కార్య నిర్వహణము దుర్లభ మగుచున్నది.

వర్తమానకాలమునందు ప్రపంచము నావరించిన విషాదయోగమునకు జ్ఞానమునకును యోగమునకును యోగసంసిద్ధి లేకుండుటయే మూలకారణమని జ్ఞానులు, యోగులు ఘోషించుచున్నను ఫలము మాత్రము గలుగకున్నది. ప్రపంచమునందు ధర్మసంరక్షణమునకును, శాంతిస్థాపనమునకును స్థాపితమైన నానాజాతిసమితి యుదంతము, సమితి యోగసిద్ధిలేకను వివాదసందేహములకు మూలమైన విధమును విశదము చేయుచున్నది.

* * *

నానాజాతి సమితి

నానాజాతిసమితి ప్రపంచమునందు జ్ఞాన ప్రచారమును చేయుటకై గతించిన ౧౯ ఏండ్లయందును ప్రచురించిన గ్రంథములు ఆశ్చర్యము గలుగజేయుచున్నను మానవ స్వాతంత్ర్యధర్మాభ్యుదయమునకు నిరర్థకములైనవి. ప్రపంచక్షేమమున కవసరములైన ధర్మములును, శాస్త్రములు, అర్థసాధనములును, పరిశ్రమలు, ఆహారారోగ్యములు, కార్మిక నియమములు, ఆయుధ నిర్మాణములు, యుద్ధవిధానములు, స్వల్పజాతుల సంరక్షణము, పరాధీన రాజ్యముల స్వాతంత్ర్యము మొదలగు మహా సమస్యలు గ్రంథములందు శాస్త్రప్రమాణము

గను జర్పింపబడి నిర్ణయింపబడినను ప్రపంచ మునకు గలిగిన ప్రయోజన మతిస్వల్పము. నానాజాతి సమితియందు జేరిన ౫౦ రాజ్యములకు వ్యష్టి విషయములందును, సమష్టి విషయములందును యోగసంసిద్ధి గలుగ నపుడు ధర్మ సంరక్షణమునకు సమితి చేయుచున్న జ్ఞానప్రచారము సమితి ప్రయోజనములనే నిరర్థకము చేసెది. సమితియందు జేరిన రాజ్యములకు స్వప్రయోజనరక్షణమునందు గల కాంక్ష ధర్మప్రయోజన సంరక్షణమునందు లేకుండుటవలనను సమితి బల గౌరవ ప్రతిష్ఠలు క్షీణించినవి.

గ్రేటుబ్రిటనుకు స్వీయ ప్రయోజన సంరక్షణమునందు గల యభిమానము సమితి ధర్మరక్షణమునందు లేదని ప్రపంచ వ్యవహారములు చెప్పక చెప్పుచున్నవి. హిందూస్థాన రాజ్యాంగములు, చీనా పతనము, జపాను విజృంభణము, అబిసీనియా దుర్గతి, ఐర్లాండు ఈజిప్టుపలస్తీను విప్లవములు, సంరక్షణవ్యాపారము, స్వర్ణప్రమాణ విసర్జనము, జాతీయ ప్రభుత్వము మొదలగు విషయములు బ్రిటీషు రాజ్యాంగములందు గలిగిన ధర్మచ్యుతికి నిదర్శనములు. మంచి మాటలు పంచతంత్రములు బ్రిటీషు సామ్రాజ్యమునకు లక్ష్యములై బ్రిటీషు ప్రతిష్ఠ క్షీణించినది. అబిసీనియా పరాజయము మస్సొలోనివిజయము బ్రిటీషు సింహమునందు సంభ్రమమును గలుగజేసినవి. స్వస్థల సంరక్షణమునకును సామ్రాజ్యసంరక్షణమునకును గ్రేటుబ్రిటను చేయుచున్న యపూర్వ ప్రయత్నములు బ్రిటీషు ప్రతిష్ఠకు కళంకమును గలుగజేసినవి. ఇటలీ గ్రేటుబ్రిటనుకు చూపుచున్న ధిక్కార తిరస్కారములును నితర రాజ్యములు చూపుచున్న విశ్వాసరాహిత్యమును జాతిసమితియందు గ్రేటుబ్రిటను ప్రతిష్ఠను నిరర్థకము చేసినవి. అయినను ఈడెను గారి ప్రగల్భములు సాగుచునే యున్నవి. జూను ౧౮ వ తేదీని గూడనున్న సమితి సమావేశ మేమి చేయునదియును కాలము తెలుపగలదు.

గ్రేటుబ్రిటనువలెనే ఫ్రాన్సు, రష్యా, బెల్జియము మొదలగు రాజ్యములును నిశ్చేష్టతను వహించి ఆత్మవిశ్వాసమును, ప్రపంచ గౌరవమును గోల్పోయి జాతిసమితి ప్రతిష్ఠను నిర్మూలము చేసినవి. ముస్సోలిని ప్రయోగించిన విషవాయువులు విజయమును పొంది ప్రపంచమునం దంతటను ధర్మసంచలనమును గలుగజేసినవి. అబిసీనియాచక్రవర్తి నిరపరాధియైనను రాజ్యభ్రష్టుడును, దేశభ్రష్టుడునునై విదేశవాసమును స్వీకరించుటయును, ఇటలీరాజు అబిసీనియా చక్రవర్తిత్వమును వహించుటయును నానాజాతిసమితికి తల వంపులనుట నిస్సందేహము. ముస్సోలినీ వలెను జర్మను, జపాను రాజ్యములును పరాక్రమణమును జేయుచున్న విధమును సమితి ప్రయోజనమును శూన్యము చేసినది. ఇటలీపట్ల సమితి నిర్ణయించిన ఆంక్షలు నిరర్థకములైనను ఆంక్షల నామస్మర

ణము చేయుట పరిహాసముగ నున్నది యోగసంసిద్ధి లేని సమితి నిర్ణయములు స్వప్రయోజనములనె నిరర్థకము చేసినవి. అబిసీనియాయందు ఇటలీ పూర్ణహోమము చేసినతరువాతను సమితి ఆంక్షులజపము నేల చేయుచున్నదో తెలియకున్నది. యూరపు రాజ్యములును, జపాను, అమెరికారాజ్యములును చేయుచున్న భయంకర సంగ్రామ సన్నాహములు ప్రపంచమున కాసన్నమైన మహాప్రళయమును సూచించుచున్నవి. ప్రపంచమునందు శాంతిపర్వము స్థాపింపబడుటకు ప్రపంచ సంగ్రామరూపమైన మహాప్రళయము తప్పదని తెలిసియును వివిధరాజ్యములు ప్రత్యేకముగను, సమితి సమష్టిని కార్యాచరణమునకు బూనకుండుట ప్రపంచము నావరించిన విషాదము. సంహారపరమైన సంగ్రామప్రయత్నములు సంహారమును సమకూర్చునటులు శాంతిని సమకూర్పజాలవు. పాశ్చాత్య సంస్కార పాశబద్ధమైన ప్రపంచమంతయును పాశ్చాత్య సంస్కారము ననుకరించుచు దుఃఖవేదన ననుభవించుచున్నది. జపాను విజయ విజృంభణములు దౌర్జన్యములు నిందలకువలెను ప్రశంసలకును పాత్రము లగుచున్నవి. ముస్సోలినీగారి దురంతములు గర్హ్యములైనను రాక్షస పరాక్రమమునకును, తెల్లజాతి విజయమునకును హర్షించెడి తెల్లనాయకులును, గురువులునుగలరు. దౌర్జన్యమయమైన ప్రపంచమునందు గాంధిమహాత్ముని సత్యాగ్రహశాంతి సందేశ మరణ్యరోదనముగ నున్నది. యోగసంసిద్ధికి సాధనమైన సత్యాగ్రహము స్వతంత్రదేశములందు ప్రయోగ యోగ్యమైనను ఆత్మవిశ్వాసములేకను పరావలంబనము శరణ్యమైన పరాధీన దేశములందు నాయకులకును, అధికారులకును పరిహాస పాత్రముగ నున్న విధమును హిందూస్థాన వ్యవహారములు-ముఖ్యముగను కాంగ్రెసు వ్యవహారములు విశదనుచేయుచున్నవి.

* * *

కాంగ్రెసు వ్యవహారములు

లక్నో కాంగ్రెసు కాంగ్రెసుచరిత్రయందొకనూతనాధ్యాయారంభము. పండిత జవాహరిలాలు నెహ్రూగారు రెండవసారి యధ్యక్షపీఠము నలంకరించుట యొక్క విశేషము. లక్నో కాంగ్రెసుతో గాంధిశక మంతరించి నూతన శకమారంభమైన విధమును కాంగ్రెసువ్యవహారములు చెప్పక చెప్పుచున్నవి. కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమునందు సన్నిహిత సంయోగమున్నను, లేకపోయినను కాంగ్రెసు నాయకత్వము వృద్ధనాయకులనుండి యువజన నాయకులకు సంక్రమించుట కుపక్రమించినటులు కాంగ్రెసు వ్యవహారములు వెల్లడిచేయుచున్నవి. కాంగ్రెసునందు గల బహిష్కారపక్షమునకును, మంత్రిపదస్వీకారపక్షమునకును, స్వరాజ్య జాతీయపక్షమునకును, సాంఘిక పక్షమునకును సంయోగ సాహచర్యము లే రీతిని సంభవమగునో కాలము వెల్లడిచేయగలదు. సన్నిహితములైన రాజ్యాం

